# ఉత్తరహరివంశము

(నాచన సోమనాథ ప్రణీతము)

సంపాదకురాలు :

పి. యశోదా రెడ్డి






ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవన్ : సైఫాబాద్ : హైద్రాబాద్

1979

# తొలి పలుకు

ఉత్తమోత్తమ ప్రబంధములలో నొకటి నాచన సోమనాథుని ఉత్తర హరివంశము. ఈ మహాకవి సకల భాషాభూషణుఁడు, సర్వశాస్త్ర పారంగతుఁడు, అపార పాండితీమండితుఁడైన కారణముచేత నీతనిప్రయోగ విశేషము లంత సులభముగా నర్థమగునవికావు. శ్రుతిసుభగములైన యీతని పద్యములన్నియు జాతీయ పదబంధురములై, సంప్రదాయ పరిజ్ఞాన గర్భిత ములై పాఠకునికి లోతు తెలియనీయక చిక్కులువెట్టుచుండును.

పాఠశాలలందు కళాశాలలందు విద్యార్థుల కీ గ్రంథమును బోధించు నవసరమం దేర్పడుచున్న క్లేశమును పలువురు విద్వాంసులు ప్రసంగించియున్నారు. అం దనేకులు ఉత్తర హరివంశమునకు విపుల వ్యాఖ్య యుండినచో బాగుండుననియు సూచించినారు. ఇంతేకాక యీ గ్రంథ ప్రథమాశ్వాసాంత భాగము తాళపత్త్ర ప్రతులందు లుప్తమై యుండగా శ్రీ వీరేశలింగముపంతులుగారు పూరించి ప్రకటించిరని తెలియుచున్నది. కావున నీ గ్రంథమునకు విపులవ్యాఖ్య వ్రాయుటయేకాక దేశమందలి తాళ పత్త్ర ప్రతులు పరిశీలింప ఉత్తమ ప్రతినొకటి ప్రచురింప వలయునని తోచి నది. సాహిత్య అకాడమీ అధ్యక్షులు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు మరియు అకాడమీ సభ్యు లీ పథకము నామోదించి ఇందుకొరకు సంపాదకసంఘమును యేర్పాటు చేసినారు.

కాని యీపని ఒకరోజులో పూర్తి ఆగునదికాదు. కావున ఇంతలో విపుల పీఠికతో ఉత్తర హరివంశమును ప్రకటించిన సహృదయులు మఱి కొన్ని సూచనల నొసంగి తోడుపడగలరను తలంపుతో ఈ పనిని శ్రీమతి పి. యశోదారెడ్డిగారికి అప్పగించనైనది. శ్రీమతి యశోదారెడ్డిగారు యీ కార్యము మిక్కిలి సమర్థతతో నిర్వహించి నారు. అకాడమి పక్షాన వారికి కృతజ్ఞతలు.

దేవులపల్లి రామానుజరావు

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము : నరకాసుర వధ

విషయము



## ద్వితీయాశ్వాసము :

## బ్రాహ్మణ పుత్ర రక్షణ వృత్తాంతము - హరిహర ప్రభావము

## తృతీయాశ్వాసము :

## పౌండ్రక వాసుదేవ వృత్తాంతము – చక్రమహిమ



## చతుర్థాశ్వాసము : హంసడిభకోపాఖ్యానము

## పంచమాశ్వాసము : బాణాసుర వృత్తాంతము



## షష్ఠాశ్వాసము ; బాణాసుర వధ

# పీఠిక

"ఘను నన్నయభట్టును ది
క్కన నెఱ్ఱాప్రెగడఁ బొగడి యలికంబున న
క్షిని డాఁచి నట్టి సర్వ
జ్ఞుని నాచన సోమనాథు స్తుతి యొనరింతున్"

నీతిచంద్రిక - చిన్నయసూరి.

''నన్నయగారి త్రోవగాని నవ్యగుణంబులు కొన్నిచేర్చి తి
క్కన మహాకవిప్రవరుఁ డాంధ్రకవిత్వము వృద్ధి చేసె నె
ఱ్ఱన్నయు వీరిత్రోవఁ గాని యర్వాత యింకొక కొంత యిచ్చె స
ర్వోన్నతి తెచ్చె సోముఁడు మహాదధి నా జను నాంధ్రభాషకున్''

వేంకటపార్వతీశ్వరకవులు.

ఏ మహానుభావుని బురస్కరించుకొని శ్రీ వీరేశలింగము పంతులుగారు ''భారతమును రచించిన కవిత్రయములో ననేకుల కవిత్వమును గొన్ని విషయములలో సోముని కవిత్వముతో సరిరాదని" జేర్కొనిరో యట్టిపొగడ్తను సార్థక మొనరించు కవితాసంపత్తిగల కవివరుఁడు సోమనాథుఁడు.

ఈ నాచన సోమనాథుఁ డాపస్తంబసూత్రుఁడు. భరద్వాజగోత్రుఁడు. సకలాగమవేది, అష్టాదశ పురాణార్థవిదుఁడు, అష్టభాషాకవిత్వ శ్రీవిలసితుఁడు. అన్నిటిమించి యాతఁడు మహాకవివరుఁడు. ఈతఁడు 'నాచన' లేక 'నాచిరాజ'ను నాతని కుమారుఁడు. ఈ వివరము లన్నియు పెంచుకలదిన్నె శాసనమువలనఁ దెలియవచ్చినవి. పెంచుకలదిన్నె శాసనమునందుఁ గానవచ్చు "సోమాయ నాచనాం

భోధేః సోమాయామిత తేజసే" అను వాక్యము నాధారముగాఁ గొని 'నాచన' యనునది గృహనామమా ? లేక పితృనామమా ? యను సందేహమును గొందఱు విమర్శకులు బయలు పఱిచినారు. సాధారణముగ కులమునుగాని వంశమునుగాని సముద్రముతోఁ బోల్చు నాచార మున్నదనియుఁ దండ్రిని సముద్రముతోఁ బోల్చు నాచార మంతగా లేదనియు నీ విమర్శకుల వాదము. దాని ననుసరించియే వారు నాచన యను ఉపసర్గ గృహనామమని తీర్పు నిచ్చినారు. ఈ వాదము నొప్పుకొనుచు శ్రీ యస్. రామకృష్ణశాస్త్రిగారు తమ 'ఆంధ్రవాఙ్మయచరిత్ర సర్వస్వము'లోఁ బ్రకటించిరి.[1]

"కొన్ని తావులఁ దండ్రిని, కొన్ని తావులఁ దల్లిని సముద్రముతోఁ బోల్చుట కూడఁ గలదు. కావున నిట 'నాచన' యను వ్యక్తినే సముద్రునితోఁ బోల్చి నాఁడందుమేని సోమునకు నాచన తండ్రి యగును. ప్రతి గ్రహీత లందఱ కును దండ్రుల నామములను శాసనమునఁ జెప్పియున్నాఁడు. సోముని తండ్రి పేరు చెప్పకుండ నుండఁడు. కావున నాచన శబ్ద మీతని తండ్రి పేరై యుండు ననుట కూడ సమంజసమయిన యూహయే యగును. కాకోకమును రచించిన యెఱ్ఱయ కవి తన సకలనీతికథానిధానమునఁ బూర్వకవిస్తుతి చేయుటలో 'నాచన సుతుసోము' అని చెప్పియున్నాఁడు. దీనినిబట్టి నాచన శబ్దము పితృనామమే యని స్పష్టమగుచున్నది" అని శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాసినారు.[2]

"నాచన యింటిపేరు మాత్రమేగాక యితని తండ్రి పేరు 'నాచిరాజ'ని యాంధ్ర ప్రబంధములందు వ్రాయఁబడియున్నది. ఒకవేళ నింటిపేరు నాచిరాజు వారనియైనఁ జెప్పవచ్చును" అని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు సూచించినారు.[3]

---

"ఆపస్తంబాఖ్య సూత్రాయ బారద్వాజాన్వవాయినే, 19

యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే
అష్టాదశపురాణానా మఖిజ్ఞాతార్థవేదినే 20

అష్టభాషాకవిత్వ శ్రీవాణీవిజిత సంపదే
సోమాయ నాచనాంభోధేః సోమాయామిత తేజసే. 21

ఎపిగ్రాఫికా కర్ణాటికా-జి.డి. 468 లైన్స్ 19—21.

1. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర-సర్వస్వము. దశమ ప్రకరణము పు. 684
2. ఆంధ్రకవితరంగిణి-సంపుటము 4 పు 116

ఇక నాచన యనునది గృహనామమా లేక పితృనామమా ? అని పరిశీలించి నిర్ణయము నొసఁగుట కాధారము లంతగ లేవు. ఏమేనియున్నచో నది మొదట సంశయమునకుఁ దా వొసంగిన పెంచుకలదిన్నె శాసనమే. ఆ శాస నాధారము తప్ప మఱివేఱొండు లేదు. కావున నాశాసనమును పరిశీలింపఁగ నందు నాచన సోముఁడు ప్రతిగ్రహించిన గ్రామమున నూటపది వృత్తు లేర్పఱచి తాను ముప్పదియారువృత్తుల కధిపతియై మిగిలిన వృత్తిభాగముల నాయాగోత్రీకులకు నిచ్చినట్లు గానవచ్చుచున్నది. అందు

"భారద్వాజాన్వయే జాతః తల్లపోనామయాజుషః
అష్టావింశతి వృత్తీనామధిపోచనాత్మజః॥''

అని, కానవచ్చు శ్లోకమువలన భారద్వాజాన్వయుఁడు, యాజుషుఁడు నాచనాత్మజుఁ డయిన తల్లపుఁడను నాతఁ డష్టావింశతివృత్తుల కధిపతియని తెలియుచున్నది. పైఁ బేర్కొనఁబడిన తల్లపుని యన్వయము, సూత్రము, శాఖ మొదలగు వాని నన్నిటిని బరిశీలింప నాచన సోమనాథుని యన్వయము శాఖాదులతో సరిపోవుటయేకాక యీ తల్లవుడు నాచన కుమారుఁడని స్పష్టముగఁ బేర్కొనఁబడి యున్నది. కావున నిచట నాచన యనునది గృహనామముకాక వ్యక్తి పే రనుటలో సందేహములేదు. ఈ విషయములను బురస్కరించుకొని చూడ శాసనమందుఁ గంఠోక్తిగఁ జెప్పఁ బడకపోయినను ప్రయుక్తములగు విశేషణముల వలననే నాచన సోమనాథునకు సోదరుఁడుగఁ దెలియవచ్చుచున్నాఁడు.

యజుశ్శాఖియైన నాచనకుమారులలోనేకాక మొత్తము నాఁటి యాజుషు లలో శ్రేష్ఠుఁడు నాచన సోమనాథుఁడు. కావుననే పెంచుకలదిన్నె శాసనమునందు శాసనకారుఁడు ''సోమాయ నాచనాంభోధేః సోమాయామిత తేజసే" అని యుచిత ముగఁ బేర్కొనినాఁడు. ఆ కాలమందు వెలసిన సోమనాథులనుండి యితనిని ప్రత్యేకించుటకు నాటి యాచారమును బురస్కరించుకొని తండ్రిపేరుతోఁ జేర్చి

---

3. ఆంధ్రుల చరిత్ర-3వ భాగము పు.338

1. ఎపిగ్రాఫికా కర్ణాటికా-G. D. 468 lines 29-30.

యితనిని నాచన సోముఁడని వ్యహరించి యుందురు. ఇమ్మహాకవియు నావిధముగనే తన యుత్తర హరివంశమందు 'నాచన సోమనాథ ప్రణీతంబయిన' అనియే వ్రాసికొనినాఁడు. పెంచుకలదిన్నె శాసనము సయితము 'శ్రీమన్నాచన సోమాఖ్య మహాకవివరో పృథ' అనియే పేర్కొనినది. కావున నీ సోముఁడు నాచన కుమారుఁ డనుటయే నిక్కవము కాగా నాచనయను శబ్దము గృహనామముగాక తండ్రిపేరనియే తెలియుచున్నది.

## నాచన సోమనాథుని కాలము

నాచన సోమనాథుని కాలమునుగూర్చి పండితులలోఁ బలుదగవు లున్నవి. కేవలము నాచన సోముఁడేని ఎఱ్ఱాప్రెగడయేని హరివంశమును వ్రాసినచో నీతని కాలనిర్ణయమున కిన్ని వివాదము లుండెడివి కావు. ఈ కవి కాలనిర్ణయము మహాకవులయిన ఇద్దఱి హరివంశరచనల పౌర్వాపర్యముతో జోడింపఁబడినది కావున నిం దనేకములయిన యితర విషయములును ప్రవేశించినవి.

నాచన సోమనాథుని కాలనిర్ణయమును గావించుటకుఁ బ్రధానములయిన రెండు చారిత్రకాధారములు గానవచ్చుచున్నవి. అందొకటి బుక్కరాయలు గుత్తిదుర్గ మందుఁగల పెంచుకలదిన్నె యనుగ్రామమును నాచన సోమనాథునకు ధారవోసి వేయించిన దానశాసనము. రెండవది నాచన సోమన కృతిగా లక్షణ గ్రంథములం దుదాహరింపఁబడిన 'వసంత విలాస' మనుగ్రంథమునకుఁ గృతిపతిగా దెలియవచ్చు మాచయ బ్రహ్మయ యను వాఁడు. మాచయ బ్రహ్మయ, బుక్కరాయలను వారిరువురు కల్పితపురుషులుకాక యాయాకాలములందున్నట్లు శాసనాధారములు గనఁబడుచున్నవి.

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు మాచయబ్రహ్మ యనువాఁడు బ్రాహ్మణ సర్దారుఁడనియు నీతనికాలమును గొన్ని శాసనము లాధారముగ క్రీ. శ. 1330 గ నిర్ణయింపవచ్చుననియుఁ దెలిపినారు.

నాచన సోమనాథు డుత్తరహరివంశమునేకాక వసంతవిలాసమను మఱియొక గ్రంథమును రచించినట్లు లక్షణకారు లుదాహరించిన పద్యముల వలనఁ దెలియుచున్నది. ఈ వసంతవిలాస కృతికిఁ బతి మాచయ

బ్రహ్మయ యని యా గ్రంథమందలి మొదటి పద్య మిదియని శ్రీ రామకృష్ణ కవిగా రుదాహరించినట్లు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలగా రీ క్రింది పద్యమును చాటుపద్యమణిమంజరి భా. 2. రాజ ప్రశంసా స్తబకములోఁ చేర్చినారు. ఆ పద్యము.

శా. శ్రీచన్నుంగవ క్రేవఁ గొమ్మెఱుఁగులన్ శృంగారపుందోటకున్
ప్రాచీనం బగుచున్న వింశతి నఖ ప్రౌఢిన్ సుధాంభోధి వే
లాచంద్రోదయమైన దేవుఁడు కృపాలంకారచిత్తంబునన్
జూచున్ మాచయ బ్రహ్మధీమణిఁ గవిస్తోమైక చింతామణిన్.

ఈ పద్యమును బురస్కరించుకొని కవిస్తోమైకచింతామణిగాఁ బొగడఁ బడిన ఈ బ్రహ్మయ యెవరని యాలోచింపవలయును. ఈ మాచయ బ్రహ్మయ శాసనము కారెమపూడిలో నున్నట్టుగను దానిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిల వారు చూచినట్లుగను దెలిపినారు.

ఈ మాచయ బ్రహ్మయను గూర్చి వ్రాయుచు "కారెంపూడిలో మాచయనిం గారి శాసనములు రెండు శా. శ. 1225-1226 సంవత్సరముల నాఁటివి కలవు. శ్రీ శాస్త్రిల వారు చూచిన శాసన మా రెంటిలో నేదయిన నగునో కాదో చెపఁజాలను. వొప్పిచర్లలో మాచయ సాహిణి పేర నొక శాసనము కలదు. (A. R. 549, 561, 564, of 1909) ఇది నాచన సోముని పెంచుకలదిన్నె శాసనములకంటె నలువది సంవత్సరములు పూర్వము పుట్టినది" అని శ్రీ చాగంటి శేషయ్యగారు పేర్కొనినారు. వీరింకను మాచయ బ్రహ్మయ యనఁగా నీతఁడు మాచయగారి బ్రహ్మయ యని యందు మేని యీ శాసనములోని మాచయ, బ్రహ్మయకుఁ దండ్రియని చెప్పవచ్చును. కాలమును సరిపోవును అని వ్రాసినారు.[2]

నిజమునకు శ్రీ చాగంటి శేషయ్యగారు భావించినట్లు మాచయ బ్రహ్మయ. 'మాచయ' కుమారుఁడు బ్రహ్మయ కాగా నతఁడు తండ్రియైన మాచయకు 25, 30 సంవత్సరముల తరువాతి వాఁడగును. ఇఁక మాచయ యనువాఁడు శా. శ. 1224-25 అనఁగా క్రీ. శ. 1304 సంవత్సర ప్రాంత

---

1. ఉత్తర హరివంశము-పీఠిక-వావిళ్ళ ప్రచురణము-1961-పు. 1
2. ఆంధ్రకవితరంగిణి-సంపుటము 4. పు. 122-124

నాగరలిపి వ్రాఁత 'రసర్తు' గాను. 'రసభూ' గాను. 'రసాత్ర' గాను పొరపుచ్చుట సంభావ్యమే అనుచుఁ బేర్కొని తమ సవరణకుఁగల కారణములను బ్రకటించినారు.

ఈ పండితుల వాదోపవాద సారాంశములను బురస్కరించుకొని చూడఁగా నాచన సోమనాథుని కాలమునకుఁ బ్రధానముగా నాలుగుస్థితు లేర్పడినవి.

1. రసభూనయనేందుభిః -- శా.శ. 1216 -- క్రీ.శ. 1294.

2. రసాభ్రనయనేందుభిః -- శా.శ. 1206 -- క్రీ.శ. 1284.

3. కరాజనయనేందుభిః -- శా.శ. 1292 -- క్రీ.శ. 1370.

4. రసర్తునయనేందుభిః -- శా.శ. 1266 -- క్రీ.శ. 1344.

ఇట్లేర్పడిన కాలమనఁగా క్రీ. శ. 1284, 1293, 1370, 1844 ఈ సంవత్సరములలో నేసంవత్సమున నీదానశాసనము వెలసియుండెనో నిర్ణయింపవలయును.

ఇంతవరకు చారిత్రకు లందురు సంగమునిపుత్రులైన హరిహర బుక్క రాయాదులు కాకతిప్రతాపరుద్రుని పతనానంతరమే దక్షిణాపథమునందు హిందూ ధర్మమును బునరుద్ధరించి గొప్ప సామ్రాజ్యమును స్థాపించిరని చెప్పుచున్నారు. కావున క్రీ. శ. 1294 వ సంవత్సరము నాఁటికే బుక్కరాయలు స్వతంత్రుఁడై దానము గావించె ననుట పొసఁగనిమాట. అంతేకాక శాసన శ్లోకము ననుసరించియైనను క్రీ. శ. 1294 నకు సరియగు శా. శ. 1216 తారణ సంవత్సరమగుట లేదు. కావున నిన్నిట పొసఁగకయున్న 'రసభూనయనేందుభిః' అను పాఠమును పూర్తిగా లేఖకప్రమాదమని త్రోసివేయ వచ్చును.

ఇఁక రెండవ 'రసాభ్రయనేందుభిః' అనఁగా నీ శాసనము క్రీ.శ. 1284 నాఁటిదను పాఠము. ఈ పాఠము ననుసరించి శా.శ. 1206 తారణ సంవత్సరమే యగుచున్నది కాని యీ శకవర్షము విజయనగరస్థాపకులైన సంగముని పుత్రులలో నెవ్వరిదినిగాదు. ఇఁక శ్రీ విద్యారణ్య శ్రీపాదుల యాజ్ఞ ననుసరించి హరిహరుఁడు శా.శ. 1258 ధాతృనామ సంవత్సరవైశాఖ శుద్ధ సప్తమినాఁడు పుష్యమీ నక్షత్రయుక్త సింహలగ్నమున శంకు స్థాపనము గావించి పుర నిర్మాణము

గావించినట్లు శాసనాధారములున్నవి. కావున విద్యానగర నిర్మాణమునకు పూర్వమే యా విద్యానగరరత్న సింహాసనమునుండి దానమిచ్చుట అసంగతము గావున నీ పాఠమునుగూడ లేఖక ప్రమాదమని త్రోసివేయవచ్చును.

బుక్కరాయలు విద్యారణ్యకృత విద్యానగర రత్నసింహాసనమున నుండి దానము చేసినట్లు చెప్పుచున్న విషయము నాధారముగాఁ గొనియు, చారిత్రకులు నిర్ణయించిన బుక్కరాయల రాజ్యపాలనా కాలము క్రీ.శ. [1335-1377] సంవత్సరముల ననుసరించియు దానికనుగుణముగ బుక్కరాయలపాలనమునందు వచ్చు సంవత్సరముకొఱకుఁ బై మార్పు గావింపఁ బడినది. ఇంత ప్రయాసపడినప్పటికి నీ మార్పువలన వచ్చిన సంవత్సరము తారణ కాలేదు. ఏలయనఁగ హరిహరరాయల మరణానంతరము రాజ్యపాలనము గావించిన బుక్కరాయలకాలములో తారణ సంవత్సరము రాలేదు. కావున తారణకు దరిదాపులనుండునది సాధారణ. అది బుక్కరాయలకాల మందు వచ్చినది. కావున పండితుల 'తారణను 'సాధారణ'గ సవరించియు శ్లోకమందలి ప్రథమపాదమును బూర్తిగ మార్చియు 'కరాజనయ నేందుభిః సాధారణే'యను పాఠమును సిద్ధము చేసినారు. నిజమున కిది పండితులు సృష్టించిన పాఠమే కాని నిజమైన దానశాసన పాఠముకాదు

ఇఁక మిగిలిన 'రసర్తునయనేందుభిః' అను పాఠము. ఈ శాసనము ననుసరించి శా.శ. 1227 (క్రీ.శ. 1344) బుక్క రాయల శాసనమందు చెప్పిన తారణ సంవత్సరమే యగును. కాని శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిలవారి సవరణతోఁ గూడిన యీ పాఠము నంగీకరింపని పెద్దలు క్రీ.శ. 1344 వ సంవత్సరమునాఁటికి బుక్కరాయలు రాజ్యమునకే రాలేదు. కావున నాతఁడు విద్యానగర రత్నసింహాసనమునుండి దానమెట్లు చేయఁ గలిగెనని ఆక్షేపమును ప్రధానముగఁ జేయుచున్నారు.

విద్యానగర ప్రథమచక్రవర్తులైన సంగమునిపుత్రుల శాసనము లన్నియు సంపూర్ణముగ బయలుపడకపూర్వము బుక్కరాయలు క్రీ. శ. 1355-56 ల నడుమ విద్యానగరాధిపతి యయ్యెనని తెలసిన దినములలో నీ యాక్షేపము సత్యమై సమంజసముగనే గోచరించుచుండెదిది. కాని సంగముని

పుత్రులైన హరిహర బుక్కరాయాదుల విషయము పూర్తిగ నెఱిఁగిన కాలము వారికిది యొక పెద్ద యాక్షేపముగ గోచరింపదు ఏలయన హరిహరరాయల పరిపాలనారంభ కాలమునుండియు ననఁగ క్రీ.శ. 1336 నుండియు బుక్కరాయలు యువరాజుగ నుండుటయేకాక యన్నతోఁ గలసి తానును రాజ్యపాలన మొనర్చుచుండెనని తెలియుచున్నది. కావున బుక్కరాయలు తన యగ్రజుఁడైన హరిహరరాయలు ప్రభువుగ ప్రభుత్వము నెఱపుచుండ పంచపాండవులలో శ్రేష్ఠుఁడైన యర్జునునివలె తాను అన్న ప్రారంభించిన మహాకార్యమగు విద్యానగర నిర్మాణమునకుఁ బూని యా విద్యానగర రత్నసింహాసనమునుండి క్రీ.శ. 1344 నాఁడు పెంచుకలదిన్నెను నాచన సోమనాథునకు ధారవోసి శాసనమును వేయించె ననుటలో విప్రతి పత్తి లేదు. కావున శాసనకాలము క్రీ. శ. 1344 అని నిర్ణయించుటయే యుక్తము.

ఈ యాధారములను బురస్కరించుకొని చూడగా నీ నాచన సోమనాథుఁడు క్రీ.శ. 1285 ప్రాంతమున జన్మించి క్రీ.శ. 1350-55 వఱకు జీవించి యుండవచ్చునని తలఁచుట కవకాశమున్నది. నాచన సోముని వసంత విలాసమునకుఁ గృతిపతియైన మాచయ బ్రహ్మనికాలము 1330 అని స్థూలముగఁ బరిగణించినచో క్రీ శ. 1330-36లలో సోముఁ డీ యుత్తరహరివంశమును రచించియుండెనని యూహింప నవకాశము గలుగుచున్నది.

## నాచన సోముని కృతములుగాఁ గానవచ్చు గ్రంథములు

1. ఉత్తర హరివంశము
2. హరివిలాసము.
3. వసంతవిలాసము.
4. ఆదిపురాణము.
5. హరవిలాసము.

ఈ గ్రంథములలో నొక్క ఉత్తరహరివంశముతప్ప తక్కిన గ్రంథము లెవ్వియుఁ గానవచ్చుటలేదు. ఆయా లక్షణగ్రంథకర్త లాయా లక్షణగ్రంథములం దుదాహరణములుగాఁ బద్యముల నుద్ధరించి, గ్రంథముల పేరొసఁగి కర్త సోమనాథుఁడని పేర్కొనుటచే నియ్యవి సోమనాథుని కృతములుగాఁ గన్పట్టుచున్నవి.

అప్పకవి ముకారయతులనుగూర్చి చెప్పుచు 'వసంతవిలాసమునందు' అని

"అ_త్తరి విటనాగరకులు
చి_త్తమున వసంతకేళి చిగురొ_త్తంగా
మొ_త్తములు గట్టి తెచ్చిరి
ము_త్తెపుఝల్లరులతోడి బుఱ్ఱటకొమ్ముల్"

ఈ పద్యము నుదాహరింపఁగా నీ పద్యమునే చక్కటివడుల కుదాహరణముగ కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహము నం దుద్ధరించినాఁడు. అం దాతఁడు నాచన సోముని వసంతవిలాసమునుండి యని కంఠోక్తిగాఁ బేర్కొనినాఁడు. ఈ యిరువురు లక్షణకారులేకాక యనేకులగు నితరవిమర్శకు లాయా పద్యముల నుద్ధరించి యయ్యవి వసంతవిలాస మందలివి యని పేర్కొనివారు. ఇంతియకాక, విమర్శకులు లక్షణకారు లుద్ధరించిన పదముల శైలిని బురస్కరించుకొని కూడ వసంతవిలాస[1] మనుకృతి నాచన సోముఁడు రచించినదిగనే కానవచ్చుచున్నది.

శ్రీ మదోగిరాల జగన్నాథ కవిరాజుగారు తమ సుమనోభిరంజన కావ్య వ్యాఖ్యానమున.

"దేవ వల్లభప్రహాదినీ విలసితమయ్యు
జంభజయాధికసంపద దఁగి"

అని తనగ్రంథమున వ్రాసినదానిలోని 'భ' యను నక్షరము లఘువనియు నందుకు లక్ష్యమును జూపుటకొఱకు సంస్కృతసమాసములందు రేఫ

1. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి—ప్రబంధ రత్నావళి.
"ప్రాలేయప్రతిసీరసేనఁ బఱపెన్ బైపై వసంతం బిలన్"
2. "వీణాగానము వెన్నెలతేట"—చాగంటి శేషయ్య-ఆంధ్ర- కవి సం. 4 పు. 124.

సంయుక్త వర్ణ పూర్వాక్షరమునకు లఘుత్వమును గల్పించిన పింగళి సూరనార్యులు నుదాహరించుచు నాచన సోమనాథునిదని

"శతతాళ దఘ్న హ్రదమున నుఱికెన్"
అను కందపద్య పాదము నుదాహరించినారు.

ఈ పాదముతోఁ గూడిన పద్యము నాచన సోముని ఉత్తరహరివంశపు ప్రతులందుఁ గానవచ్చుట లేదు. ఈ పద్య పాదమును బురస్కరించుకొని శ్రీ నడుకుదుటి వీరరాజు పంతులుగారు "శ్రీకృష్ణుఁడు యమునానది యందలి కాళియ నాగరాజు హ్రదమున నుఱికిన ఘట్టములోనిదని తోచుచున్నది. ఈ యుదాహరణము ప్రక్షిప్తమనుటకుఁ గాని, లేఖక ప్రమాద మనుటకుఁగాని వీలులేదు. కాళియుని మడువున శ్రీకృష్ణుఁ డురికినది పూర్వహరివంశము కథయైయున్నది" అని వ్రాసినారు.

ఇఁక శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారివాక్యమును బురస్కరించుకొని శ్రీ మదోగిరాల జగన్నాథకవిగారు ప్రామాణికముగా దీనిని నాచన సోమనాథుని దనుచు నుద్ధరించినారేమొ అని సందేహమును వెలిపుచ్చినారు.

ఇఁక చాగంటి శేషయ్యగారు "జగన్నాథకవి శ్రీ ప్రభాకర శాస్త్రిలు గారని నట్లు కళాపూర్ణోదయములోని శబ్దమును బొరపాటున నాచనసోమనాథునిదని వ్రాయలేదు. దీనిని బట్టి నాచన సోముఁడు పూర్వహరివంశమును వ్రాసియున్నట్లే విశ్చయింపఁ దగియున్నది. ఎఱ్ఱాప్రగడ రచించిన హరివంశమున జగన్నాథకవి యుదాహరించిన పద్యపాదములేదు. భాగవతమున గాళియమర్దనకథయందు 'హ్రదమున నుఱికెన్' అను శబ్దము లున్నవి కాని 'శతతాళదఘ్న' శబ్దములేదు. శ్రీకృష్ణలీలలను వర్ణించిన పద్మపురాణమునను నీ వాక్యము గన్పట్టుటలేదు. ఏవిధ ముగాఁ జూచినను బూర్వహరివంశమును నాచన సోమనాథ కవి రచించినట్లే కన్ప ట్టుచున్నది." అని వ్రాసినారు.

పెద్ద లందఱు భావించినట్లుగ నీ పద్యము శ్రీకృష్ణుఁడు కాళియ హ్రదమునం దుఱికిన సందర్భమునందలిదై యుండు ట యుక్తమేకాని యీ పద్యపాదము పూర్వహరివంశమునందలిదియా కాదా యని పరిశీలింపగా సంస్కృత హరివంశ పూర్వభాగమందు

"ఏనం కదంబ మారుహ్యాత దేవశిశులీల యా
వినిపత్య హ్రదే ఘోరే దయయిష్యామి కాళియమ్॥"

హరి. వి. ప. అ. 11-59.

అనియున్నదే కాని 'శతతాళదఘ్న హ్రదప్రసక్తియేలేదు.' కావున పెద్ద లేకారణమును బురస్కరించుకొని హ్రదపసక్తి కలిగియున్న పద్యపాదము భాగవతమందలిదిగా గాని, పద్మపురాణమునందలిదిగా గాని యంగీకరింపలేదో యాకారణమును బురస్కరించుకొనియే యీ పాదము పూర్వహరివంశమునందలి కాదని చెప్పవలను పడుచున్నది. అయినచో నీ పద్యపాద మెందలిదై యుండునని యాలోచింప హరివిలాసమందలిదిగఁ దోచుచున్నది. 'హరివిలాస' మైనను, పూర్వ హరివంశమైనను శ్రీకృష్ణుని బాల్యక్రీడలను వర్ణించు ఘట్టమున శ్రీకృష్ణుఁడు కాళి యుఁడను నాగుని మర్దించుటకుఁ గాళియహ్రదమునం దుఱికిన విషయమును జెప్పు సందర్భమును సూచించు నీ పద్యపాద మొకటియెయేయుఁడ నది పూర్వహరివంశ మందుఁ బొసఁగక హరివిలాస మందెట్లు పొసఁగునని యాక్షేపమును గనఁబఱుప వచ్చును. ఈ యాక్షేపము సమంజసమైయే కానవచ్చును, కాని సంస్కృత హరివంశము ననుసరించి చూడ నీ యర్థమునిచ్చు శ్లోకము పూర్వభాగ మందు లేదు. లాక్షణికు లెవ్వరును సోముని హరివంశము-పూర్వభాగమని యే పద్యమును బేర్కొనలేదు. కావున కనఁబడని వినఁబడని దానికి మూలాతిరిక్తమైన వర్ణనము నంటగట్టుటకన్న శ్రీహరిలీలలు నన్నింటిని 'హరివిలాస' మను గ్రంథమున సోముఁడు రచించినాఁడనుటయే మేలుగానున్నది. కావున సోమనాథుని మూఁడవ గ్రంథమున 'హరివిలాస'మని తేలినది.

అప్పకవి "ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి"అను పద్యము నుద్ధరించి దానిని వికల్పవిరమణములకు లక్ష్యముగ సూచించి ఆది పురాణము నందలిదని పేర్కొనినాఁడు.

ఈ పద్యము కొలది మార్పుతో నిప్పుడు సోముని ఉత్తరహరివంశ మందుఁ గానవచ్చుచున్నది. ఈ పద్యమును గూర్చి శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు "హరివంశమున కాదిపురాణమను పేరున్నదా ? లేక వేఱు గ్రంథము కాగ రెంట నొకేపద్యము నుపయోగించుకొనెనా ?" యను సందేహమును వెలిపుచ్చినారు.

ఆలోచించి చూడగ నీ యాదిపురాణము వేఱుగ్రంథ మనియే తోచుచున్నది. ఏలయన హరివంశమున కాదిపురాణమను పేరున్నటుల నింతవఱ కెక్కడను గానవచ్చుటలేదు. కావున అప్పకవి యాదిపురాణ మనుచు నుద్ధరించిన గ్రంథము నిజమై యున్నచో, సోముఁ డాదిపురాణమను వేఱొకగ్రంథమును రచించెననుటయే యుక్తము.

రంగరాట్ఛందమున, కస్తూరి రంగకవి ఆయా లక్షణములకు లక్ష్యములుగా సోముని హరి (హర) విలాసము నుండి యని నాలుగు పద్యములు నుద్ధరించినాఁడు.

క. జయవిజయ వినుత జన్యా
వ్యయ దూరానందరూప భాసురదత్తా
భయ హరిహయ ముఖనిర్జర
నయనన్నక్షత్ర యూథ నళినీనాథా.

ఆనందరంగరాట్ఛందము. అపి అను ఉపసర్గ P. 115

క. శంబర వైరి విభంజన
సాంబశివా యంధకప్రశాసక గజచ
ర్మాంబరధర యని నీదు ప
దంబులు పూజించువాఁడు ధన్యుఁడు సుమ్మీ

ఆ. రం. ఛ. ప్రాదియతి P. 100

క. జయమగుటకు నీమది సం
శయ మేటికి విను మనుచు సమంచిత కరుణా
లయుఁడగు మునీంద్రుఁ డెంతయు
బ్రియముగ మంత్రంబుఁ జెప్పె నృపతికి నెలమిన్.

ఆ. రం. ఛ. మకారయతికి. P 98

---

1. ఆంధ్రకవితరంగిణి–సంపుటి 4–. 135.

క. మౌనితిలక ! సజ్జన సం
తాన మహీరుహ ! భవత్సుధాలాపము నా
వీనులకు విందొనర్చెన్
మేనునఁ గలతాప మణఁచె మృషగాదు సుమీ ॥

అ. రం. ఛ. హల్లుకు. P. 117

ఈ నాలుగు పద్యములను బురస్కరించుకొని శ్రీ చాగంటి శేషయ్యగారు ఇవి సోమకవి వసంతవిలాసములోనివై యుండునని శంకించి 'సోమకవి వసంత విలాస'మే ఈ హరవిలాసమో కాక వేఱు గ్రంథమో తెలియదని, ఈ పద్యములు శ్రీనాథుని హరవిలాసములోని వేమోయని పరీక్షించి చూచితిని. అందీపద్యములు కన్పట్టలేదు. ఈ గ్రంథము హరవిలాసమో, హరివిలాసమో సంశయముగా నున్నదని వ్రాసినారు. శ్రీ శేషయ్యగారు సంశయించి నట్టిపద్యములు వసంత విలాసము నందలివియై యుండునోపవు. ఏలయన నింతవఱ కుదాహరింపఁబడిన వసంతవిలాస మందలి పద్యములను బురస్కరించుకొని చూడఁగా నాగ్రంథ మొక శృంగారరసప్రబంధమువలె కానవచ్చుచున్నది. ఈ పద్యము లన్ననో హరసంబంధములై యతిప్రౌఢములుగా నున్నవి. కావున నీ పద్యములు నాచన సోమనాథుని వసంతవిలాసమందలివిగా శంకించుటకు వీలులేదు. ఇఁక కస్తూరి రంగకవిచే నుద్ధరింపఁబడిన నాలుగు కందపద్యములు హరపరములై యే కానవచ్చుటచే నీ గ్రంథము హరివిలాసము కాక హరవిలాసమనియే చెప్పుట యుక్తముగా నున్నది. ఇఁక సౌమనాథుఁడన్నియు కందపద్యములనే కూర్చెనో? లేక కస్తూరిరంగ కవి లక్ష్యములుగా నాయాభాగములనుండి యేరి కూర్చెనో తెలియదు. ఈ నాలుగు పద్యములు దక్క నితరాధారము లేక యీగ్రంథ నామ మును తత్కర్తను నిర్ణయించుట సులభసాధ్యముకాదు ఒకవేళ నీ కృతి కస్తూరి రంగ కవి పేర్కొనినట్లుగా నాచన సోమనాథునిదే యగునేని యీగ్రంథము హర విలాసమే కాని హరివిలాసము మాత్రము గాదనుట నిక్కువము.

శ్రీమానవల్లి రామకృష్ణకవిగారికి మలబారు దేశమునందొక చంపూ రామాయణ గ్రంథప్రతి గ్రంథకర్తపేరు దెలియరానిది లభింపఁగా వారాశైలిని పురస్కరించుకొని యీగ్రంథము నాచన సోమనాథునిదై యుండవచ్చునని

శంకించిరి.[1] శ్రీరామకృష్ణకవిగారు లిఖించిన ఒండు రెండు వాక్యములు తక్క తది తర విషయము లెవ్వియు నెఱుఁగరాని యాగ్రంథమును గూర్చి యాలోచించుటయు సాహసమె యగును. కావున నాచన సోమనాథుని గ్రంథములుగా 1. ఉత్తర హరివంశము 2. వసంత విలాసములు నిర్ధరీకరింపఁబడినవి. ఇఁక హరివిలాసము, హరవిలాసము, ఆదిపురాణము అను గ్రంథములనుండి యాయాపద్యముల లక్షణ కర్త లుద్ధరించుటచే నీ మూఁడు గ్రంథములఁ గూడ నా మహాకవి రచించి యుండెనమట కాధారము లున్నవి.

## నాచన సోమనాథుఁడు పూర్వహరివంశమును రచించెనా? లేదా?

మహాభారతమునకు ఖిలపర్వముగాఁ బరగణింపఁబడుచున్న హరివంశము పూర్వోత్తర భాగములు గలిగియుండుటయు, నిప్పు డుపలభ్యమగుచున్న నాచన సోమనాథుని గ్రంథము 'ఉత్తర హరివంశమను పేరుఁగాన వచ్చుటయు, నెఱ్ఱా ప్రెగడ హరివంశము పూర్వోత్తర భాగములు రెండును గలిగియుండుటయుఁ ప్రధాన కారణములుకాగా నాచన సోమనాథుఁడు పూర్వ హరివంశమును రచించెనా? లేదా ? యను వివాదమునకు తావు నొసఁగినవి. ఉత్తర హరివంశమునందు గ్రంథ వతారిక గానరాకుండుటయు మఱియు గ్రంథారంభము నందలి.

"హరివంశ ప్రథమ కథాం
తరమునఁ గల వింతలెల్లఁ దప్పక మదిలోఁ
దిరమయ్యెఁ గదా మీఁదట
నరవర ః యే కథలాకో వినం బ్రియ మనుడున్" ఉ హ. ఆ 1-3

---

1. "There is another work called 'Campu Ramayana' a copy of which we secured in Malabar. There is no author's name in that work. I am tempted to doubt the author of that work is our 'Somanatha' himself."

From extracts of late Sri Manavealli Notes. (Supplied by Sri N S. Krishnamoorthy garu)

"జనమేజయుఁ డిట్లను స
మ్మానితో బలదేవులావుమునువిని మఱియుం
దనియదు మది ముద మెదుఁగ
వినఁగోరెదుఁ జెప్పవే వివేకనిధానా" ఉ. హ. ఆ 1-4

ఈపద్యములను బురస్కరించుకొని 'ఇచట బలదేవులావు జనమేజయుఁ డింతకుమున్ను వినినట్లును, నింకను వినఁగోరినట్లును దెలియుచున్నది. మఱియు ప్రథమ భాగమును దెలుఁగింపకయో "ప్రథమభాగమునఁగల కథలెల్ల వింటివిఁగదా మీఁదటనే కథలు వినఁగోరెదనని" కవి వ్రాసియుండఁడు. కావున సోముఁడు పూర్వ హరివంశమును రచించెనని చెప్పుచున్నారు. ఇఁక శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు "ఇంతకుమున్ను విన్న బలదేవులా వెచ్చట నున్నదని విచారింపఁగా పైని నేను వ్రాసిన సంస్కృత హరివంశపు వ్రాత ప్రతులందుఁ బూర్వభాగము కడపటి యధ్యాయము చివరి శ్లోకములందే బలదేవులావు రుక్మివధ సందర్భమునఁ జెప్పఁబడి యున్నట్లు స్పష్టమైనది. దీనినిబట్టి సోముఁడు బలదేవ పరాక్రమము పూర్వ హరివంశమునఁ జెప్పియున్నాఁడని నిశ్చయమగుచున్నదని" రచించిరి.

శ్రీ నడుకుదుటి వీరరాజు సూచించినట్లుగ బలదేవులావు సంస్కృత హరివంశ పూర్వభాగము కడపటి యధ్యాయము "ప్రద్యుమ్న వివాహో రుక్మివధశ్చ" అను దానితోఁ బూర్తి యగుచున్నది. ఈ ఘట్టము పూర్వోత్తరభాగములుగా విభక్తమైన హరివంశములో బూర్వభాగము చివరను, పర్వములుగా విభక్తమైన హరివంశప్రతులలో విష్ణుపర్వము 61 అధ్యాయముగనున్నది. ఇఁక బలదేవు మహాత్మ్యము నభివర్ణించు నధ్యాయముతో నుత్తరహరివంశము ప్రారంభమగుచున్నది. ఈ భాగము పర్వములుగా విభక్తమైన హరివంశములో విష్ణుపర్వము 62 వ అధ్యాయమున నున్నది. ఇది 20 శ్లోకములు మాత్రమే కల చిన్న అధ్యాయము. ఇది మూల హరివంశపువిషయము. కావున అంతమాత్రమున సోమనాథుఁడు పూర్వహరివంశమును రచించెననుటకు వీలులేదు. మఱియు పెద్ద లే పద్యము లాధారముగాఁ గొని సోముఁడు పూర్వ హరివంశమును రచించెనని

నిర్ణయించుచున్నారో యా పద్యములకు మూలములైన శ్లోకములు హరివంశమందలి యుత్తరభాగ ప్రథమాధ్యాయమునందే కలవు. ఉదాహరణమునకు

"రాజోవాచ"
"భూయ ఏవతు విప్రర్షే బలదేవస్యధీమతః॥
మహాత్మ్యం శ్రోతుమిచ్ఛామి శేషస్యధరణీ భృతః॥

హరి.వి.ప అ. 62–శ్లో

ఈ శ్లోకమును బురస్కరించుకొనియే నాచన సోమనాథుఁడు "జనమేజయుఁ డిట్లను నమ్మునితో" నను పద్యమును రచించనట్లు చెప్పకయే చెప్పుచున్నది కదా! ఇదియే కాక మూల హరివంశమున

"అతీవబలదేవంతం తేజోరాశి మనిర్జితమ్।
కథయంతి మహాత్మానం యేపురాణ విదోజనాః॥
తస్య కర్మాణ్యహం విప్ర శ్రోతుమి చ్ఛామిత త్త్వతః॥
అనంతయం విదుర్నాగమాది దేవం మహౌజసమ్॥ 1.

అను శ్లోకము లుండఁగా నాచన సోమనాథుఁడు

"ఘనబలుఁ డుదగ్రతేజుం
డనఘుఁ డనంతుఁ డని విందు మాదికథలం
దనుటయు వైశంపాయన
మునిపతి భూపాలచంద్రమున కిట్లనియెన్.— ఉ.హ.అ. 1–5

అని తెలుఁగొనరించినాడు. కావున నీ పద్యమును నాచన సోముని స్వకపోల కల్పితములు కాక మూలహరివంశమున కనువాదములగుటచే నివ్వివి సోముఁడు పూర్వ హరివంశమునుగూడ రచించెనని చెప్పుట కాధారముగాఁ జూపుటకు జాలనివి.

ఇఁక పూర్వభాగమును రచింపకయే పూర్వభాగ కథలెల్ల వింటివి కదా? ఇఁక నేమి వినవలతువని వ్రాసియుండుటను గూర్చి విచారింపఁగా నందొక విశేషమైన వాదముగాఁ గానవచ్చుటలేదు, ఏలయన మన సాహిత్యము నందుఁ బురాణములనేని, పురాణగాథ లాధారముగా రచించిన ప్రబంధములనేని పరిశీలింపఁగా నందు జనమేజయుఁడు వైశంపాయన మహర్షిఁ గాంచి యింతవఱకుఁగల కథను వినినట్లు ప్రస్తా

1. హరి. 9. ప. అ. 62–శ్లో–2, 3.

వించి యిఁకమీఁది కథను జెప్పు మనుచు నడిగినట్లు రచించుట సర్వసాధారణమై కానవచ్చుచున్నది. ఇయ్యది సాహిత్యవేత్తలెల్ల నెఱిఁగినదే. కావున నీ వాక్యము సోముఁడు పూర్వహరివంశమును రచించెననుట కాధారముగాఁ బనికివచ్చునదికాదు.

మూలహరివంశమును బరికింపక కేవలము సోముని ఉత్తరహరివంశమును మాత్రము పరిశీలించినచో నీతని యాశ్వాస ప్రారంభమునందలి పద్యములు కొంత సందేహమునకుఁ దావునిచ్చుమాట నిజమే, కాని మూలశ్లోకములఁ బరిశీలింపఁగా నీ సందేహము మనము గల్పించుకొనినదియేకాని, సోమునిపద్యములు మాత్ర మట్టి సందేహమున కవకాశము గలిగింపని మూలశ్లోకానువాదములని తెలియుచున్నది.

మఱికొందఱు విమర్శకులు ఉత్తరహరివంశమందలి

''హలపాణి మహిమ చెప్పం
గల వారెవ్వరు పురాణకథలన్ మఱియుం
దెలిసికొనుము నేఁ జెప్పక
నిలిచినచోటులు వివేక నిర్మలబుద్ధిన్— ఉహ. ఆ 1-11.

అను పద్యము నుద్ధరించి సోముఁడు పూర్వహరివంశమును రచింపలేదు. ఏల యన నాతఁడే యీ పద్యమందు "పురాణకథలన్ మఱియుం దెలసికొనుము నేఁ జెప్పక నిలిచినచోటులు వివేకనిర్మలబుద్ధిన్'' అని కంఠోక్తిగఁ జెప్పినాఁడనుచుఁ దమవాదమున కుపపత్తిగాఁ జూపుచున్నారు ఈ పద్యమునే పేర్కొని పూర్వహరివంశమును సోముఁడు రచించె ననువారలు కూడ దమనిర్ణయము నొసఁగుచున్నారు.

ఈ విధముగ సోముఁడు పూర్వహరివంశమును రచించెన నువారలకును లేదనువారలకును బెన్నిధియై యుపకరించిన పద్యమునుగూర్చి విచారింపవలయును. ఇందుకును మూలహరివంశోత్తర భాగము బలదేవమాహాత్మ్యమును జెప్పు సందర్భమున (హరి. వి ప. అ 62) లో

''ఇతి పురుషవరస్య లాంగలేర్బహువిధము త్తమమన్యదేవచ,
యద కథితమిహాద్య కర్మతే తదుపలభస్వ పురాణ విస్తరాత్॥

అను శ్లోకము గానవచ్చుచున్నది. ఇందు వైశంపాయనులే వ్యాస భగవానుల యాజ్ఞచే జనమేజయమహారాజులకు హరివంశమును వినిపించుచుఁ బురుషప్రవరుఁడైన బలదేవుని యుత్తమ కర్మలనేకములు గలవు ఇచ్చటఁ జెప్పనివి పురాణములవలన నెఱుఁగఁ దగుననుచుఁ జెప్పి యంతటితో నీబలదేవ మాహాత్మ్యకథనము నాపివేసినాఁడు.

ఈ విధముగనే హరివంశోత్తరభాగమును దెనిఁగింపఁ బూనిన నాచన సోముఁడు హరివంశోత్తరభాగ ప్రథమాశ్వాసమందలి బలదేవమాహాత్మ్యమును గొంత అభివర్ణించి చివరి శ్లోకమునకువాదముగ నీ "హాలపాణి మహిమచెప్పఁగల వారెవ్వరు" అను పద్యమును రచించినాఁడు. ఈ పద్యము సంస్కృత శ్లోకమునకుఁ బూర్తి యనువాదమేకాని యొక్కపలుకైన క్రొత్తగా చేర్చినదికాదు. కావున నీ పద్యము సోముఁడు పూర్వ హరివంశమును రచించెనను వారలుగాని లేదనువారలు గాని యుద్ధరించి తమవాదమున కుపపత్తిగాఁ జూపుటకు వీలులేదు. కావున నిన్ని మూలాధారములఁ బురస్కరించుకొని సోముఁడు పూర్వహరివంశమును వ్రాయ లేదనుటయే సమంజసమైనది.

ఇఁక సోమనాథుని ఉత్తర హరివంశమందలి గ్రంథావతారికనుగూర్చి యాలోచింపవలయును.

నాచన సోమనాథుని ఉత్తర హరివంశము

"శ్రీసర్వమంగళాకుచ
వాసంతీ వకుళగంధ వద్వనమాలా
వాసుకివిలాస వేద
వ్యాసమునిమనోనివాస హరిహరనాథా॥ ఉ హ. అ.-1.

అను కందపద్యముతోఁ బ్రారంభమైనది, ఈ పద్యము సర్వవిధముల నవిఘ్న పరిసమాప్తి సంప్రదాయావిచ్ఛేద లక్షణఫల సాధనముకొఱకుఁ గావించు ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశ పూర్వకమంగళ ప్రారంభమును గావించుచునే రచింపఁబడినది నాఁటి కవికులమూర్ధన్యుఁడైన సోముఁ డీపద్యమ ద్దిష్టదేవతాప్రార్థన, వస్తు నిర్దేశాదుల నతి చమత్కారముగఁ జూపుటయేకాక వ్యాసమహర్షిని బేర్కొని పూర్వ కవిస్తుతిని

సముితము గావించినాఁడు. ఇంతియకాక భారతమునుగాని, హరివంశమునుగాని, పురాణములనుగాని ప్రారంభించునప్పుడు

''నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్॥

అను శ్లోకముతోఁ బ్రారంభించుట పరిపాటియై కానవచ్చుచున్నది. ఆ విధము గనే నాచన సోమనాథుఁడు భారత పరాంశమని చెప్పఁదగు నీ హరివంశోత్తర భాగమైన ఉత్తర హరివంశ ప్రారంభమున ''శ్రీ సర్వమంగళాకుచ'' అను పద్యమునందు శ్రీ యనుపదముచేత లక్ష్మీదేవియేకాక సరస్వతియు సూచింపఁబడుటచే మిగిలిన వ్యాస నారాయణులను గంఠోక్తిగఁ బేర్కొని సోముఁడు సంప్రదాయము ననుసరించి సరస్వతీ దేవిని, నారాయణవ్యాసమహర్షులను నమస్కరించినాఁడనియు నిఁక నీ విధానము గృతిప్రారంభమును సూచించుచున్నదనియుఁ జెప్పవలనుపడుచున్నది. కావున నాఁతడు పూర్వహరివంశమును రచింపలేదనియు నిప్పు డుపలభ్యమగుచున్న ఉత్తర హరివంశమునే రచించెననియు నిర్ణయింపవచ్చును. ఈ ప్రారంభపద్యమునందీ మహాకవి తాను వర్ణింపఁబోవు కథ నారాయణకథయనియు నాదేవుఁడు వ్యాస మనోనివాసియైన హరిహరదేవుఁడనియు నాతఁడు ''శ్రీసర్వమంగళాకుచ వాసంతీవకుళ గంధ వద్వన మాలా వాసుకివిలాసుడైనవాఁడుగా రూపించి నమస్క్రియారూపమైన కావ్యముఖమును బూర్తిగావించినాఁడు. ఇన్నివిధముల గ్రంథ ప్రారంభమును సూచించుచున్న ఈ పద్యము సోముఁడు పూర్వ హరివంశమును వ్రాయక ఉత్తర హరివంశమునుండియే కావ్యారంభమును గావించినాఁడని రుజువుచేయుచున్నది.

కొందఱు పెద్దలు సూచించినట్లు తెలుఁగునందు బ్రథమకావ్యముగ భారతము వెలసిననాటినుండి సోమనాథునివఱకు నవతారికలేక కావ్యముల రచించినవారు లేర నుట నిజమే. అయ్యు సంస్కృతకావ్యములఁ బరిశీలింప నందు మహాకవులుగఁ బ్రసిద్ధికెక్కినవారి గ్రంథములందు గ్రంథావతరణమును గూర్చిన ప్రస్తావన మున్నట్లు గోచరింపదు. ఉదాహరణమునకు కవికులగురువైన కాళిదాసుని రఘువంశమందు

కాని మాఘుని శిశుపాలవధయందు గాని, హర్షుని నైషధకావ్యమందుగాని ఈ గ్రంథావతణ ప్రసంగములు పొడకట్టకుండుటను బేర్కొనవచ్చును.

ఇట్లు మహాకవులు మీఁదు మిక్కిలి నాచన సోముఁ డధికముగాఁ బ్రభావితుఁడైన మహాకవి కాళిదాసుని గ్రంథములం దవతారికలు గానరాకుండుటచే సోముఁడు దానును తన ఉత్తర హరివంశమం దవతారికను జొప్పింపక కృతినాయకుఁడు. స్థితిలయముల కేకరూపియై వెలసిన హరిహరదేవుని స్మరణతో నవిఘ్నసమాప్తికై యేర్పరుపఁబడిన నమస్కార రూపమైన సంప్రదాయము నవలంబించి కావ్య ప్రారంభమును గావించినాఁడు. ఇంతేకాక యింతవఱకుఁ దెలుఁగుకవు లెవ్వ రనుసరింపని నూతన విధానమం దనగాఁ గ్రంథాది యందవతారికలేకయే యుత్తర హరివంశమును రచించి తన నవ్యతను బ్రదర్శించినాఁడు. ఇయ్యదియు నొకకారణమై సోముని నవీనగుణ సనాథునిగ నొనరించి యుండనోపు. కావున నాచన సోముని యుత్తరహరివంశమం దవతారిక గానరాకుండుట ఆతఁడు పూర్వహరివంశమును రచించెనుటకు హేతువుకాదు. కావున సోముఁడు పూర్వహరివంశమును రచింపలేదనుట నిశ్చయము.

## నాచన సోమనాథుఁడు - అనువాద పద్ధతి

సకలభాషాభూషణుఁడు, సాహిత్యరసపోషణుఁడు, సంవిధానచక్రవర్తి, నవీనగుణసనాథుఁడైన నాచన సోముని హరివంశరచనావిధాన మతిరమ్యమైనది. ఈతఁ డధికతరమైన జాగరూకతను బ్రదర్శించి హరివంశోత్తర భాగమునుండి కథా సంగ్రహమును గావించుటయందే తన నేర్పును బ్రదర్శించినాఁడు, మూలహరివంశ విష్ణుపర్వమందు 61వ అధ్యాయమునుండి ప్రారంభింపఁబడిన యీ హరివంశోత్తర భాగము భవిష్యపర్వాంతము 5566 శ్లోకములతో సమాప్తమగుచున్నది. పూర్వ హరివంశమునఁ జెప్పిన ప్రళయము, విధానము, అవతార ప్రశంస, దేవదానవ యుద్ధము లీ భవిష్యపర్వమునఁ బునరుక్తములైనవి. మిగిలిన కథాభాగములైనను అవాంతర విషయములతోఁ గూడియున్నది ఈవిధముగా అనేక విషయములఁగూడి సాహిత్యరసదృష్టితోఁ జూచువారలకు మూలహరివంశ మగమ్యమైయుండ నాచన సోమనాథుఁడు మిక్కిలి నేర్పును జూపి హరివంశోత్తరభాగమునకంతటికిని ప్రాణ

ములందఁదగు వారు కథలనుమాత్రమే గ్రహించి యుత్తర హరివంశమను పేర రచించినాఁడు.

సంవిధాన చక్రవర్తియైననాచన సోముఁడుగావించిన ఈ విషయ సంగ్రహ విధానమును బురస్కరించుకొనియే యితని గ్రంథ ముత్పాద్యమట్లు సర్వతంత్రమై కానవచ్చుచున్నది. మూలగ్రంథమునందలి యనేక విషయముల ననుసరింపక విడిచినప్పటికిని తిక్కన భారతపర్వము లావెలితిని దోఁపనీయక సమగ్రములై కానవచ్చినట్లులే సోమనాథుని యుత్తర హరివంశముగూడ నా గ్రంథమునకొక మూల గ్రంథమున్నదను భావమునే కలిగింపక సమగ్రమై కానవచ్చుచుండును కాని సూక్ష్మముగాఁ బరిశీలింప తిక్కన సోమయాజి భారత గ్రంథానువాద సందర్భము నందేనియమములు పాటించి యాంధ్ర మహాభారతమును స్వతంత్ర కావ్యమట్లు సంతరించెనో నాచన సోముఁడును పాటింపవలసిన సమయసందర్భములందా నియమము లన్నిటిని పాటించియే యనువాదము గావించినాఁడు.

హరివంశమును ననువదించిన సమకాలికులగు మహాకవు లిద్దరిని పోల్చుచు నెఱ్ఱన హరివంశ పూర్వోత్తరభాగముల రెంటి ననువదించెను. నాచనసోముఁ డుత్తరభాగమును సయితము పూర్తిగా ననువదింపలేదని చెప్పుచుందురు. కాని మూలహరివంశముతోఁ బోల్చిచూచిన, సత్యాసత్యముల విజ్ఞు లెఱుఁగుదురు. ఉత్తరహరివంశము విస్తృతియందు జిన్నదయ్యు గుణమం దధికవిశేషము గలది. ప్రధాననాయకుని బురస్కరించుకొని యనౌచిత్యపు ఛాయలనేని సోఁకనీయక యతిభద్రముగా నీ గ్రంథమును గాపాడుకొనుచు వచ్చిన మహాకవి నాచన సోమనాథుఁడు.

హరివంశమందు విపులముగా వర్ణింపఁబడిన శ్రీకృష్ణుడు సామాన్యుఁడుకాఁడు. ఈతఁడు పురుషోత్తముఁడు. పంచమామ్నాయరూపమందు వెలసి ప్రసిద్ధమైన మహాభారతమునకంతటికి పట్టుకొమ్మ. భారతామ్నాయ మందుఁ బరాశరసూనుఁడే యద్వైతధర్మమును బ్రవచింపఁ దలఁచెనో యా ధర్మముయొక్క సమగ్రస్వరూపమే యితఁడు, అమూర్తమైనట్టిదియు. సర్వలోకకల్యాణ కారకమైనట్టిదియు హరిహరాభేద రూపకమైనట్టిదియు నగు ఒకానొక ధర్మాద్వైత విధానమునకు రూపు కట్టినవాఁడు శ్రీకృష్ణుఁడు అట్టి ధర్మస్వరూపుఁడు నాయకుఁడుగఁ బ్రవర్తింపఁబడిన దుష్టసంహార శిష్ట రక్షణాదిరూపమగు విశ్వశ్రేయమును వర్ణించినది నాచన సోముని

హరివంశము. ఈ ధర్మమునకు వెలితియైన కథలవి యెంతటి మనోహరములయ్యు నెంతటి శ్రవణపేయములయ్యు సోముని హరివంశమందు స్థానమును బొంద లేదు. మఱియు మూలగ్రంథ మార్ష గ్రంథమగుటచేత నందలి విషయనివేదనావసరములందు కాలక్రమము పాటింపఁ బడలేదు. కావుననే మనుమని వివాహాదులు ముందుచెప్పి తరువాత నా మనుమని తండ్రి పుట్టుకకొఱకు నసఁగా ప్రద్యుమ్నుని జననమునకుఁ బూర్వము రుక్మిణి పుత్రార్థినియై శ్రీకృష్ణుని బ్రార్థించినట్లు మూలమునందు వర్ణింపఁ బడియున్నది. నిజమునకు విషయ నివేదనమే ప్రాధాన్యము వహింప నొక యలౌకిక భావముతో శ్రద్ధాభక్తులఁ బురిగొల్పుచు సాగిపోవుచుండు రచనావిధానమే హరి వంశమందలి పద్ధతి. అట్టియెడ నా గ్రంథమును గావ్యముగా దీర్పఁదల పెట్టిన కవి యతిజాగరూకుఁడై సూక్ష్మాతిసూక్ష్మములైన మెలకువల నెన్నియో ప్రదర్శింప వలసి వచ్చును. అట్టి మెలకువలఁ బ్రదర్శించి కవివరుఁడైనాఁడు నాచన సోమనాథుఁడు.

నాచన సోమనాథుఁడుత్తర హరివంశమందు మూల హరివంశక్రమము కన్న వేఱుగా నొకక్రమమును బాటించి రచించుటవలన నుత్తర హరివంశము రెండు గుణవిశేషముల నధికముగా సంతరించుకొనినది. సోమనాథుఁడు పాటించిన ఈ క్రమ మునుసరించి హరివంశమందలి కథలన్నియు నొక నియత మార్గమున నానుపూర్వ్య ములందు వైపరీత్యములు లేక వింతగఁ బొసఁగి సాగి పోవుటయేకాక కావ్యము మంగళాంతమగుటకును దోడుపడినది.

నాచన సోమనాథుని యనువాదపద్ధతియందొక వైలక్షణ్యము గోచరించు చున్నది. ప్రధానములైన యితిహాస సంఘటనములందు, తత్త్వోపదేశములందు, నితరములగు మఱికొన్ని ప్రధాన విషయనివేదనములందు మూలానుసారియై మూలకారుని భావమునద్దము నందువలె ప్రతిబింబింపఁ జేయుచుండును. ఉదాహరణ మునకు

**మూలహరివంశము**

"సుగ్రీవం చైవశైబ్యంచ మేఘ పుష్పవలాహకౌ:
యోజయాశ్వానితి దారుకం ప్రత్య భాషత॥

ఆరోప్య బ్రాహ్మణం కృష్ణోహ్యా పరోప్య చదారుకమ్।
మాముువాచతతః శౌరిః సారథ్యం క్రియతామితి॥''

హరి వి. ప. అ. 112-27

**ఉత్తర హరివంశము**

''దారుకుని డించి సారథిత్వంబు నాకు
నొసఁగి భూమి సురసహితుఁడై యొప్పమెరసె
గృత వలాహక శైబ్య సుగ్రీవ మేఘ
పుష్ప సన్నాహమగు రథంబున మురారి''— ఉ. హ. అ. 2-36

ఇఁకనిట్లే శ్రీకృష్ణాదు లుత్తర సాగర ముత్తరించి గంధమాదనము సేరి నప్పుడు.

**మూలహరివంశము**

''తతస్తు పర్వతాస్సప్త కేశవం సముపస్థితాః
జయంతో వైజయంతశ్చ నీలో రజత పర్వతః
మహామేరుః సకైలాస ఇంద్రకూటశ్చ నామతః।
బిభ్రాణా వర్ణరూపాణి వివిధా న్యద్భుతాని॥''

హరి వి ప. అ 113-14+15

**ఉత్తర హరివంశము**

''వచ్చునెడ జయంతమన వైజయంత
మనఁగ నీలంబు నారజతాచలం బ
నఁగ మహామేరుకైలాసము లనఁగ
నింద్రకూటంబునా వచ్చె నేడు గిరులు.'' ఉ. హ. అ. 2-47

మఱొకచోట

**మూలహరివంశము**

''నారా అపః సమాఖ్యాతాస్తాసామ యనమాదితః।
యతస్త్వం భూత భవ్యే శతన్నారాయణ శబ్దితః॥
హరస్సి ప్రాణినో దేవతతో హరి రితిస్మృతః।
శంకరోఽసి సదాదేవతః శంకరతాం గతః॥

బృహత్త్వాద్బృంహణత్వా చ్చతస్మాద్బ్రహ్మేతిశబ్దితః
మధురింద్రియనామేతితతో మధునిషూదనః॥
హృషీకాణీంద్రియాణ్యాహుస్తేషామీశోయతోభవాన్।
హృషీకేశ స్తతో విష్ణోఖ్యాతో దేవేషుకేశవః ॥
మా విద్యాచహరే ప్రోక్తాతస్యాః శోయతోభవాన్ ।
తస్మాన్మాధవ నామాసిధవః స్వామీతి శబ్దితః ॥

హరి. భ.ప.అ 88, 43, 47

''విశ్వలోక వ్యాప్తి విష్ణునామము దాల్తు
మధువింద్రియములు దన్మర్దనమున
మధుసూదనుండవు మాయన విద్యద
త్పతివి మాధవుఁడవు దపముచేత
నగుదు తపస్వి విహరణమింతకుఁ జేసి
హరివైతి నారంబున జలంబు
లం దనయంబు నీ కగుట నారాయణ
త్వము వహించితి బృహత్త్వంబు బృంహ

తే॥ ణమున జూపుట బ్రహ్మవై నాఁడ వింద్రి
యములను హృషీకములు దదీశాఖ్యఁ గలిగి
నది హృషికేశ పదము శమ్మది సుఖంబ
ఖిలమునకుఁ జేసి శంకరాకృతి భజింతు ॥

ఉ. హ ఆ. 2-207.

ఇంతటి మూలాంను సారియైన రచన గావించిన సోమనాథుఁ డతి విచిత్రముగా రాజసభ మర్యాదలను, రాయబారములను, అంతఃపుర వినోదములను ప్రదర్శించునపుడు స్వాతంత్రమును వహించి తనకాలమునాఁటి దేశాచారములను బురస్కరించుకొని యాయాసందర్భములందు వర్ణించు కావ్యమును రసవత్తరముగాఁ జేయుచుండును. ఉదాహరణమునకు ఊర్వశీ నరకాసుర సంభాషణము, శ్రీకృష్ణుఁడు

రుక్మిణీ సత్యభామలతో జూదమాడుట. జనార్ధనుని రాయబారము, సత్యభామ నరకాసురుతోఁ బోరుట మున్నగు ఘట్టములఁ బేర్కొనవచ్చును. [1]

ఆయాపట్టుల సర్వతంత్ర స్వతంత్రుఁడై రచించిన సోమనాథుని మూలాతిరిక్తములైన పద్యభాగములే ప్రధానకథతోఁ గలసి నిజమునకు గ్రంథ మంతయు సోముని యుపజ్ఞయే యను భావమును గలిగించుచుండును.

---

1. "చతురవచోవిలాస గుణసాగర సాగర మేఖలావనీ
పతియగు నీకు నింతులొక ప్రాఁతియె నీవిటు గోరుటెల్ల నా
యతులిత భాగ్యమింత నిజమైనఁ గలంగక మున్న వైభవో
న్నతి మెఱయంగ వచ్చి యొకనాఁడయినన్ నను గారవించితే."

ఉ. హ. ఆ, 1-66.

2. "జూదరివి సుమాళివి నెఱ
వాదివి తసుకరివి గెలువవచ్చునఁటే బా
మోదర నిను మాకనుటయు
నాదెసఁ గనుఁగొనక పిలువుమనె జాంబవతిన్" ఉ. హ. ఆ. 3-113.

3. "యాదవు లుప్పు మోవఁగ మురారికి సోలలు మోవ కింకఁ బో
రాదు హలాయుధుం గొలువ రమ్మనరై రటుగాని యాగముం
గాదట చేయ హంసడిభకక్షితిపాలకుమారులంచు నా
బీదలకేల బోగుపడి పెద్దతింబునుఁ బెట్టు బీరమున్

ఉ.హ. ఆ 4-160

4. "అరి జూచున్ హరిఁ జూచు జూచుకములందందిమందార కే
సరమాల మకరందబిందు సలిలస్యందంబు లందంబులై
తొరుగం బయ్యెద కొంగొకింత దొలగం దోర్దోశ్శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్."

ఉ. హ. ఆ. 1-162

5. "కమలముఖీ కటాక్ష కటకాముఖపాణిఖీనఖోపకారి వి
భ్రమ మణిపుంఖరింఖదభిరామరుచుల్ గరమొప్పెఁ జెక్కులం
జెమటలఁ బత్త్రిభంగమును చిందఱవందఱలైనఁ దోన శాం
భ్రమమున వరలక్ష్మి సమరక్రమ రక్షకు వ్రాసెనో యనన్."

ఉ. హ. ఆ 1-69.

## మూలమును పెంపుగావించిన విధానము

మూలమందు కథామాత్ర ప్రధానములైన శ్లోకములుండగా సోమనాథుఁడు రసపోషణమునకై యాయాభావములపెంచి కావ్యపాత్రల నన్నిటిని సజీవములుగా నొనరించి మన కన్నులముం దటుసిటు నడయాడు నట్లుగాఁ జేయుచుండును. ఉదాహరణమునకు శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణుని మృతబాలకుల రక్షించుకథయందొక నాఁడు దీక్షితుఁడైన కృష్ణునొద్దకు.

"తతో దీక్షిత మాసీన మభిగమ్య ద్విజోత్తమః ।
కృష్ణం విజ్ఞాపయామాస త్రాహి త్రాహీతి చాబ్రవీత్

అనుచు నొక బ్రాహ్మణుఁడు వచ్చి.

"రక్షాధికారో భవతః పరిత్రాయ స్వమాం విభో" ।

అనుచు నార్తుఁడై పలికెనని యుండగా నాచన సోమనాథుఁడు

ఉత్తర హరివంశము

వెడవడెడు దోవతియును
బెడతల చేతులు వడంకు పెదవులు తూగా
డెడు వెంద్రుకలునుఁ బైపై
వెడలెడు కన్నీరుఁ గలుగు వేషముతోడన్ ॥ ఉ. హ. ఆ. 2-7

ముందట నిలిచి మురాంతక
మందరధర భక్తలోక మందార దయా
కందళిత హృదయ సురముని
వందిత పాదారవింద వసుదేవసుతా ॥ ఉ. హ. ఆ. 2-8

యనుచు వచ్చెనని రచించినాఁడు. ఇచ్చట బ్రాహ్మణుని యాకార విశేషము చేతనే యాతఁడొక మహావిపత్తునందుఁ దగుల్కొనినవాఁడు వలె కన్పట్టుటయే కాక కష్టసమయములందు జగన్నాయకుని స్మరణ మతి సహజమై యాపన్నుని ముఖము నుండి వెడలినట్టుగనే సకలజగన్నాయకుఁడైన శ్రీకృష్ణుని యెదుట నిలిచి బ్రాహ్మణుఁడు పలికిన విధానమును గానుపింపఁ జేసినాఁడు.

ఇట్లువచ్చిన బ్రాహ్మణున కభయప్రదానము గావించి వచ్చినకారణమును గూర్చి ప్రశ్నించిన శ్రీకృష్ణునితోఁ బ్రాహ్మణుఁడు.

మూలహరివంశము

"జాతో జాతో మహాబాహో పుత్రో మే హ్రియతేఽనఘ
త్రయో హృతాశ్చతుర్థంత్వం కృష్ణ రక్షితు మర్హసి ॥"

హరి. వి. ప. అ. 102-11

ఉత్తర హరివంశము

అని ప్రార్థించినట్లుండగాఁ దెలుఁగునందు సోముఁడు, వచ్చిన బ్రాహ్మణుఁగాంచి కృష్ణుఁడు "ఎట్టి సంకటములనేని మీవంటి వారలు కలఁగరు మఱి మీరేల ప్రలాపించెదరని యడుగ నా బ్రాహ్మణుఁడు

"ఓ పురుషోత్తమ ! యెట్లు ప్ర
లాపింపక యుండుదుం జలంబున విధి నా
పాపల ముప్వురఁ దోడ్తోఁ
జూపోపక చంపెఁ దత్ప్రసూతి దినములన్"— ఉ. హ. అ 2-14

అనుచుఁ దనవగపునకుఁ గారణము చెప్పి మఱియు
"తడియొత్తుచీరతో దాదికౌఁగిట జేర్చి
చూపంగఁ గన్నారఁ జూడనైతిఁ
దడవి యాడకమున్న తట్టాడు మనిపట్టి
వడఁకంగ సెజ్జపై ప్రాల్పనైతి
నల్లంత దవ్వుల నప్పుల అప్పలనంగ
నెదురుగాఁ బఱతేర నెత్తనైతి
వియ్యాల చేనిచ్చి వేడుక నను వారు
తిట్టింప విని దప్పి దేర నైతి

తే ॥ నకట మిథ్యామనోరథుండైతి గాని
కొడుకులం గని దమవారు గొండసేయ
నుండ లేదయ్యె సంపద లుబ్బనేని
లేఁబరమకాదె బిడ్డలు లేని బ్రతుకు ॥ ఉ. హ. ఆ. 2-160

ఇట్లు వాపోయినట్లున్న పద్యమున మొదట పుత్రోత్పత్తివలన గలుగు సంతోషమును తరతరములుగా నాబాలుఁడు పెరిగి పెద్దవాఁడగుచునుండ నాయ

వేళలం దండ్రి యనుభవించు నానందమును, మఱియు నితరములగు వానినన్నిటి నేకరువు పెట్టి యవి యన్నియుం దనకుం దూరమగుటచే నెంతటి దైన్యము ననుభవించుచున్నాఁడో తెలియఁబఱిచి యా సందర్భమునందలి శోకస్థాయిని పరిపుష్టము గావించుటకుఁ బ్రయత్నించినాఁడు సోమనాథుఁడు.

ఆ విధముగనే రుక్మిణీదేవి తనకు సుపుత్రు ననుగ్రహింపుమని శ్రీకృష్ణుఁ బ్రార్థించిన సందర్భమున మూల హరివంశమందు.

''ద్వారవత్యాం జగన్నాథో వసన్ వృష్ణిభి రీశ్వరః,
రుక్మిణ్యాసంగతో దేవో వసంత స్తత్ర పురేహరిః ॥

హరి. చ. ప. అ 173-17.

అని ఉన్న శ్లోక మాధారముగా సోమనాథుఁడు

''కంసారాతిమురా మరారి నరకక్రవ్యాద ముఖ్యాసుర
ధ్వంసాపాదన పీతకంటక వర్తిన్ ద్వారావర్తిన్ రుక్మిణీ
హంసీ హారమృణాలహారి భుజమధ్య స్ఫారకాసారుఁడై
సంసారార్ణవసార మన్మథసుధాసారంబునన్ దేలఁగన్.

అని వర్ణించుటయేకాక యా జగన్నాయకుని యుపలాలనమున సుఖియించు రుక్మిణీదేవిని వర్ణించుచు.

''యమునాతరంగ డోలాధిరోహణమున
డంబుమీరెడు మరాళంబువోలె
హరినీలమణిమనోహరమందిర స్తంభ
ముల వినోదించు కీల్బొమ్మవోలె
దళిత నీలోత్పల దళదామసంగతి
గొమరారు సంపంగి గుత్తివోలెఁ
దరుణ తమాలపాదప శిఖాశాఖలఁ
జెలువారు పలుచాచ చిలుకవోలెఁ

తే॥ బారిజాత గోవర్ధనోత్పాటనమున
బరిమి తొడవైన మురవైరి బాహుయుగము
తెప్పగా మన్మథాంబుధిఁ దేలుచుండె
రమ్యగుణమణి రుక్మిణీ రమణి ప్రీతి ॥ ఉ. హ. అ 2-73.

అని రచించిన యీ పద్య మమూలమయ్యు మనోహరమై శృంగార రసస్ఫోరకమై ముందు వర్ణింపఁబోవు రుక్మిణీదేవియొక్క పుత్రసంబంధమైన కోరికకును జగన్నాయకుఁ డామెయందు ప్రీతుఁడై యనుగ్రహించుట అను ఘట్టమునకును నాందివలె ఉపకరించుచున్నది.

మూలమును సంక్షేపించిన విధానము :.

నాచన సోమనాథుఁడు మూల హరివంశోత్తర భాగములనుండి రసవత్తరములైన కథలను మాత్రమే గ్రహించి తక్కినవాని ననువదింపక విడుచుటయేకాక స్వీకరించిన కథలందు సయితము కథాభాగమునకడ్డు వచ్చినవియు, రసపోషణమునకుఁగాని పాత్రపోషణమునకుఁగాని భంజకములగునట్టివియు, సుదీర్ఘములగునట్టివియునగు వర్ణనాంశములను దొలఁగించి రచించినాఁడు. ఉదాహరణమునకు మూల హరివంశమందు నరకాసుర సంహారార్థమై ప్రాగ్జ్యోతిషంబు ప్రవేశించిన శ్రీకృష్ణుఁడు ముర, పంచజన, నిశుంభ, హయగ్రీవాది దానవులతోఁ బోరునప్పుడా యుద్ధవర్ణనములన్నియు (హరి. వి. ప. అ 63-47-70) 24 శ్లోకములలో వర్ణింపఁబడియుండగా సోముఁడీ సందర్భమున (ఉ. హ. ఆ 1-141-44) నాలుగుపద్యములను మాత్రమే రచించి ప్రధాన విషయనివేదనము గావించినాఁడు.

ఆ విధముగనే మృత బ్రాహ్మణ కుమారులఁ దెచ్చినప్పటి విచిత్రములఁ గూర్చి ప్రశ్నించిన యర్జునునకు సమాధానముగనున్న (హరి.వి స. అ 64-8-14) ఏడుమిది శ్లోకముల భావమునొక్క సీసపద్యము (ఉ. హ. ఆ 2-58) నందిమిడ్చి మిగిలిన శ్లోకములు పునరుక్తములై భాసించుచుండ వానిననువదింపలేదు. మఱియు శ్రీకృష్ణుడు కైలాసయాత్రకై గరుడవాహనారూఢుఁడై వెడలఁగ మార్గమధ్యమునం దాకాశమునందు నిలిచి దేవతలు, గంధర్వులు శ్రీకృష్ణుని స్తుతించినట్లు మూలమందు వర్ణింపబడియుండగా నా శ్లోకముల సోమనాథుఁడు తెనుఁగుసేయలేదు. ఏలయన ఈస్తోత్రములే తిరిగి బదరికాశ్రమమున శ్రీకృష్ణుడు ప్రవేశించినప్పుడును ఘంటాకర్ణుఁడు కృష్ణుసేవించినప్పుడును గానవచ్చుచున్నవి. కావున నాచన సోముఁ డిజ్ఞుడై పాఠకులకు విసువు జనింపకయుండున ట్లీ స్తోత్రముల ననేకమారు లనువదింపలేదు

ఇట్లె మూల హరివంశమందు కైలాసపతియైన శంభుఁడు శ్రీకృష్ణునిచేరవచ్చి పరస్పరము స్తుతు లొనరించుకొనిన విధానమంతయు భవిష్యపర్వము అధ్యాధ్యాయము 87 మఱియు 88 లందు విపులముగా వర్ణింపఁబడియున్నది. దీనితరవాత శంకరుఁడు మునులకు శ్రీకృష్ణతత్త్వము నుపదేశించు భ.ప. 89వ అధ్యాయమున 20 శ్లోకములును భ ప. 90వ అధ్యాయమున శివకృత విష్ణుస్తుతిః అని విష్ణు పారమ్యమును సూచించుచు 38శ్లోకములును రచింపబడియుండగా సోమనాథుఁ డుత్తరహరివంశమున శివకేశవాభేదమును సూచించుచు శివకేశవు లొండొరు లొకరి నొకరు సంభావించిన విధానమంతయు విపులముగా ననువదించి పునరుక్తములుగానున్న యీ రెండు అధ్యాయముల శ్లోకములను స్పృశింపక వదలినాఁడు.

బాణాసురోపాఖ్యానమున దేవేశ్వరుఁడైన మహదేవుఁ డుమాపతిఁ గూడి వనకేళి జలకేళ్యాదుల జరుపుచుండగా బాణాసురపుత్రియైన యుషాదేవి మనస్సునందొక కోరిక జనించినది. దానినెఱిఁగి పార్వతి యుషాకన్యయు నిట్టిసుఖము నచిరకాలములో ననుభవించునని చెప్పి యంతర్హితయైనది. ఇఁక యుషాదేవి

''తతః ప్రభృతి సాదేవి కామమోహాంగ తావిభో

దేవ్యాస్తువచనం స్మృత్వా సంస్మరంతీపతిం తదా॥

హరి.వి.ప.అ. 177-28.

నాఁటినుండియే కామమోహితయై

"నిద్రాం నభజత్తే రాత్రౌ నదివా భోజనం తథా"[1]

రాత్రింబవళులు నిద్రాహారము లొల్లకుండినదని చెప్పుటయేకాక యామె విరహావస్థను వర్ణించుచు 27శ్లోకములు మూల హరివంశమునందుఁ గానవచ్చుచున్నవి.

ఈ కథ ననువదించునప్పుడు సోముఁ డీభాగము ననువదింపలేదు. ఉషాదేవి స్వప్నమునందైనను పురుషదర్శన మెఱుఁగక పూర్వము తనమనమొక ప్రత్యేక పురుషునియందు సంలగ్నముకాక పూర్వము విరహభరముతోఁ దపించెననుట కొంత విపరీతముగానున్నది. కావున నాచనసోముఁడు మూల హరివంశమునం దుషాదేవి స్వప్నమునకుఁ బూర్వమునందున్న విరహవర్ణనమునంతయు వదిలిపెట్టి యౌచిత్యమును గాపాడుచు నుత్తర హరివంశమును రచించినాఁడు. ఈ విధముగా సంవిధాన చక్రవర్తియైన నాచన సోమనాథుని విధానమొక రమ్యమార్గమనుచు నెన్నియో యుదాహరణములఁ జూపవచ్చును.

1. హరి.వి.ప.అ. 117-28.

## నాచన సోమనాథుని రసపోషణము

ఉత్తర హరివంశమునందు ధీరోదాత్తుఁడైన శ్రీకృష్ణుడు నాయకుఁడు. అంగి రసము వీరము అంగము శృంగారము. కాని రసప్రాధాన్యమును గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు వీరశృంగారముల రెంటిని సమప్రాధాన్యముతోఁ బోషించెననియె చెప్ప వలయును. ఒక్కొక్కచో శృంగారమంగియైన వీర మంగమైనది. కావ్య మందంతట నన్ని రసములు పోషింపఁబడినవి.

ఉత్తర హరివంశమందు రెండు సందర్భములలో శృంగారరసము ప్రధానముగా వర్ణింపబడినది. ఈ రెండును రెండువిధముల వెలసినవి.

1. రుక్మిణీ కృష్ణుల శృంగారము. 2. ఉషానిరుద్ధుల శృంగారము.

**రుక్మిణీకృష్ణుల శృంగారము :**

'ధర్మావిరుద్ధో భూతానాం కామో-ఽస్మి భరతర్షభ' ధర్మావిరుద్ధమైన కామ స్వరూపుఁడను నేనే యని శ్రీకృష్ణుఁడు భగవద్గీతలోఁ జెప్పినాఁడు. కావున ధర్మావి రుద్ధమైన కావ్యస్వరూపుఁడగు శ్రీకృష్ణుని దాంపత్యము నిచ్చట ధార్మావిరుద్ధమైన కామమున కుదాహరణముగా వర్ణించినాడు. ఈ సందర్భమున 'యమునాంతరంగ డోలాధిరోహణమున' అను సీసపద్యములో రుక్మిణీదేవి శ్రీకృష్ణుఁ డాలంబనముగ ననుభవించిన కామోపభోగము నంతటిని హృదయానందకరముగా లక్షణము తప్పక వర్ణించి దీనిని ధర్మశృంగారముగాఁ దీర్చుటకై పుత్రసంబంధమైన రుక్మిణి కోర్కెను జేర్చినాడు.

''పుత్రుల కలిమియె శుద్ధ క
ళత్రమునకు లక్షణంబు లక్షణవతులై
పుత్రవిహీనతఁ బొరసిన
బాత్రములే సతులు పతులు పాటించుటకున్- ఉ.హ.అ 2-81.

అనుచు రుక్మిణి తనను కడుపు చల్లనికాంతలలోఁ గలువుమని కోరినది. ఇచ్చట భర్తృబహుమానమునకు స్త్రీ సౌందర్యాదులేకాక పుత్రుల కలిమిని గూడ నొకకారణముగాఁ జెప్పుట ఔచిత్యపోషకముగానున్నది. సంతానరూపమైన కోరికను విని కృష్ణుఁడు

"మానిని వినవే పున్నా
మ్నో నరకా త్రాయతే' యనుట పుత్రార్థం
బై నది నీ కోరిక నా
మానస మలరించె వేదమార్గోచితమై॥ ఉ.హ.ఆ. 2-85

అని శ్లాఘించినాఁడు ఇచ్చట దాంపత్యశృంగారమునకు పరమప్రయోజనము సంతానలబ్ధియని చూపనెంచిన సోముఁ డావిషయమును రుక్మిణీకృష్ణుల వ్యపదేశము చేత నిరూపించినాఁడు. అంతియగాక సనాతనులు 'జగ దవిచ్ఛిన్న కారితా కారణం శృంగారః' అని సంతానరూపమైన యే ధర్మశృంగారమును గూర్చి చెప్పిరో యాధర్మశృంగారమునే యిచట సోముఁడు ప్రదర్శించినాఁడు. సర్వశాస్త్రయు, పురుషోత్తముఁడు నైన శ్రీకృష్ణునిచేత "పుత్రార్థంబై నది నీ కోరిక నామానస మలరించె వేదమార్గోచితమై" యని ప్రశంసింపఁజేసి సంతానలబ్ధియే దాంపత్య శృంగారమునకు లక్ష్యమనియు నదియే సంఘమున కుపాధేయమనియు నుపదేశ రూపముగా రచించినాఁడు.

**ఉషాచరిత్రము**

ఇచట నాచన సోమనాథుఁడు గావించిన శృంగారరసపోషణము సశాస్త్రీయమై యారసపోషణమునం దాతనికిఁగల సామర్థ్యమును బ్రకటించుచున్నది. ఉషా దేవి మనస్సునందు మొదట శృంగార సంబంధమైన భావారంభమునకుఁ బ్రాతిపది కగాఁ బార్వతీ పరమేశ్వరులఁ గూడివచ్చిన యప్సరసల నాట్యమును, వనజలకేళులను వర్ణించినాఁడు. ఈ వర్ణనముల సయుతము శృంగార రసాంగములకు వెలితిగానీయక సమగ్రముగా వర్ణించినాడు.[1] ఇట్టి క్రీడాదులవలన ఉష మనస్సునందొక కోరిక భర్తృ సంయోగ సంబంధియై పొడమినది.

ఉషాదేవి స్వప్నమున ననిరుద్ధుని గాంచినప్పటి నుండి పూర్వరాగమును లాక్ష ణికముగా వర్ణించినాఁడు. ఉషాదేవి యొక్క పూర్వరాగాను రూపమైన విప్రలంభము నందామెకు దశవిధములైన మన్మథావస్థలు కలిగి నట్లు వర్ణించినాఁడు.[2] ఇచ్చట మన్మథ మారుతాద్యుపాలంభనము లన్నియుఁ బ్రవేశపెట్టఁబడినవి.

---

1. ఉ.హ.ఆ. 5-48 to 132.
2. ఉ. హ. ఆ. 5-115 to 182.

చిత్రలేఖ ద్వారకకేగి యనిరుద్ధుని గొనివచ్చిన తరవాత సంభోగ శృంగారము నంతటిని క్రమము తప్పక యధికాభినివేశముతో వర్ణించినాఁడు. ఈ విధముగా నాచన సోమనాథుఁడు శృంగార రసలక్షణమునకు లక్ష్యముగా నీ కథను దీర్చి శృంగార రసమును బ్రదర్శించుటయందుఁ దనకుఁగల సామర్థ్యమును బ్రకటించి నాఁడు.

**విరోధిరసాంగముల వర్ణనము :**

నాచన సోమనాథుఁడు కేవలము రసములనే కాక విరోధి రసాంగ ములను గూడ చమత్కారముతో వర్ణించి దక్షతను బ్రదర్శించినాఁడు. ఉదాహరణము నకుఁ బరమ సుకుమార మూర్తియైన సత్య వీరరసాధిదేవతయైన విధానము నతి చమత్కారముగాఁ జెప్పి యందలి విరోధమును సందేహమును దొలఁగించినాఁడు.

"తంత్రీ వినోదంబు తడువునైఁ పని వ్రేళ్ళ
గొనయంబు తెగలపైఁ గోరుకొనుట
యద్దంబు పిడిముట్టనలయు పాణితలంబు
లస్త్రకం బిటియింప లావు కలిమి
చెలికత్తె నొత్తిలి పిలువలేని యెలుంగు
సింహనాదంబుచేఁ జెదరకునికి
ప్రమద నర్తనకేలిఁ బరిథవింపని పదం
బైదు ఠాణంబుల నలఁతఁ బడమి
సోయగపుఁ జిత్రరూపంబుఁ జూచుచోట
వేసరు విలోచనంబులు వికృతదైత్య
లక్ష్య మీక్షించుటయు మొక్కలంపు గెలుపు
గైకొనియె సత్యభామ సంగ్రామసీమ". ఉ. హ. అ 1-61

ఈ పద్యమందు శృంగారనాయికయైన సత్యభామ వీరాంగనయైన విధాన మతిరమ్యముగాఁ జూపినాఁడు. శృంగారరసాంగములైన వర్ణనాదుల కనువగు సౌకుమార్య మాధుర్యరీతి గుణాదులనన్నిటిని సత్యభామ కాదనినది. అతిసుకు మారములు కుసుమపేశలములైన సత్యభామ సర్వావయము లిప్పుడు వీరరసా లంకార చిహ్నముల మోయుట కనువైనవి. అందుకే వేళ్ళకు గొనయంబు తీగలపైఁ

గోరుకొనుట, పాణితలంబునకు లస్త కం బిరియించు లావుకలిమి చేకూర్చుట, ఎలుఁగునకు సింహనాదంబుచేఁ జెదరని శక్తిఁ గూర్చుట, పదంబులకై దురాణముల నలత నెఱుఁగని బలిమి గూర్చుట, విలోచనములకు వికృత దైత్య లక్ష్యమీక్షించు స్థైర్యమును గల్పించుటలను గావించినది. కావుననే సత్య సంగ్రామసీమలో గెలుపు గైకొనినదని రచించిన విధాన మతిమనోహరముగా నున్నది.

ఇట్లే సోమనాథుఁడు కరుణ హాస్యశాంతములను, శాంతి-అద్భుతముల నొక్కచోఁ జెప్పి యాశ్రయ భేదముచేత నాయారసములు ద్యోతకమగునట్లు విచిత్రముగాఁ గూర్చుచుండును. ఈగ్రంథము నందాయా తావులలో బీభత్స, కరుణ, రౌద్ర, భయానక, అద్భుతాది రసముల నతి ప్రౌఢముగాఁ బ్రదర్శించి తనకుఁగల సాహిత్య రసపోషణ బిరుదమును సార్థకము గావించు కొనినాఁడు.

**యుద్ధవర్ణనములు :**

నిజమునకు యుద్ధవర్ణనములు గావించునపుడు సోముని ప్రజ్ఞ బహుముఖమై ప్రకాశించుచుండును. రసవత్తరములైన యితర ఘట్టముల నెట్లు పాఠకుఁడు తన్మయుఁడై చదువుచుండునో సోముని యుద్ధవర్ణనములను జదువునప్పుడు సయితము పాఠకుఁ డట్లె తన్నుతా మఱచి యాయావీర ప్రతివీరుల వీరరసోల్బణమును దిలకించునట్లు గానవచ్చుచుండును. ఉదాహరణమునకు పౌండ్రక సాత్యకు లొండురుల నధిక్షేపించుచు

"ఎవ్వఁడు రోరి తాను నొక యెక్కుడు వీరుఁడ పోలె రాత్రిమైఁ
జివ్వకువచ్చి ముచ్చిమిగఁ జేరినవాఁడు దదీయమస్తముం
గ్రొవ్విన మచ్చరంబునను గూల్చెద వాని శరీర మాంసముం
గ్రవ్వి కొనంగ గృధ్రములఁ గంకములం బరితృప్తిఁ దేల్చెదన్."
ఉ. హ. అ. 3-43

పౌండ్రుఁడు సాత్యకితో

"అయ్యాదవగోపాలుం
డెయ్యెడ నున్నాఁడో పసుల నెందడఁచెనొకో
యయ్యన్న తమ్ముఁడవు నీ
వియ్యాడెడు బిరుదుమాట లెచటఁ జదివితో.
ఉ. హ. అ 3-46

"చక్రి పొద మంగఁ బార్థివ స్థానమయ్యె
నోరి మీవంశ మందుఁ దాకోర్వఁజాలు
వారిఁ జూపుము కుమ్మరావమున రాగి
ముంత లేఱంగఁ గలవె నీ కింతయేల" ఉ. హ. అ 3-48

అనుటయు సాత్యకి కోపించి.

"ప్రేలకు జీలుగు వెరిఁగిన
మాలెకుఁ గంబంబుగాదు మాటలు మిగులన్
నాలుక కఱచిన యంత నె
చాలునొ మగతనము జూప సాత్యకి యెదురన్" ఉ.హ. అ 4-50

అనుచుఁ బల్కిన పద్యములఁ బేర్కొనవచ్చును.

**నాచన సోమనాథుని శైలి :**

సర్వకళాశాస్త్రపారంగతుఁడైన సోమనాథుని శైలిని గూర్చి చెప్ప వలయు ననిన ప్రధానముగా నాశైలి కడుంగడు ప్రౌఢమైనదనియే చెప్పవలయును. కాని సూక్ష్మపరిశీలనము గావించుకొలఁది యీతని శైలి యపురూపమై, నవీన గుణసనాథమై అడుగడుగున వింత చెలువమును బ్రదర్శించుచుండును. బహుముఖ ప్రజ్ఞా భూషితమైన యీతని శైలిరసలుబ్ధులైన తరువాతి కవులెందఱికో యొఱ వడియై చివరకుఁ బ్రబంధశైలిగా రూపొందినదని చెప్పిన నతిశయోక్తి కాఁజాలదు.

పరిపూర్ణ సాహిత్యకళాభిజ్ఞుఁడు, అధినేతయునైన సోముని రచన చూపు మాత్రము నతనే కర్తృసామర్థ్యములఁ దళుక్కున మెఱపింపఁ జేయదు, కాని యొండు రెండు మారులు చదివి పరిచయము గావించుకొని లోతుల నరసినకొలఁది యమృత భాండమై ఆమెతల పెట్టుచుండును.

ఇతఁడు కేవల మొకమాఱు దృష్టిని ప్రసరించుటచేతనే యావస్తువునకు సంబంధించిన సర్వవిషయముల నాకళించుకొని యావస్తువుయొక్క బాహ్యస్వరూప వర్ణనమునకుఁ దోడు, అంతర ప్రకృతిని వర్ణించి దాని సూక్ష్మరూపమును గూడ దృశ్యమాన మొనరించుచుండును. ఈ వర్ణనములం దీతఁ డెప్పుడు దేశకాల సమయ సదాచారములకు వెలితికాక తత్తద్వస్తు స్వభావానుగుణమైన వర్ణనములనే విచిత్ర

దీర్చి చెప్పుచుండును. కావుననే యితని వర్ణనములు సమగ్రములై, తమ వెంట పాఠకుని గొనిపోయి యాయావ్యక్తులందు సమయసందర్భములందు లీన మొనరించుచుండును. ఇతనియందు ప్రతిభాపాండిత్య కవిత్వములు నిండారఁగ నీతని భావము లతిగంభీరములై శుచిమంతములై, అనన్యసాధారణములై భాసించుచుండును. అత్యంత ప్రగాఢములైన యితని భావములు మెఱుపుతీగలవంటి పదబంధములతోఁ గూడి జాజ్వల్యమానములై ప్రకాశించుచుండును. ప్రకృష్టమైన భావనా బలము వెనుక పరిపూర్ణ కావ్యకళా రహస్యవేత్తయైన సోముఁడు నిరంకుశుఁడై విహరించుచు మన కన్నుల యెదుట గాన వచ్చుచుండును. నన్నయ తరువాత వెలసిన మహాకవి తిక్కన సోమయాజి, యాతనిశైలిని దివ్యకావ్య ఫక్కియని శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు పేర్కొనిరి. ఇట్టి శైలియే నాచన సోమనాథునిది. నాచన సోమనాథుని శైలియందు మఱొక్క విశేష మధికముగాఁ గానవచ్చుచున్నది. అది కాంతియను గుణము. ఈతడు తన పద్యములలో కాంతి ప్రసాదాది గుణములకుఁదోడు పురుషోపనాగరకాది వృత్తులఁజేర్చి శబ్దపాకమును పరిపక్వ మొనరించి పద్యముననొక విధమైన కాంతిని జిలుగు నధికముగాఁ గూర్చుచుండును. అందుచేత నీతనిపద్యములు జీవ చైతన్యముతోఁ బ్రకాశించుచుండును.

## సోముని కావ్యవిశేషములు

సకలభాషాభూషణుఁడు, సర్వ శాస్త్రపారంగతుఁడైన నాచన సోమనాథుఁడు ఉత్తర హరివంశమందుఁ బ్రదర్శించిన పాండిత్యము, వ్యాకరణ పదప్రయోగాది వైచిత్ర్యము పాఠకున కాశ్చర్యమును గలిగించుచుండును. సోముని యుత్తర హరివంశమంతయు నొక కుప్పవోసిన జాతీయముల యొప్పె, రాశివోసిన సామెతల సొంపై యింపులు నింపుటయేకాక విచిత్రపదములకూర్పు జిలుగుతో విశిష్టమై కానవచ్చుచుండును.

కేవలము సంస్కృతసమాసమునందేకాక తెలుఁగుసమాసపుకూర్పునందు సయితము ప్రౌఢత్వము నుట్టిగట్టుకొనిన యీ ఉత్తర హరివంశము నందు నేఁటికిని నిఘంటువుల కెక్కని పదముల ప్రయోగము బహుళముగా నుండి పాఠకుని బెక్కు చిక్కులఁ బెట్టుచుండును. కాని పాఠకుఁ డొక్కసారి యీ చిక్కును సడలించుకొని సాగిపోయినచో నీ గ్రంథ మాతనికి నర్థవైభవముతో గూడిన దివ్యకావ్య ఫక్కిని బ్రదర్శింపఁ జేయుచుండును. ఉదాహరణమునకు సోమనాథుఁ డాయా సందర్భములందుపయోగించిన పదజాలము.

**సౌగటాలాట**

1. వాట్లీడు 2. అటమటీడు 3. సుమాళి 4. తత్తబళులు, 5. పాసిక బొమ్మగట్టుట 6. బైసుకవెట్టుట 7. ఈరైదు పూజించుట 8 సరముచూచుట 9. తీవంచి 10. ఇత్తిగ 11. దచ్చొక 12. జోగిణిగొసరుట 13. పరదాళము 14. బద్రలు.

**దుర్గరక్షణ సంబంధములైనవి**

1. కొత్తళంబులు 2. అట్టళ్లు 3. అళువరి 4. వసికొయ్య 5. ములువెలుగు పెట్టు 6. దంచనంబులు 7. దద్దడంబులు 8. బ్రద్దపరులు 9. కత్తెరగాయములు 10. గండముంగిళులు 11. సొచనదీవెలు 12 హట్టి మొదలగునవి.

**మల్లబంధ విశేషములు**

1. కడవరానకు జొచ్చుట.
2. డొక్కరము హత్తుట.
3. బిడగొనుట.
4. పట్టెసమున దొడరుట
5. తోరహత్తము
6. పోతమారి.
7. బొబ్బణము.
8. రింజవట్టుట.
9. అపతాయి.
10. అళువాయి.

**32 ఖడ్గ ప్రచారములు**

1. భ్రాంతము 2. విభ్రాంతము 3. విద్ధము 4. అవిద్ధము 5. విప్లుతము 6. విస్సృతము 7. అకరము 8. నికరము 9. భిన్నము. 10. నిర్మర్యాదము 11. అమానుషము 12. సంకుచితము 13. వికుంచితము 14. సవ్యజానువు 15. వామజానువు 16. చిత్రకము 17. అహితకంబు 18. క్షిప్తము 19. గుడుంబంబు 20. లంబనము 21. ద్రుతము 22 సవ్యబాహువు 23. వినిర్బాహువు 24. సవ్యేత

రము 25. వృత్తము 26. త్రిబాహువు 27. తుంగబాహువు 28. సవ్యోన్నతము 29. పృష్ఠతఃప్రసారణము 30. యోధితము 31. దాసి 32. ప్రథితంబు.

ఇట్లే శత్రువులు కోటను భేదించువిధానములు, నాటి ఆయుధవిశేషములు, గృహవిశేషములు, గుఱ్ఱపు కళ్లెముల పేర్లు ఆ గుఱ్ఱముల గతిభేదములు, అప్పుడవి యొనరించు చేష్టావిశేషములు, వేటసాధనములు, ఆయామృగపక్షులు వేటాడు విధానములు, గదాయుద్ధవిధానము, యుద్ధమునం దోడి పాఱువారల విధానము లెన్నియో వర్ణింపబడియున్నవి.

## ఉత్తర హరివంశమందలి యలంకారములు

వశ్యవాక్కులైన పూర్వ మహాకవిగ్రంథములం దప్రయత్నసిద్ధములై యలంకారములు చేరి సహృదయరంజనము గావించుచుండును. విచిత్ర పదగ్రథన కళాకుశలియైన సోముఁడు శ్రుతి సుభగత్వమును జేకూర్చుటకై యను ప్రాసాది శబ్దాలంకారములను ద్వి త్రి చతుష్ప్రాసాది విశేషములను బ్రవేశపెట్టి సహజసుందర యతిప్రాసరూపయైన యాంధ్రవాణికిం గనుసొబగులఁ గూర్చినాఁడు. ఔచిత్యము నెఱిఁగి కావించిన యాయాయిలుఁగులవలన ఉత్తర హరివంశము 'పాదబద్ధోఽక్షర సమః తంత్రీలయ సమన్వితః' అను వాల్మీకి మహాకవి సూక్తిచొప్పున శ్రుతికింపును గూర్చుచు శబ్దాలంకృతమై ఛందస్స్వర లయాన్వితమై కానవచ్చుచున్నది.

సోమనాథుని యలంకారములన్నియు నయత్నసిద్ధములై సమయసందర్భములతో నతుకుచు నెంతయో లోకోత్తరముగా నున్నవి.

**ఉదాహరణమునకు**

''కరసరసిరుహంబున కౌక
సరసీరుహం బమర వదనసరసీరుహమున్
బరిమళ వశమున మోపుచు
ధరణీధరతనయ దొంతితామర చూపెన్ ఉ. అ. 5-86.

అని ఇందుధరోపాఖ్యాన సందర్భమున జలక్రీడ సేయుచున్న పార్వతిని వర్ణించిన పద్యమునందు శబ్దార్థాలంకారములు రెండును సౌభ్రాతృత్వముతోఁగూడి పాఠకున కమృతోపమానమగుచు నానందమును గూర్చుచున్నవి. ఇచ్చట సోముఁ డుపయోగించిన ''ధరణీధరతనయ దొంతితామర చూపెన్'' అను అలంకార ప్రయోగము సహృదయ హృదయైకవేద్యమైనది.

**ఉపమ :—**

"అరచందురు డెందములోఁ
బొరఁబాటి వఱంకు తోఁకచుక్కయ పోలెన్
నరకుండేసిన బాణము
హరినిటలతలంబు నాటి యల్లల నాడెన్"... ఉ. హ. అ 1-153.

**ఉత్ప్రేక్ష :—**

"కుంకుమహత్తించి కొనదోరఁ దీర్చిన
పురుహూతు నిల్లాలి బొట్టనంగఁ
జక్రవాకములకుఁ జల్లఁగా మందు ద్రా
గించిన చంద్రపుగిన్నె యనఁగఁ
బార్వతీపతికిఁ బ్రభాతభూపతి గొన్న
యలరుగెందమ్మికోహళి యనంగఁ
తొలిదిక్కుతొయ్యలి చెలులపైఁ జల్లఁగ
నిండముంచిన పైఁడికుండ యనఁగ

గీ॥ మేరుధరణీధరంబుతో మేలమాడ
నుదయగిరిరాజు దలయెత్తెనో యనంగఁ
గ్రమముతో నించుకించుక గాననగుచు
భానుబింబంబు గన్నుల పండువయ్యె"-

ఉ. హ. ఆ. 3-86.

**రూపకము :-**

సీ॥ "యదుకులాంబుధిచంద్రు నానందమునఁ జూచు
రామాది హితచకోరములలోన
దనుజారి పారిజాతముఁ జేరి పొదిగొన్న
రాజన్యరాజకీరములలోన
వసుదేవసుత సరోవరములో నోలాడు
సనకాది దివ్యహంసములలోన

గోపాల నవపుష్ప గుచ్ఛంబు మూఁగిన
పరిచారికా ద్విరేఫములలోనఁ

తే॥ గలయఁ దొలుఖాము నోములు గలవుగాన
సెలవు లేక జన్మంబులు చెడియె నాకు
మీఁద జన్మంబు గలుగ నిర్మించెనేని
కమలజుని పేర దావటికాల బొమ్మ ఉ. హ. ఆ. 4-137

యథాసంఖ్యము -

"వెలిదమ్మిలో లేఁత వెన్నెలో యమృతమో
కన్నులో చిఱునవ్వొ కనికరంబొ
గగనమో చుక్కలో గ్రహరాజబింబమో
వక్షంబొ మౌక్తికావళియొ మణియొ
తరఁగలో ఫేనమో తరణిమండలమొ హ
స్తములొ శంఖంబొ సుదర్శనంబొ
తలిరులో కరికంబులొ కుంకుమప్రభయొ
పదములో యూరులో పచ్చఁబట్టొ

ఆ॥ యనుచుఁ గన్నులార నాజగన్నాథునిఁ
గనుగొనంగ నేఁడు గలుగుఁగాన
తలఁపులోన మున్ను దలఁచిన రూపంబు
పట్టువడుట జన్మఫలముగాదె"- ఉ. హ. ఆ. 4-138

ఈ పైపద్యమందు కేవలము యథాసంఖ్యాలంకారమే కాక సందేహము, లుప్తోపమాద్యనులు కూడ గర్భితములై మధురాతిమధురమై పాఠకుని హృదయమునకు విందొనర్చునట్లుగా నున్నది.

అర్థాంతర న్యాసము

"ఏఁచు నుపేంద్రునిం బదక మిమ్మని రుక్మిణి మున్ను దేవుఁడుం
బూఁచిన పూఁపుదప్పటకుఁ బోకులఁ బోవుచునుండు నమ్మెయిన్
దాఁచిన సొమ్ముచేరె నిచటన్ మదిఁ గోరని సత్యభామకున్
నోఁచినవారి సొమ్ములవి నోమనివారికి వచ్చునే ధరన్"- ఉ.హ.ఆ. 1-163

ఈ విధముగా సీత( డుపయోగించిన యలంకారములు సాధారణముగ కవులందఱు వాడునవియేయయ్యు నాకూర్పువిశేషముచేత విలక్షణములై మనోరంజకములై యల రారుచున్నవి. అంతియకాక యీతని రచన యందుపమాలంకారధ్వని యధికముగా( గానవచ్చుచుండును. తెలు(గు వాఙ్మయమునందు సాధారణముగా( గన్పట్టని యుప మానములు, అర్థాంతర న్యాసములు, దృష్టాంతము లీతని గ్రంథమునందు( గానవచ్చు చుండును.

**శబ్దాలంకారములు :—**

ఉత్తర హరివంశమునం దనేక చోటుల సీత(డు శైలీరామణీయకమునకై అను ప్రాస, అంత్యానుప్రాస, వృత్త్యనుప్రాస, లాటానుప్రాస, యమకము, శబ్దశ్లేష, మున్నగు శబ్దాలంకార విశేషముల నెన్నింటినో ప్రయోగించినా(డు. పద్యమునకు సొగసును శ్రుతిశుభగత్వమును గూర్చుట కొఱకింత శబ్దాలంకారప్రీతి గన(బఱిచియు సీత( డెక్క(డను నర్థగౌరవమునకు భంగమును రానీయ(డు. ఉదాహరణమునకు.

క॥ అరి గరమున నే( దాల్చిన
నరిగరము నగేంద్రధీరు(డై న( జెడ(డే
యరి( దిరమై నన్నడుగుట
యరిది రమైకాభిలాషు లగునృపతులకున్"-

ఉ. హ. అ. 4-162

ఈ కందములో రెండు రెండుపాదములందు వేర్వేరుగా చతుష్ప్రాసను బ్రయో గించియు నత్యద్భుతముగా పద్యమును ధారావాహికగ నడిపించినాడు. లక్షణకర్త లేప్రాసలను క్లిష్టప్రాసలని పేర్కొనిరో యట్టివాని సీత(డు పద్యమునందు యవలీలగా రచించును. ఙకారప్రాసమన్నసీతిని కెక్కు(డు ప్రీతి కేవలఙకారమేకాక 'ంఙ' (1-75) 'ంఙ్వ' (6-89) అను అక్షరములను ప్రాసస్థానములం దుంచినా(డు ఈ ప్రాస సీత(డు తప్ప మఱియొక రుపయోగింపలేదని పెద్దల యభిప్రాయమై యున్నది.

'ఎద్రిచిన కాలపాకము' అను (4-100)వ పద్యమున మొదటి రెండు పాదము లలో త్రిప్రాసను, తరువాతి రెండు పాదములలో ద్విప్రాసను వాడినా(డు. అంతేకాక యీ పద్యమందు సంయుక్తాక్షరమునకు ముందున్న యక్షరము లఘువగుట కనువైన నాలుగు పదముల( గూర్చినా(డు.

ఈ విధముగా నీతఁ డనేక క్లిష్టప్రాసల గూర్చుటయేకాక యచ్చతెలుఁగు, నిరోష్ఠ్య పద్యములను గూడ రచించినాఁడు.

**సోమనాథుని వచనము**

పద్యమునందువలెనే వచనమునందును ప్రాసనియమమును బాటించి రచన గావించు ప్రక్రియ కాద్యుఁ డితఁడే యని చెప్పనగును. ఈతఁడు కేవలము అనుప్రాసాంత్య ప్రాసములనేకాక వచనమునందు యమకమును సైత ముపయోగించినాఁడు. ఒక్కొక్కచోట నితని వచనము భట్టబాణుని కాదంబరి యందలి శ్లేషానుప్రాణిత మైన యర్థాలంకారములను, ఉత్ప్రేక్షాదులను దలఁపఁజేయుచు మనోహరముగా నుండును. మఱికొన్ని చోట్ల విరోధాభాస పరిసంఖ్యాద్యలంకారములుచేరి వచన మంతయు దీర్ఘ దీర్ఘముగా సాగిపోవుచు పాఠకుని గొంత చిక్కులఁ బెట్టుచుండును. యుద్ధవర్ణనములం దంత్యాను ప్రాసమును బాటించుచుఁ గ్రియలను జంటలు జంటలుగా వాడుట ఈతని గ్రంథమునందు ప్రత్యేకమై కానవచ్చుచున్నది.

**జాతీయములు :—**

నాచన సోముని ఉత్తర హరివంశమంతయు జాతీయ పదప్రయోగ భరితమై యున్నది. సాధారణముగ నాయాసంప్రదాయములను ఆచారములను, జీర్ణించుకొనిన సోమనాథుని జాతీయ ప్రయోగములెంతయో సిసలై నిండుగా గానవచ్చుచుండును.

ఉదాహరణమునకు.

1. ఇట్టిక సూడిన వాడో యొట్టిడు కొన్నవాఁడో
2. లజ్జబందతనమునన్.
3. బీరపుపొత్తము గట్టుకొని పోవుట
4. గుంప్రాయైన జెమర్చుట
5. కన్నవారు కన్నదిక్కులకుఁ బోవుట
6. నాలుకముల్లు విరుగుట
7. ధరయింగలాలపుట్ట
8. వెట్టికి బట్టుట
9. అరచేతి మానికము
10. బయల నెత్తిన దివ్వె

11. పెట్టిన పీటన యుండుట
12. ఒకండు వ్రేలఁజూప
13. ప్రేవులలోన సురియఁద్రిప్పుట
14. నడుమ బెట్టిన పూరిగాలుట
15. కన్నుండ కంటిపాపను గొనుట. మొదలగునవి యెన్నియో చూప వచ్చును.

**సామెతలు :—**

సాధారణముగా నుత్తర హరివంశమంతయు రాశిబోసిన సామెతల కిక్కయని చెప్పవచ్చును. నాచన సోమనాథుఁ డుత్తర హరివంశమునందు వాడినన్ని సామెతలు మఱియే తెలుఁగుకవియు వాడియుండ లేదనిన నతిశయోక్తి కాదు. ఈ సామెత లన్నియు పద్యభావమునందు, పాత్రల సంభాషణములందు, ఆయా ఆచారవ్యవహార ములతో నతికి ఏ ప్రయత్నమును లేకయే సొంపుగా సాగిపోవుచుండును నిత్యవ్యవ హారములలో, సంభాషణావసరములందు వృద్ధుల ముఖమునుండియు, స్త్రీల వాక్కు నుండియు నప్రయత్నములుగా జాలువారినట్లునే సోముని గ్రంథమున పాత్రల ముఖము నుండి యాయా సందర్భములందు వారి వారి యాభిజాత్యమును బురస్క రించుకొని యాయా సామెత వెలువడుచు కావ్యమున కెంతయో సహజత్వమును గూర్చుచుండును ఉదాహరణమున కుత్తర హరివంశమందుఁ గానవచ్చుకొన్ని సామెతలు.

1. చిల్కవోయిన పంజరమేమి సేయు 1–72
2. పువ్వులు వేడుకైన గడివోయిన వాళ్ ముడువంగవచ్చునే 1–73
3. ఎంత దరిగిన మిరియాలుం జొన్నలు సరిపోవే 1–70
4. కనికని కొత్తవ్వ డింటికంబము సేయున్ 1–94
5. శిర సుండగ మోకాలను సేసలువెట్టుట 1–96
6. లేబరమకాదె బిడ్డలులేని బ్రతుకు 2–16
7. మాడిననేమి చేసెదవు మంత్రపునీళులు సల్లవచ్చునే 2–19
8. జీలుగు వెరిగిన మాలెకు కంబంబుగాదు 3–50
9. కుమ్మరావమున రాగిముంత లేఅంగకలవె 3–48
10. తాజెడ్డవాఁడు వెనకయ్య చేతికి వెసలిచ్చె 4–50

11. వరుగుతోఁ దాగరయు నెండవలసినట్లు 4-54
12. ముంజేతికంకణమున కద్దమేటికి 4-100
13. పులి పేవ పడిన పసుల వాండ్రై యెక్కడి రనుకతవచ్చె 4-102
14. చల్లకు వచ్చి ముంత దాఁచిన గతి 4-149
15. పిడుగువేసినఁ దలటొప్పియాగునే 4-166
16. ముల్లుపుచ్చి కొఱ్ఱుడచిన చందమయ్యె 5-103
17. బెండులు మునింగి గుండులు తేలెన్ 5-218

ఈ విధముగ నెన్నియో పేర్కొనవచ్చును.

ప్రౌఢోక్తులు :—

'ప్రౌఢిరుఢితేః పరిపాకః ఇతి' అని కావ్యవిదులైన పెద్దల నిర్వచనము. ఇట్టి ప్రౌఢోక్తులఁ గూర్చుటలో సోముని ప్రతిభ యసాధారణమైనది.

ఉదాహరణమునకు.

1. నీకనుదోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే అ 1-61
2. కోపాటోప గజంబు మానస సరః కోలాహలోత్సాహిగాన్ 1-99
3. ఉర్విలోన కడుపు చల్లని కాంతలఁ గలుపునన్ను 2-75
4. వేయికన్ను లువ్విళూరంగ నున్నయుత్పలవనమై 2-195
5. వెన్నెల వడఁబడెదేల వలపు నీతల వేగెన్ 3-115
6. నీ పొంగిన పుడిసెడుఁ బోయె ననుచు 4-237
7. చెర్లాటము చూపి పీఁడు మొదలామనికనుచు 4-269
8. కడమవడిన లజ్జకడకన్నులం బెరయనుండె 5-97
9. లజ్జఁ బోద్రోవ లజ్జకు లజ్జలేదు 5-115
10. జముబానసము నింటి త్రోవఁజూపుట 5-139

ఇట్లె యుత్తర హరివంశమునందలి మరికొన్ని

అలంకారోక్తులు ;—

1. అమృత ధారాధరము మాటలాడినట్లు 2-46
2. భాగ్యదేవత రూపు చేపట్టినట్లు 2-496

3. నాపాలి పారిజాతము గోపాలక చక్రవర్తి 2-30
4. వగపు చిత్తరువౌ కళవళము కరువౌ యనఁగ 1-178
5. మొగమునఁ దనికిన కెంపుతోడ 4-89
6. పూఁచిన మోడువుల తోడఁబుట్టువు లనఁగన్ 3-63
7. సౌబగువీడెములకు చుక్కయెదురు 3-147
8. చిత్తజాతుండు వత్తిదాల్చిన 5-129

ఈ విధముగ నాచన సోమనాథుని గ్రంథమందు జాతీయములు, సామెతలు, రసోక్తులు, ప్రౌఢోక్తులు మున్నగునవి యెన్నియోకూడి కావ్యమున కౌక పరిణతిని యొక పటుత్వమును సహజత్వమును రామణీయకత్వమును జేకూర్చినవి. ఇన్నిట సొగసైన ఉత్తర హరివంశము సహృదయరంజనము గావించినదనుటలో సందేహము లేదు.

## సోమనాథుని తత్త్వచింతనము

నాచన సోమనాథుని తత్త్వచింతన మతిగహనమైనది. షడ్దర్శనముల నామూలాగ్రమున నధీనము గావించుకొనిన యీ మహానుభావుఁడు హంసడిభకోపాఖ్యానమునందు హంస పరమహంసలను గూర్చియు, సంయములను గూర్చియు వ్యక్తము గావించిన భావము లతిగహనములై సామాన్యుల కగాథములై యున్నవి. ఉదాహరణమునకు.

ఉ॥ ఆసలఁ ద్రుంపి పెట్టి హృదయం బను క్రాఁగునయోగవాసనా
భ్యాసపు నీరు గాఁచుటకు నాగమపావకము దగిల్చియా
యాస విహార మత్కుణ గణైహిక శయ్యకుఁ దజ్జలంబుపైఁ
బోసిన నీ శరీర మది పొందియుఁ బొందని యట్టు లాఁడుదున్.

ఉ. హ. అ. 4-86

ఈ పద్యమునందుఁ జెప్పిన జీవన్ముక్తుఁడైన పరమహంస విధానమేకాక హంసడింభకులచే భంగపడి వచ్చిన దుర్వాసునిగాంచి ఋషులరాకకు కారణమడిగిన కృష్ణుతో యతిపరుఁడైన దుర్వాస మహర్షి.

1. తగునే యింత మురాంతకా తలంపవేత్రైలోక్యముంగావ
2. ఏఁగాదే నడతుం జతర్ముఖునితో నింద్రాది దిక్పాలకుల్

3. ప్రాఁతల మేము నీకుఁ బలుబాములఁ బొందకయున్ననాఁటి.
4. ఏ నెఱుంగుదు నిన్ను నేల నాతోడనె వెడమాయలు

అని చెప్పిన పద్యము లన్నియు దుర్వాసోమహర్షి సనాతనత్వమును, అతని యధికారమును, మహాయోగియైన యాతని సర్వవేదిత్వమును బ్రదర్శింపఁ జేయు చున్నది.

**హరిహరాభేదము**

తిక్కనసోమయాజి యనంతర మన్నివిధముల తిక్కన యంతటి వాఁడైన నాచన సోమనాథుఁడు హరివంశోత్తర భాగము నాంధ్రీకరించి హరిహరనాథునకే యంకితమిచ్చినాఁడు. తిక్కనవలెనే సోముఁడు కూడ నీ హరిహరనాథుఁడు వ్యాసాదిసంపూజితుఁడైన దేవదేవుఁడుగనే పేర్కొని నాఁడు. ఇంతియకాక తిక్కనవలనే యాతఁడును హరిహరనాథుని కేవలమర్చారూపమెన యొక ప్రత్యేక దైవతమువలె కాక సకల జగద్రక్షకుఁడైన దేవాధిదేవునిగా భాసింపఁజేసినాఁడు. ఉదాహరణమునకు.

మాలిని॥ "నిగమ శిఖరవేద్యా నిర్వ్యదానంద విద్యా
విగత శుగ నవద్యావిర్భవద్ధ్యాన వేద్యా
జగదధికృత రక్షాసారసంసారశిక్షా
ద్యగణిత కృత సాక్షాదద్భుతాకార దీక్షా'' ఉ. హ. 2-224

ఈ పద్యమును బేర్కొనవచ్చును. ఇందు హరిహరదేవుఁడు కేవలము హరిహర లక్షణ సమ్మైక్యముతో నేర్పడిన మూర్తియేకాక యీ దేవుఁడు నిగమశిఖర వేద్యుఁడనియు, నిర్వ్యదానందభాసియనియు నవగతదుఃఖానవద్యుఁ డనియుఁజెప్పి యాదేవుడు సర్వవ్యాపి, సర్వలోకేశుఁడు, సచ్చిదానందమూర్తి, భవభయదూరుఁడైన ఆదిదేవుఁడనియే ప్రకటనము గావించినాఁడు.

ఈతఁడు హరిహర భేదమును నిరూపించుటకు పూర్వమే.

మ॥ "పరివాదాస్పదవాదమోదమదిరా పానంబు చేమత్తులై
హరిమేలంచు హరుండు మేలనుచు నాహా కోందఱి పొందెఱుం
గరుకైలాస నగంబు నందు మును లేకత్వంబు భావించి రా
ముకవైరింబుగవైరిఁ బావుట మహామోహంబు ద్రోహంబగుణ.

ఉ. హ. ఆ 2-68

కం॥ పదునాలుగు లోకంబులు
బొదలింపం ద్రుంపవలసి పొడవులు రెండై
తుదిఁ దారొక్కటి యగుదురు
వదరల జేయుదురు భేదవాదులనెల్లన్'' ఉ. హ. అ 2-69

అను పద్యములందుఁ బదునాలుగు లోకములను సృష్టించి, సరిహరింపవలసి భిన్నులైన వీరొక్కటియే కాని వేఱుకారు. వీరు భిన్నులఁగా భావించిన భేదవాదులే ఓవరకు వాచాలురె కానవత్తురు. ఈ భేదవాదులు కేవలము పరివాస్పద వాదమోద మదిరాపానముచే మత్తులె శివకేశవుల వేఱనుచున్నారు గాని నిజమునకు విజ్ఞులైన పెద్దలు శివకేశవుల కైక్యమును పాటించినారు. అందు కుదాహరణము కైలాసము నందు మునులు శివకేశవుల ఏకత్వమును భావించినారనిచెప్పి చివరకు మురవైరి పురవైరుల వేఱు సేయుట కేవలము భ్రాంతియేకాక ద్రోహముననుచు చాటి తన సర్వజ్ఞత్వమును ప్రకటించిన మహానుభావుఁడు నాచన సోమనాథుఁడు.

**ఉత్తర హరివంశమునందలి కొన్ని పాఠములు**

ప్రాచీనాంధ్ర కవికృతులలో దురవబోధములనఁబడు వానిలో సోమనాథుని కృతిప్రధానమైనది. అప్రతీత పదప్రయోగ బహుళమైన ఉత్తర హరివంశము నెన్నిమారులు చదివినను పూర్తిగా నర్థముగాని పద్యము లింకను మిగిలియే యుండును

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారిచే సంస్కరింపఁబడి ముద్రింపబడిన తరువాత నుత్తర హరివంశ మెన్నిమారు లచ్చొత్తింపఁబడినను పాఠంతరము లేవియు నిర్ణయింపఁబడలేదు.

ఉత్తర హరివంశమునం దసాధారణ కవితా ప్రాగల్భ్యము చేత సోముఁడు పాఠకుని ముప్పుతిప్పలు పెట్టుచుండని (కదీనియం దీలేఖక ప్రమాదములు, పాఠాంతరము, సంస్కరణములుచేరి యింకను కవి హృదయమును దెలియనీక పుస్తకము నందలి పద్యము లచ్చటచ్చట నగాధములవలె కాన వచ్చుచున్నవి. కొన్ని తావులందు పద్యములు సులభములయ్యు నన్వయమునందో యర్థమునందో క్లిష్టత గోచరించుచున్నది.

ఉదాహరణమునకు శ్రీకృష్ణుడు నరకాసురుని వధింపఁబూని మాహిష్మతీ పురమునకుఁ బోయినప్పుడు.

గీ॥ "కత్తివాతులతో నూరుగాచి తిరిగి
యాడు మురుపాశెములఁ గాంచె నాఱువేల
వానిలోని పిశాచముల్ వచ్చి వచ్చి
పొదువ నన్నింటిఁ దునుకల ప్రోవుచేసె''　　　　ఉ హ. అ 1-140

అను గీత పద్యమున్నది. ఈ పద్యము యొక్క రెండవ పాదమున 'మురుపాశెము' అని ఉన్నచోట 'మురుపాశెము' అని ముద్రిత ప్రతుల పాఠము ఈ పాఠములలో సంస్కరింపఁబడిన 'మురుపాశెముల' అను పాఠమును బురస్కరించుకొని చూచిన అన్వయము పొసఁగి పాఠము ప్రామాణికమై కానవచ్చినప్పటికి నీ సంస్కరణము కవిహృదయమునకు దగ్గరగా నున్నట్లు గోచరించుటలేదు. ఏలయన మూలగ్రంథ సహాయ్యముతో నీ ఉత్తర హరివంశమును జదివినప్పుడీ విషయము తెల్లమగును ఈ సందర్భమునందే మూలహరివంశములో.

"అపశ్యద్ ద్వారి తత్రస్థాం హస్త్యశ్వరథ వాహినీమ్।
క్షురాంతాన్ మౌరవాన్. పాశానీ షట్ సహస్రాన్ దదర్శహ''
హ. వి. వి. అ 63-46

అను శ్లోకమున్నది. ఈ శ్లోకమునందలి రెండవ చరణమును బరిశీలింపఁగా మురదైత్యుఁడు క్షురాంతమునైన ఆఱువేల పాశములను గల్పించి నగరమునకు రక్షగా ద్వారదేశమున గాఁపు పెట్టినట్లు తెలియుచున్నది.

సర్వతంత్ర స్వతంత్రుఁడయ్యు ప్రధాన విషయ నివేదనావసరము లందు మూలకారుని తప్పక పాటించుచు రచన గావించుట సోమనాథుని యనువాదవిధానము. కావున నీ సందర్భమునందు సయితము నాచన సోముఁడు మూలానుసారియై

"కత్తివాతులతో నూరుగాచి తిరిగి
యాడు మురుపాశెముల గాంచె నాఱువేల"

ననియే రచించి యుండును. ఆ పాఠమే వ్రాతప్రతులందుండఁగా నది లేఖక ప్రమాదముగా భావించి యుంతకన్న నెక్కు డర్థవంతముగాఁ దోచునదియు, అక్షరములందంతగా భేదము లేనిదియునగు 'మురుపాశెముల'ను పాఠము సంస్కరింపఁ బడినది. కాని మూలహరివంశమును జదివిన తరువాత నీ సందర్భమునం దుత్తర హరివంశమునందు సంస్కరింపఁబడిన పాఠము ప్రామాణికము కాదని, పాఠభేద

ముగ నొనఁగబడిన తాళపత్ర ప్రతి పాఠమే సరియైనదనియుఁ దోఁచినది. కావున నీ పూర్వ పాఠమే ఈ ముద్రణమునందు గ్రహింపబడినది.

మఱొక్కచోట

మ॥ అనుచుం గృష్ణుఁడు వోయినం బిదప బాణామర్త్య వైరీశ్వరున్
ఘన చక్రాయుధ నిష్ఠురక్షత గళద్రక్తార్ద్రి సర్వాంగు న
ఢ్యనుభూతా ప్రతిమ ప్రగల్భ పరివాగాంతర్హితో ద్విక్రమున్
జనిత్రాస్త్రైక వేదనా ప్రకట మూర్ఛా పారవశ్యాత్మునిన్".

ఉ. హ. అ. 6-226

ఈ పద్యమునందలి రెండవ పాదమున యతి భంగము గానవచ్చుచున్నది. ఈ పద్యమునందీ తావున పాఠాంతరములు కాని సంస్కరణములు గాని చూపింపఁబడ లేదు. అనన్య సామాన్య కవితా ధురీణుఁడైన నాచన సోమనాథుఁ డిట్టిద యతి దోషమును పాటింపక రచించెననుటకన్న నిచ్చట లేఖక ప్రమాదమువల్ల దొరలిన పొరపాటుచే నీయతిభంగము గల్పింపఁబడిన దని తలంచుట లెస్స. ఇఁకనిప్పుడీ పద్యమునందు రెండవ పాదమున ఘనయని యున్నచోట దన యని సవరించి పద్యము ముద్రింపఁబడినది. దీనివల్ల పద్యమునకు యతి భంగము గలుగక యర్థము గూడ కొంతవరకు సంతృప్తికరముగనే యతికినది. ఈ సంస్కరణము కుదురనిచో విజ్ఞులేదేని యుత్తమ పాఠమొసఁగ ప్రార్థితులు.

ఈ విధముగా ముద్రితమైన గ్రంథములం దెన్నియో పద్యములు సంస్కరణము గాంక్షించునవి యున్నవి.

అయ్యవి కేవలము ముద్రిత ప్రతులాధారముగ నిర్ణయింపఁబడునవి కావు. దేశమందు నలుమూలల వెదికి తాళపత్ర ప్రతుల సంపాదించి యాపాఠములతో నివి సరిపోల్చుచు మూలహరివంశ సాహాయ్యముతోఁ జేయదగిన పనియిది. కావున నిప్పుడు లభించిన యవకాశముతో కేవలము ముద్రిత గ్రంథములను చూచియే ఈ ప్రతి సిద్ధము చేయఁబడినది.

ఈ ఉత్తర హరివంశ సంపాదన కార్యము నాకొసంగిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారికి నా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

హైదరాబాదు 15-5-1978

పి. యశోదారెడ్డి

శ్రీరస్తు

# ఉత్తరహరివంశము

## ప్రథమాశ్వాసము

శ్రీ సర్వమంగళాకుచ
వాసంతీవకుళగంధవద్వనమాలా
వాసుకివిలాస వేద
వ్యాసమునిమనోనివాస హరిహరనాథా.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

క. హరివంశ ప్రథమకథాం
తరమునఁ గల వింతలెల్లఁ దప్పక మదిలోఁ
దిరమయ్యెఁగదా మీఁదట
నరవర ! యే కథలొకో ? వినం బ్రియ మనుడున్. 3

క. జనమేజయుఁ డిట్లను న
మ్మునితో ; బలదేవులావు మును విని మఱియుం
దనియదు మది ముద మొదవఁగ
వినఁగోరెదు జెప్పవే వివేకనిధానా ! 4

క. ఘనబలుఁ దుదగ్రతేజుం
డనఘుఁ డనంతుఁ డన విందు మాదిమకథలం
దనుటయు వైశంపాయన
మునిపతి భూపాలచంద్రమున కిట్లనియెన్. 5

శా. పాతాళాధిపుఁడైన శేషుఁడు ప్రలంబఘ్నుండు నారాయణ
ప్రీతిం బుట్టిన శంకరుం డని జనుల్ పేర్కొన్నచో నంధకో

ద్భూతస్నేహముఁ గామపాలతయుఁ దప్పం దప్పఁ గాకేమి ప్ర
ఖ్యాతిం బొందఁడె పాండురాంగమహిమన్ హాలహాల స్వీకృతిన్. 6

వ. మఱియును. 7

సీ. కడిమి జరాసంధగంధసింధురముఁ ద
ద్బృంధుమండలి [1]తోన పాఱఁ ద్రోలె
బలియు నాగాయుత [2]బాహు జగత్ప్రాణ
తనయు గదాకేలి దర్ప మడఁచె
[3]పేఁకతోడ వరాటపీఖేలనమ్మున
ధీరుఁ బ్రలంబదైతేయుఁ జంపెఁ
దెగువ రాసభరూపు ధేనుకాసురుఁ బట్టి
విన్నాణమున మేను విఱిచి వైచె

గీ. నగరపరిఖాపయఃపూరణంబు సేయ
సీరముఖమునఁ గాళిందిఁ [4]జీఱి తెచ్చె
మెఱసి మూఁడులోకంబుల మేటిమగలు
రాయనేర్తురె యా[5]దవరాముతోడ. 8

సీ. కౌరవాధీశ్వరు కన్యకారత్నంబుఁ
గామించి సాంబుండు గజపురంబు
సొచ్చి ప్రుచ్చిమి సేయఁ జూచిన నెఱిఁగి యా
రారాజు వానిఁ గారాగృహమున
నిగృహీతునిఁ జేయ నెఱ[6]సిన వార్త వే
గమ విని నగరంబు గంగలోనఁ
ద్రవ్వివైచెద నని తన భూరిహలమున
నెత్తి [7]యెత్తేఁపె నయ్యేటిసీదు

గీ. పఱపెఁ బట్టణ మిట్టట్టు వడఁ గదల్చి
కొడుకుఁ గోడల రావించి కోటవెలికి

1. మునుబా. 2. ప్రాణు. 3. విస్మయవికచాటపీఖేలనంబున. 4. జీర్చి, 5, బల, 6. సె నవ్వా, 7. పఱపిన.

వియ్యం మని శిష్యుఁడని కాచి విడిచె నతని
సీరపాణితో రాజులు చెనయువారె. 9

గీ. అతఁడు నాఁగట నెత్తినయంతనుండి
యేటి ది[1]క్కున కంతయు నెగసియుండు
హస్తినాపురి: యది యేల యమున నాఁటఁ
గోలె మధురాపురము చుట్టికొంచుఁ బాఱు. 10

క. హలపాణిమహిమ చెప్పం
గలవా రెవ్వరు పురాణకథలన్ మఱియుం
దెలిసికొనుము నేఁ జెప్పక
నిలిచినచోటులు వివేకనిర్మల బుద్ధిన్. 11

క. అనుటయు నా జనమేజయ
జనపతి యిట్లనియె ; రుక్మి సచ్చిన మగుడం
జని యాదవనగరంబున
జనార్దనుం డేమి సేసె సౌజన్యనిధీ ? 12

వ. అనుటయు వైశంపాయను డిట్లనియె. 13

మ. తనపీటన్ హరియుండ రాక్షసులు రత్నస్వర్ణసందోహమున్
వినతిం గప్పము దేరఁ బుచ్చికొనెఁ దద్విఘ్నంబుఁ గావించినన్
వనదత్తాఖ్యుల దైత్యులం దునుమ నోర్వంజాల కంభోరుహా
సనుచేతన్ నరకుండు లబ్ధవరుఁడై చాలెం గ్రియాహానికిన్. 14

మ. అతఁ డంతంతకు వాలి వాలుబలిమిన్ హాలాహలాహంక్రియా
ద్భుతభంగిఁ వివిధాస్త్రధారలు సమిద్భూమిన్ వెలార్చుం బ్రభా
పతితీవ్రద్యుతి సోదరరాష్ట్రరథినీపాదాంతకుంతంబులం
బ్రతివీర ప్రమదాకపోలఫలక ప్రాంతాలకాంతంబులన్. 15

మ. ధనదాంతఃపురతారహారములు యాదఃపాలబాలాఘన
స్తనకాశ్మీరము ధర్మరాట్కుల వధూసంవ్యానకౌశేయమున్

---

1. క్కంతకంతకు

దనుజేంద్రారివరావరోధదయితాధమ్మిల్లమాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁజూచు జయలక్ష్మినిత్యనై పథ్యమున్. 16

వ. ఇట్లు వర్తించి వర్తించి దిగ్విజయంబు సేయు తలంపున. 17

## నరకాసురుఁడు స్వర్గముమీఁద దండయాత్ర వెడలుట

సీ. ఒకనాఁడు దనుజనాయకుసేన[1]తో దివ్య
ధామంబుపై కటు దాడివెట్టి
వజ్రిమందిరము కవాటంబుఁ దనవింటి
కొప్పునఁ బొడుచుచుఁ గ్రూరసింహ
నాదుఁడై సమరంబు నా కిమ్ము చాలవేన్
జయ మిమ్మనుడుఁ బాకశాసనుండు
నైరావతం బెక్కి యమరసైన్యంబుతో
నగరంబు వెలి కేఁగి మగతనంబు

తే. మిగులఁ దద్దైత్యవాహినిమీఁద నడచె
నప్పు డుభయబలంబులు నసికుఠార
కుంతతోమరక్షురి కాది ఘోరశస్త్ర
ఘట్టనంబున నసమసంగరము సేయ. 18

గీ. అచలగతి నుండె దనుజసైన్యంబు మిగులఁ
బరఁగి [2]దైవసైన్యంబుచేఁ దెరల దయ్యె
దనుజ సింహనాదములు డెందములు సొరఁగ
దిరుగఁబడఁ జొచ్చె నమరకుంజరబలంబు. 19

క. అట్టియెడన్ [3]సురబల మి
ట్టట్టు వడం జేసి దనుజు లసిముసలగదా
ఘట్టనముల బలర్ధమను
కట్టెదురన[4] నెఱపి రసమకౌతుకమతులై. 20

---

1. గూడి దివ్యపురంబుపై దాడివచ్చి యేచి, 2. నమరుద్గణంబు, 3. సురబలముల నట్టిట్టువడంగఁజేసియసి, 4. పఱపి,

క. అరగయ్యంబున దివిజులు
దిరుగుడువడి రింకమీఁద ధృతి చెడి తిరుగం
బురుహూతుఁ డనుచు దమవా
రరసినఁ దలపువ్వు వాడదని సంతసిలన్. 21

చ. నిలునిలు మంచు దానవుల నిర్జరనాథుఁ డదల్చి మింట మం
టలగతిఁ దూపులుం జటులటంకృతులున్ నిగుడారఁ బోర న
క్కాలఁది నుదారసారరణకోవిదబాహులు లోకపాలకుల్
గలసిరి కారుచిచ్చునకు గాడ్పులుదోడగు చందమొందఁగన్. 22

వ. వా రెవ్వరం డేని. 23

గీ. వచ్చె యక్షగుహ్యకులతో వైశ్రవణుఁడు
దోఁచె దారుణభుజగయాదోబలముల
తోడ వరుణుండు, గాలమృత్యువులతోడ
నడచె దండధరుండు, దానవులమీఁద. 24

వ. అప్పుడు. 25

గీ. ముర నిశుంభ హయగ్రీవ నరకముఖులు
బరవసంబునఁ దలపడ్డ బవర మచట
భీకరం బయ్యె నుద్భట లోకపాల
రచిత సమకాల బాహువిక్రమముచేత. 26

వ. ఇట్లు సంకులసమరంబు చెల్లుసమయంబున వరుణుతోడ హయగ్రీవుండును దండధరునితోడ నిశుంభుండునుం బురుహూతుతోడ నరకుండును గుబేరునితోడ మురుండును మఱియుం దక్కిన గీర్వాణులతో నితర పూర్వగీర్వాణులుం దలపడి పరిఘ ప్రాస ముసల బరశు తోమర శక్తి ప్రముఖంబు లగు వివిధాయుధంబుల నొండొరుల గం దడంగించు సమయంబున. 27

గీ. కినుకఁ బాశహస్తుఁడు హయగ్రీవు నొంచె
మర్మభేదిబాణాసారమహిమ నతఁడు

గిరివిధంబున నచలుఁడై వరుణుమీఁద
శితశరపరంపరా[1] సారశతము లేసె. 28

క. ఏసిన వరుణుఁడు దనుజు శ
రాసారములోన ముంచె నతఁ డాతని బా
ణాసనము క్షురప్రంబున
నేసెను లస్తకము విఱుఁగ నింద్రుఁడు సూడన్. 29

వ. ఇట్లు ఖండింతబైన కోదండంబు సకాండంబుగా దిగవిడిచి. 30

చ. వరుణుఁడు వైచెఁ బాశమున వైచిన నబ్బలితంపుఁ గ్రదువుం
గరమునఁ బట్టి దానవుఁడు క్రమ్మఱవైచెఁ దదస్త్ర మంబుధీ
శ్వరునకు నొవ్విసేయద నిజప్రభుఁ డంచు సురారి రేఁగి ని
ష్ఠురగద[2]నూచి వైచిన గడున్ వడిమస్తముమీఁదఁ దాఁకినన్. 31

క. నెత్తురు గ్రక్కుచు మూర్ఛా
యత్తుండై తెలిసి వరుణుఁ డనిమొన నిలువం
జిత్తంబులేక బీరపుఁ
[3]బొత్తము గిట్టుకొనిపోయెఁ బోయినపోకై. 32

వ. ఇట్లు వరుణుండు పాఱ వెండియు నొక్కెడెస. 33

సీ. తఱిమి నిశుంభుఁ డంతకుమీఁద నిరువదే
నమ్ము లేసిన నతం డతనిమీఁద
నేసె సాయకశతం బింద్రుఁడు చూడ న
ద్దనుజుఁడారవిసూనుధనువు నఱకె
నతఁడు దండం బెత్తి యద్దైత్యు బొరిపుచ్చ
[4]నాదిగొనంగ బాణాసనంబు
వైచి వాఁ డసితోడ వైవస్వతునిమీఁద
నడచె నద్దేవదానవులు కడఁగి

1. పరశ్శతము, 2. పూంచి, 3. బొత్తన ముటు గట్టితొలఁగె, 4. నయిది.

తే. జోడు గానికై దువులఁ బోరాడి రచట
ముందఱ సురాసురుల బలంబులు గడంక
వాసవుఁడు [1]బలుఁడును బోరువడుపు దోఁప
నట్లు గదిసి జయోల్లాస మతిశయిల్ల. 34

మ. గద దట్టించి నిశుంభు మస్తకము నక్కాలుండు వ్రేయన్ మెయిన్
సదరం బైననాకింత కన్దిరిగియున్ శాతాసిచే వాఁడు జో
డు దెగన్ వ్రేసిన మేను[2] వ్రస్సి యముఁ డాటోపంబుఁ జైతన్యముం
ద్రిదులన్ యామ్యబలంబు లావలనికిన్ భీతిం దొలంగించినన్. 35

క. ఇట్టిక సూఁడినవాఁ[3]డో[4]
యొట్టిడుకొన్నాఁడొ యనుచు నుల్లసమాడం
బట్టగుచు మగిడి చూడక
పట్టణమున కేఁగె లజ్జబందతనమునన్. 36

వ. మఱియు నొక్కదిక్కున. 37

గీ. శ్రీదుఁ డుద్ధతి మాణిభద్రాదులైన
యక్షులును గుహ్యకులును విద్యాధరులును
మొనసి తోతేరఁ దాఁకె నమ్మురునితోడఁ
జేరి నడవ దెబ్బదివేలు [5]పౌరవులును. 38

వ. ఇట్లు (నడచి) శరపరంపరా లాదనుజేంద్రుపయిం గురిసిన. 39

చ. మురదనుజుండు [6]పౌరవసమూహమునుం గని రాజరాజుపై
శరనికరంబు వుచ్చి తనచక్కిన యెక్కిన యక్షగుహ్యకుల్
విరియఁగ ఖడ్గపాశముల వ్రేసిన వచ్చినత్రోవ వట్టి [7] కా
తరమున మాణిభద్ర సహితంబుగ వచ్చినవారు పౌరులున్. 40

గీ. కైదువులు విడిచి యొడళ్ల గగురుపొడువ[8]
నంత నంత గకాపిక లైనవారిఁ
గని మురుండు కుచేరునిఁ గదిసి యేసెఁ
బ్రతిభ [9]యాశీవిషోపమ బాణతతుల. 41

---

1. బలిపోరిన, 2. దస్సి, 3. డా, 4. ద వ. 5-6. శా, 7. రా, 8. ప. 9. నా.

చ. చను[1]మఱలందు పక్షమునఁ జక్షురుపాంతములందు ఱెప్పలన్
మునిఁగిన బాణజాలముల ముప్పిరిగొన్న భయంబు ఖేదమున్
మనమున నిండఁగాఁ దొడఁగి మార్కొనలేక కుబేరుఁ డేఁగె న
ద్దనుజుల నింత చేసినవిధాతకు గో డనఁబోవు చాడ్పునన్. 42

గీ. మఱియు దానవసైన్యంబు మాఱులేక
యొప్పి తప్పిన నిర్జర యోధవరులఁ
దోలి తొప్పఱవెట్టి నింద్రుండు నిలిచె
బవరమున నొక్కరుఁడు [2]నేఁదుపల్లువోలె. 43

ఉ. దేవత లెల్లఁ బాఱిన మదిన్ రణకౌతుక ముల్లసిల్ల నై
రావణదంతినెక్కి నిజరాజిత కార్ముక ఘోరశింజినీ
రావము సూప నేపునఁ బురందరుతో నరకుం డెదిర్చె నా
నావిధసింహనాదుఁడయి నాగముపైఁ జనుసింగమో యనన్. 44

మ. ఇటురా ! చూతువు చేతిలావనుచు బ్రమోయించెన్ గుణం బప్పు డు
త్కటసంగ్రా[3]మము సెల్ల నిద్దఱకు దైత్యస్వామి నారాచమొ
క్క[4]టి యేసెం దెగ నిండఁ జాఁపి హరిమైగాఁడన్ సురేంద్రుండు నె
త్తుట జొత్తిల్లుచు మూర్ఛవోయి కరిపైఁ దూలెన్ విచైతన్యుఁడై. 45

సీ. అంతలోనన[5] తేఱి యమరేంద్రుఁ డెనిమిది
బాణంబు లతనిపైఁ బఱపి మఱియు
రథము డెబ్బదిట సారథిఁ దొమ్మిదిట నేసి
పడఁగ శాతక్షురప్రమున నఱకి
సూతు నంతట శితాశుగ పరంపరచేత
జముఁ గూడ ననిచి రథ్యముల నాల్గు
శరములఁ జంపి తచ్చాపంబు క్రూరభ
ల్లమున ఖండించిన నమరవైరి

తే. విరథుఁడై చేతఁ గరవాలు వెలుఁగుచుండ
దాఁటి గజకుంభములఁ గాలదన్ని వజ్రి

1. మొన, 2. నేడు, 3. రంభమునూప నీడుగని, 4. టనే. 5. నఁ దెలిసి.

వక్ష మదరంట వ్రేసిన వ్రాలె నతఁడు
మీఁదమీఁదనె ప్రాణంబు మిడు[1]కుచుండ. 46

వ. ఇట్లు వ్రేసి. 47

గీ. కరటికుంభస్థలం బొక్క ఘాతఁ గొన్న
మురిసి హరి మూర్ఛదేఱకమున్న పాఱె
నది రయంబున దనుజుఁ డల్లంత నుఱికెఁ
జూప అగ్గింప విక్రమాటోపలీల. 48

వ. ఇట్లు సంగర విజయోత్సాహంబున సింహనాదంబుచేసి వరుణ సైన్యవార్ధి బడబానలుండును. దండధర సేనావనదవానలుండును హరసఖవీరభట హరిణ శార్దూలుండును సురరాజశూర పరివార వారివాహపవనుండును నను కైవారంబులు సెలంగ నరకాసురుండు. 46

క. సమరమున గెలిచి పగతుర
సమస్తసంపదలు సేర సంతోషమునం
దమవారు మిగుల నుబ్బఁగ
నమరావతి సొచ్చె విభవ మరయుతలఁపునన్. 50

వ. ఇట్లు సొచ్చి. 51

సీ. నృత్తగీతంబులు నిస్సాణపటహసం
    జాతంబులును లేని చదుకములును
గాశ్మీరనికరంబుఁ గల్హారపుష్పోప
    హారంబు లేనిసౌధాంగణములు
మణితోరణంబులు మహనీయ శృంగార
    [2]వారణంబులు లేనివాకిళులును
గర్పూరధూమంబుఁ గాంతాకటాక్ష ని
    రీక్షలు లేనిగవాక్షములును

తే. గదళికాదుకూలంబులుఁ గంపమాన
చమరవాలంబులును లేనిచంద్రశాల

1. కమిదుక: 2. వారంబులును.

లును గనుంగొని ప్రమదకల్లోలలోల
మానసుండయ్యె దిక్పాలమర్దనుండు. 52

వ. మఱియును మగలు దిగవిడిచి పోవుటయును మానంబుతోడను ప్రమంది మందిరంబుల నడంగియున్న మగువలఁ దెగువతోడ వెడలం దిగిచి తెచ్చి గడచి చక్కనివారి నేర్పఱచి యొక్కయెడం గూడఁబెట్టు ధూర్తదనుజులును, పోవచ్చిన నొడిచి కచభరంబులు వట్టికొన్న నన్నన్న! నీ చెలియ లనని విడిపించుకొని కన్నీరు దొరుగు మొగంబులఁ బయ్యెద లొత్తుకొని యేడ్చు సుదతుల నదలించు నిర్దయదైతేయులని నవరని పాపలం దడవితడవి తమయేలికకుం గానికగా నీవలయునని కొనిపోవచ్చినఁ బైపడి విడువఁజాలక పెనంగు తల్లులం బ్రల్లదంబునం ద్రెళ్ళం ద్రోచి తిట్టుచు సైకవుంబై దలిమూఁక లగపడెనని చెలంగు ఘాతుకదైతేయులును, వెండియుం గడుసరి దానవులు మిసిమిగల పసిఁడి కాసచేసి పడఁద్రోసి గాసిం బఱచిన ప్రాసాదంబులునుం, జతురులగు దితిసుతులు దమతమ నికేతనంబులకుం గొనిపోవుటకై విఱుగకుండం బెఱికించి సురకుమారకులతలల కెత్తి(ంచి)న ఘటిత మణికోటి కోటీమండిత కవాటసంఘాతంబులును, వారువంబులు గంధేభంబులులేని దివిజవైరులు మగిడి పోవునప్పటికి మసలక మనోవేగంబుల నెక్కించుకొని చన వలసి(పొలసి)నం బోవనీక దామెనలం గట్టిన దివ్యవిమానంబులును, విఱిగిన రత్నస్తంభంబులును, విటతాటనంబులగు హేమకుంభంబులును, బగులనడచిన పట్టెలుం, బైపడం దిగిచిన పెట్టెలు, నోడుపఱచిన చిందంబులు, నొరగం ద్రోచిన దారబందంబులును, దప్పిపడిన నూపురంబులుం, దల్లకెడవైన గోపురంబులును, నిలువునఁ గూలినమేడలు, నెఱిదప్పినవాడలుం, బాఱవైచిన దివ్యాస్త్రంబులునుం, బలుచోట్లం బడిన శస్త్రంబులునుం, జూచి చిఱునవ్వున నరకాసురుండు భాసురం బగుజంభారిమందిరద్వారంబుం బ్రవేశించి వాహనంబు నవతరించి కక్ష్యాంతరంబులు గడచి యంతకమున్న యంతఃపురకాంతలు దొలంగుట యెఱింగి యచ్చట సభా మండపమునన్న యున్నత రత్నసింహాసనంబున నాసీనుండై. 53

## నరకాసురుఁ డూర్వశిని రావించి సంభాషించుట

ఉ. ఊర్వశిఁ దోడితెమ్మనుచు నొక్కనిఁ బంపఁ బదుండ్రు వాఱి సౌ
పర్వణసౌధవీథుల యుపాంతములం దిరుగంగ నంతకుం
బూర్వసురేశ్వరుండు సురపుంగవుగద్దియమీఁద నుండి గం
ధర్వులపాట వించుఁ బ్రమదంబును బొందుచునున్న యత్తఱిన్. 54

క. తడవం బోయిన దైత్యులు
పొడగని యూర్వశి, తొలంగిపో నేల ? నినుం
దొడితెమ్మనె మారాజు; జదె
బడిబడి వచ్చెదరు వేగ పనివిను మనినన్. 55

వ. అజ్జోటి దిట్ట గావునం దలంకక వచ్చునప్పుడు మునుముట్టిన భయకార
ణంబున. 56

సీ. తొడవు లూడ్చిననైనఁ దొయ్యలి [1]రూపుతోఁ
జిన్నవోయినపట్లు సెన్ను మీ[2]ఱ
విరులు పుచ్చినవైన వెలఁది పెన్నెఱితావిఁ
బాయనిజవ్వాది బయలు మెఱ[3]య
బూత రాల్చిననైనఁ బొలఁతుక మైచాయ
గవుసెనలో నున్నక్రమము దెలు[4]ప
మడుఁగు మాసిన నైన మగువపిఱుందుసో
యగము చూపఱచిత్త మాఁకగొలు[5]ప

తే. మురిపముల నుజ్జగించిన[6]ముగుదనడపు
గలికిచూపుల పిడొక్కన్న కన్నుఁగవయుఁ
జిఱునగవు నోసరించిన చిగురుమోవి
నింతి మది బీతి వెలు[7]పలి కెఱుక సేయ. 57

క. దనుజేంద్రుఁ డాతలోదరిఁ
గనుఁగొని చొళ్ళెంబు నిమురుఁ గ్రమ్మనఁ బైకొం

---

1. మేనిలో, 2. ఱు, 3. యు, 4. పు, 5. పు, 6. ముదురు,
7. పీడుకె.

గనువుపఱుచు గేదఁగిరే
కు నఖంబులఁ జీఱు [1]గులుకుఁ గోర్కులఁ దేలున్. 58

క. ఆ త్తెఱఁ గంతయు నూర్వశి
చిత్తంబున నెఱిఁగి వాఁడు చేతోజాతా
యత్తుండై తనుఁ బిలువం
బు త్తెంచుట తెలిసి లోనఁ బూనినలజ్జన్. 59

ఉ. తోరపుఁజన్నుదోయిపయి దొంగలితెప్పలదాఁచి చూపు నీ
హారము లేనిక్రొమ్మెఱుఁగులై నిలువం గొలు వల్ల జొచ్చి య
చ్చేరువకంబముం గదిసి చిత్తరువో కరువో యనంగ గం
డారపుబొమ్మవోలె నచటం గద లించుక లేక యుండఁగన్. 60

ఉ. ఆ లలితాంగిఁ జూచి నరకాసురుఁ డిట్లను బాకశాసనుం
డాలములో ననుం గదిసి యంతక పాశి కుబేరయుక్తుఁడై
తోలుపులం బడెన్ సతులు దోడనె డాఁగిరి దైత్యభీతలై
[2]ప్రోలు దొలంగి తేమిటికిఁ బొత్తులదానవు నీవు తొయ్యలీ. 61

ఉ. నాకపురంబులో మెఱసి నందనకేళిఁ జరించి దివ్యకాం
తాకరతాలవృంతసముదాయసమీరము సోఁక రాజ్యముం
గైకొని నేఁడు దిగ్విజయగౌరవధన్యుఁడ నైన నాసభన్
నీ కనుదోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే. 62

మ. అవె సుత్రామరథంబు; లల్లవె కుబేరానేకపశ్రేణు, ల
ల్లవె వార్ధీంద్రుతురంగమంబు; లవె ప్రేతాధీశపీరావళుల్
దవులం బాఱినఁ బట్టితెచ్చి రనిలో దైతేయు[3]లేసొమ్ము లిం
దువిదా నీకుఁ బ్రియంబు ? గైకొనుము నీయుల్లంబు దెల్లంబుగన్. 63

ఉ. కౌఁగిటి కాస చేసి నొడికారితనంబున నిన్నుఁ దేల్చి రా
రాఁ గొఱగానివాఁడ నయి రామలలో నగుఁబాటు దేను నీ
కేఁ గలుగంగ సంపదల కేల విచారము పద్మగంధి ? నీ
కౌఁగిటఁ జేర్పనే యుభయలోకసుఖంబులు నన్నుఁ బొందినన్. 64

---

1. నొఁడలు గులుకుచు నిక్కున్ (మెచ్చున్), 2. పోలఁదా,
3. లిసొమ్ములం.

వ. అనుటయు నక్కాంత చింతాక్రాంతయై యొక్కింత దెలిసి యతనితో నిట్లనియె. 65

చ. చతురవచోవిలాస గుణసాగర ! సాగరమేఖలావనీ
పతియగునీకు నింత లౌకబ్రాంతియె ? నీ విటు గోరుటెల్ల నా
యతులితభాగ్య; మింత నిజః మైనఁ గలంగికమున్న వైభవో
న్నతి మెఱయంగ వచ్చి యొకనాఁడయినన్ నను గారవించితే. 66

ఉ. నావుడు దానవేశ్వరుఁడు నవ్వుచు నూర్వశితోడ నిట్లనున్
నీవిటు దూఱ నేర్తు వని నేరమి వెట్టితి గాక యేను మీ
దేవత లున్నవీటి కరుదెంతునె మిండతికంబుచేఁతకై
లావున రాక వేఱొకతలంపున వచ్చినఁ గీడు పుట్టదే ? 67

చ. అనుటయుఁ బూర్ణచంద్రముఖి యద్దనుజేంద్రునితోడ నిట్లనున్
మనమున నింతమాత్ర మనుమానము గల్గిన నిందు నిన్ను ర
మ్మనుట పొసంగ, దొక్కదినమైనను నీ విహరించుచోటికిన్
ననుఁ బిలిపింప వైతి తగునా చన వింతకు నాకుఁ జెల్లదే ? 68

వ. అనుటయు నతండు. 69

క. పగవాఁ డట దేవేంద్రుఁడు !
మగువా ? నీ వతని కొలువుమానిసివట ! నిన్
దగవు చెడి పిలువఁ బనుచుట
మగతనమే ? యిట్టిలంజమాటలు గలవే. 70

వ. అనుటయు నచ్చెలువ విచారించి. 71

ఉ. లంజియ నౌదు నేను విను లావున నీ వమరేంద్రు గెల్చి న
న్నుం జెఱవట్టి తెమ్మని వినోదము చేసితిగాక చిత్త మె
ల్లంజెడి యుండ రిత్తయొడలం జవి చేరునె ? చిల్కవోయినం
బంజర మేమి సేయ ? రసభంగము సంగతిలోన మెత్తురే. 72

శా. నవ్వులమాటలో నిజమొ నాకములోన ననేకకన్యకల్
మవ్వపుఁదీఁగెలం దెగడు మానిను లుండఁగ సంత నెన్నఁడో

జవ్వన మమ్మకొన్న [1]గడసాని ననుం గవయం దలంచితే
పువ్వులు వేడుకైనఁ గడివోయిన[2]వాళ్ ముదువం[3]గవచ్చునే. 73

వ. అనుటయు. 74

క. అంజెదవుగాక ననుఁ జెం
తం జేరఁగనీక యెంత[4]దఱిఁగిన మిరియా
లుం జొన్నల సరిపోవే
లంజెతనములందుఁ గొమిరెలన్ గెలువ వటే. 75

గీ. అనుడు నవ్వామలోచన యతనిఁజూచి
చిఱుతనగవుల తెప్పల సిగ్గు దేర్చి
నీవు రాజవు ! మాటలు నిన్నుఁ గడవ
నాడ నేర్తునే, విన్నప మవధరింపు. 76

చ. శతముఖుఁ డోడె నీవతనిసంపద కంతకు రాజవైతి త
చ్చతురవిలాసినీ[5]గణము సంతతసేవ యొనర్చు నీమనో
హితముగ నింక నేననఁగ నెంతటిదాన మహిన్ మహామునుల్
క్రతువులు సేయుచోటి కధికారివిగాని కొఱంత యేటికిన్ ? 77

క. యాజకులు యజ్ఞ భాగ
భ్రాజిష్ణునిఁ జేయ నిన్ను భావజ[6]సౌఖ్యా
వ్యాజపదరాజుఁ జేసెదఁ
దేజముసూ వలపు దెలుఁపు దెఱవల కెందున్. 78

వ. అనుటయు నతండు. 79

చ. అవునిదివోలు వాసవుఁడు నంతకుఁడున్ వరుణుండుఁ బార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ దత్పద మేలెద రంచు నిట్టినే
నవిహితయాగభాగము లహంకృతిమైఁ గొనకున్న నూర్వశీ
కవకవ నవ్వరే త్రిదశకాంతలు వింతలసేయు నాపనిన్. ౹ 80

1. కడసారె, 2. వేన్మ, 3. దలంతురే, 4. దఱిని, 5. మణుల సంగతి సేవయొనర్తు, 6. సుఖసీరాజ.

వ. అని యొడంబడి యావెలంది పీడ్కొలిపి యమరావతీపురంబునం దడవి తడవి చక్కని కన్యకాజనంబుం బట్టించి తెప్పించి యందంద నందన పాదపంబులు వెదకించి తెప్పించి యెనిమిదివేల యేనుంగులం గైకొని మాహిష్మతీపురంబునకు వచ్చి మఱియును. 81

గీ. త్వష్టకు నుదాహరకుఁ జతుర్దశి యనంగ
నొక్కకూఁతురు గలిగినయిక్కు వెదకి
[1]గంధగజరూపముననను నక్కన్యఁ దెచ్చి
కవసి నరకాసురుండు సౌఖ్యములఁ దేలి. 82

క. నాకంబునయందును భూ
లోకంబునయందు ధనములు మణులు దైత్యా
నీకంబు దేర మంచివి
గైకొని యాచంద్రముఖికిఁ గానుక యిచ్చెన్. 83

వ. వెండియు గంధర్వ దేవ మానుషకన్యకలం బదాఱువేలున్నూఱుగుర నప్సరో గణంబు (లేడింటి) జెఱలువట్టి తెచ్చి మణిపర్వతంబునం బురంబుచేసి కావలివెట్టి కొని యుండెనట్టియెడ. 85

మ. మురదైత్యుండు దపోవసానమున వైముఖ్యంబముఖ్యంబుగా
[2]వరదత్తాపరనామధేయమున దేవవ్రాతముం గిట్టి ము
ష్కరుఁడై కుండలముల్ హరించె నదితిం గారించి దైతేయు లె
వ్వరుఁ బూర్వంబున నింత చేయ రనుచున్ వారింత వారింపఁగన్. 85

క. ఆకుండలములు నరకునిఁ
జేకొమ్మని యిచ్చి యతనిచేఁ దాఁ బడసెన్
నాకొడుకులకుఁ బదుంద్రకు
నీకావలి యొసఁగు మనుచు నిచ్చలుఁ గొలువన్. 86

మ. అతఁడున్ వారికి నాత్మరక్షయును గన్యారక్షయుం జేయనై
హితులం దోడుగఁబెట్టి యిచ్చె మహిలో నింపారఁ బ్రాగ్జ్యోతిషా

1. కదిసి గంధర్వుఁడనుచు నక్కన్యఁ దెచ్చి (కదిసి కందర్పురూపునం గన్యఁ దెచ్చి),
2. వరదంతావళ.

ర్పితుఁడై తచ్చతురంగరక్షకు హయగ్రీవున్ నిశుంభుం బొన
ర్చుతటిం బంచజనున్ మురుం బనిచె ధీరుండై జగం బేలుచున్. 87

క. ఆమురుఁడు రాక్షసకుల
స్వామి [1]సుకృతి వానిఁ జంప వచ్చుటకుఁ బరం
ధామపతి పుట్టె సుజన
క్షేమంకరుఁ డగుచు దేవకీగర్భమునన్. 88

క. మురనరకాసురు లిరువురు
సుర లరిగెడుత్రోవ లుడిపి సుత్రామభయం
కరులై మునిగణ మానస
సరోవరంబులు గలంచి చరియింతు రిలన్. 89

నరకాసుఁ డధ్వరభాగంబు లిం డని మునుల బాధించుట

మ. ఒకనాఁ డూర్వశిమాటవొందు నరకుం డూహించి నాకాధినా
యకునిం దాపసముఖ్యు లధ్వరము చేయంబూని రావించుచో
టికి దాఁబోయి [2]ధరామరావతులు రెంటింగొంటి మీ కెల్లనే
లికనై యుండెద యాగభాగములు పాలింపన్ విభుం డయ్యెదన్. 90

శా. పాశిం బాఱఁగఁ దోలి యంతకు దిశాపట్టంబు గావించి పూ
ర్వాశాధీశ్వరు వెన్నడిం జని ధనాధ్యక్షున్ విభాళించి కే
లీశస్త్రాస్త్రవిహారసార మెచటన్ లేకుండ నిర్మించితిన్
మీశాస్త్రంబుల నింక నెవ్వరి కగున్ మేలైన యజ్ఞాంశముల్. 91

క. మ్రొక్కులకుఁ దగుదుఁ బూజల
కెక్కినమంత్రార్థవిధుల కెల్లం దగుదుం
బెక్కేల యేను వెలిగా
స్రుక్కక యాగముల కొకరు సొరఁ గలవారే. 92

చ. అనుటయు సంయముల్ బదరికాశ్రమవాసులుగూడి వానికి
ట్లనిరి సురాధినాయకుఁడ యాగము లేలెడువాఁడుగాక లా

---

1. బలుఁడు, 2. ధరామరేశ్వరుల దండిం దిల్చి (ధరామ రామరుల వెట్టింగొంటి).

పునఁ బడునయ్యె పేర్మి ? యలవుం దగవుం దలపోయ కేల కూ
దనిపని సేయఁ[1]జొత్తు ? వకటా వికటాచరణంబు పాడియే ? 93

క. మనుజాశను లట, బలు లట
మును లట, యాగంబు లట, నమో విశ్వసృజే
[2]విన మింతకు మున్నెన్నఁడుఁ !
గని కని కొత్తెస్వఁ దింటికంబము సేసెన్ ? 94

వ. అనుటయు నద్దనుజుండు 95

క. ఏలిక నౌదు మఖాంశ
శ్రీలకు; నొరు దరవ నేల ? శిర సుందగ మోఁ
కాలను సేసలు వెట్టుట
బేలుఁదనము గాక మీకుఁ బెద్దఱికంబే. 96

క. త్రిదివసుఖమ్ము మఖమ్మునఁ
గదియించుఫలంబుఁ దనకుఁ గానసిదయ్యం
బెదిరికి వర మిచ్చు ననుట
చదురే యతఁ డేఁగె ముని దిశాపట్టముగాన్. 97

వ. అనుటయు నమ్మునీంద్రులు విడియనాడం దలంచి యతని తోడ.

శా. పాపాత్ముండవు దానవుండవు నినుం బాటించి యాగార్థ్మఁగాఁ
జేపట్టం దగునే మునీంద్రులకు ? మాచేఁ జెల్ల దీకల్ల దు
ర్వ్యాపారంబులు ధర్మకర్మములలో వర్తించునే ? నావుడుం
గోపాటోపగజంబు మానససరఃకోలాహలోత్సాహిగాన్. 99

చ. తనపరివారముం బిలిచి దానవుఁ డాశ్రమసంభృతార్థముల్
గొనుఁడు పరంపరాకమునకున్ మును యజ్ఞపశువ్రజంబులం
దినుఁడు కుమారికావితతిఁ దెండు బలాత్కృతి నంచు నమ్మహా
మునులకు నెగ్గు చేసి మద మోహమునం దనవీటి కేఁగినన్. 100

1. జూతు. 2. విన మెన్నఁడు మున్నిట్టివి కన మెన్నఁడు గోరవిట్టి కర్జము సేయన్.

వ. తదనంతరంబ 101

సీ. జడలు [1]కంపలు వట్టి జరగనీ కున్నచో
విడిపింప శిష్యుల వెదకువారు
జన్నిదంబులు కాలిసంకెల లై పడ్డఁ
దెగఁ దన్ని మిన్నక తిరుగువారు
ముందటిదిక్కూడి మొలత్రాడుఁ దవిలిన
తోఁక[2]గోచులవెంటఁ దూలువారు
దగ యెత్తి పోలేక దండంబు లటు వైచి
"హా విధీ" యని చేతు లార్చువారుఁ

తే. గడవసంబుల మోఁదిన గలఁగువారు
వల్కలంబులు దోఁచిన వంగువారుఁ
జెఱలువోయినవారలఁ జీరువారు
నై మునీంద్రులు గలఁగి రయ్యాశ్రమమున. 102

చ. నరకునిచేత నిత్తెఱఁగునం బరిభూతికి భాజనంబు లై
హరి కెఱిఁగింత మీబదరికాశ్రమ దుర్భరబాధ లంచు న
ప్పరమమునీంద్రు లందఱు గృపాపరతంత్రుని యాదవాన్వయాం
బురుహదివాకరుం గొలువఁ బోయిరి వేడుకతోడుపాటుగాన్. 103

గీ. అరుగు నెడ భరద్వాజ కాశ్యప వసిష్ఠ
వామదేవ జాబాలి కణ్వ బృహదశ్వ
ధూమ్రముఖ్యులు దనుజారి తొల్లి చవులు
గన్నబదరీఫలంబులు కానుకలుగ. 104

క. తెం దనుచు దుష్టదానవ
ఖండితయాగోపకరణ ఘనభారంబుల్
దెం దనుచు [3]వేగమే చను
దెం దనుచున్ శిష్యులకును దెలియఁ బలుకుచున్. 105

---

1. క్రవ్వలు, 2. గోఁచు, 3. గూడరాఁ జ.

## నిరోష్ఠ్యము

చ. చని చని కాంచె నంత ఋషిసంహతి సారసకేసరాంతరా
సన సరసాళిసంగఁ దటచందన శాఖి చల త్తరంగఁ గాం
చనసరసీజలార్ద్రి యతిసంచిత సైకతలింగ గంగ నం
దనగిరి గాఢ గంధగజ సంగతశృంగ రథాంగ న త్తటిన్. 106

క. అనిమ్నగలోనఁ గృత
స్నాను లయి మునీంద్రు లమలినస్వాంతశరీ
రానూనమహిము లగుచును
దానవరిపుఁ గానఁ జనిరి ద్వారావతికిన్. 107

మ. చని వా రందఱు దేవతారచిత పంచక్ష్మాధరాంతస్థలం
బున నొప్పారెడుపీడు చొచ్చి మన ముప్పొంగంగ[1] దాశార్హు నా
వినుతిం బొందుసభన్ నిషణ్ణులగుచున్ [2]విచ్చేయ కై నేయుఁ డా
సనపాద్యాదిసపర్యలం దనుపఁగా సంప్రీతచేతస్కులై. 108

చ. అచటికి దానవాంతకుఁడు నంతటిలోఁ జని యానుపూర్వితో
నుచితవిధోపచారముల నూఱటగాఁ గుశలానుయోగ వా
క్యచతురత న్ముదం బెసఁగ నందఱ ధన్యులఁ జేసి భక్తి న
ప్రచలితుఁడయ్యె వారలు నుపాయనముల్ మునుసూపి పిమ్మటన్. 109

### మునులు నరకుని యాగడములు శ్రీకృష్ణునకు విన్నవించుట

క. నరకుఁడు యాగంబులకున్
జొరకుఁడు మీ రనుచు ఋత్విజుల నడుచుటయున్
సరకులఁ జూఱాడుటయును
వరకులకన్యకలఁ బట్టి వాఁ డేఁగుటయున్. 110

వ. విన్నపంబుచేసి తమ తెచ్చిన విధ్వస్తోపకరణంబులు విచ్చి చూపి. 111

మ. అది నాయుద్గమనీయవస్త్ర మది నాయాషాఢరాంభద్వయఁ
బది నాస్రుక్స్రువపాత్రవర్గ మది నాయజ్ఞోపవీత వ్రజం

1. సుదాశార్హ, 2. వేవేగఁ బ్రద్యుమ్నుఁ డా.

బది నాదారవయంత్ర పీఠ మది నాయైణో త్తరీయాజినం
బది నారాంకవకంబళం బని పదార్థాలోకనవ్యగ్రులై. 112

వ. వేఱువేఱ యెఱింగించి. 113

క. నారాయణ ! నీమన్నన
కారణముగ నేము బదరికావనభూమిం
జేరితిమి నరకుఁ డిమ్మెయిఁ
గారించెం దనకుఁ జేటుఁగాలంబునకున్. 114

క. నీతోఁ జెప్పినయంతకు
మాతలఁపులు దుఃఖజలధిమగ్నంబులు గా
కాతల నాతలఁ కేలా
దైతేయాంతకుఁడ వెల్లతగవుఁ దెలియవే. 115

వ. అని మునిలోకంబు శోకంబు గ్రోధంబును బోధంబు సడలింప జేయ నిలింప
వైరి తెఱం గెఱింగించుటయును. 116.

మ. అరుణాంభోరుహపత్రనేత్రుఁడు సముద్యద్భ్రూకుటీభంగభా
సురఫాలస్థలుఁడుం జలాచలమనశ్శూలాయమానవ్యధా
పరివేషాననభానుమండలుఁడు నై ప్రత్యక్షరౌద్రం బనన్
నరకాలంభవిజృంభణంబు నెఱపెన్ నారాయణుం డాకృతిన్. 117

వ. అప్పు డప్పరమపురుషుం గొనియాడం దలంచి యత్తాపసోత్తము
లిట్లనిరి: 118

సీ. పన్నగంబుల రాజుఁ బగవాఁడుఁ గూడి నీ
శయనంబుఁ బయనంబు నంతరింప
దుగ్ధవారాశికూఁతురు నాలుఁ గూడి నీ
శరణంబుఁ జరణంబు సవదరింపఁ
దామరపగవాఁడు దయితుండుఁ గూడి నీ
బడిచూపుఁ గుడి చూపుఁ [1]బరిఢవింపఁ
జందురుచెలికాఁడు సయిదోడు గూడి నీ
యుల్లంబు మొల్లంబు నుపచరింప

1. బరికరింప.

తే. గంపమానమనోధ్యానగతులు మాన
కేకతం బున్నమునులకు నేకతంబు
లేక పొడగాన వచ్చు నీలీల గాన
నన్యు లేనాఁట ధన్యులే యంబుజాక్ష ! 119

గీ. అనుచుఁ గొనియాడి వందన మాచరించి
మునులు సంతోషవార్ధిని మునిఁగి యాడఁ
గొలువునం దున్న యాదవకోటి యెల్ల
మొగుపుఁగేలు ఫాలంబున మోచియుండె. 120

గీ. ఇట్లు మ్రొక్కిన మునియాదవేంద్రసమితి
సంతసము నొంద నరకునిఁ జంపువాఁడ
నందఱుచు జూడ నని పంతమాడు హరికి
మఱియు మ్రొక్కుచు సంయము ల్మగిడి చనిరి. 121

క. తదనంతరంబ రాముఁడు
మొదలగు యాదవుల కెల్ల మోదము వెలుఁగున్
మది మొలవఁ జక్రధరుపై
వదలక వినువీధిఁ బుష్పవర్షము గురిసెన్. 122

ఉ. తోడన దివ్యగంధములతో సుఖశీతలమారుతంబు ద
ట్టాడ వియత్తలంబుగలయంతటఁ గారుమెఱుంగుమూఁకకుఁ
జోడగుకాంతి పర్వ మఱిచుట్టులఁ బాయుతొలంగుమంచు బె
ట్టాడెదుమాట లుప్పతిలె నంతటిలో గగనాంతరంబునన్. 123

ఇంద్రుఁడు నరకునిదుండగములు నివేదింపఁ గృష్ణునికడకుఁ బోవుట

క. ఈరీతిఁ దోఁచి నంతట
నైరావణదంతి నెక్కి యమరులతో జం
భారి చనుదేర యాదవ
వీరులు నిలుచుండి రధికవిస్మయమతులై. 124

క. వాసవుఁ డేనుగు దిగి, సిం
హాసనముననుండి దిగి జనార్దనుఁ డన్యో

న్యాసక్తిఁ గౌఁగిలింపఁగ
నాసభవారలకు ముదము నచ్చెరు వయ్యెన్. 125

వ. ఇట్లు పరస్పరపరిరంభణం బాచరించిన యనంతరంబ జంభాంత
కుండు. 126

శా. రాముం గౌఁగిటఁజేర్చి [1]యాహుకుని నాప్రద్యుమ్ను నక్రూరునిన్
ప్రేమం బారంగఁ గౌఁగిలించి వరుసన్ బేర్వేర భోజాంధక
స్తోమం బెల్ల వయోవిశేషగతి రాఁ దోడ్తోఁబరీరంభలీ
లామాధుర్యమునన్ సుఖాంబునిధిఁ దేలం జేసె నెయ్యంబునన్. 127

మ. హరి చేయించిన యర్ఘ్యపాద్యమధుపర్కాద్యోపచారంబులన్
హరి సమ్మోదము మోమునం బొడమఁగా నర్హాసనాసీనుఁడై
కరమర్దేవు కపోలఫాల[2]చిబుకగ్రైవేయసంక్రీడకుం
దిరుగం జేయుచు నొయ్యనొయ్యఁ జెవికిం దియ్యంబుగాఁ బల్కుచున్. 128

క. నరసీరుహసంభవుచే
నరకుం దేవరము వడసి నమ్మినవాఁడో
పురములు గైకొని [3]కొండల
తెరువులఁ బట్టించె నన్ను దిక్పాలకులన్. 129

వ. అంతనుండి. 130

చ. చొరనిబిలంబులున్ వెదలఁజూడని క్రంతలుఁ గాలు రాపడం
దిరుగని స్రోవలున్ విడియఁ దీర్పనిగొందులు నాలుబిడ్డ లే
కరయని రేలుఁ జీమ చిటుకన్నను విప్పనిమూఁకలు బయిం
జిరుఁగని చీరలుం గలవె చేరిన యీ సురకోటి కచ్యుతా. 131

వ. నా తెఱంగు వినుము. 132

శా. లోకాలోకనగంబు [4]చెంపలకుఁ గల్లోలాహతాంబోధివే
లాకుంజంబులకుం జనం జనఁగ నాలా [5]వెంత చింతాభరం

1. సాత్యకిని నాప్రద్యుమ్ను నక్రూరునిన్, (a) సత్యకసుతున్ రాజేంద్రు నయ్యాహు, (b) సాత్యకిని. 2. వంక: 3. కొండల. 4. దాపలకు (దెంపలకు); దంపులకు; చెంపలకు. 5. వేది.

ఖాకంపంబు మనంబునం బెనుపఁగా నై రావతోఁ జెచ్చె శ్రవ
స్స్వీకారంబున దిక్కులం దిరుగ వచ్చెన్ దేవకీనందనా! 133

వ. అది యట్లుండనిమ్ము. 134

క. ఇటమీఁద నాకు నరకుఁడు
కుటిలమతిం గీడు చేయఁ గోరెడు నతనిం
జటులతర చక్రధారా
త్రుటితశిరఃకములఁ జేయు తోయజనాభా! 135

క. ఈవైనతేయు నెక్కినఁ
గావింపఁగ రానిపనులఁ గలవే నీకున్
గోవింద! తిరుగు నీతఁడు
దేవతలకుఁ దిరుగ రాని తెరువున నైనన్. 136

చ. అతఁడు జనార్దనుండు నరకాసురుఁ జంపుట కింత యేల నీ
కనిమిషనాథ! మున్ బదరికాశ్రమ తాపసపంక్తి ముందటం
గినిసి ప్రతిజ్ఞ చేసి రణకేళికి నప్పుడ పోవువాఁడనై
పనివడి నేఁ దలంచితి సువర్ణుని నాతఁడు వచ్చె నింతలోన్. 137

శ్రీకృష్ణుఁడు సత్యభామతో నరకాసురుని వధింపఁ బోవుట

ఉ. నావుడు నింద్రుఁ డుబ్బ యదునాయకుఁ డప్పుడ సత్యభామతో
నావిహగేంద్రునెక్కి వివిధాయుధుఁడై వియదంతరంబుపై
త్రోవఁ జనంగ నాతఁడునుఁ దోడన యభ్రగజంబు నెక్కి సం
భావనఁ గొంతద వ్వరిగి పాసి చనం దనవీటిచోటికిన్, 138

గీ. హరియు మహిష్మతీపురి కరుగు దెంచి
రక్షగాఁ జుట్టి తిరిగెడు రాక్షసులకుఁ
దొలుత జముబానసమునింటి త్రోవ చూపి
పాంచజన్యంబు చేనంది బలము మెఱసి. 139

గీ. కత్తివాతులతో నూరు గాచి తిరిగి
యాడు [1]మురపాశముల గొంచె నాఱువేల

1. మురు పాశముల

వానిలో నిపిశాచముల్ వచ్చి వచ్చి
పొదువ నన్నింటిఁ దునుకల ప్రోవు చేసె. 140

మ. కని శౌరిన్ మురుఁ డంత మార్కొని గదాఘాతంబుల న్నొంచి[1] మీఁ
ద నవార్యాద్భుతశక్తి వైచుటయుఁ గోదండంబు సారించి య
ద్దనుజారాతి శితక్షురప్రమునఁ దత్కంఠంబు ఖండిచి శం
ఖనినాదంబున భూనభోంతరభయోత్కంపంబు గావించినన్. 141

ఉ. అంత నిశుంభుఁ[2] డెద్దియుకొని యాశుగముల్ దనమీఁద నేయ దై
త్యాంతకుఁ డంతకంతకు గదాహతి నొవ్వఁగ సత్యభామ దు
ర్దాంతమదంబుతో ఘనగదం గడు బెట్టుగ వైచె దైత్యు న
త్యంతరయంబునన్ రుధిరధారలు గ్రక్క రణాంగణంబునన్. 142

క. ఆలోకించి మురాంతకుఁ
డాలోననె శరపరంరాంభోనిధిక
ల్లోలములఁ దేల్చి వానిం
గాలుని కందిచ్చె రౌద్రఘనవాయుగతిన్. 143

శా. కేళీవిక్రముఁడైన చక్రికి హయగ్రీవుండు మార్కొన్న నా
భీలాయోధన మయ్యె నయ్యెడ శర ప్రేంఖద్గళోద్వేలకీ
లాలాలోలము చేసి వానితల నేలం గూల వైచెన్ జయ
శ్రీలోలుండు మురారి పంచజనుఁ బంచెం దత్సహాయుండుగాన్. 144

వ. ఇట్లు విజృంభించి దనుజాంతకుండు, 145

క. ప్రాగ్జ్యోతిషంబు గదిసి స
దృగ్జ్యాటంకృతులు లేక దితిజులమీఁదన్
దృగ్జ్యోత్స్న జేవురింపఁగ
దిగ్జ్యగగనాంతరంబు దివురఁగ నార్చెన్. 146

క. విని కడఁగి యసుర లెనుఁబది
యెనిమిదివే లొక్కమొగిన యెత్తిన హరియుం

1. యం. తప చక్రం బటుమీఁద వైచుటయు. 2. డాదిగొని.

గినిసి విశిఖంబు లేసిన
మొనపడు గగనంబు మొయిలు మూఁగినమాడ్కిన్. 147

వ. ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు గాలువలు గట్టి గట్టి మెయిమఱు
వులు సించియుఁ గాయంబులు నొంచియు, మర్మంబులు గీఱియు, మహీతలం
బులు దూఱియుఁ, బ్రేవులు వెఱికియుఁ, బెనుమూఁకల కుఱికియు, సీసకంబులు
వగిలించియు, శిరంబులు నొగిలించియు; గైదువులు గఱచియుం, గరవాలం
బులు సఱచియు, నెత్తురులు సిమ్మియు, నెసళ్ళు గ్రుమ్మియు' జరణంబులు
దొలిచియుఁ, జర్మంబులొలిచియు, బాహుదండబులు గత్తరించియు, ఖయళ్ళకు
నొత్తరించియుఁ, బలుగండలు సెండియు, బవులురాసి మండియు, గుండెలు
ద్రుంచియుఁ, గుత్తుకలు ద్రెంచియు, నురంబులు గాఁడియు, నరంబులు
దోఁడియు, నుదరంబులు వ్రచ్చియు, నూరువులు గుది గ్రుచ్చియు, మకుటం
బులు విఱిచియు, మదంబులు చెఱిచియు, జంఘలు సెల (లి)సియు, జఘ
నంబుల బల(లి)సియు బాణులం బెనంగియుఁ, బ్రాణంబుల మ్రింగియుఁ
జట్టలు వాపియుఁ, జమత్కారంబులు మాపియుఁ, బై పయిం దోఁచిన నేచినదనుజ
సబలంబు చలంబు కొని పోరి పోరిలోఁ దునుకలయ్యునుఁ దుమురయ్యునుఁ
నింతింత లయ్యును నీసుమంత లయ్యునుఁ జిఱునుగ్గయ్యునుఁ జిదురుప
లయ్యును మంచయ్యును మడిమంచయ్యును రూపుచెడి తిరుగుడు వడి వాహి
నులు చిక్కువడి చిందఱవందఱై మతిచెడి మల్లామడియై యేపుదెగి[1] యవురు
సవురై యనువుదప్పి యదవదయై యంతంత విచ్చి యరవరలై పాఱలేక
పలపలనై వెఱఁగుపడి వెలవెల్లనై చిడు ముడిపడి చెల్లాచెదరై పొదవడంగి
ప్రోవున నొక్కండై పోవిడిచినఁ బోయినపోకై పోయినం గని దనుజనాయ
కుండు తనమొనకభయ దాయకుండై నిజరథ నిహిత బహువిధసాయకుండై
చాలుఁ జాలుఁ బోకుపోకు నిలునిలు మని యదలించి కోదండంబు ధరియించి
గొనయంబు సారించి సారథికి రథవేగం బుపదేశించు సమయంబున 148

1. యెప్పరుస పట్టయి.

క. కమ్ములఁ దవిలెడు నేనిక
కొమ్ములు నెమ్ములును సుభటకోటులయమ్ముల్
నెమ్మనము నూఁకు సెఱుపఁగ
నుమ్మలికపుఁ గింకఁ గొంక కురవడి నేసెన్. 149

మ. దనుజుం డేసినసాయకంబులు గరుత్మంతుండు పక్షావళీ
ఘనకక్షాంతరవీథులన్ [1]నిలిచి వీఁకన్ మేను వొంగంగ హు
మ్మని జాడించిన లాగు వేగమునుగా నాయంపచా లేసె నా
తనిపై సారథిపై హయంబులపయిం [2]దట్టాడఁ బెట్టాడుచున్. 150

సీ. క్రేగంటి చూపున గిఱిగొన్న సన్నగే
దంగితేకుల కన్నదమ్మ లగుచు
జడగొప్పలోను [3]నచ్చపుసజ్జకములైన
విరవాదులకు వింతవిందు లగుచు
బిగువుఁజన్నులమీఁదఁ బెనుపడం బైన చెం
గలువ క్రొవ్విరుల సంగడము లగుచు
[4]గేలకి హరి వైవఁ గేలఁ దాలిచిన సం
పఁగిబంతికొనలఁ జోపాప లగుచు
తే. [5]వేగ నరకాసురుం డేయు వేగిరంపు
బాణములఁ బ్రాణములు సత్యభామమేనఁ
గుసుమశృంగారముల కెల్లఁ గ్రొత్తసేయ
నెనిమిదిదెఱంగులై సౌబ గినుమడించె. 151

క. పగలిటిభానుఁడు వోలెను
ధగధగ యను మొగము దివుర దనుజుం డేసెన్
జగదేకనాథు మీఁదను
దెగ నిండఁగ దిగిచి యొక్కదివ్యశరంబున్. 152

క. అరచందురు డెందములోఁ
జొరఁబాఱి వణఁకు తోఁకచుక్కయపోలెన్

1. విఱిచి. 2. దట్టాడు చిట్టాడుచున్. 3. పచ్చంపక సజ్జక. 4. గెలిచిన.
5. వెఱచి.

నరకుం డేసిన బాణము
హరినిటలతటంబు నాటి యల్లలనాడెన్. 153

## సత్యభామ నరకాసురునితోఁ బోరాడుట

ఉ. కాఁడినయమ్ముచే సొలసి కంసవిరోధి శిరోధి వ్రేలఁ జే
యాడక మూర్ఛవోయె భుజగాంతకు తెక్కలకొక్కలాగునం
దోడుగఁ దాలవృంతములఁ దూకొని చల్లనిగాలి చల్లెఁ దో
డ్తోడనె సత్యభామ విభుఁడుం గనుఱెప్పలు విచ్చెఁ జెచ్చెరన్. 154

ఆ. అట్లు సేదదేఱి యరవిందనయనుండు
సత్యభామఁ జూచి చంద్రవదన !
శార్ఙ్గ మింద నీవు సమరంబె శ్రోఘ్ర[1]చో
నవసరంబు వచ్చె ననుచు నిచ్చె. 155

ఉ ఇచ్చినఁ బొంగి యచ్చెలువయుంపును దెంపును లోన మానమున్
మచ్చరముం బెనంగ మురమర్దనుపై నరకాసురేంద్రుపై
నచ్చపుఁజాయలం గువలయచ్ఛదగుచ్ఛ విషచ్ఛటావలిన్
మెచ్చని వానిఁ గీల్కొలిపె మేలపుఁ జూపుల వాఁడితూపులన్. 156

మ. గనయంబున్ గొనయంబు నెన్నడుముతోఁ గర్ణావతంసంబుతో
జనుదోయిం గనుదోయుసాయకముతో సంధానహస్తంబుతో
జెనకం జేయుచు నేయుచుండె సతి లక్ష్మీభూతదైతేయ త
ర్జన గర్జారవ జర్జరాంగరుధిరాసారంబు దోరంబుగన్. 157

క. అరవిందనయన శరముల
సరవిం దనయనువు చూపఁ జాలము గుడు సై
పరివేషముగల చంద్రుని
సరివేషము దాల్చె మొగము జగము నుతింపన్. 158

చ. కమలముఖీకటాక్షకటకాముఖపాణినఖోపకారి వి
క్రమమణిపుంఖరింఖదభిరామరుచుల్ గరమొప్పెఁ జెక్కులం

1. దు

జెమటలఁ బత్త్రిభంగములు చిందఱ వందఱ లైనఁ దోన సం
భ్రమమున వీరలక్ష్మి సమరక్రమరక్షకు వ్రాసెనో యనన్, 159

శా. సత్రాజిత్తనయాకరాంతరధనుర్జ్యారావ మైరావతీ
సూత్రానర్గళనిర్గత స్తనితమై సుత్రామచాపప్రభా
పాత్రభ్రూలతికావిలాసముల కొప్పం గప్పు శార్ఙ్గాంబుము
క్షుత్తిక్రూరమహాశనుల్ దనుజరాడ్గాత్రంబు గోత్రంబుగన్. 160

సీ. తంత్రీ వినోదంబు తడవు సైఁపనిక్రేళ్ల
గొనయంబు తెగలపైఁ గోరుకొనుట
యద్దంబుపిడి ముట్ట నలయుపాణితలంబు
లస్త్రకం బిఱియించు లావుకలిమి
చెలికత్తె నొత్తిలి చీర లేనియెలుంగు
సింహనాదంబుచేఁ జెదర కునికి
ప్రమదనర్తనకేళిఁ బరిధవింపని పదం
బైదుతాణంబుల నలఁతఁ బడమి

తే. సోయగపుఁజిత్రరూపంబుఁ జూచుచోట
వేసరువిలోచనంబులు వికృతదైత్య
లక్ష్య మీక్షించుటయు మొక్కలంపు[1] గెలుపు
గైకొనియె సత్యభామ సంగ్రామసీమ. 161

మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందంద మందారకే
సరమాలామకరంద [2]బిందుసలిలస్యందంబు లందంబులై
తొరుగం బయ్యెదకొం గొకింత దొలఁగం దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్. 162

ఉ. ఊఁచనకట్టి వంపని పయోరుహలోచన మింట మంటలం
బూఁచిన బాణజాలమునఁ బూర్వసుపర్వపురాణగర్వమున్
వేఁచినచందమున్ విపులవీరరసంబున నాత్మచిత్తముం
దోఁచిన చందముం దెలియఁ దోఁచిన నచ్చర లిచ్చ మెచ్చరే. 163

---

1. పుఁడెంపు (బుఁ దెలుప). 2. ఘర్మ

ఉ. అక్కమలాయతాక్షి నరకాసురుపై సరి నేసె బాణముల్
పెక్కుదెఱంగు లయ్యసుర భీకరుఁడై నడు మాఱుతూపులన్
గ్రక్కునఁ బార్చెఁ మేదువిశిఖంబుల నొంచిన సత్యభామ గెం
పెక్కిన మోము లేనగవుటీరికలం దళుకొత్త నత్తరిన్. 164

గీ. [1]గొడుగు కామయు విల్లునుఁ బడగతోన
తుమురు సేసి రథ్యంబులఁ దునిమి వైచె
నతివ యతఁ డొండుకోదండ మందికొన్న
నఱకె వేఱ విల్లెత్తిన విఱుగ నేసె 165

క. గద విసరి వైచె నరకుఁడు
వదలక సతి దునిమె శక్తి వైచెను దితిజుం
డది ముదిత దుమురు సేసెను
దుదిఁ బరిఘము వైచె నతఁడు దొయ్యలి విఱిచెన్. 166

మ. సతి దైతేయపతి న్నిశాతవిశిఖాసారంబుల న్నొంప దే
వతలున్ సంయములు న్నుతించిరి మఱి న్వామాక్షి తత్పూతు ను
ద్ధతి నేసెం[2]దల నేలఁగూల నొకటన్ దైత్యాంతకుం డిచ్చె లా
లితకంఠాభరణంబుతో నతిపకునన్ లీలాపరిరంభమున్ 167

ఉ. ఏఁచు [3]నుపేంద్రునిం బడక మిమ్మని రుక్మిణి మున్ను, దేవుఁడుం
బూఁచినపూఁపు దప్పటకుఁ బోకులఁబోవుచునుండు నిమ్మెయిన్
డాఁచినసొమ్ము చేరె నిచటన్ మదిఁ గోరనిసత్యభామకున్
నోఁచినవారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే ధరన్. 168

వ. ఇవ్విధంబున సత్యభామచేసిన సంగరంబునకు సంతోషించి, 169

గీ. చెలువచెక్కుల నెలకొన్న చెమట దుడిచి,
తరుణినుదుటఁ బైకొన్న కుంతలము లొత్తిఁ
రమణికుచమధ్యమునకు హారములు ద్రోచి
పొలఁతిపయ్యెదకొంగుపైఁ బొందుపఱిచి. 170

మ. హరి యక్కామినిచేతివిల్లు గొని యేయం జొచ్చినన్ ధీరుఁడై
నరకుం డొండుశరాసనంబు గొని యన్యస్యందనం బెక్కి వే

---

1. గొడగు. 2. దెగ నిండ గోల. 3. నుప్రేమనీ (పీ)

తొరిఁగించెన్ శరముల్ మురారిపయి నైదున్ రెండు రెండై దులు
న్నరి నై దేడులు సత్యభామయెడలన్ సౌపర్ణగాత్రంబునన్. 171

క. క్రమ్మఱ నేడుశరంబుల
నమ్మురరిపు వేసె విభుఁడు నద్దనుజుని చా
పమ్ముఁ దుమురు సేసెను ర 172
థ్యమ్ముల సారథిని నంపధారలఁ బొడివెన్.

గీ. తన రథంబుననుండి యద్దైత్యవిభుఁ
దాఁటి దనుజాంతకుని యురస్స్థలము వ్రేసి
తిరిగి [1]గరుడుని నడిచి యేతెంచి తోన
పరిఘమున వైచె నది శౌరి పగుల నేసె. 173

శా. జాలన్ వైచె సురారి యొండొరుల మీఱంబాఱి యయ్యుద్ధులు
నై ల్యలానోకహముద్గరంబులను బాశప్రాసఖడ్గంబులన్
శూలవ్రాతగదాకదంబ పరశుస్తోమంబులన్ భిండివా
లాలీపట్టిసమాలికాపరిఘసాహస్రంబులం బోరుచున్. 174

శ్రీకృష్ణుడు చక్రము ప్రయోగించి నరకుని సంహరించుట

ఉ. అంతట దానవాంతకుఁ డహంకరణంబునఁ బేర్చి వేడ్కతో
వింత యొకింత సూపి పృథివీతనయుం దనయుగ్ర చక్రవి
క్రాంతికి విందుచేసె సదరంబుగ దెందము దాఁకి వ్రక్కలౌ
క్కంతగ నేలఁగూల దనుజాకృతి త్రాసునఁ దూఁప భూతముల్. 175

వ. ఇట్లు. 176

చ. అతిశితచక్రధార నరకాసురు వ్రక్కలు చేసి దాసి దై
వతపతి కింక రక్కసుల వాఁడిమి పొడిమి మాల్చి గెల్చి యూ
ర్జితవిహగేంద్ర పక్షపరిశీతల మారుత చారుతానివా
రితసమరాంతసంతత పరిశ్రముఁడై హరి యున్నయత్తఱిన్. 177

సీ. మాఁగుపాఱిన చంద్రమండలంబునుఁ బోలె
వదనారవిందంబు వన్నె దఱుఁగ

1. గరుడని

మకరందమున నిండుమధుకరంబులుఁ బోలె
నేత్రోత్పలంబులు నీటఁ దేల
నెఱి దప్పి వ్రాలిన నీలమేఘమువోలెఁ
గచభారబర్హ మగ్గలము పీడఁ
దొరఁగి చాలఁ జలించు తొండంపుఁగవవోలె
నూరురంభా స్తంభయుగము వడఁకఁ

తే. గడఁక లేనితనూవల్లి ఘర్మజలము
దళముగాఁ జిందఁ జెందనితాల్మితోడ
వగపుచిత్తరువో కళవళముకరువొ
యనఁగ నొకకాంత గానంగనయ్యె నంత. 178

వ. ఇవ్విధంబున నవ్వామలోచన వసుదేవనందను ముందటనిలిచి, 179

క అమరారి చెవులముందఱఁ
గొమరారి వెలుంగు నమృతకుండలముల న
త్తిమిరారిద్వయ మన నె
త్తి మురారికిఁ జూపి యపుడు దెలియఁగఁ బలికెన్. 180

ఉ. ఏను వసుంధరన్ యదుకులేశ దయాకర సూకరాకృతిం
బూనిననాఁడు నీవు ననుఁ బొందినఁ బుట్టినవాఁడు వీఁడు నీ
చే నపరాద్ధుఁ డైన మఱి చెప్పెడి దెవ్వరికింకఁ గింక లో
నూనఁగ నీక కుండలము లొప్పఁగ నొప్పన గొమ్ము క్రమ్మఱన్. 181

గీ, అకట యిచ్చువవాఁడు దయ్యంబ కొన్న
వాఁడు దయ్యంబఁ దీనికి వగవ నేల ?
కాలపా[1]కంబు దప్పింపఁ గమలనాథ !
నాదు దుఃఖ ప్రలాపంబునకుఁ దరంబె. 182

క. తనయుని[2]కి పదిలముగ నా
తనయునికిం గలుగ దితనితనయునికై నన్

1. శంబు దప్పదు—నకుఁదలంచి. 2. కిం బదిలము.

వనజోదర యాదరమునఁ
గనుఁగొని ప్రాగ్జ్యోతిషంబు గరుణింపఁదగున్. 183

మ. దివిజుల్ దల్లడిలం దదీయజనయిత్రీకుండలద్వంద్వముం
జెవులం బెట్టికొనంగ రూపగుట సూచెం గాని యాతప్పు నీ
చెవులం బెట్టికొనంగరాని రిపు గాసిం బెట్టి కట్టిండి వా
సవుఁ డెట్టుం దనుఁ జంపజాలు టితఁ డెంచం జూడఁ డింద్రానుజా. 184

గీ. శత్రులకుఁ బుత్త్రులకు నొక్క సందమగుట
పెద్దలకు మంచి గుణమని పేరుకొనఁగ
సకలదానవసంఘంబుఁ జంపినట్లు
కొడుకుఁ జంపితి మునికోటికోర్కి దీర్ప. 185

క. అట్టేల జగము లన్నియుఁ
బుట్టింపం బెంపఁ బురుషులు మువురై
పుట్టిన వేలుపవఁట నా
పట్టియెడం దగునె నడిమిపని మానుటకున్. 186

గీ. కన్న మోహంబు విడువదు గాన యేనును
వగపుమై నెంతదూరిన వనజనాథ!
నెలవు లే దింక గజతలసేతుబంధ
నంబు చేసిన నాదట నవ్వుఁబాటు. 187

వ. అనిన విశ్వంభరుండు దేవీ నరకాసురునకు వగవం బనిలేదు వాడు సురముని వర్గంబునకు నెగ్గు చేసెం గావున వధియింపవలసె దుష్టశిక్షణంబును శిష్టరక్షణంబు నుం జేయ నవతరించిన నాకుం బుత్త్రమిత్త్రాదు లని చూచుట ధర్మంబుగా దీయర్థంబు నీవెఱింగి నదియ యదియునుంగాక కాలంబు గడవ నెవ్వరికి నశక్యం బని యూఱడిలం బలికి నరకాసురతనయుండగు భగదత్తునకుం బ్రాగ్జ్యోతిషం బొసంగి వసుంధరాకాంత వీడ్కొని నిజపురంబున కభిముఖుండై చనుదెంచు నప్పుడు వైనతేయుండు నభోమండలమున మురళి భంజళి కాసుడాల వల్గితంబు

లనుగతి విశేషంబుల రా నమందానందంబున రైవతక సమీపంబునకు వచ్చుటయు హరిరాక యెఱింగి బలభద్ర సాత్యకి ప్రముఖ సోదరులు ప్రద్యుమ్న సాంబానిరుద్ధాది పుత్త్రి పౌత్త్రివర్గంబును యదువృష్ణిభోజాంధ కానీకంబునుం జతురంగబలసమేదితంబుగా నెదుర్కొ_నుటయుం బరస్పరవాహనావతరణంబులు చేయునెడం గృష్ణుండు బలభద్రునకు నమస్కరించి గాఢాలింగనమ్ముఁ జేసి తనకు మ్రొక్కిన సాత్యకి ప్రద్యుమ్నసాంబానిరుద్ధాదుల దీవించి యదు వృష్ణి భోజాంధక వర్గంబులం దగు తెఱంగుల నాదరించి బలభద్రాదులు నిజవాహనంబు లెక్కం దానును గరుడాధిరోహణంబు చేసి వందిమాగధ సందోహస్తుతిరవంబులును వేణువీణా గానంబులును భేరీమృదంగాదినిస్స్వనంబులును రోదోంతరాళంబు నిండ నిండు వేడుకతోఁ బుర ప్రవేశంబు చేయునెడం బుంద్రశాలికల బాలికలు సేసలు చల్లంజామరానిలంబులు మార్గశ్రాంతి నపనయింప రాజమార్గంబు దఱిసి నిజమందిరతోరణంబున సువర్ణావతరణంబు చేసి సకలజనంబుల నిజనివాసంబులకు ననిచి సత్యాసహితంబుగా నంతఃపురంబునకుం జని సముచితవ్యాపారంబుల సుఖంబుండెననుటయు విని యభిమన్యు పౌత్త్రుండు సంతోషపులకితగాత్రుండై మునీంద్రా తరువాతి వృత్తాంతం బెఱింగింపు మనుటయు. 188

శా. [1]పారావారనగాధిరాజతనయాపాంగేక్షణోదంచిత
శ్రీరాజత్పుల కావళీవరతనుప్రీతిప్రకాశాంతరా
కారుణ్యామృతవర్షి భాషణవిధా కళ్యాణరత్నాకరా
దూరీభూతతరాంతరాయనివహా దుష్టాత్మశిక్షాపరా. 189

క. [2]చక్రపరశ్వథయుతదో
ర్విక్రమజితదానవేంద్ర వివిధవినోదా
పక్రాంతహృదయ భావ్యా
శక్రప్రముఖామరౌఘ సతతనిషేవ్యా. 190

1. ఈ పద్యము పంచమాశ్వాసాంతమందు నున్నది.
2. ఈ పద్యము చతుర్థాశ్వాసాంతమందున్నది.

[1]మాలిని.

జలధిగిరి నివాసా చంచదుద్యద్వికాసా
విలసితదరహాసా వృత్తసచ్చిద్విలాసా
ప్రళయబహుళరూపా పండితాంతఃప్రదీపా
దళితవివిధపాపా దైత్యసంహారికోపా. 191

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్ర బుధారాధానవిరాజితిక్కనసోమయాజీ ప్రణీతంబైన శ్రీమహాభారతకథానంతరంబున శ్రీమత్సకలభాషాభూషణసాహిత్య రసపోషణసంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథ ప్రణీతంబైన యుత్తరహరివంశంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

1. ఈ మాలిని చతుర్థాశ్వాసాంతమందున్నది.

వ్రాత ప్రతులలోఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము గాకుండుటచే శ్రీ కం. వీ. గారో మఱెవరో వచనమునుఁ గ్రొత్తగా రచించియు, ౨, ౬ ఆశ్వాసముల నుండి యాయాశ్వాసాంత పద్యములఁ గయికొనియు సంపూర్ణపఱిచియుందురు.

శ్రీరస్తు

# ఉత్తరహరివంశము

## ద్వితీయాశ్వాసము

శ్రీ పార్వతీకుచాగ్రా
రోపితముక్తేందు కాంతరోచిర్నిచితా
కూపార శైలహరణ
[1]ప్రాపితమణిరుచిసనాథ హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

మ. శరతల్పంబున నున్న శాంతనవునా[2]జ్ఞం దత్పరుండై యుధి
ష్ఠిరుతో నర్జునుఁడిట్లనున్ హరిఁ బ్రశంసింపంగ[2]రారే మునీ
శ్వరులున్ ద్వారక కేనుబోయితిఁ గదా సంబంధులం జూడనాఁ
డరుదాదేవునియందుఁగంటి నొకకృత్యం బెవ్వరుంజేయరున్. 3

క. ఆ పట్టణమున నుచిత
వ్యాపారతఁ గుకుర వృష్ణి యదు భోజ సమా
జాసాదితపూజుఁడ నై
యాపురుషోత్తమునిఁ గొలిచి యే నున్నయెడన్. 4

### శ్రీకృష్ణునియొద్ద కొక బ్రాహ్మణుఁడు వచ్చి తన కుమారుల రక్షింప వేడుట

క. ఒకనాఁ డొకశాస్త్రములో
నొకక్రతు వొకనాఁటిదీక్ష కొనరినఁగని ధా
ర్మికు డాహరి యది గైకొని
యొకచో నుండంగ విప్రుఁ డొకఁ డేతెంచెన్. 5

---

1. వ్యాపారణరుచి. 2. జ్ఞాత, 3. లే.

చ. అకట కుమారులార కడుపార మిముం గని పొఱవైచు త
ల్లికి నటు సూనుతండ్రికి బలే తొలుబామునలేవునోములా
రక ననుఁ గన్నుఁబ్రామి విధిరత్నపుబొమ్మల నాఁచికొన్ననా
మొకమున వ్రేలుచున్న యవిముప్పిరమూర్తులునంచునార్తుఁడై. 6

క. వెద పీడెదుదోవతియును
బెదతలచేతులు వడంకుపెదవులు తూఁగా
దెడువెండ్రుకలును బైపై
వెదలెదడు కన్నీరుఁ గలుగు వేషముతోడన్. 7

క. ముందట నిలిచి, మురాంతక,
మందరధర, భక్తలోకమందార, దయా
కంధళితహృదయ, సురముని
వందిత పాదారవింద, వసుదేవ సుతా ! 8

గీ. దేవ దేవ, రక్షింపవె దివ్యమూర్తి !
యనుచుఁ బలుకునవ్విప్రుని యార్తభంగి
చూచు[1]మురవైరి శోకంబుఁ జూడలేక
వెడలె నాకును గన్నీరు వేయు నేల. 9

వ. అట్టియెడ దేవదేవుం డమ్మహిదేవున కిట్లనియె. 10

క. ఏలయ్య భూసురోత్తమ
దూలెదు ? నీయట్టివారు దుఃఖాంబుధిలోఁ
దేలుదురే మముబోంట్లకుఁ
దాలిమి లేకున్నఁ దెలుపఁ దగువారయ్యన్. 11

క. మేలుం గీడును వచ్చుం
గాలముతో రెంటిచేతఁ గలఁగరు ధీరుల్
తేలుచు మునుఁగుచు నితరులు
జాలిం బడుదురు వివేకసంగతి లేమిన్. 12

వ. అనుటయు న వ్వాసుదేవునకు భూసురోత్తముం డిట్లనియె. 13

1. నవ్వుడు మురవైరి చూడ్కి కేల

క. ఓ పురుషోత్తమ! యెట్లు ప్ర
లాపింపక యుండుదుం జలంబున విధి నా
పాపల మువ్వురఁ దోడ్తోఁ
జూపోపక చంపెఁ దత్ప్రసూతి దినములన్. 14

మ. అవి యెల్లం గడచన్న నేఁడు దుదగా నస్మత్కళత్రంబు గౌ
రవమున్ మోదము ఖేదమున్ బెరయఁగర్భంబిమ్ములందాల్చినన్
నవమాసంబులు నిండె గుండెవగిలెన్ నాకంతలోఁ గొంత లో
కవినోదంబుల కీఫలంబు చవి[1]దక్కం జేసి రక్షింపవే. 15

సీ. తడి యొత్తు చీరతో దాది కౌఁగిటఁ జేర్చి
చూపంగఁ గన్నారఁ జూడ నైతిఁ
దడవి యారకమున్న తట్టాడు మని పట్టి
వడఁకంగ సెజ్జపై వ్రాల్ప నైతి
నల్లంతదవ్వుల నప్పలప్ప లనంగ
నెదురుగాఁ బఱతేర నెత్త నైతి
వియ్యాలచే నిచ్చి వేడుక నను వారు
తిట్టింప విని దప్పి దేర నైతి

తే. నకట మిథ్యామనోరథుం డైతిఁ గాని
కొడుకులం గని దమవారు గొండ సేయ
నుండ లేదయ్యె సంపద లుబ్బె నేని
లేబరమ కాదె బిడ్డలు లేని బ్రతుకు. 16

క. ఈ గర్భము రక్షించిన
నా గౌరవ మేమిఁ జెరక నారాయణ! నా
నా గుణ సంపన్నులలో
సాఁగుదు నటు గాక యున్న సమయుదు వగలన్. 17

చ. అనుడు నొకింత లేఁతనగ వానన పద్మము గారవింప మ
న్ననఁ గృప సేయు నేఁడొకదినంబును దీక్షితుఁడైన నాకు; రా

1. దాఁకం.

ననువగు నెల్లి భూసురకులాగ్రణి ! యిన్ని విధంబులందు నీ
తనయునిఁ గాతు, నన్న హరి దప్పక చూచియతండు దీనుఁడై. 18

ఉ. నేఁడు ప్రసూతికాలమున నీవు గదాధర ! మద్గృహంబునన్
వాఁడిమితోడ నుండి జమువాకిలి గట్టి మదీయ సంతతిం
బోఁడిమితోడఁ గాచి ననుఁబుణ్యునిఁ జేసినఁగాక యింతలో
మాఁడిన నేమి చేసెదవు మంత్రపునీటులు సల్లవచ్చునే. 19

అర్జునుఁడు విప్రార్భకరక్షణార్థము తా నరుగఁ గోరుట

క. అనవుడు నెద జింతిల్లిన
వనజాక్షునితెఱఁ గెఱింగి వసుధామురు ప్రా
ర్థన దీర్ప నన్నుఁ బనుపుము
పనివినియెద నంటి లావుఁ బంతము మెఱయన్. 20

మ. విని విశ్వంభరుఁ డల్ల నవ్వి కరుణావిర్భూత చేతస్కుఁడై
ననుఁ బ్రీతిం గడగంటఁ జూచి విజయా! నాచేత[1]నెబ్బంగి నే
పని యైనం గడతేఱుఁగాని యిది నీ పంతంబులం దీఱునే
యనినన్ మో మరవాంచితిన్ వినయలజ్జాయత్తచిత్తుండనై. 21

మ. ధరణీదేవుని దైన్యమున్ నిజ మనోధర్మ క్రియా నిష్ఠయున్,
విర[2]సోల్లాసమదాననావనతియున్వీక్షించి పద్మాక్షుఁడు
ద్ధురతం దోడ్కొనిపొమ్ము రాముఁడునుఁ బ్రద్యుమ్నుండుఁ దక్కంబురం
దరపుత్రా! మన వీటిలోనఁ గలయోధవ్రాతమున్ నావుడున్. 22

మ. యదువృష్ణ్యంధకభోజసైన్యములతో నభ్రంకషారావభి
న్నదిగంతద్వీపమండలుండ నయి కృష్ణశ్రీపదాంభోజముల్
మదిలో నిల్పి మహీసురావసథరమ్యాగ్రామమధ్యంబునం
బదిలుండై తిఁ బ్రసూతి వేళ యమునిం బ్రత్యర్థిఁగాఁ జూచుచున్. 23

క. ఎఱపంజ దాసనంబుల
తెఱఁగయ్యెను, గూబ లెల్ల దెసలఁ జెలంగెన్,

1.నీచేతనే, 2.శో.

వఱదు లఱచె, నుల్కలు వడె,
నెఱి చెడి సురగాలి విసరె నిలువక పెలుచన్ 24

గీ. అట్టియెడ సైన్య మెల్లఁ గట్టాయితంబు
చేసి [1]యేనును గాండీవశింజినీని
నాద మేదుర భూనభోంతరుఁడ నగుచు
[2]నమ్మహీదేవుని గృహాంగణమ్మునందు, 25

ఉ. ఉండునెడన్ భయంబున మహోద్ధతిఁ గొందఱు వచ్చిపట్టుప
ట్టుం డిట తెండు పొండనికడున్ రభసంబున నాడుమాటలుం
బండియుఁ బొల్ల వోయెనని బ్రాహ్మణిలోపల నేడ్పు నేడ్చునాం
డొంద కడంగి తచ్చిశువు నుద్భవమున్ మరణంబు దెల్పినన్. 26

స్రగ్ధర. గాండీవారావఘుం పాఘటితభయదివౌకః పురాంతః పురం ద్రీ
గండాభోగ శ్రమాంభః కణకలుషితగంగాతరంగాభిషంగా
ఖండాస్మత్కాండ పాళిక బళితసకలాకాశసీమానిశాంతో
ద్దండాతిక్రాంతగర్వాంతకయమభట సంతానముంగానసైతిన్. 27

గీ. పోయె బాలుండు యదువృష్టిభోజబలముఁ
జిన్న వోయెను జూడ వచ్చినజనంబు
డించి పోయె మదీయగాండివము లజ్జ
వోయెఁ గొనిపోయె[3] భూసురపుత్రు జముఁడు. 28

వ, ఇవ్విధంబున గాండివమ్ములావు వమ్మయినం గ్రమ్మనుమ్మలికంబున విన్న
నైన నన్నుం జూచి యవ్విప్రుండు. 29

నిజకుమారుని యముఁ డపహరింపఁగా బ్రాహ్మణుఁ డర్జునుని దూఱుట

క. ఓపార్థ ! నిను నమ్మితిఁ
బాపని రక్షింప కిట్ల పార్థుఁడ వైతే
నాపాలిపారిజాతము
గోపాలక చక్రవర్తిఁ గొని రానైతిన్. 30

---

1. యేనుగాండివము శింజినినినాద, భరితబధరితభూ. 2. కఱఁగి ధరణీసురునిగృహాం గణమువందు, 3. ఁగడసారెలోయె, శవము

చ. పిలిచితి నన్న నిన్ను నతిభీతుఁడ విప్రుఁడ నమ్మినాఁడ నీ
పలు కనృతంబుగాఁదగునె పాఱెడుబండ్లకుఁ గాళ్లసాఁపఁగా
నలవడు నన్న పోటుమగఁడై యిటు చేసితిగాక యాసతో
నిలుతు మురారి నన్నచట నీఫలముంచినఁ బాలముంచినన్. 31

క. మేలై ననుఁ గీడైనను
నాలవపా [1]లాఫలము ధనంజయ రక్షా
శీలునకుఁ జేరు నీ పీ
బాలుని రక్షింప [2]వట్టిఫల మందఁదగున్. 32

క. నీ వేమి సేయు దీగాం
డీవము నీ కిచ్చి [3]యమ్ము దెప్పర మైనన్
లావు గల దంచుఁ బలికిన
[4]పావకుచేఁగాదె కోలుపడితిఁ గుమారున్. 33

గీ. అనుచు ననుదారియై విప్రుఁ డరుగుదేరఁ
దేర గాండివ మిడి యస్మదీయమహిమ
మహి మడుంగ మడుంగ గుమనసు మాయ
మాయ గన్నులఁ గ్రమ్మఁ గ్రమ్మఱితి నేను. 34

క. ఈరూపున బొలివోయిన
బీరముతో వృష్ణిభోజవిభు లేతేరన్
ద్వారవతి కరిగి నిలిచితి
నారాయణు నెదుర ఖేదన మ్రముఖుఁడ నై. 35

విప్రకుమారుల నుజ్జీవింపఁజేయుటకై కృష్ణుఁడు పార్థసహితముగాఁ బోవుట

సీ. అట్లున్న నన్ను నొయ్యన గారవించి యా
భూసురోత్తముఁ జాల బుజ్జగించి
నీ కుమారకుల నేలోకంబునం దున్నఁ
దెత్తు: నీ కిం తేల ధృతి గలంగ ?

1. లరయఁగా. 2. నట్టిపల మందఁదగున్. 3. యితఁడు...గలఁడంచు: యిమ్మ
4. భావము.

ననుచుఁ బీతాంబరుం డనుపమాభరణుఁ డై
శార్ఙ్గ కౌమోదకీ చక్ర నంద
కాది ప్రహరణంబు లరదంబుపై బెట్టి
దర్వీకరాహితధ్వజము మెఱయ

తే. దారకుని డించి సారథిత్వంబు నాకు
నొసఁగి భూసురసహితుఁ డై యొప్పుమెఱసె
గృతవలాహకసైన్యసుగ్రీవ మేఘ
పుష్పసన్నాహ మగురథంబున మురారి. 36

వ. ఇవ్విధంబున వసుదేవనందనుండును నేమును రథగమనోచితం బగు పథంబున వితతమనోరథులమై వెడలి మద ముదిత మాధవ మహిళా మంజు శింజాన మంజరీ కోలాహల హళహళిత హంస సందోహ సం దిహ్యమాన కుముదదళాళింద కళింగనందనీ సందర్శనంబువలనను లాటీవధూటీ కటకనికట విషంకట తట నట త్సారస సంచయ చంచుపుట విపాటిత కమల ముకుళపుట కుటీర పటీయః కేసర కదంగరీయ భ్రమర విభ్రమ భ్రమణ భాసుర భాగీరథీవిలోకనంబువలనను మనంబు రంజిల్ల మచల్లకంబు మట్టి మ్లేచ్ఛంబు మెట్టిదరదంబు దాఁటి కాశ్మీరంబు గడచి సైంధవం బనుసంధించి నారదంబు పరిభ్రమించి హిమాచలం బెక్కి హేమకూటంబు ద్రొక్కి నిషధం బతిక్రమించి నిమిషంబున. 37

చ. కదిసితి మంత దంతపరిఘద్విపఖండిత దేవదారువున్
మదనవినోదకందళిత మానసమానసవాసభీరువుం
బ్రదరపదాచ్యుత క్రకసాటితలస్తక దేశ చారువున్
ముదిత చమూరువున్ ఫలితమూలన మేరువు నాసు మేరువున్. 38

గీ. కడచి వర్షాచలంబునుం గడచి మఱియు
నెడ నెడం గలవిపినంబు లేఱు లద్రు
లన్నియును దాఁటి కంటి ముద్యత్తరంగ
నాకడోలాకరంబు రత్నాకరంబు. 39

గీ. అతఁడు నెదురుగ వచ్చి మురాంతకునకు
నర్ఘ్య మిచ్చి లోకేశ నా కానతిమ్ము

చేయఁ గల కార్య మనుటయు సింధురాజ
తెరువు [1]విడు నాకు నుత్తరదిశకు ననిన. 40

ఉ. నావుడుఁ గంసవైరికిఁ బ్రణామముచేసి పయోధియిట్లనున్
దేవ భవన్నియోగమునఁ దేఁకువదప్ప దొకండు నాపయిం
బోవఁగ లేఁడు కాల్నడ విభుండవు నీవు చనంగ నంతయుం
ద్రోవ యగున్ సమాశ్రితుఁడు దూలిన నెవ్వగనీకుఁ బుట్టదే. 41

గీ. అనుడు విప్రార్థమై నాకు నరుగవలసి
త్రోవ వేఁడితి మఱి నిన్ను దేవతలకుఁ
దేఱి చూడంగ రా దన్నఁ దెలిసి జలధి
రథము చనునంత శోషింతు బథము గొనుము. 42

చ. అనుడు మురారి యిట్లను మహాంబునిధీ ! తగదింక నింక నీ
కనితరగమ్యధైర్యము ననర్ఘమణి ప్రకరంబు నెవ్వరుం
గనుఁగొన నేల నేల నొడికంబుగ నేఁగినమాడ్కి నాహరుల్
చనియెడు నంబుపూరము శిలాసదృశంబుగఁ జేయు నావుడున్. 43

క. అపారావారము జా
రూ పై రథ మరుగునంత త్రోవ విడిచినన్
వే పఱపితిఁ దురగములఁగ
శాపాండిత్యంబు హరితలంపున కెక్కన్. 44

వ. ఇత్తెఱంగున నుత్తరసాగరం బుత్తరించి చిత్తం బలర గంధ మాద నంబు
సేరి. 45

గీ. వచ్చు నెడ జయంతం వన వైజయంత
మనఁగ నీలంబు నా రజతాచలంబ
నఁగ మహామేరుకైలాసనగము లనఁగ
నింద్రకూటంబు నా వచ్చె నేడుగిరులు. 46

గీ. వివిధవర్ణ రత్న ప్రభావితతి మెఱయఁ
దమ్ము బనిపంచు మనిన మాధవుఁడు భూధ

1. విడుము నా కుత్తర దిక్కు కనియె.

రములఁ గృపఁ జూచి మీయందు రథము నడవఁ
దెలిపి యిం డన్న ననియు న త్తెరఁగు చేసె. 48

క. అంతట నేడునగంబులు
నంతర్ధానంబు చేసి యట చనఁగా న
త్యంతభయంకరకర్దమ
సంతమసంబున రథంబు సాఁగక నిలిచెన్. 48

మ. మఱియుం జీకఁటికొండ చందమయినన్ మాకెల్లఁ బాతాళము
న్దఱియంజొచ్చు తెఱంగుదోఁచెనచటనే దైత్యాంతకుండుద్ధతి
న్నఱకెం ద త్తిమిరంబు నంబుధములోనం దోఁచువం ళోళిద
²గ్గఱుచుట్టం బన విక్రమక్రమణ చక్రక్రీడ శోభిల్లఁగన్. 49

శా. ఆకాశంబు వెలుంగఁ దోఁచె నడ పో నత్యద్భుతాకారుఁడై
రాకాచంద్రదివాకరానలశిఖారత్న ప్రభాజాలరే
ఖాకాంతింబురుషం డొకం డచట లోకం బెల్ల నిండించినన్
మాకన్నుంగవ లిట్టిరూప మని నమ్మ జాలవయ్యెన్నృపా. 50

క. నను నవ్విప్రుని నచ్చో
నునిచి జగన్నాథుఁ డఖిల యోగనిధి జనా
ర్దనుఁ డా తేజములో³నం
జనఁ జొచ్చెన్మగుడఁ దెచ్చెఁ జచ్చినసుతులన్. 51

కృష్ణుఁడు విప్రకుమారులఁ దెచ్చి యిచ్చి ద్వారకకు వచ్చుట

తే. ఎవ్వఁ డేయేఁట బుట్టి నయ్యేటి⁴వయసు
సుతుల మువ్వుర నాఁడు గన్న తనిఁ గూర్చి
యిచ్చె నలువుర సుతుల మహీసురునకు
వచ్చితిమి క్షణంబున ద్వారవతికి నేము. 52

మ. దివసార్ధంబునఁ జోయి వచ్చుట ధరిత్రీనాథ చిత్రంబు భ
క్తవిధేయుం డగు దేవ దేవుని ప్రసాదం బెట్టిదో యేము బాం

1. చేసే నట (ఉ-హరి—4) 2. గ్గఱుచందంబున, 4. ఁజొచ్చెన్ దెచ్చెన్ జచ్చినట్టి శిశువుల 3. ప్రాయమైన.

ధవులం గ్రమ్మఁ జూడఁగంటిమి ప్రమోదంబార నద్దేవుఁడున్
వివిధార్థంబులతోడ వీడుకొలిపె న్విప్రుం గృతాహారునిన్. 53

ఆ. బంధుభోజనంబు భాస్కరపూజయుఁ
బొందుపడఁగ నేనుఁ బొత్తుగలియఁ
గెలన వృష్ణి సాత్యకులుఁ బంతి గుడువంగ
యదుకులాబ్ధి చంద్రుఁ డారగించె. 54

వ. తదనంతరంబ సభామండపంబున నుచితకథావినోదంబులు సలుపుచున్న
యన్నారాయణునకుం బ్రణమిల్లి మెల్లన యిట్లంటి. 55

తే. సాగరము నీరు పేరుట శైలకులము
తెరువు లిచ్చుట చీఁకటి నరకువడుట
దివ్యతేజంబు దోఁచు టద్భుతస్థితి నీవు
నొచ్చుట కుమారులం గొని వచ్చు టేమి ? 56

క. అతిదూరమైనమార్గము
కతిపయపదగమ్యమైనకతముఁ దెలియ నా
నతి యీవే యనుడును స
న్మతిఁ గైకొని దాన వారి నా కిట్లనియన్. 57

సీ. అపుడు తేజోమయం బైనరూపంబు మ
త్ప్రకృతి యందుఁ జరాచరంబు దోఁచు
మదుఁగు నప్పురుషుండు మద్దర్శనకుతూహ
లముగ నవ్విప్రబాలకుల మ్రింగె
వారు కారణముగా వత్తు నే నని యంధ
తమసంబు నేన భేదకుఁడ నేన
యచలంబు లేన రంధ్రాపాది నేన సా
గర మేన సంస్తంభకారి నేన

తే. పంచభూతాత్మకంబు ప్రపంచ మిందుఁ
గలిగినది లేనియది లేదు కల దనంగ
నున్నయదియె సర్వంబును నుచితగమ్య
మిది రహస్యంబు దెలిపితి నెరఁగు పార్థ ! 58

తే. అక్షరత్రయరూపమై యఖిల యోగ
మూల మగుప్రణవంబు నా మూర్తి సుమ్ము
నీకుఁ జెప్పితి, నత్యంతనియతమతికిఁ
దప్ప నీ మంత్ర మొరులకుఁ దగదు తెలుప. 59

చ. అని పరమోపదేశముగ నానతి యిచ్చినయంతనుండియు
న్వనజదళాక్షు భక్త జనవత్సలు [1]వేదశిఖావతంసపా
వనపదపల్లవుం త్రిదశవల్లభ సేవితు నాశ్రయింతు నా
మనమున ఘోరదుర్దశలు మట్టిన సంపద మిన్ను ముట్టినన్. 60

క. అన విని ధర్మతనూజుఁడు
జనపతులును గృష్ణుఁ జిత్తసరసిరుహములం
దుటిచి పులకాంకురమ్ములు
మొనయఁగ నానందబాష్పములు వెడలంగన్. 61

క. అని చెప్పిన వైశంపా
యనునకు జనమేజయుఁడు ప్రియం బారఁగ ని
ట్లను మురవైరి పరాక్రమ
మనఘా విన వలతుఁ జెప్పుమా పరిపాటిన్. 62

వ. అనుటయు వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 63

సీ. మడియించె వక్రాఖ్యు మాహిష్మతీనాథు
నరకాసురునిఁ జంపె నాకవిభుని
దట్టించి పారిజాతము దెచ్చె లోహిత
హ్రదమున వరుణు [2]నూటార్చె నూఱు
చెట్లు సైరించి శిశుపాలు నరకె శో
ణితపురంబున నగ్ని నీలలోహి
తుని గెల్చె బాణునిఁ దోలె వార్ధిఁ గలంచి
పాంచజన్యంబు చేపట్టి రూప

1. దేవా 2. నొ°

తే. [1]దంచె నా జరాసంధుఁ బాండవుల మనిచె
గాండివం బిచ్చె నరునకు ఖాండవమునఁ
దల విఱిచెఁ గలయవను మైందద్వివిదుల
ను బ్బడఁచె జాంబవంతునియుక్కు మడఁచె. 64

శా. చేసెన్ దౌత్యముయాదవాన్వయము రక్షించెం గురుక్షోణి నా
థా ! సాందీపుని పుత్త్రునిన్ జనకుఁ జైతన్యంబు బొందించెఁగా
దే సాల్వుం బడవైచె సౌంభకముతో దేశాధిపోదగ్రులన్
గాసిం బెట్టె విశాపుఁ జేసె నృగునిం గంసారి సామాన్యుఁడే. 65

వ. అనుటయు జనమేజయుండు. 66

క. ఎన్ని తెఱంగుల ముందఱ
విన్నను మురవైరి మహిమ విన నింపగు నా
వెన్నుఁడు గైలాసమునకుఁ
జన్న తెఱఁగు శివునిఁ గన్న చందముఁ జెపుమా. 67

మ. పరి వాదాస్పద వాదమోదమదిరాపానంబుచే మత్తులై
హరి మేలంచు హరుండు మే లనుచు నాహా కొంద ఱీ పొందెఱుం,
గరు కైలాసనగంబునందు మును లేకత్వంబు భావించి రా
మురవైరిం బురవైరిఁ బాపుట మహామోహంబు ద్రోహంబగున్. 68

క పదునాలుగు లోకంబు లుఁ
బొదలింపం ద్రుంపవలసి పొదవులు రెండై
తుదిఁ దా రొక్కటి యగుదురు
వదరలఁ జేయుదురు భేదవాదులనెల్లన్.

తే. పుండరీకాక్షునకు శూలి పూజలిచ్చె
సంయములు చూడ బదరికాశ్రమమునందు
వాఁగ విందు మయ్యిరువుర నాటకంబుఁ
జెప్పి చెవులకుఁ బండువు సేయు మనఘ ! 70

1. దఁచె జరాసంధు మనిచెఁ బాండవల నేర్చె, ఖాండవం బిచె [illegible] గాండివంబు

వ. అనుటయు వైశంపాయనుండా జనమేజయున కిట్లను జనార్దనుండు రజతాచలంబునకు నరుగుటయు నద్దేవుండు నిశ్చల తపశ్చరణంబుల నుండుటయు నవ్విభుని దివ్య ముని గంధర్వ దేవతానివహంబు చూడ వచ్చుటయునచ్చట హరుండా నారాయణునకు వరం బిచ్చుటయు నయ్యిరువుర యేకత్వంబు సకల లోకంబులుఁ దెలియుటయుం దెలియం జెప్పెద నాకర్ణింపుము. 71

శా. కంసారాతి మురామరారినరక క్రవ్యాదముఖ్యాసుర
ధ్వంసాపాదనవీతకంటక వతిన్ ద్వారావతిన్ రుక్మిణీ
హంసీహారమృణాలహారిభుజమధ్యస్ఫారకాసారుఁడై
సంసారార్ణవసార మన్మథసుధాసారంబునం దేలఁగన్. 72

సీ. యమునాతరంగడోలాధిరోహణమున
[1]డంబుమీఱెడుమరాళంబువోలె
హరినీలమణి మనోహరమందిర స్తంభ
ముల వినోదించు కీల్బొమ్మవోలె
దళితనీలోత్పలదళదామసంగతిఁ
గొమరారుసంపంగిగుత్తి వోలె
దరుణతమాల పాదపశిఖాశాఖలఁ
జెలువారువల రాచచిలుక వోలెఁ

తే. బారిజాత గోవర్ధనోత్పాటనమున
బలిమితోడ నైన మురవైరిబాహుయుగము
తెప్పగా మన్మథాంబుధిఁ దేలుచుండె
రమ్యగుణమణి రుక్మిణీరమణి ప్రీతి.

## రుక్మిణీదేవి తనకుసుపుత్త్రి నను్రగహింపుమని శ్రీకృష్ణుని వేఁడుట

శా. ఆరామాతిలకంబు మన్మథవినోదైకాంతగేహంబులో
గారామై యొకనాఁడు లేనగవు శృంగారంబుగాఁ గన్నులం
బారం బేదనిలజ్జ దోఁప హరికిం బాదప్రణామక్రియా
ప్రారంభం బగుభక్తిఁ గుట్మలితహస్తాంభోజయై యిట్లనున్. 74

1. దళుకొత్తుపసిఁడి నెత్తమ్మివోలె.

గీ. అఖిలలోకైకనాథ ! నీయట్టిరూప
విక్రమౌదార్య శౌర్యవివేకనిలయు
నొకకుమారుని దయచేసి యుర్విలోనఁ
గడుపు చల్లని కాంతలఁ గలుపునన్ను 75

వ. ఈవరంబు నా కీవై తేని 76

క. మును రుక్మిణి తన్నడిగిన
దనుజాంతకుఁ దేవరంబుఁ దప్పక యిచ్చెం
దనయుని నడిగిన నీఁడని
జను లాడఁగఁ జెవులు నేఁడు సంకటపడవే. 77

క. కాచికొని కొడుకు నడిగెనఁ
[1]చే చనవున నాలు మగఁడ[2]ఁచే వర మిచ్చెం
జూచెద మను సవతుల చే
నీ చులకఁదనంబు చేరనీకుము కృష్ణా ! 78

చ. అనిన మురాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింప నో
వనజదళాక్షి ! నీకుఁదగవా ? యిటు లాడుట నన్ను నీవె వేఁ
డిన నటు చేయకుండుట ఘటిల్లునే చేసిన నెవ్వరైన మె
చ్చనిపనియేను జేయుదును సంతసమందుముకోర్కిదీర్చెదన్. 79

క. తన వలచు కాంత యేపని
మనమునఁ దలఁచినన జేయుమగవానికి న
వ్వనిత బిగియారుకౌఁగిలి
దినదినమును మదనకామధేనువు గాదే 80

క. పుత్త్రులకలిమియె శుద్ధక
ళత్రమునకు లక్షణంబు లక్షణవతులై
పుత్త్రవిహీనతఁ బొరసినఁ
బాత్రములే సతులు పతులు పాటించుటకున్. 81

1. టో. 2. పో

క మానిని వినవే 'పున్నా
మ్నో నరకా త్త్రాయతే' యనుట పుత్త్రార్థం
బై నది నీ కోరిక నా
మానస మలరించె వేదమార్గోచితమై. 83

వ. అని పలుకుచు నాలీలావతివిలోచనంబులం బొరయు లజ్జా వినయదర హాసంబులకుం దనమేలంబునుం గరుణయు సమేళంబున నెదుర్కొన నారాత్రి వర లాభంబున బ్రభావిభాసిత యగునద్దేవితో వినోదించి.

మ. మఱునాఁ డంధక భోజ వృష్ణి యదు సామంతాగ్రణీసేన గం
దెఱగా సాత్యకి రాముఁ డుద్ధవుఁడు హార్దిక్యుండు లోనైన కొం
ద ఱమాత్యుల్ దనుజుట్టిరా సమరె నాస్థానంబునం గృష్ణుఁడా
కఱకంఠుండు పరీతపారిషదరేఖం [1]జూచుచందంబునన్. 85

క. అప్పరమపురుషుఁ డందఱ
దప్పక కనుఁగొని ప్రసాదదరహాసములన్
ముప్పిరిగొను భాషణముల
నప్పటి కప్పటికి వేడ్క లలర నిటు లనున్. 85

మ. శిశుతాకేళిఁ దొడంగి గర్వితులఁ గేశిం గంసు జాణూరునిన్
శిశుపాలున్ నరకాదులం బరువడిం జెండాడి సప్తార్ణవీ
రశనారాజవిరాజితక్షితిసతీరత్న ప్రభామాలికా
విశదాత్మీయగుణోల్లసన్నృపయశో విక్రాంతిఁ జెల్లించితిన్. 86

చ. పరఁగినవాఁడు నేఁడు ధరఁ బౌండ్రుఁడు రాజులయం దభంగుఁడై
నరకుఁడుఁ దాను మిత్త్రములు నాకును వానికి సాటిగాని యె
వ్వరికిఁ దరంబు గాదు యదువంశము మ్రింగుదునంచునుండు నీ
శ్వరుఁడు గణంబులం గలసివచ్చిన నంబుధి[2]లోనఁ జొచ్చినన్. 87

వ. ఇంతసెప్పుటకుఁ గతం బేమియనుతలంపు గలదేని (ంజెప్పెద) వినుండు 88

1. బూఁచు. 2. లోను సా.

శా. చూడం బోదు గజాపనీతకటఖర్జూభూర్జ ఖర్జూర లీ
లాడోలాసుఖలేఖలోకమహిళాలంకారహారక్షణ
క్రీడాతారకితాంతరాళ తరళ శ్రీకంఠకంఠ ప్రభా
చూడాచంద్రకళాకిలాసము సతీశుద్ధాంతకైలాసమున్. 89

ఆ. బదరికాశ్రమంబుఁ బావనమునిలబ్ధ
విశ్రమంబు నచట విమల యోగ
దీపికాప్రకాశతేజోమయాకారు
భుజగహారు హరుని భువనగురుని. 90

క. కనుఁగొని నాతలఁచినపని
యనువుపఱిచి మఱిచి యైన నలయక వేగం
బున వత్తు వచ్చునంతకు
మనపీ దేమఱక కాచు మత ముచిత మగున్. 91

సీ. కోట[1]సింగారించి కొత్తళంబుల నెల్ల
నట్టళ్లు వన్నించి యాళువరికిఁ
బందిళ్ళు వెట్టించి [2]పైకొమ్మ లెగయించి
గుండుదూలము వసికొయ్యఁ గూర్చి
యగడిత లీఁతసీ రలవడఁ ద్రవ్వించి
వెలిచుట్టిరా [3]ములు వెలుగు వెట్టి
డంచనంబులు దద్దడంబులు నెత్తించి
పలుగాఁడితలుపులు బలుపుచేసి

తే. బాళెము ల్వెట్టి క్రొంకులు బ్రద్దపరులుఁ
గత్తి గొంతంబు లొడిసెళ్లఁ గత్తళములు
నారసములును విండులు నగరిలోనఁ
బెట్టి పెట్టుఁడు నడు[4]హట్టి[5]మట్టిలావు 92

క. ఈకోటకు నొకదిక్కున
వాకిలి సారించి యానవాలుగఁ జారుల్

1. నిగ్గ. 2. పైకొమ్మ పెట్టించి. 3. వెదుర్వెలుగు 4. నెట్టి. 5. గట్టి

రాకలఁ బోకలఁ జక్రముఁ
జేకొని రక్షకులతోడఁ జెప్పి చనఁ దగున్.

మ. పురిచుట్టు న్నిచరుండు సారణుఁడు నీభోజాంధకు ల్గాడి క
త్తెరగాయంబుల గండముం[1]గిళుల సందిం గొమ్మకొమ్మ న్నిరం
తరమున్[2] సోదనదీవె లెత్తి చనుఁ డుత్తాలధ్వజాభీలగో
పుర భేరీరవభిన్నవైరి హృదయాపూర్ణంబుగా రాత్రులన్. 94

వ. అని పలికి సాత్యకిం గనుంగొని. 95

మ. శర కోదండ కృపాణ కంకట శిరస్త్రాణాంబులం బూని సం
గరసన్నాహవిహారి వై నగరరక్షాదక్షతం జూపు శా
ర్వరి నిద్రం బెడఁబాసి వాదనిగమవ్యాఖ్యానముల్మాని యె
వ్వరిచేత న్నగుఁబాటు దేక పరభావజ్ఞుండవై తమ్ముఁడా! 96

వ. అనుటయు సాత్యకి యిట్లనియె : 97

ఉ. దేవర యానతిచ్చినగతిం గృతకృత్యుఁడ నైతి పీటికిం
గావలి వెట్టి పౌండ్రవిభుకన్నులు గట్టి ప్రలంబవైరికిన్
సేవ యొనర్చి నీ కిచట సిద్ధఫలంబులు గోరి యుండెదన్
దేవత లైన నాకెదిరి ధీరత మైమయిఁ బోవ నేర్తురే. 98

వ. అనియె నట్టియెడ నమ్మహీధరధరుం డుద్ధవాచార్యున కిట్లనియె : 99

ఉ. తండ్రులు మీరు మీకు నయతత్త్వముఁ జెప్పెదమన్న మమ్మ నే
మంత్రు జనంబు, లూఅడు బృహస్పతి మీయెడ, నేను లేనిచో
వెంద్రుకయంతమోసమును వేచి దురంబున కెత్తి వచ్చు నా
పౌండ్రుఁడు వానిచేత మనబంధులు చిక్కకయుండఁ గావుఁడీ. 100

వ. అని పలికి హలాయుధుం గనుంగొని. 101

మ. గద చేతం గొని యున్న [4]ని న్నమర దిగ్దంతావళశ్రేణియుం
[5]గదియం జాలదు చాలదు స్తరము మత్కైలాసయాత్రాంతరో
న్మదపౌండ్రక్షితిపాలసంగరము ధీమన్మంత్రి సామంతస
మ్మదశక్తి న్విముఖప్రమాదమతివై మర్దింపుమీ శత్రులన్. 102

1. గదల 5. సాదన. 8. నవార్చి 4 వీయెదుర. 5. గదలం

గీ. అనుటయు హలాయుధుం డియ్యకొని నృపాల
సంఘమును దాను వీడ్కొని చనియె నపుడు
హరియుఁ గైలాసయాత్రకు ననువు చేసి
తలఁచె సౌపర్ణు శతకోటితరణివర్ణు. 103

వ. అంత. 104

శ్రీకృష్ణుఁడు గరుత్మంతుని నెక్కి కైలాసంబునకుఁ బోవుట

మ. హరిదంతద్విపదంతకుంత శిఖరాహంకారనిశ్చింత ని
ర్జరరాజార్జితవజ్రజర్జరితవిచ్ఛాయైకరోమచ్ఛని
స్థిరవిద్యుత్ప్రతిపక్షవక్షుఁడయి వచ్చెన్ వైనతేయుండు భా
స్కరబింబప్రతిబింబ మంబరము గ్రింగం బారు చందంబునన్. 105

గీ. వచ్చి నిజపాదపంకజావనతుఁడైన
వైనతేయుఁ గనుంగొని వాసుదేవుఁ
డల్లఁ గరపల్లవంబున నాదరించి
పయన మెఱిఁగించి యెక్కె నప్పక్షివిభుని. 106

వ. ఇవ్విధంబు వివిధగతిసంచరణచాతురీధురీణ గరుడాధిరోహణంబున నతిత్వరితంబుగా సముల్లాసంబునం గైలాసంబుఁ జేర వచ్చునప్పుడు. 107

సీ. వాచంయమోత్సంగ వత్సలసారంగ
మురుచషాలస్థూలయూపశతము
ప్రాగ్వంశబంధుర బహుగంధసాన్నాయ్య
మాగ్నీధ్రముఖ్యర్త్విగాశ్రయంబు
సుత్రామసఖయాయజూక సామాజికం
బాతిథేయమయోటజాజిరంబు
పటుధవిత్ర పవిత్రపవనోజ్జ్వలత్రేత
మఘమర్షణజ్ఞ శౌకాంచితంబు

తే. సంతతబ్రహ్మచర్యసుస్నాతకంబు
పరమయోగినిరాకృతపాతకంబు

1. వర్చస

హ స్తికై తిహ్యసహ్యపంచాననంబు
బదరికాకాననంబు చూపెట్టె నెదుర. 108

సీ. పవనవేగవిశీర్ణ పాదపాగ్రంబుల
జడియకుండఁగఁ బట్టుసామజములు
పూజార్థనియమిత పుష్పవాటికలపై
మధుకరంబులఁ జోఁపుమర్కటములు
నవభృథస్నానపర్యంతనిర్మలత కై
కాసారములఁ గాచుకాసరములు
నిజనిజోటజభాగనీవారసీమలు
సొరక కావలి యుండు సూకరములు

ఆ. గలిగి కంసవైరి కన్నులపండువై
చెలువు మిగిలెఁ బూర్ణకలశవిగళ
దాలవాలవారిహారి[1]తమువిదారి
కాశ్రమంబు బదరికాశ్రమంబు. 109

వ. మఱియుం దదాశ్రమంబు వలాహకంబునుంబోలెఁ గరకాస్పదంబై కుంజరంబునుం బోలెఁ గుంభాభిరామంబై రంగస్థలంబునుం బోలె శైలూషశతరమ్యంబై యింద్రపదంబునుం బోలె నైరావతరుచిరంబై తరుణీముఖంబునుం బోలెఁ దిలకవిరాజితంబై పరమయోగిహృదయంబునుం బోలెమోక్షనిలయంబై పారావారాంబునుఁ బోలె నమృతోత్పాదనస్థానంబై మహాభారతంబునుంబోలె శతపర్వసనాథంబై గగనంబునుంబోలె ఋక్షగణసంకీర్ణంబైకర్ణరథంబునుంబోలె శల్యాధిష్ఠితంబైవేఱొక్క తెఱంగున రతిరమణరణవిరహితం బనుటకుం దగి శంబరసత్త్వవర్ధనస్థానంబై యదృష్టపుండరీకం బనుటకుం దగి రాజోదయనిధానంబై రామమనోహరఁ బనుటకుం దగి వైదేహీకృతపరివేష్టనంబై పరిపుష్టవాజినికరం బనుటకుం దగి సంతతాహవనీయమాన మహిమంబై గంధర్వనివాసం బనుటకుం దగి విష్ణుపదావలంబనమూలంబై వెండియు నొక్కచందంబున బుద్ధసిద్ధాంత సంశ్రమం బయ్యును నజినవసస్థితి శోభితంబై పుణ్యజనేశ్వరనివాసం బయ్యును యమనియమవశంవదశాంతలో

1 తన్మ

కంబై సమిద్భారధురీణ సంకులంబయ్యెను నక్షమాలాభాతిశయంబై యొప్పునప్పుండరీ కాక్షుండు దద్దర్శనంబున హృదయంబు ప్రియంబునం బెనంగొన సాయంతన సమయంబున. 110

సీ. సంయమీశ్వరదత్తసంధ్యార్ఘ్యజలబిందు
జాలంబు నక్షత్రసమితి గెలువఁ
దాపసకృత దేవతానమస్కృతిహస్త
[2]ములు ముకుళితపద్మముల జయింపఁ
బారికాంక్షిహుతాగ్ని బహుధూమపటలంబు
దిక్కీర్ణతిమిరంబు ధిక్కరింప
స్నాతకవల్కలశాళనోద్ధతకాంతి
సాంధ్యరాగద్యుతి సంహరింప

గీ. ధైనుకాగమనోన్ముఖతరళవాత్స
కారవంబును సామగానారవంబు
నంతకంతకుఁ జెలఁగంగ హర్షలీల
నంబుజాక్షుండు సొచ్చె నయ్యాశ్రమంబు. 111

తే. గౌత మాత్రి విశ్వామిత్ర కణ్వ యాజ్ఞ
వల్క్య జాబాలి కాశ్యప వామదేవ
రైభ్య ధూమ్ర వాల్మీకి పరాశ రాంగి
రఃపవిత్రాక్షశంకకర్ణ ప్రభృతులు. 112

క. మునివరు లెదురఁగ జని పా
వనలోచను లైరి గోపవల్లభసంద
ర్శనమునఁ గృష్ణుఁడు వారలఁ
గనుఁగొని సంభ్రమముతోడ గరుడని డిగ్గెన్. 113

వ. ఇవ్విధంబున నితరేతరసందర్శన సమయసముచితకృత్యంబు లాచరించి తత్తా పసోత్తములు పురుషోత్తముం దపోవనమధ్య పర్ణశాలాంగణంబున నున్నత బ్రుసీ

1 పుటములు పంకజంబులజయింప

సమాసీనుంజేసి యాతిథేయపరిగ్రహణానంతరంబున నతనితో నిట్లని విన్న
వించిరి. 114

సీ. ఆకాశగంగ నీయడుఁగునఁ బొడమె నీ
కి ట్లర్ఘ్యపాద్యంబు లిచ్చు టెంత ?
నిఖిలంబు రక్షింప నీరజోగుణమూర్తి
పని నీకుఁ గుశలసంప్రశ్న మెంత ?
కమలంబు నీనాభి గన్నది నీ కిట్టి
పుష్పాంతరంబులపూజ యెంత ?
యమృతంబు నీచేత నమరులు గుడిచిరి
నీకు వన్యాహారనియతి యెంత ?

తే. యెంచ మాభక్తి యెంత ! మాయెఱుక యెంత !
మాతపోబల మెంత ! మామనికి యెంత !
యింతసంతోష మెసఁగ నీ విచట నునికిఁ
గంటి, మిది మాకు భాగ్యంబు కలిమి గాదె. 115

క. నీవారము నీ విచ్చితి
నీవారము మాకు భోగనియతసుఖంబుల్
గావింపుము మాప్రియములు
గావింపుము నీవు భక్తిగమ్య మురారీ.

వ. అని పలుకుచు నద్దేవుని ననేకవిధంబులం గొనియాడి యాదేవునిం గొలిచి
వచ్చిన దివ్యమునిదేవతాసిద్ధవిద్యాధర గణంబులకు నాతిథ్యంబిచ్చి యామంత్రణంబు
చేసి యమ్మురాంతకు వీడుకొని నిజనివాసంబులకుం బోయిరి. తదనంతరంబ 117

శా. గంగానిమ్నగ దాఁటి యుత్తరతటీకాంతారపర్యంత భూ
మిం గంసారి పురారిఁ గోరి నియమోన్మీల న్మనఃపద్ముఁడై
భంగాపేతపయోధివోలె ననిలాపాయ ప్రదీపంబునా
నంగం బొప్పఁగ నుండెఁ దొల్లియుఁ దపోవ్యాసక్తిఁ దానున్నచోన్. 118

వ. అట్టియెడ. 119

## బదరికావనంబునఁ బిశాచద్వయంబు శ్రీకృష్ణునకు దృగ్గోచరమగుట

ఉ. కుక్కలు వెంటఁబడ్డ నొకకొన్ని మృగంబులు వాఱె నెత్తురు
గ్గ్రిక్కుచు నేలఁగూలె విశిఖంబులు నాఁటిన గొన్ని యున్నవే
దిక్కు నెఱుంగవయ్యెఁ గరదీపనికాయము ఛాయఁ బర్వఁగా
గ్రక్కున వచ్చి రంతట వికారశరీరపిశాచ సైనికుల్. 120

వ. అందులోన. 121

గీ. వికృతాననంబులు విరళదంతంబులు
నిడుపైన దౌడలు నిక్కుమెడలుఁ
ముడివడబొమలును ముమ్మూలముక్కులుఁ
బల్ల వెంద్రుకలును బడికితలలు
బొక్కుఁజొమ్ములు లోఁతుఁబొట్టలు మిడిగ్రుడ్లు
గూనివీఁపులు నిడుఁగ్రొంకివ్రేళ్ళు
బూరకాళులు నీచఁబోయినచేతులుఁ
గోలమూఁపులు గుదిగొన్నతొడలు

తే. నతిభయంకరగతి సూప నట్టహాస
కహకహారావములతోడఁ గాననయ్యె
దావపావకఘన శిఖాదగ్ధతాల
సాలసంకాశ మగు పిశాచద్వయంబు. 122

వ. అందు నొక్కరుండు. 123

చ. పిరిగొనఁ దాల్చు నెట్టముగఁ బ్రేవులు చుట్టి కపాలపాత్రలో
విరియఁ గలంచుఁ గ్రొమ్మెదడు, వెండ్రుక లేఱి తొలంగవైచు నె
త్తురు చవిచూచుఁ గండలు తుఘా యని క్రాయుఁ ద్రిశూలధారలం
జెరివిన ప్రేతమాలికలఁ జిమ్ముఁ బిశాచవిభుండు వేడుకన్. 124

వ. మఱియొక్కరుండు, 125

(అచ్చ తెనుఁగు)

చ. కఱచినపీనుఁగు న్వెడఁదకప్పెరయు న్మొలఁ బచ్చితోళులున్
బుఱియల పేరులు న్మెదడుపూఁతకు జుమ్మనిమూఁగునీఁగలుం

బెఱికినవాలు ఱొమ్ముపయిఁ బేరిన నెత్తురు తేపుడున్ గడున్
బిఱుములచూపులుం దఱచు బీఱనరంబులుఁ గల్గురూపునై. 126

క. చనుదేరఁగ నయ్యిరువురఁ
కనుఁగొని మురవైరి వారి కలకలమున నె
మ్మనముం బదిలముచేయక
ఘనతరవిస్మయవికారకలితముఁ జేసెన్. 127

వ. తదనంతరంబ దద్వికృతవేష వేతాళయుగళంబు నరులగళంబులు దెగనడిచినఁ దొరుఁగు రుధిరంబు చవిగొని రుచియగుటయు హరికి సమర్పితం బయ్యె ననుచు న ద్దేవుని సహస్రనామంబులు పేరుకొని. 128

శా. ఓ నారాయణ యో మురాసురహరా యో భక్తచింతామణీ!
యో నీలాంబుదవర్ణ! యోగుణనిధీ యోలోకరక్షామణీ!
యో నీరేరూహపత్త్రి నేత్ర కృప నా యుల్లంబులో నుండవే
యో నా వే భవబంధముల్ చెఱుపవే యో దేవకీనందనా! 129

శా. గోవిందాయ నమో నమో భగవతే గోపాలభర్త్రే నమో
దేవేశాయ నమో నమో మురభిదే దిక్పాలకర్త్రే నమో
భావజ్ఞాయ నమో నమో ముదహృతే పాపప్రహర్త్రే నమో
జీవస్థాయ నమో యనంగ శుభముల్ చేకూరు మా కెప్పుడున్. 130

గీ. అనుచు నిరువురుఁ దను జేర నరుగుదేర
గారవంబున వారి నాకంసవైరి
చూచుచుండంగ నం దగ్రజుండు గాంచి
పలికె నల్లన గంభీరభాషణముల. 131

ఉ. ఎక్కడివాఁడ వన్న కడు నీరపుఁగాఱడవిం జరించె దీ
చక్కనిమేను నీ గరుపచందము నెందును గాన మక్కటా
నిక్కము మాకుఁ జిత్తములు నీరగుచున్నవి క్రూరసత్తము
లెక్కలి గొన్నఁ జొక్కపడదే మదిలో నినుఁ గన్న తల్లియున్. 132

శా. చేతోజాతుఁడు నీవు నే మవుదురో శీతాంశుచూడామణిం
బ్రీతుం జేయఁ దపంబు నేసెదొ విచారింపంగ నట్లే లగున్

పాతాళంబును నేలయుం ద్రిదివమును బాలించు సిద్ధుండవో
నా తండ్రీ నను నేలవచ్చిన జగన్నాథుండవో చెప్పవే. 133

క. అనుటయుఁ బిశాచవల్లభు
దనభక్తునిఁగా నెఱింగి దామోదరుఁ డ
ల్లనఁ గరుణ వొడముకన్నులఁ
గనుఁగొని యిట్లనియెఁ బలుకుగారవ మొసఁగన్.

క. భూజనములు యదువంశము
రా జనఁగాఁ బరఁగుదు న్నిరంతరమును స
త్పూజయును దుష్టశిక్షయు
నాజన్మవ్రతము లఖిలనాథుఁడ నగుటన్ 135

గీ. నాకు నొకకోర్కి కైలాసనాథుచేతఁ
బార్వతీవల్లభునిచేతఁ బడయుతలఁపు
గలదు గావున బదరికాకాననంబుఁ
జూడ వచ్చితి మీ రిందు సొచ్చు టేల ? 136

చ. వలదు మహామునీశ్వరులు వారె సదాశివచింతచేత ని
శ్చలగతి నున్నవా రిది పిశాచనివాసము గాదు మీరుఁ గు
క్కలుఁ గవియంగఁ బాఱెడి మృగంబులఁ జూచి సహింపరాదహోఁ
నిలువుఁడు వేయునేల తగునే కఱకుట్లనుఁ జంకఁ బొత్తముల్. 137

క. వెలి నుండుఁ డిచ్చటికిఁ గా
వలి నే నుండంగఁ జొచ్చువారుం గలరే
బలిమిఁ బిశాచంబులు మీ
రలిగిన నలిగితిరి చూడ నగునే మిమ్మున్. 138

వ. అనుటయు నం దగ్రజుం డిట్లనియె. 139

శా. ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డీకాలాంతకుం డేము ము
క్కంటిం గొల్తుము కిన్నరేశుపనికిన్ కైలాసశైలంబునన్
జంట న్వచ్చినసారమేయములు నీసైన్యంబులున్ మావె యే
వెంటం బోయితి మేమి? కాఱడవిలో వేఁటాడరే యెవ్వరున్? 140

గీ. నీవు నీపోవుదెసఁ బొమ్ము నీకు మాకు
మాట లేటికి ననుచు నమ్మరులు తేడు
నచటఁ బ్రేవులు దర్భలు నాసనంబు
చేసి తనమానసంబునఁ జేర్చెఁ గృష్ణు. 141

క. తలఁపునఁ జూచినరూపును
వెలిఁజూచినరూపు నొక్కవిధ మయి యున్నన్
నెలకొని ఘంటాకర్ణుఁడు
నలినాక్షుని నామకీర్తనం బొనరించెన్. 142

వ. ఆద్దేవుని నుతియించు నప్పుడు. 143

సీ. తొమ్మండ్రు గొడుకులఁ దొలివేలుపులఁ జేయఁ
బొడమించు నేదేవు బొడ్డుఁదమ్మి
మూఁడుత్రోవలఁ బాఱి మున్నీటిగరిత గాఁ
బరఁగు నేదేవునిపాదతటిని
పండ్రెండు రూపులై పగలింటి రాజు గా
వలఁతి యేదేవుని²వలనుఁగన్ను
వేయిమానికపుదివ్వెలతోడఁ బడగలు
మ్రాల్చు నేదేవునిమలకపాన్పు

తే. మునులకెల్ల నేదేవునిమూర్తి వెలుఁగు
హృదయగేహంబులో దీప మెత్తినట్లు
హరి మురారి నద్దేవు మహానుభావు
మనసులోఁగంటి భవములు మాను నంటి. 144

వ. అనుచు విలోచనంబులు దెఱచి చూచి. 145

సీ. పుండరీకములతోఁ బురణించుకన్నులఁ
గారుణ్య మనుతేనె గడలుకొనఁగఁ
మందారశాఖతో మలయఁ జాలెడు కేల
బాంచజన్యం బనుపండు మెఱయ

1. మ్మలం, 2 వలనికన్ను (లీ)

నుదయాద్రితటము[1]తో నుద్దించునురమునఁ
గౌస్తుభం బనుదివాకరుఁడు దోఁప
నాకలోకంబు[2]తో నవ్వుపాదంబున
నాకాశనది యనునమృత మొప్ప

తే. నమృతధారాధరము మాటలాడినట్లు
భాగ్యదేవత రూపు చేపట్టినట్లు
లలితగతి నున్న సద్గుణాలంకరిష్ణు
విష్ణుఁ బొడగంటి భవముల వీడుకొంటి. 146

వ. అనుచుం బ్రణామంబు చేసి. 147

క. పకపక నవ్వుచు నొక వి
ప్రుకళేబరమాంస మెల్లఁ బుచ్చి పునుకపా
త్రికలోనఁ గడిగి పెట్టుచు
నకుటిలమతిఁ గృష్ణ! 'నీకు నర్పిత' మనుచున్. 148

గీ. ఆరగింపవె దేవ! మాయందు విందు
వేలు పన్నఁ బాటింతురు విప్రమాంస
మిచట మత్ప్రీతిసేసి నన్నేలికొనుము
భక్తిగాని నీ కేమియు భ్రాంతి గాదు. 149

క. నావుడు మురారి నవ్వుచు
నావేఁదుఱు నూఱడించి యనుచితము మహీ
దేవునిఁ జంపుట యనుచుం
గై వెక్కినవానిమేను కరమున నిమిరెన్. 150

వ. నిమురుటయును. 151

క. తామర రేకులఁగన్నులు
సామజహస్తములు దొడలు శశిమండలమున్
మోమును మెఱుపును నొడలును
సోమింపఁగ దివ్యరూపసుందరుఁ డయ్యెన్. 152

1. న నుద్దించు. 2. ను నవ్వు.

క. అంటినమాత్రన హరిచే
ఘంటాకర్ణుండు మెఱసె గంధర్వపదం
బంటినగతి సిద్ధపదం
బంటినగతి దివ్యతేజ మంటిన కతనన్. 153

శ్రీకృష్ణుఁడు ఘంటాకర్ణున కింద్రపద మిచ్చుట

చ. అతనికిఁ బ్రీతి నిట్లను మురారి బలారిపదంబు నీకు ని
చ్చితి నతనిం దొలంగ విధి చేసిన వాఁడమరావతీపురీ
పతి వని నేఁడ నీనుదుటఁ బట్టము గట్టితిఁ గొంతగాల మి
ట్లతిశయభోగ మొంది పరమాత్మునిఁ గూడఁగ రమ్ము పిమ్మటన్. 154

క. నీతమ్ముఁడు నీరూపున
నీతోడన కూడ వచ్చి నిర్జరరాజ్య
స్వాతంత్ర్యముఁ గని పిమ్మట
నాతత్త్వముఁ గూడ వచ్చు నాకాధిపతీ ! 155

చ. అని వర మిచ్చి వానివినయంబునకు న్మదిమెచ్చి వెండియుం
గొనుము వరంబు నీ వనినఁ గోరె భవచ్చరణారవిందభా
వనకు మదాత్మ యింత గడవ న్మురభంజన వేయు నేల యే
జననమునందు నిట్ల నిను సంస్తుతి సేయఁగ నిమ్ము నావుడున్. 156

శా. సంతోషించె మురారి యంతట భవిష్యన్నాకలోకాధిరా
ట్కాంతున్ శక్రుఁడు దోడికొంచుఁ జన ఘంటాకర్ణుఁ డట్లేఁగు వృ
త్తాంతం బంతయుఁ గృష్ణుచేత విని సాంద్రానందపూరావృత
స్వాంతం బయ్యె మునీంద్రలోకముపునస్సందర్శనాహ్లాదియై 157

వ. ఇవ్విధంబున నారాత్రి సంయమీశ్వరులకుం గన్నులపండువునకుం
దోడు సెవులపండువును జేసి మధుసూదనుండు మరునాడు మహా
మునుల వీడ్కొని వచ్చి వచ్చి. 158

ఉ. వాసుకిహారసంతతనివాసము వాసరవల్లభ ప్రభా
న్యాసము నాసముద్రరశనక్షితిహాసము నాత్మకీర్త్యను

ప్రాసము దత్తదిక్తటనిరాసముఁ గంసవిరోధి గాంచెఁ గై
లాసము నభ్ర విభ్రమకిలాసము మేరుతటీవిలాసమున్. 159

వ. కనుఁగొన్న నన్నగంబు కన్నులకు నందక మిన్నంది నందికృత నాందీ సందానిత వందనమాలాసందోహవిహరద్బృందారక సుందరీ హార ఘటితనటనారంభ విజృంభితరంభాకుచకుంభ సందర్శన సంభావనా సుభగంభావుక కుబేరకుమార సంభ్రమావతకరణ రాణచరణరుఝుణాయమాన మణిమంజీరజ్ఞాపిత సోపానపథోపగ మ్యంబై, రమ్యంబై వెండియు వెండియుం బసిండియుం దడంబడు ననుటకుం దగి కుందగిరి మల్లికా కుముద సముదయదాయాదసదాదితేయ నదీసుమేరుశిఖర విసర విసరదుదీచీముఖ ప్రవాహవిహరమాణ విరించిపుర మహిళాపయోధరకుంకుమపరాగ రాగచ్ఛవిచ్ఛురిత తరంగిపరంపరా పరార్థ్య ఫెనపట పల్లవిత విగతరజతరుచిరుచిరత రాధిత్య కాదిత్యకాత్యాయనీరమణ శిరోభూషణశశాంకశకలవిలాసనిస్తంద్ర చంద్రి కావిచరదవాచీముఖ రోచిర్ఝరీపరీతపరిసరపరిహృత తపనీయతటద్యుతినిపతదితరేతర కాంతివినిమయంబై మునిమయంబై పాతాళంబును మూలంబును మేలంబు లాడునని యాడుట కొనియాడుటగాదనితెలుపం దెలుపగు సహజప్రకాశంబునకునవకాశం బొసం గక భవాని సేవానిపుణపుణ్య జనేశ్వరపురపురంధ్రీపునః పునరాగమనరాగమనఃప్రియ వద పల్లవపటచయపరితః ప్రకటితప్రవాళ ప్రభావిభావ్యమాన దశాననభుజాపరిఘ సంఘాతవిఘాతవిఘట్టితవసుధాసనిబన్ధవివర వినిర్యద్ధర్వీకరసార్వభౌమఫణామణికిర ణచ్ఛురణప్రావరణంబెవరణంబె దురితంబులం జొరనీక ఛందంబుగా కుండియుజగతీ ధృతి ప్రకృతి ప్రతిష్ఠాంచితంబె దంతావళంబుగాకుండియుఁ గటకరవిగ్రహవిహారదా నోన్న తంబె కాంతారూపంబుగాకుండియుం నలకాహితపుష్పకచారూఢముకాభిరామఁబె యట్లునుంగాకసంసారియుం బోలెఁ బ్రసౌషధి పూర్ణోదరం బయ్యును సకలాశాభరి తంబె యనాత్మజ్ఞుండునుం బోలెఁ దుర్వర్ణసానుభవం బయ్యును నున్నతవంశధ్వని ముఖరం బె యట్లుంగాక జామదగ్న్యుండునుఁ బోలె భృగుసంతతివర్ణనీయం బయ్యును భూభృద్విగ్రహనిరూఢంబె నిఖిల నిర్జరలోక మకుటరత్న రాజినీరాజిపాదంబె రాజ కళాధరు విడంబించియున్న నప్పు డప్పురుషోత్తము డిట్లని విచారించు. 160

సీ. ఇం దుండుహరుమౌళి నిందుండు పెద్ద యై
నెత్తంబు నిండువెన్నెలలు గాయ
నీగిరిరాజుపై నీఁగిరి గాఁబోలు
నఖిలదేవతలు నేకార్థవమున
నిచ్చట విహరింప నిచ్చఁట సంయమీ
శ్వరులకు మోక్షంబు సందియంబె
యీనగాగ్రంబున నీన గాఁడినయంత
శిల నైన మున్నేఱు సెలవ కున్నె

తే. యీవనము లీకెలంకులు నీనగంబు
లీకొలంకులుఁ గలుగ సింహేభశరభ
హరిణశార్దూలగంధర్వయక్షసిద్ధ
గణగణాంగనాగణనలు గానఁబడునె. 161

## శ్రీకృష్ణుఁడు ద్వాదశవర్షంబులు తపస్సు చేయుట

మ. అనుచున్ ధద్ధరణీధరాధివరకూటారూఢుఁ డై మానసం
బనుకానారము నుత్తరంబున విహంగాధీశ్వరున్ డిగ్గి గ్ర
క్కున వల్కంబు జటాభరంబు నమరం గూర్చుండి చర్చించెఁ బా
వనదేశంబు శౌరి ద్వాదశసమావ్యాప్తిం దపఃప్రాప్తిగాన్. 162

వ. అట్లు విచారించి 163

క. ఫాల్గునమాసము మొదలుగ
ఫల్గునసఖుఁ డతులతరతపశ్చరణమునన్
వల్గదరివర్గహయఖుర
ఫల్గువు గానీక మనసు పదిలము చేసెన్. 164

గీ. పుష్పములు గోయుఁ జక్రంబు భుజగవైరి
నఱకు నిధ్మము ల్గుశములు నందకంబు
తెచ్చుఁ బాంచజన్యము గాచు దెసలు శార్ఙ్ఞ
మెదుర నిలుచుండు గద సేయు నెల్లపనులు. 165

క. దిన మొక్కొక్కటి యెక్కఁగ
వనజాక్షుం డుపవసించి వత్సర మెల్లం
జనఁగా నొక్కొకయేఁడె
క్క నుపాసం బుడిగి యశనకర్మము నడపున్. 166

శా. పంద్రెండేఁడులు నీగతిం జనఁగ జంభద్వేషిముఖ్యామరుల్
మంద్రాటం బిది యేల చెప్పఁడము కామధ్వంసికి న్నేమముల్
గుంద్రా యైనఁ జెమర్చు నింత కకటా గోపాలచూడామణిన్
గంద్రోకానరొ వారు చెప్పఁ దగదా కైలాసవాచంయముల్. 167

గీ. అనుచు గంధర్వసిద్ధవిద్యాధరాను
గమ్యమాను లై బదరికాకాననంబు
వలనిమునులఁ దోఁ జనుదేర వచ్చి కనిరి
నిశ్చలధ్యానపరిపూర్ణు నీలవర్ణు. 168

క. కని యాకైలాసతటం
బున నమరులు తమవివిమానములు డిగ్గి జనా
ర్దనుఁ దిరిగి వచ్చి కొలువఁగఁ
గనువిచ్చె నతండు నియమగతి చెల్లుటయున్. 169

వ. అట్టియెడ. 170

(అచ్చతెలుఁగు)

సీ. తొలుకారుమెఱుఁగులతోఁటలో నాడెడు
రాయంచకొదమతో రాయఁ జాలి
యిరులబండారంపుటింటికిఁ బెట్టిన
బొందుమల్లెలకోటఁ బోర గెలిచి
బలుమంచుఁగంబాల బలసి రాఁ జుట్టిన
క్రొత్తమంజిడిబాగుఁ గొఱఁత చేసి
పాలవెన్నురువుగుబ్బలిమీద నెలకొన్న
నిండువెన్నెలముగ్గు నిగ్గు చెఱిచి

తే. జడలఁ గొన్నెల మెడఁ బాఁపసరిగఁ దొడలఁ
బొదలతో ల్మేన వెలిమిడిపూఁత మించఁ

బొదమి వ్రేతేనిముందటఁ బొదవు నూపెఁ
[1]బొడువులం దెల్లఁ బొడువైనబోటువేల్పు.

(అచ్చతెలుఁగు)

ఉ. ఏనికతోలుపచ్చడము, నెమ్ములగుబ్బసరంబు, నంపపూఁ
దేనియతియ్యవిల్లుఁ గొని త్రెంచినబొట్టు పఱంగునెట్టము
న్వీనుల[2]చూపుపెండెముఁ, దవిల్చిన మంచముకోటికైదువుం
బూనినప్రాఁతవేల్పుఁ గని, పోకులఁబోయిన వెన్నుఁ డిట్లనున్. 172

సీ. కల్హారమకరందకలితమందాకినీ
లహరీపరీతకోలాహలంబు
బాలేందుచంద్రికాపరభాగశోభాప
రాగసంభావితారగ్వధంబు
సేవాసమాసన్న సిద్ధసీమంతినీ
తాలవృంతోత్తాలతాండవంబు
కాత్యాయనీదత్తకర్ణావతంస క
ర్పూరఖండామోదపూరితంబు

తే. మారుతంబు నామీఁదట మలసియాడ
గలుగునొకొ నాకు నొకనాఁడు కన్నులార
శివునిఁ జూచుపుణ్యం బనుచింత నెఱయ
మొదలివేలుపుఁ బొడగంటి మ్రొక్కఁ గంటి. 173

సీ. తరుణపల్లవరాగతామ్ర విద్యుల్లతా
భాసురం బగుజటాభార మెఱిఁగి
నిబిడసంతమసాతినీలబాలతమాల
పరిపంథి యగుకంఠభాగ మెఱిఁగి
తారము క్తాహారధవళశారదనీర
దాకార మగునిర్మలాంగ మెఱిఁగి
ద్రవశాతకుంభ గౌరకుసుంభకుసుమఖం
డనశీల మగుఫాలనయన మెఱిఁగి

1. బొదవు (బొడువ) లందెల్లఁ బొదవైన బోఁటు. 2. చూపుఁబెం,

తే. యెఱిఁగికొన వచ్చు నటమీఁద హృదయకమల
కర్ణికాభద్రపీఠంబుఁ గదియఁ జేర్చి
వరసుధాభిషేకంబునఁ బరమయోగి
సార్వభౌముఁడ వగునిన్నుఁ జంద్రమౌళి. 174

సీ. లలితవిద్రుమలతాలావణ్య మగు జటా
జూటంబుఁ జిగురాకుజొంపమైన
సాంద్రతారకవిలాసం బగుపురుహూత
పురపురంధ్రులసేస పూవు లైన
విశదకాదంబినీవిభ్రమం బగు వియ
త్సింధుతోయము పూవుఁదేనె యైనఁ
దరుణభానుసమంచితం బగునుష్ణీష
ఫణిఫణామణికోటి ఫలము లైన

తే. నైనపారిజాతంబు మూలాలవాల
జాత మగు నైన నభిలాషజాత మెల్లఁ
జేతిలోనికి వచ్చు నిచ్చిత్ర మిచట
నాత్మలోఁ గంటిఁ గన్నార[1]నంటికొంటి. 175

సీ. కుజము కుంజరముచేఁ గూలునో కూలదో
కూలుకుంజరము నీకుజము గూల్చె
మ్రాను పేరేటిచే మడుఁగునో మడుఁగదో
మడుఁగుపేరేటి నీమ్రాను మడఁచెఁ
గాలునో యొకనిచేఁ గాలదో సాలంబు
గాలునీసాలంబు గాల్చె నొకని
దునియునో పరశుచేఁ దునియదో వృక్షంబు
తునియు నీవృక్షంబు తునిమెఁ బరశు

తే. వనుచుఁ దమలోనఁ జర్చించు నమరవరుల
కభిమతార్థఫలార్థ మై యంద వచ్చు
పారిజాతంబు నా మ్రోలఁ బండియుండ
నందఁ గంటి నాకోర్కులు నందఁ గంటి. 176

1. నందు

మ. అనుచున్ లోచనపుండరీకములలో నానందబాష్పాంబువుల్
తనుసీమం బులకాంకురంబులుఁ బ్రమోదంబుం బ్రకాశింప న
వ్వనజాక్షుండు చెలంగుచుండఁగని సర్వజ్ఞుండు యోగీంద్రవా
జ్మనసాగమ్యుఁడు కేలుఁ గేలఁ గదియ న్మన్నించెఁ గృష్ణుం గృపన్. 177

క. ఇత్తెఱఁగున నయ్యిరువుర
చిత్తముగతి నొడలు గలసి సిద్ధాంతపరా
యత్తు లగు మునుల యెఱుకకు
విత్తై చెలువారె జమిలివేల్పని తెలుపన్. 178

వ. అట్టియెట. 179

సీ. అభ్రంకషం బైనయాలపోతు నితండు
త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు
గాచినాఁ డీతండు ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు
దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు
మెట్టినాఁ డీతండు సుట్టినాఁడు

తే. నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁ గలిగె
ననుచుఁ గొనియాడుసంయమిజనుల కొదవె
రజతగిరిమీఁద హరిహరారాధనంబు. 180

సీ. సారసంబున లేవ నారసంబునఁ జావఁ
బద్మాసనుఁడు వీరిపాలఁ గనియె
రూపు గంటఁ జెలంగఁ జూపు మంట లడంగఁ
బంచబాణుఁడు వీరిపాలఁ గనియె
వరములు వడయంగ శరములు గెడయంగఁ
బంక్తికంఠుఁడు వీరిపాలఁ గనియె
గేహరక్ష నటింప దేహశిక్ష ఘటింప
బాణాసురుఁడు వీరిపాలఁ గనియెఁ

తే. గనియెఁ జిత్రంబులకు వీరు గలసియుండి
మనుపఁ జెఱుపంగఁ జెఱుపంగ మనుప నేర్తు
రెల్లలోకంబులకు దైవ మేక మగుట
హరిహరాత్మక మెఱిఁగితి మనిరి సురలు. 181

శివుఁడు సాక్షాత్కరించి కృష్ణునకుఁ బుత్త్రి నొసంగుట

చ. ప్రమథులు సప్తమాతృకలుఁ బార్వతియు న్మరవైరి తాపసో
త్తములు నుతింప నయ్యెడ సుధాకరఖండవతంసుఁ డిట్లనున్
దమతమలోనిచూడ్కిఁ దముఁ దార కనుంగొనుమాడ్కి నింతగా
లము నినునీవ చూచి[1]తి తలంపున నీవును నేన కావునన్. 182

మ. యదువంశాంబుధిచంద్ర! నీమదిఁ గుమారాపేక్ష నాలో నెఱుం
గుదు నాకి చన వీఁ దలంచియ తపోఘోరక్రియ న్మెచ్చఁగాఁ
బిదపం జెప్పెడివాఁడవై తగుఁ దగుఁ బృందారకశ్రేణికిన్
హృదయాహ్లాదముగా మదీయమకుటం బెక్కెన్ భవత్పాదముల్. 183

క. నీ కొడుకు నీకు నిచ్చితిఁ
గైకొనుము వికించిచిట్టకాలకు లోనై
నాకుఁ బగ యగుట నంగము
లేకున్నాఁ డతఁడు కొఱఁత లే దతనిపయిన్. 184

వ. అది యె ట్లనిన వినుము. 185

మ. హిమవత్కూటమునన్ దపోమహిమతో నే నున్న నాఁ డమ్మహీ
ధ్రము నాకుం దనకన్యఁ జూపి పరిచర్యాకారిణిం జేసినన్
రమణీరత్నము నన్ను సంతతము నారాధించె సద్భక్తిసం
భ్రమభావంబులు విభ్రమభ్రమణవిభ్రాంతిం దొలంగింపఁగన్. 186

ఉ. అత్తఱిఁ దారకుం డనుమహాసురుఁ డీసురసంఘము న్మదో
న్మత్తవిహారుఁ డై గెలిచి నాకము చూఱగొనంగ వాసవుం
డెత్తినభీతి బ్రహ్మకడ కేఁగి ప్రణామము చేసి ఖేదముం
దత్తఱపాటుఁ జెప్పిన విధాతృఁడు నాతనితోడ నిట్లనున్. 187

1. లె తలంచిన.

మ. దనుజేంద్రుండు తపఃప్రభావమున నత్యంతస్థిరస్వాంతుఁ డై
నను మెప్పించి వరంబు వేఁడెఁ దన కెన్నండున్ వినాశంబు లే
క నికామవ్యవహారుఁ డై తిరుగ నొఁగా కంటి నేనుం ద్రిలో
చనసూనుం డొకరుండు దప్పఁజెఱుపఁ శక్తుండు గాఁడెవ్వఁడున్. 188

క. అని వానివరములోనన
మునుముట్టఁగఁ గొంత నెగులు మోవఁ బలికినఁ
విని దనుజుఁడు మీఁ దెఱుఁగక
చనియె జితేంద్రియుల కేటిసంతతి యనుచుఁ. 189

చ. అమరపతీ పతివ్రతల కాదిమదై వతమైన పార్వతిం
బ్రమథవిభుండు గైకొనెఁ గృపాపరతన్ బరిచర్య సేయ నీ
సమయమునందు మన్మథుఁడు సాగి శరాసనకౌశలంబునన్
హిమగిరిరాజకన్యపయి నీశునిచిత్తముఁ జేర్ప నోపినన్. 190

క. ఆరమణికి నుదయించు కు
మారుఁడు సేనాని యగు నమర్త్యులు వొగడఁ
దారకుని నెల్చి తిరముగ
నీ రాజ్యము నిలుప నోపు నిక్కం బనుడున్. 191

శా. జంభారాతి విజృంభమాణహృదయోత్సాహైక సాహాయ్యుఁడై
యంభోజాసనుపంపునఁ జనిప్రసూనాస్త్రుఁదలంచె న్నటా
[1]రంభ స్తంభనదంభ ఖేదవిహర ద్రంభాపరీరంభణ
స్తంభాసంభవగుంభరత్నరచనాస్థాన [2]స్థలస్థేము ఁడై 192

వ. ఆలోన. 193

సీ. మకరంద మాని మైమఱచిన గొనయంబు
వెడ్రమోయఁ గడివోనివింటితోడ
జలజకేసరరాజి జల్లెడమూఁకగా
దాఁటువతారిరథ్యములతోడఁ
గర్ణికారపుమొగ్గ కనకంబుగుబ్బగాఁ
గోయిల నోరూరుగొడుగుతోడ

1. రంభ స్తంభనికుంభఖేదవిచరద్రం. (వి) 2. స్థితి.

రతికన్నుఁగవ మచ్చరము సేయు బెక్కెంబు
వదఁక పీతెంచు సేవకులతోడ
తే. వలపుఁదూఁపులు కరసాన వాఁడి చేసి
మందునెలతోడఁ దన మేనమామయైన
నిండునెలతోడ వలరాజు నిర్జరేంద్రు
సభకు నేతెంచె భుజబలోత్సాహ మెసఁగ. 194

క. ఇవ్విధమున బొడసూపిన
పువ్వులవిలుకానిఁ జూచి పురుహూతుఁడు లే
నవ్వడర వేయుఁగన్నులు
నువ్విళు లూరంగ నున్న యుత్పలవన మై. 195

గీ. సముచితోపచారములతో సంతసంబు
మనమునకుఁ జేయ నచ్చట మన్మథుండు
[1]నిర్జరాధీశ ననుఁ బంపు నీకుఁ జేయ
వలయు పని యేది కడతేర్చి వత్తు ననుఁడు. 196

చ. త్రిపురహరు న్వరింపఁ దగుదేవి ధరాధరకన్య దగ్గఱన్
దపముఁ గలంప నం దొకఁడు తారకుఁ జంప నిలింపలోకమున్
గృపఁ దిలకింపఁ బెంపఁ బరికింపఁగలాఁ డుదయించు నంచు వే
దపుఁగనివేల్పు సెప్పినఁ బదంపడి నిన్నుఁ దలంపఁ జొప్పడెన్- 197

క. అత్తాపసోత్తముని మదిఁ
దత్తఱపా టొదవఁజేయఁ దక్కొరులకుఁ గా
దిత్తెఱఁగు నీక చెల్లు ను
దాత్తగుణా యనుడు నతఁ డుదగ్రమదమునన్. 198

వ. తదనంతరంబ రంభాదిరంభోరు కరకిసలయవికీర్ణ కల్పతరుకుసుమ కేసర విసరద్విరేఫ దంభ ధూమధూసర శిరోరుహంబువలనను జంభాసుర విస్రంభన పరి రంభరాగ నిర్భరనయన సహస్ర ప్రభాపటల కపటకీలాకలాప పరీత దేహప్రభా విహారంబులవలనను రతివిరచిత మంగళాచరణగోరోచనా రుచిర దక్షిణభుజా

1. కణఁగి నిర్జరాధీశ నాకతనఁజేయ.

నిక్షేపణలక్షణలక్షిత మౌక్తికాక్షతకైతవస్ఫులింగ సంగరసమయోచిత వైక క్ష్యంబు వలనను వాతాయనవివరవితీర్ణ దితిసుతారాతి నగరచతురయువతిముకుళిత కర కర్పూరపూరవ్యాజ నిచిత భసితవితానవిస్తారిత పతాకాపటపల్లవంబుల వలనను పరితః ప్రతిపదముఖరబృందారకబృంద జయజయారావపరిపూరితవీర రసావేశ వేల్లితభుజాస్ఫాలనకోలాహల చ్ఛద్మగద్గదశబ్ద ప్రతిరవ విభావితగోపుర ప్రదేశంబుల వలనను మొదలన మదీయలోచనానలంబునకు నాహూతి యగుటఁ దెలుపుచు నమ రావతీపురంబువెడలె నచ్చందంబునం బచ్చవిల్తుండు నన్నుం గలంచుటకు సమకట్టి తాను సమయుట వీరిందఱు నెఱుంగుదు రిది పిదప నేఁ దెలిసి యపరాధంబు గాకుండుటకు నా మనంబున ననుతాపంబు వొడమిన 199

మ. వగఁ బొందంగ విరించి దేర్చినఁ గృపావంతుండవై మన్మథు
న్మగుడ న్జేసితి నీకుఁ బెద్దకొడుకై మద్భక్తుఁడై చెప్ప నొ
ప్పగుఁ బ్రద్యుమ్నుఁ డనంగ నీధర సరోజాక్షా తపసిద్ధికిం
దగు మేలిచ్చుట గాదు పూర్ధవిహితార్థం బింత కింతేటికిన్. 200

## శ్రీకృష్ణుని శివుండు కొనియాడుట

క. అనుచుం గరములు మొగుపఁగ
మునుముట్టఁగ మొగిడె నమరమునిపారిషదా
వనిధరతనయాకరములు
పినాకి గొనియాడఁ దొడఁగెఁ బీతాంబరునిన్. 201

సీ. ప్రకృతిసంజ్ఞికము గారణము ద్రిధాభూత
మది ప్రధానమునకు నాత్మ యయ్యె
సత్త్వరజస్తమోజాతమై జగదండ
మంతకుఁ గారణం బనఘ నీవ
ప్రకృతియందు మహత్తు ప్రభవించె నం దహం
కారంబు వొడమెఁ దత్కల్పితములు
పంచభూతములు శబ్దస్పర్శగంధరూ
పరసంబులును బాదపాణిపాయు

తే. వాగుపస్థములుఁ దదీయవర్తనములు
మనసు గలయఁగ నివి సాంఖ్యమతమునందుఁ
దత్త్వములు వీని కంత[1]కుఁ దాఁప వీవు
పనులు వీనికిఁ దగుఖంగిఁ బనుపనేర్తు. 202

గీ. బ్రహ్మయై రాజసమున నుత్పత్తిఁ గూర్చి
విష్ణుఁడై సాత్త్వికమ్మున వృద్ధిఁ గూర్చి
రుద్రుఁడై తామసంబున రూపు మాపి
చూపుదు చరాచరంబుఁ గౌస్తుభవిభూష. 203

క. ఇంద్రియముల గోచరముల
కుం ద్రోవలు చేసి భక్తకోటులలో నె
ల్లం ద్రిమ్మరు నాత్మవు రవి
చంద్రవిలోచన వివేకచైతన్యనిధీ ! 204

గీ. బ్రాహ్మణులు మోము రాజులు బాహుయుగము
వైశ్యు లూరులు తక్కినవారు పదము
లుదయపథములు సేయ నీయొడలు మెఱయు
నీవు విశ్వేశ్వరుండవు నీలవర్ణ. 205

క రవిచంద్ర శిఖమరుద్వా
సవదిగ్వియదంతరిక్షసర్వంసహలున్
భవదక్షి హృదోజ్ఘ్రా
ణవదనకర్ణోత్తమాంగనాభిపదోత్థల్. 206

సీ, విశ్వలోక వ్యాప్తి విష్ణునామముఁ దాల్తు
మధు వింద్రియములు దన్మర్దనమున
మధుసూదనుండవు మా యన విద్య ద
త్పతివి మాధవుఁడవు దపముచేత
నగుదు తపస్వివి హరణ మింతకుఁ జేసి
హరి వైతి నారంబు లన జలంబు

1. కు బాప.

లం దయనంబు నీ కగుట నారాయణ
త్వము వహించితి బృహత్త్వంబు బ్రంహ
తే. ణమును జూపుట బ్రహ్మ వై నాడఁ వింద్రి
యము లగు హృషీకములు దదీశాఖ్యఁ గలిగి
నది హృషీకేశసదము శమ్మది సుఖం బ
ఖిలమునకుఁ జేసి శంకరాకృతి భజింతు. 207
గీ. వసనము దివంబునన కాన వాసుదేవుఁ
[1]దన మనమున ముని యని యన యతనమునను
యతి యనఁగ భూతవితతి నీయందు నెప్డు
నునికిఁ గనితి విశ్వంబరాఖ్యను మురారి 208
క. కపదంబున బ్రహ్మయు నీ
శపదంబున నేనుఁ బరఁగి జన్మింపఁగ నీ
కుపగతము కేశవత్వము
ప్రసన్న మఖిలజగదీశ్వరత నీశతయున్. 209
గీ. వామనం బణువు తదాఖ్య వామనుఁడవు
వేదముల త్రినామములు దద్విక్రమమున
నీ త్రివిక్రనామంబు నెగడె వాణి
వెలయు గోసంజ్ఞ నెఱిఁగి గోవిందుఁ డయితి. 210
సీ. అగుదు ఛందముల గాయత్రి వర్ణంబుల
యం దకారము రుద్రులందు నేను
ననలుండు వసువులం నాదిత్యులందు వి
ష్ణుండు వాస్తోష్పతి సురలయందు
గజములలో నింద్రగజము పక్షులలోన
గరుడుఁడు నరులలో నరవరుండు
నిర్జరవరులలో నీరజాసనుఁడు వృ
క్షముల నశ్వత్థంబు శైలములను

1. దనఁగ మౌనంబునను ముని యనఁగ యతన
మున యతి యనంగ నీయందు భూతనివహ
మునికి గలుగ భూతావాసుఁ దన మురారి.

తే. మేరుగిరి దేవమునులలో నారదుండు
దైత్యులందు బ్రహ్లాదుండు ధనదవిభుఁడు
కిన్నరులయందు వాసుకి పన్నగముల
లోన మృగములలోనఁ బంచాననంబు. 211

సీ. నీయంద జనియించె నీయంద నిఖిలంబు
నడఁగె నీవాదిమధ్యాంత మగుట
నేన నీ వన నీవ నే నన వర్తింతు
మిరువుర శబ్దార్థ మేకరీతి
నీనామములు నాకు నా నామములు నీకుఁ
జేసినపూజ నాకుఁ బూజ
నిన్ను నొల్లనివార నన్ను నొల్లనివార
లెచట నీయునికి నా కచట నునికి

తే. చెల్లునది చెల్లుచున్నది చెల్ల నున్న
యది సమస్తంబు నీవ నీ కనభిగమ్య
మేదియును లేదు వేదంబు లెఱుఁగు నవియు
నీవ నా నమస్కారంబు నిన్నుఁ జేరు. 212

వ. అని పలికి సకలదేవతామునిసంఘంబులం గనుంగొని వారితో నిట్లు
యె. 213

క. ఏ మిరువురు నేకం బిది
సామర్థ్యజూరాదితత్త్వసారము హరిచేఁ
గామార్థధర్మమోక్ష
శ్రీమహిమలు మీతపంబు సేర్చు ఫలంబుల్. 214

క. ప్రణవాత్మకు నవ్యయు హరి
నణిమాదివిభూతికారణాంతఃకరణుం
బ్రణుతించువారు చేసిన
ప్రణామములు నన్నుఁ జేరుఁ బరమార్థముగాన్. 215

. ఇదియ పరమోపదేశంబు హితము సకల
మంగళము నిత్య మోంకారమంత్రమయము

శ్రీకరంబు నిశ్శ్రేయస సిద్ధి నిగమ
సారము తపఃఫలంబు నిశ్చలపదంబు. 216

వ. అని యద్దేవుని నుద్దేశించి. 217

సీ. ప్రణుతింతు నోం నమో భగవతే వాసుదే
వాయ నమో భక్తవత్సలాయ
సూర్యాత్మనే నమ స్సోమాత్మనే నమః
ప్రణవాత్మనే నమో బ్రహ్మణే న
మో రుద్రనామ్నే విమోనష్టవే నమో
మూలప్రకృతయే నమో వసుంధ
రాదిభూతగణానుహారిభాసే నమో
మాయామయాయ నమ స్సహస్ర

తే. బాహునేత్రశిరఃపాదవస్తయే న
మో వషట్స్వధాస్వాహాత్మమూర్తయే న
మః స్వభావశుద్ధాయ నమః ప్రహరణ
ధారిణే నమో యనుచు నుదాహరింతు. 218

గీ. ఆద్యబీజాయ విశ్వకర్త్రేఽక్షరాయ
నిర్గుణాయ గుణాత్మనే నిర్మలాయ
హరిహరాత్మనే ప్రవరదివ్యాయ యజ్ఞ
సూకరాయ నమో యనుచు న్నుతింతు. 219

క. అని వినుతించి మహేశుఁడు
మునులు వినఁగ నిది పురాణముఖ్యస్తోత్రం
బనవరతముఁ జదివిన వ్రా
సిన విన్నను సకల కార్యసిద్ధి ఘటించున్. 220

మ. అనుచుఁ బారిషదాంబికాసహితుఁడై యంతర్హితుండై త్రిలో
చనుఁ డేఁగెం దదనంతరంబ సుమనస్సంఘంబు గోవిందు వం
దనపూర్వంబుగ వీడుకొన్న మును లత్యానందులై యిచ్చలున్
జనిరా కృష్ణుఁడుఁ దార్క్ష్యు నెక్కి మగిడెం జక్రాది సన్నద్ధుఁడై. 221

ఉ. చక్రపినాకమండన భుజాకృతఖండన దైత్యఖండనా
విక్రమనర్తన ద్యుపదవీపరివర్తన మూర్తికీర్తనా
శక్రమణి ప్రభాసిత నిశాకరభాసిత వర్ణ భాసితా
నక్రపమత్తవారణ ఘృణారసకారణ కృత్తిధారణా. 222

క. చికురాభరణకిరీట
ప్రకటజటాజూటఘటితబర్హా ఫణీంద్రా
మకరాకరగిరితనయా
ముకురీభవదేకపంచముఖషట్చంద్రా. 223

మాలిని.

నిగమశిఖరవేద్యా నిర్యదానందవిద్యా
విగతశుగనవద్యావిర్భవద్ధ్యానవేద్యా
జగదధికర్మతరక్షా సారసంసారశిక్షా
ద్యగణితకృతసాక్షా దద్భుతాకారదీక్షా ! 224

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధాన విరాజితిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతకథానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణసాహిత్య రసపోషణసంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథ ప్రణీతంబైన యుత్తరహరివంశంబునందుఁ ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు

# ఉత్తరహరివంశము

## తృతీయాశ్వాసము

శ్రీ దుర్గాకుచదుర్గ
స్వేదాంభోహారయష్టివిభ్రమశాలీ
శ్రీదత్తాభయమద నా
హ్లాద క్రీడావినోద హరిహరనాథా ! 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

గీ. వాసుదేవుండు బదరికావనము సొచ్చి
ముందటితెఱంగునను తాను మునులఁగూడి
నవవినోదకథాగోష్ఠి నడపె నంత
నంతరంగంబు ముద మంద నంతలోన. 3

ఉ. ఇక్కడఁ బౌండ్రభూపతి విహీన వివేకతఁ జేవ యెక్కఁగా
నెక్కడి వాసుదేవుఁ ? డిల నేనొకరుండన వాసుదేవుఁడన్
దక్కినవాఁడు నందక సుదర్శన శార్ఙ్గగదాదిహేతులన్
[1]క్రుక్కక పట్టినన్ దెసలఁ జుట్టిన నిర్మలకీర్తి పట్టునే. 4

చ. అని తన వంగడం బగు ధరాధిపమంత్రి పదాదివర్గముం
బనివడి కూడఁబెట్టి శతభారసువర్ణము దండ మెవ్వఁడై
నను ధర వాసుదేవుఁడను నామమున న్నను బిల్వకున్నఁ బా
యనిపగ వాసుదేవుఁ డని యాదవుఁ బిల్చినఁ జాటి చెప్పితిన్. 5

క. నాచేతిచక్ర మిందఱుఁ
జూచితిరో చూడరో విశుద్ధతరాయో .

---

1. క్రుక్కక పట్టునే దెసలు చుట్టునె నిర్మలకీర్తిపట్టికల్.

మేచకితసహస్రారం
బాపక్రము దోలఁ జాలు నతిభర మగుటన్. 6

తే. నందకము గూల్చు యాదవునందక ంబుఁ
బాంచజన్యంబుచేతఁ దత్పాంచ జన్య
మడఁగు శార్ఙ్గంబుచేఁ జెను నతని శార్ఙ్గ
మసము సేయదె గద గోపుఁ డెత్తు గదను 7

ఉ. నావుడు నేమియుం బలుక నాలుక యాడనిపాటియైన ధా
త్రీవరకోటియుండ నొకదిక్కున మంత్రులు గూడి యిస్సిరో
యావసుదేవసూనుసరియా యితఁ డంచుఁ దొలంగి రెల్లచో
లావున నీతఁ డెక్కుడని లజ్జలు మానిరి ధూర్తసేవకుల్. 8

శా. ప్రాలేయాంశుమరీచినిర్మలతనూభాగంబుఁ గృష్ణాజిన
వ్యాలోలామలయజ్ఞసూత్రములు నంసాసక్తవీణాలతా
లాలిత్యంబు లలాటికారుచులుఁ గ్రాల న్నారదుం డిచ్చలం
గైలాసంబున నుండి వచ్చెఁ గలహోత్కంఠస్వాంతుఁ డచ్చోటికిన్. 9

క. వచ్చిన మునిపతి [1]కర్హణ
మిచ్చిన పిదపన్ మహీశు లెల్లను వినఁగా
మచ్చరపువాసుదేవుఁడు
[2]పెచ్చారితనంబు ప్రమానుపిల నిట్లనియెన్. 10

## పౌండ్రక వాసుదేవుఁడు వాసుదేవుని నారదునిముందఱ నిందించుట

మ. మునినాథా! నిఖిలంబు నీకు హృదయాంభోజాతగంధంబు దోఁ
పనియర్థంబులు లేవు నాకు సరి చూపం జాలుదే యాదవుం
డనుమానింపక వాసుదేవుఁ డని మిథ్యాగర్వరథ్యావిడం
బనుఁ డైనన్ [3]వినిపింతుఁగా కతని కీపంతంబుఁ జెల్లింతునే. 11

మ. కలరే రాజులలో మదీయకరచక్రక్రీడ సైరింపఁ బె
దల భీష్మాదుల ధిక్కరింపఁ దగ దెత్తం జాల రీకైదువో

2 కర్ష్యంభి పిచ్చాలితనంబు మదిన బెనఁగొన ననియెన్, పెచ్చాలితనంబు మందటిల నిట్లనియెన్ 3 నదపిం.

రలు వో నాడకు గోపమీరు నొరుపేరం జీరుమీ విక్రమా
ఢ్యులలో నేనును వాసుదేవుఁడ నతండున్ వాసుదేవుండ బే. 12

వ. అనుటయు. 13

చ. మనమున నోకిలించి మఱుమాటకుఁ గింకిరిపాటు తోడుగా
మునిపతి యల్ల నవ్వి విను మూర్ఖమురాంతకుఁ బుండరీకలో
చనుఁ ద్రిజగన్నుతున్ సుగుణసాగరుఁ జేరవు గాక శార్జ్గితో
బెనఁగుట మంటలో మిడుత బీరము సూపుట గాదె దుర్మతీ ! 14

క. నీశంఖము నీచక్రము
నీశార్జ్గము నెఱుఁగమే యనిం గదిసినచోఁ
గేశవసాధనములు గళ
పాశంబులు నీకుఁ దొడరి బ్రతుకఁగ వశమే. 15

క. ఏనుఁగులాగు పందికి
మానిసిచందంబు నీరుమానిసికి నగుం
గాని గుణంబులు గలుగవు
పూనకు చక్రంబు చక్రి పూనఁగ నెదురన్. 16

ఆ. త్రుళ్లుఁ[1]బోత నీవు [2]తూలిపోఁ బలికిన
సార మేమి తఱుఁగుఁ జక్రమునకు
నినుము కూడఁ [3]బొరుగ నిది చక్రమా యెత్తు
వచ్చుఁగాన [4]నొరకు వచ్చు నెట్లు. 17

మ. అనినం బౌండ్రుఁడు చిన్నవోయి హృదయం బల్లాడ నొం దేమియు
న్మనుకం బాఱక నారదా కినుకకు న్మూలంబు నీ మాటలై
నను శాపాస్త్రుఁడ వైననీకు నవమానం బేను జేయంగ నొ
[5]ల్ల నిజేచ్ఛం జను మింక యాదవుల నెల్లం ద్రుంచి మెచ్చించెదన్. 18

వ. అనుటయు నమ్మునీంద్రుండు నెమ్మనంబునం దనికిన యేవంబును భావంబునం బొడమిన రోషంబును మేలంబునం దెలుపుచు వెలుపలికి వెడలె

1. గొంక. గోఁక. 2. దూలపో. ౩. బోసి రిది. 4. యొరకు. 5. సే.

నిత్తెఱంగున నతఁ డుత్తలపడి బదరికాశ్రమంబునకు వచ్చి వాసుదేవుం గని
యతనితో నిట్లనియె. 19

శా. దేవా ! దేవర పేరు పెట్టుకొని ధాత్రిన్ వాసుదేవుం డనన్
లావుం జేవయు మీఱి పౌండ్రుఁడు దురాలాపంబులన్ గ్రొవ్వి సి
గ్గేవం జేమియు లేక నీసముఁడ నం చేమేని వాక్రువ్వ మ
ద్భావం బుద్గతరోషవహ్నియగుడున్ ధట్టించితిం బల్కులన్. 20

తే. ప్రల్లదంబున నందక పాంచజన్య
శార్ఙ్గకౌమోదకీసుదర్శనము లనఁగ
నలినలోచన నీ సాధనములసాటి
చేసె నతఁడు విశ్వామిత్రసృష్టి వోలె. 21

క. అనుటయు నారాయణుఁ డను
మునినాయక ! వేగపడకు మూఢునిఁ బౌండ్రా
వనివిభుని నీవు సూడఁగఁ
దునుముదు [1]నేఁ డెల్లిలోనఁ దుత్తునియలుగాన్. 22

## పౌండ్రుఁడు రాత్రివేళ వచ్చి ద్వారకను ముట్టడించుట

మ. అనిన న్నారదుఁ డుబ్బె నట్టియెడఁ బౌండ్రాధీశ్వరుం డేకల
వ్యనృపానేక సహస్రసంఖ్య రథకట్యాహాస్తి కాశ్వీయ సై
న్య నిరూఢిం జతురంగసైన్యమున సాహాయ్యంబుతో నాత్మవా
హిను లేతేర మురారిపట్టణముపై నేఁగె న్నిశీథంబునన్. 23

సీ. గర్జితానేకపోత్కటదానధారలు
జలరాశిరాణివాసముల గెలువ
వల్గదాజానేయవదన ఫేనము లంటి
నేల చుక్కలతోడినింగిఁ దెగడ
సన్నద్ధపాదాతశస్త్ర ప్రభాపంక్తి
కరదీపరాజిపైఁ గాలుద్రవ్వ
రథ్యా[2]ప్రతీకోత్థరవముచే గిరికోటి
పిడుగుల నెఱవిడిఁ బిఱుదుకొనఁగ

1. నెల్లింటిలోనఁదు 2. ప్రణీతో; ప్రణీపో.

తే. నంధతమసంబు శ్వేతపింఛాతపత్ర
దీధితులు మ్రింగవై జయంతీవితాన
మెదములకు నెడమీక మీఁ దెదము కొనఁగఁ
బరఁగి నడతెంచెఁ బౌండ్రభూపాలుసేన. 24

చ. పరిగొని వచ్చి యాదవులపట్టణమొక్కటఁ జుట్టుముట్టి యా
హరి పౌద గానరాఁ డల హలాయుధుఁ డెక్కడ వోయె సాత్యకిం
బొరిగొనుఁ డంచు నార్పులును బొబ్బలు నింగిఁ జెలంగఁ బౌండ్రభూ
వరభటకోటి తూర్పుదెస వాకిట భేరులు మ్రోసి డాసినన్. 25

మ. కరదీపంబులతోడ సామజతురంగస్యందనౌఘంబుతో
వరవీరావలితో బహు ప్రహరణవ్యాపారసన్నాహసు
స్థిరతన్ సాత్యకియున్ హలాయుధుఁడు హార్దిక్యుండు లోనైన సం
గరరత్నాకరకర్ణధారులు గడంక న్వచ్చి రచ్చోటికిన్ 26

వ. ఇవ్విధంబున నుభయబలంబులుం గదిసిన సందడికయ్యంబయ్యె నయ్యెడ కరులు గరులను దేరులు దేరులను దురంగంబులు తురంగంబులను బదాతులు పదాతులనుం దలపడి కత్తివాతియమ్ములం గత్తరించినం దుత్తుమురులగు కత్తళంబులును, ఘనగదాఘాతంబులం జిద్రుపలైన సీసకంబులును, ముసలప్రహారంబులం బఱియ లైన భటకర్పరంబులును, నిశితహేతివిదారణంబుల ఖండ ఖండంబు లైన శుండాల శుండాదండంబులును. మొక్కలంబులం బరశుధారలంజెక్కిన నిక్కడక్కడం బడిన పక్కెరలును, ప్రచండభిండి వాలసంక్రీడనంబులం గలయం గ్రుమ్మడువడ్డ రథాంగంబులును దుర్దాంతకుంతసంతాడనంబుల నింతింతలు తునియ లైనకరిదంతంబులును నరవాయిగొనక సురియలం జెరివినం దొరుగురక్తంబులును నెట్టుకొని సెలకట్టియలవైచిన నిట్టట్టు గదలక తెట్టెలు గొనం గూలిన కాలుబలంబులును గాలుబలంబులపైఁ బైకొనక యెక్కి పటవ[1]ణింపలేక తిరుగవచ్చినంజొచ్చి చక్కడఁచుటయుఁ జాఁపకట్టువడిఘోటకంబుల కింద మిలమిల మెలంగెడురావుతులను రావుతుల మోహరంబునకు నోహటించిన బోసిక కరిఘటలం బురికొల్పిన[2] రాగవాగల నైరావంబునం దురగఘట్టంబు నెల్పి తెల్పికొనిముగుడం బడి యడిదంబులు

1. ణివిప్ప 2 రాగెవాగె; రాగెవాగంబు నైరాగంబునం

డుస్సి వ్రేసినం జూసినచందంబున నేలంగూలిన యేనుంగుపీనుంగులును, నేనుంగుల పీనుంగుల దిగ నుఱికి పాఱు మావంతులును. మావంతులవిన్నాణంబులం బొంగి మ్రొగ్గుగజంబులగములపై యుగ్యంబులపగ్గంబుల వదలించి పోయినదియు పీఠిగాఁ దఱియ నుఱికిన యరదంబులకు ద్విరదంబు లెదు రొగ్గించి కడనొగలు వట్టి కరంబులం ద్రిప్పి వ్రేయించిన సారథిసహితంబు గాఁ జదిసినరథికులును రథికులకర లాఘవంబునం బఱపుశరపరంపరలచేతం దొరుగురుధిరంబులు కాలువలు గట్టం గట్టలు గట్టి చూచుసెనికులును సైనికులం బేరుకొని వాసి కెక్కించి పురి కొల్పు కోలలవారి యెలుంగులును జెలంగులును జటుపటహభేరి ఛాంకారంబులును బుంఖాను పుంఖనాదంబులును బిరుద కాహళకోలాహలంబులును బలంబులకుఁ జలంబులఁ బెనుప నినుపపొడి రాల నొండొరుల యలుగు లలుగులఁ బడ వ్రేసియు పిడం బోక డాసియుఁ బోకు పోకని యదలించియుఁ బంతంబులు ముదలించియుఁ బిలుపబిలుప నెత్తురుల బొత్తిల్లిన నేలం గాలూఁద నేరక జీరువాఱియు మూర్ఛల మునింగి తేఱియుఁ గైదువుల ఘటించియు నెదగాని చొరవచ్చిన దట్టించియు నంగంబుల హత్తియు నెమ్ముల సలియనొత్తియు సుభటసందోహంబులు గీలుబొమ్మలచందంబున [1]మెఱఁగాడు తెఱంగున [2]జొత్తుకడతలిలకై వడి సోమంబుల పోలిక సంజీవన విధిజ్ఞుల విధంబున నసువులదెసకు శంకింపక పోరు నవసరంబున.

## ఏకలవ్యుఁడు యాదవసైన్యంబు దైన్యంబు నొనరించుట

శా. వీరాగ్రేసరుఁ డేకలవ్యుఁడు ధనుర్విద్యానవద్యుండు దో
స్సారఖ్యాతి నరాతిరాజుల రణోత్సాహంబు దూరంబుగాఁ
బారావారవిహారమందరగిరి ప్రారంభ [3]శుంభద్గతిన్
దే రొప్పారఁగఁ బేరువాడి కలఁచెన్ ధీరోద్ధతానీకమున్. 28

సీ. అయిదుబాణంబులు హార్దిక్యు నొదల మా
 ర్గణధశకంబు సారణుని మేన
సాయకపంచవిశంతి శుకప్రభు నిశి
 తప్రదరంబుల దశక ముద్ద

---

1 మెఱుఁగారు 2 జొత్తుకడవలిలకై వడి వాహంబుల
3 జృంభోద్ధతిన్.

వాచార్యు గాత్రంబునందు స ప్తశరంబు
లానకదుందుభి యంగకమున
నాశుగపంచకం బక్రూరుకాయంబు
నం దెనుబదితొమ్మి దమ్ము లుగ్ర

తే. సేను దేహంబునను గ్రుచ్చి చెలఁగి హస్త
లాఘవము వింతగా నేకలవ్యుఁ డెచట
నెచట నున్నాఁడు సాత్యకి యెందుఁ బోయె
హలధరుం డని యదలించి యంతఁ బోక 29

మ. సమదానేకపచక్రవర్తినవకాసారంబుతో నాడుచం
దము చూపం గరదీపికానికరముం దట్టించి రాజన్యసై
న్యము చెలాచెదర[1]య్యె గుంపు లగుచో నవ్వీరుఁ డస్త్రంబులం
జమరం జొచ్చిన నొచ్చి విచ్చి పఱచెన్ జక్రాటాతిపై పోఁక లై. 30

క. సలిచప్పుడు లే కమ్మెయిఁ
దొలఁగినసైన్యంబు లెల్లఁ దొడిఁ దొడి నూరం
గలయఁబడి కోటదిక్కులఁ
బలుకక గుజగుజలు వోయెఁ బౌరులు బెగడన్. 31

శా. ఈచందంబున నేకలవ్యువిజయం బింతంత గా కున్న పీ
రాచారంబు నుతించి పౌండ్రకవిభుం డాత్మీయులం జూచి చే
పీచెం [2]ద్రవ్యుఁడు కోటమేడలు పర ద్రవ్యుండు[3]డాయుండు లెం
దేమా తెవ్వఁడు గొన్ననిత్తునని లావెక్కించె సంరంభియై. 32

వ. అనుటయు నబ్బలంబునం గలవీరభటసంఘంబు లయ్యవసరంబున 33

సీ. వంకదారకుఁ జేరి వాకిటి [4]దడ్డడం
బులు సేర్చి కొమ్మల మ్రోఁకు వైచి
ప్రాఁకి లోపలఁ జొచ్చి పలుగాఁడిఁ దెఱచిన
[5]పంతగార్లకు మున్న బద్దపరుల

1. యెం మూఁకలగు 2. ద్రోవుఁడు 3. పట్టుండు తెం 4. బద్దకం
5 పంతగారలుమున్న.

తోన నిచ్చెన లెక్కఁ ¹లోనికొత్తళములోఁ
బురణించి చొచ్చినపోటుమగల
వాఁడి మెచ్చక యాళువరిమీఁదఁ ²బాళెల
వారిఁ దాఁకించిన వానిబిరుదు

తే. లచ్చెరువు నొంద మేడలు సొచ్చి యార్చు
³దొడ్డకార్లచేఁ బఱివోయెఁ దూర్పుదిక్కు
జాలవాటుల నేటుల అంతు మిగిలి
తఱిమి రచ్చటి బలముఁ గొందఱు గడంగి. 34

ఉ. సామజవాజిముఖ్యబలసంతతి వీఁగిన వృష్ణివీరు లే
మే మనఁ జేవ లేక దమయిందులలోనఁ జొరంగ మందిర
స్తోమము గోపురంబుఁ బడఁద్రోవఁగఁ జప్పుడు మిన్ను ముట్టినన్
దామరపాకునీరువలెఁ దల్లడ మందిరి పౌరు లందఱున్. 35

వ. ఇట్లు చటులతర పరాక్రమంబునం బ్రతిభటబలంబులు దలంకం బౌండ్రభూపాలుండు యదువీరునగరంబుకలుకోట వికటంబుగా వలుదటం కంబుల నఱికించియుఁ దంచనపుగుండం బడవైచియు ⁴గొంకి క్రుమ్ముడు దగరు మొదలు గాఁగల సాధనంబులచేఁ జీకాకు పఱిచియు స్వస్తికసర్వతో భద్రనంద్యావర్తపిచ్ఛంద కాదిహర్మ్యప్రాసాద సౌధంబులు రూపుమాపించియు వెన్ను దన్ని చూచునవ సరంబున. 36

మ. హరివాక్యంబుఁ దలంచి సాత్యకి పురం బాత్మీయరక్షాస్థితిం
⁵జరపన్ వైరులు దొడ్డగొన్న పిదపన్ జక్రాయుధుం డెన్నునే
వరవీరావలిలోనఁ దమ్ము దనునే వాక్రుచ్చి నన్నంచు సం
గరసన్నాహము మీఱ నుద్ధతశతాంగస్ఫారనానాస్త్రుఁడై. 37

క. దారకునిసుతుఁడు దనకున్
సారథిగా నరద మెక్కి శైనేయుఁడు దు
ర్వారుఁడు దీపపరంపర
బోరనఁ జనుదేర యుద్ధమున కేతెంచెన్. 38

1. దోని, 2. పల్లెల: 3, దొడ్డకాఱుచే:బఱివోయె. 4- గొంకు।గొమ్మతగరు,
5. జగరన్—దొట్టకొన్న-

గీ రౌహిణీయుఁడు భుజబలోత్సాహ మెసఁగఁ
జటులరథమున శస్త్రాస్త్రసమితి నించి
మించి నడతెంచె నేనుఁగుమీఁద మెఱసి
యుద్ధవుఁడు నచ్చె నీతికి నుచిత మెఱిఁగి. 39

వ. ఇవ్విధంబున నడచుదొరలం గని యదువృష్ణిభోజాంధకకుకురుసైన్యంబులు గూడుకొని కృతవర్మప్రభృతిమహావీరులం దలకడచి నిజతూర్యంబులు సెలంగ సింహనాదంబులు నింగిముట్ట నడిచి మునుముట్ట నప్పట్టణంబు చొచ్చి కడింగు రిపుసేనలం దలపడియె నట్టియెడ. 40

శా. మాయం బాయఁగఁ బెట్టు యోగిక్రియ సామలతావిజేయుండు శై
నేయుం డత్తరివైరి వీరబలమున్ నిశ్శేషధూతంబుగా
వాయవ్యాస్త్రము నంబుదంబుగతిఁ బోవ న్వైచెఁ జొక్కాకుతో
రాయన్ రేణుకణంబుతోఁ జెనయఁ గార్పాసంబుతో సాటిగాన్. 41

క. పరబలముఁ దోలి వెనుకొని
పురివెడలెను సకలసైన్యమును దనుఁ బొగడన్
శరము కదంబునఁ ద్రిప్పుచు
బిరుదుమగలు వినఁగఁ బలికెఁ బెద్దయెలుఁగునన్. 42

పౌండ్రకసాత్యకు లొండొరుల నధిక్షేపించుచుఁ దాఁకుట

ఉ. ఎవ్వఁడు రోరి తాను నొకయెక్కుడువీరుఁడపోలె రాత్రిమైఁ
జివ్వకు వచ్చి క్రుచ్చిమిగఁ జేరినవాఁడు దదీయమస్తముం
గ్రొవ్వినమచ్చరంబునన కూల్చెద వానిశరీరమాంసముం
గ్రవ్వికొనంగ గృధ్రములఁ గంకములఁ బరితృప్తి దేల్చెదన్. 43

ఉ. నావుడుఁ గోపవేగముల నవ్వు మొగంబున నివ్వటిల్లఁ జెం
గావికనుంగవం బొడమఁగా వికటభ్రుకుటీకుటీలలా
టావిలఘర్మవారికణహారలలామనిలాసుఁడై గుణా
రావము చేసి నిష్ఠురశరఁ బరివోసి కడంగి డాసియన్. 44

వ. ఏయ నొల్లక పౌండ్రుకుండు సాత్యకితో నిట్లనియె 45

క. [1]అయ్యాదవగోపాలుం
దెయ్యేద నున్నాఁడొ పనుల నేం దడఁచె నొకో
యయ్యన్న తమ్ముఁడవు నీ
వియ్యాడెడుబిరుదుమాట లెచటఁ జదివితో. 46

చ. మిడికెడు వాసుదేవుఁ డన మీఁదు దలంపక యాదవుం డొకం
[2]డుడుగఁడు వానిఁ ద్రుంతు సమరోర్వరలో నని వచ్చి పోరునే
పడుచులతోడఁ బౌండ్రుఁ డదిపంతమె నావిశిఖంబు మ్రింగు నీ
తొడిగినబాణము న్వెనుక తూణమునందుననున్న ప్రాణమున్. 47

గీ. చక్రి పొడమంగఁ బార్థివస్థాన మయ్యె
నోరి మీ వంశమందుఁ దాఁకోర్వఁ జాలు
వారిఁ జూపుము కుమ్మరావమున రాగి
ముంత లేఋంగఁ గలవె నీ కింతయేల. 48

వ. అనుటయు సాత్యకి కోపించి. 49

క. ప్రేలకు జీలుగు వెరిఁగిన
మాలెకుఁ గంబంబు గాదు మాటలు మిగులన్
[3]నాలుక గఱచినయంతనె
చాలునొ మగతనము జూప సాత్యకి యెదురన్. 50

క. గిరితోడ [4]నురభ్రకమును
హరితో [5]భషకంబుఁ జెనయునట్టిద కాదే
హరితోడ నీవు లావునఁ
బురణించుట పౌండ్ర ! నీకు బోఁ డేమిటికిన్. 51

ఉ. పన్నిదవాఁడ వింకఁ జెడి పాఱకుమీ యని మూదలించి చే
నున్న నిశాతబాణము మహోద్ధతిమై నరిబోసి యేసినన్
గన్నుల నోరనెత్తురొలుకంగ శతాంగముమీఁద వ్రాలె నా
సన్నపరేతరాజ మనసౌధతలంబునఁ బవ్వళించె నాన్. 52

---

1. అయ.... దేయెద.... యాయిన్న.... వీయడిబీరలపు. 2. డుడుగక వానిముంతు లపఙోదములో నని. 3. నాలుగు. 4. న కరిపోదము, 5. బుషంబు.

సీ. అంతలోన తేఱి యాతండు బాణము
        ల్తొమ్మిదిఁటఁ బవింటఁ దొలుత నేసి
సాత్యకినిటలంబు సాయకం బొకట భే
        దించి నెత్తురువెల్లిఁదేల్ప నతఁడుఁ
దేరిపైఁ జదికిలఁ ద్రెళ్ళి నిశ్చైతన్య
        గతి నున్న దళసాయకముల సూతు
నిరువదేనమ్ములఁ దురగ చతుష్కంబు
        మిడుకు మాఁగ సేసి మిన్ను ముట్ట
తే. నార్చినఁ దదారవంబున నతఁడు మూర్చ
దెలిసి యొకకోలఁ దెగనిండఁ దిగిచి యేసె
వానివక్షంబు వగుల జీవంబు లేమ
కల దనఁగఁ దేరు పడిబాణముల నొగిల్చె. 53
క. ఖల్లముల రెంటఁ దెక్కెము
ద్రెళ్ళను సూతుతల డొల్లఁ దెగఁ గొని శరముల్
పెల్లు గురిసి చక్రంబునఁ
బిల్లులుగా హరులు గూల బీరము నెఱపెన్
వ. వెండియు. 55
గీ. సింహనాదంబు చేసిన సేద దేఱి
కనలి వరచాపములు గదాఖడ్గములును
గొన్ని సందిటఁ దనలావుకొలఁదిఁ బట్టి
నెగులు మోచినఁ బొంద్రుండు నేల కుఱికి. 56
సీ. కొలఁది మీఱిన బాణకోటులు శై నేయు
        పై నేసి పడవైచెఁ బడగ రథముఁ
బదిశరంబుల నేసి బాణచతుష్టయం
        బున రథ్యములఁ గూల్చి భుజబలంబు
నెఱయఁ జాపముతోఁద నేలకు దాఁటి సా
        త్యకి వానిగుణము బాణాసనంబుఁ
దునిమె నంతట వాఁడు దొడ్డకోదండంబుఁ
        గొని శరంబుల నొంచె శినిమనుమని

ఆ. నతఁడు నైదు నైదు [1]నాఱు నెన్మిదియును
శరము లేసి యేసి కెరలి పదరి
పలుక నంతలోనఁ బౌండ్రుఁడు సాత్యకి
విల్లు ముష్టికొలది విఱుగ నేసె. 57

ఉ. వేఱొకచాప మెత్తి యదువీరుఁడు డెబ్బదిరెండుబాణముల్
మీఱిన పౌండ్రభూవిభునిమేను కలంతట నాఁటి నల్గడం
బాఱఁగ నేసి రేసి శలభ ప్రకరంబు మహీరుహంబు పైఁ
దాఱు తెఱంగుచేసి యతిధైర్యము సూపె నతండు సైరణన్. 58

గీ. అర్ధచంద్ర బాణంబున యాదవేంద్రు
నేసి తోడన బలదూపు లేడు వఱపి
యతనివేగంబు మాన్చెఁ బంచాశుగముల
వృష్టివీరుండు పౌండ్రునివిల్లు దునిమె. 59

మ. తనలా వంతయు నిఁడఁ బౌండ్రుఁడు గదాదండంబు సారించి వై
చిన శైనేయుఁడు నమ్మహాయుధము డాచేఁ బట్టి నారాచ మే
య నతం డంతన పట్టి శక్తిదశకం బవ్వీరుపై నాఁటినన్
ధను వల్లంతట వైచి సాత్యకి గదాదండంబుచే నొప్పగన్. 60

క. దగ్గఱి యేసినఁ బౌండ్రుఁడు
ద్రగ్గక గదఁ గొనుచు వ్రేటు సరగునఁ గొన్నన్
మొగ్గరములోన నిరువుర
యగ్గలికలు మెఱసె గదలు నాకస మంటన్. 61

క. ఎత్తినగద లంకించియు
హత్తించియు బ్రమరి దిరిగి యడిచియుఁ ఙయిపై
నొత్తియుఁ దట్టియుఁ బట్టియు
మత్తగజద్వయముఁ బోలె మలసి రిరువురున్. 62

---

1. నాఱును నాఱును, నెనిమిదియు శరంబు లేసి యేసి, పదరి పలుకనంత బౌండ్రుండు సాత్యకి.

క. ఈచందంబునఁ దెఱపులు
వేచియుఁ బయిఁ బూఁచి లాఁచి వ్రేసియుఁ బైపైఁ
ద్రోచురుధిరమునఁ దడిసిరి
పూచిన మోదుగుల తోడఁబుట్టువు లనఁగన్. 63

వ. ఇట్లు సరిసరిం బోరు నవరసంబున సాత్యకి సవ్యమండల ప్రచారంబునఁ బొలసిన వాసుదేవుఁడు వలవంక శంకింపక [1]పక్క్రశంబు గానీక యర్ధభ్రమణంబునఁ గదిసి [2]పరిచాళిక చేసిన శైనేయుం దత్తెఱవికి నాసచేయక ముఖ చాళిచేసి [3]మురిసి త్రుళ్ళగించిన వవ్వీరుండు దళపి (ద్రిప్పి) వ్రేసి హాహా యనుటయుం గైటభారి తమ్ముండు గనలి నిలునిలు మవి యదలించి కక్ష్యావర్తంబు వెనుక కొదిగించి మెయిచూపిన నచ్చోరవరకు వాసుదేవుండు సీసకంబు [4]పూంచిన శైనేయుండు కుదికిలి గదను డాకేలు దాపించినం బొంచి చొచ్చిననంతంబునకు మెచ్చి పౌండ్రుండు కంఠాభరణంబు[5]చాళెంబున గద ద్రిప్పి భుజమధ్యంబు వ్రేసిన సాత్యకి స్వస్తికంబుగా నొడ్డి [6]బొంకుబొంకనుటయు నాన్నృపాలుండు గదసుట్టి తివియ వచ్చిన యదువీరుం డున్న తోడన యెత్తికొన్న నిరువురగదలును మసకంబునం బెనుంగు పాములపగిదిం దాళించుపాసికలతోలికఁ గ్రేతొటుకరళ్ళకై వడిఁగలయ బెరయు నిరువురు మెయి మలంచి పాపియు డాసియుఁ దట్టియుఁ బట్టియు హత్తియు నొత్తియు మలంగియుఁ దొలంగియు జడిసియు నొడిసియుందాఁటియుం దూఁటియు నరలించియు ము(వ)దలించియు లాసియు వ్రేసియుఁ దఱిమియు మెఱిమియు నొండొరువుల దేహంబులు రుధిరాసారంబునం దడిసి కుసుమితకింశుకంబులం బురుడింప లత్తుక జొత్తిల్లిన పుత్తళ్ళ విడంబింప గైరికజలంబుల మునిగిన సింగంబులఁ దలఁపింప నున్న సమయంబున. 64

గీ. అర్చి యెడవంక సాత్యకి యడ్డగింప
వాసుదేవుండు వలవంక వచ్చి యురము
వ్రేయ నవ్వీరుఁ డచ్చోట వ్రేసెఁ దత్త
ఱించి పౌండ్రుఁడు ధర మ్రోకటిల్లఁ బడఁగ. 65

---

1. పగళంబు. 2. యుప్పళి: 2. ముఖ- తూళగిం. 4. బొడిచిన. 5. ఐనుచాళింజన.
6. పోనుపోక. 7. గై. 8. నదల్చియు వదల్చియు.

క. ఆలోన నెగసి పౌండ్రన్సృ
పాలుఁడు శైనేయునిటలపట్టిక వ్రేయం
దూలి యతం డంత గదా
ఖీలాఘాతమున నతనిఁ బిలుకుర వ్రేసెన్. 66

సీ అటు వ్రేటువడి పౌండ్రుఁ డంతకుండును బోలెఁ
బెడచాళి గద ద్రిప్పి విడిచిపాటు
వైచినఁ బడి యాదవశ్రేష్ఠుఁ డెన్నఁడేన్
చచ్చినయట్లు భూశయ్య నుండి
గ్రమ్మఱఁ దెలిసి యగ్గద రెండుదునుకలు
చేసి సముద్భట సింహనాద
వదనుఁ డై యున్న నవ్వాసుదేవుఁడు సొచ్చి
యెదమచే సాత్యకి నిఱియఁబట్టి

తే. కుడికరంబునఁ బిడికిటఁ బొడిచె నురము
వృష్టివీరుండు నేలతో పీఁవు మోవ
నతని వైచిన నవ్వీరుఁ డతనిఁ గ్రింద
వైచె రెండుసైన్యంబులుఁ జూచుచుండ. 67

వ. ఇవ్విధంబున మల్లయుద్ధంబునకుఁ దొడంగి. 68

గీ. కడవరానకు [1]జొచ్చిడొక్కకరము హత్తి
జడికిమై బిడ గొని పట్టెసమునఁ దొడరి
తోరహత్తంబునకుఁ బోఁతమారిబొబ్బ
ణంబునను రింజ వట్టి విన్నాణ మెసఁగ 69

వ. మఱియు వివిధంబు లగువిన్నాణంబుల నొడిచియు నెమ్ములు నలియఁ బొడిచియు మండి దాఁకించియుఁ గదయి సోఁకించియుఁ దలదల[2]నాగించియు భుజంబులు భుజంబులతో స్రగ్గించియుఁగక్షంబుకక్షంబులతోఘట్టించియువక్షంబుపక్షంబుతోదట్టించియుఁ గరంబులు కరంబులతో నప్పళించియుఁ బిక్కలు పిక్కలతో నుప్పళించియుఁ గరంబులు కరంబులతో నప్పళించియుఁ బిక్కలు పిక్కలతో నుప్పళించియుఁ జరణంబులు చరణంబులతోఁ

1. జోడొక్కరముహత్తి. చడికిమైబిర, [బెరగొని] ... బొ త్తమూరిబ్బంత..., వింజపట్టి- 2. తంగిం.

దాఁచియు నడుము లాగించి వైచియు లులాయంబులు మలయుమాడ్కి బులులుఁదల పడ్డపోలికఁ గరులు పోరాడుకయివడి సింగంబులు పెనంగుభంగి నుపతాయి[1]తో నఖవాయి నిరువురుం జదిసియుం గదిసియు నచ్చలంబునం జముదు చల్లినమంటల కయివడిఁ బ్రత్తి తాల్చిన వడువున నిమ్మపండు నలంచిన పగిదిఁ ఖాదరసంబు మర్దించు పంతంబునఁ [2]జోళంబు విఱుచు తెఱంగున మనసునం బలిమి లేక విసువక పరస్పరజయకాంక్షలం బరాక్రమించు నవసరంబున. 70

ఉ. రెండు బలంబులందు నరరే యరరే యరరే యనంగ నొం
డొండఁ జెలఁగు సన్నుతుల నుబ్బుదు రీయదువీరుఁ జంపుఁ బౌం
డ్రుం డనువారు సాత్యకి కఠోరభుజాపరిఘుండు పౌండ్ర భూ
మండలనాథుఁ జంపు ననుమానము లేదనువారుఁ బోరిలోన్. 71

క. అట్టియెడఁ బుండ్రనందను
దట్టించి యదూద్వహుండు దశముష్టిహతిన్
బిట్టడువ నయిదు ముష్టుల
నెట్టు వొడిచె నతఁడు నొదలు నెళినెళి యనఁగన్. 72

బలరాముఁ డేకలవ్యునితోఁ దలపడి పోరుట

గీ. అంతలో నేకలవ్యుండు హలధరుండు
నాహవోత్సాహసన్నాహ మతిశయిల్లు
నెక్కు టెక్కుటిఁ దలపడ్డ నేకలవ్యుఁ
డేసె బలభద్రు నమ్ముల నిరువదింట. 73

క. ప్రదరంబులు పదియింటం
బదియింటం బదిట రెంటఁ బరువడి నేసెన్
మొదల నరదంబు సూతుం
దుది నేసె న్నారి దునియఁ ద్రుళ్ళి చెలఁగుచున్. 74

ఉ. అంతట రాముఁ డొండు గొనయం బమరన్ శరముల్ నిషాదసా
మంతునిమేనిలోఁ బది యమర్చి తదీయధనుఃప్రకాండ మిం

1. లోనమవాయ 2. బౌళయంబుగా.

తింతలుగా దశాశుగము లేసి పదింటను ముప్పదింటఁ ద
ద్దంతిబలంబు నేయుచుఁ బతాక ధరం బడ భల్ల మేసినన్. 75

సీ. అనిషాదేశ్వరుం డపరకోదండంబు
మధ్యమాంగుష్ఠప్రమాణదళక
ముగ మహామౌర్వీకముగ ధరించి నిశాత
ముఖసాయకమున రాముని యురంబు
నెఱ నాట నేసిన నిట్టూర్పు నిగిడించి
యత దేకలవ్యుబాణాసనంబు
దశవిశిఖముల లస్త్రకము[1]చక్కటిఁ ద్రుంచె
నవ్వీరుఁ డొక నిశాతాసి వైవ

తే. నడుమ నయిదుబాణంబుల నఱకె సీరి
వాఁడు సూతుపై నొకహేతి వైవ నదియు
బదిశరంబులఁ దునిమె నబ్బలుఁ డతండు
ఘంటలు చెలంగ నొకశక్తిఁ గనలి వైచె. 76

గీ. ఒడలు నొలియించి యదువీరుఁ డొడిసిపట్టి
యమ్మహాశక్తిఁ గ్రమ్మఱ నతని వైచె
నురము గాడఁగ భూపతుల్ తిరిగి చూడ
వేగ నది చేసె నించుక వెలితిచావు 77

వ. అట్టియెడఁ దదీయసైన్యంబు గజిబిజించిన. 78

శా దృష్టారాతినృపప్రతాపకలుషోద్రేకోగ్రమై తాఁకె నం
దష్టాశీతిసహస్రనిష్ఠురనిషాదాధీశసైన్యంబు సం
ఘృష్టాన్యోన్య భుజావిజృంభణరణత్కేయూర ధారోన్నత
స్పష్టాసిక్షురికాకుఠారపరిఘప్రాసక్షుర ప్రోద్ధతిన్, 79

వ. ఇట్టు దాఁకి బలభద్రుం బొదివి వివిధాయుధంబులం గనలించిన నవ్వీరుండు లయకాలశూలాయుధుండునుం బోలె హలవిహారం బమర సమరంబు సలుప బలుపు మిగిలి మగతనంబునం దలపడి మడిసినముంగలివీరులం గను

1. చక్కికిఁ,

గొనియునుం గడిపోవనికడిమి నిగుడం దెగి నడచి మగుడం దెరువు లేక నెగ డడి చిన చందంబునం బోలియు బలుమూఁకలును నాఁకొనిన బెబ్బులికి నబ్బినగిబ్బల విధంబున బహువిధవధంబులం బడిన బలుమానుసులును నుసులు లేక మానంబు మనంబునకు ధనంబుగా వనంబునం గార్చిచ్చునం గమరినయట్లు రూపు సెడి పీనుంగు పెంట లగుచోట్ల శరంబులు రాలినను శిరంబు వంపక కుంతంబులు వడి నను బంతంబులు వదలక ప్రాసంబులు వెడలినను రోసంబులు సడలక గదలు దొలం గినను నెదలు సలింపక శూలంబులు వోయినను నోలంబులు దలంపక చాపంబులు విఱిగినను దాంపంబులం బొరలక లాపుననిక్కియు ప్రేవులం జిక్కియు మెదలు ప్రిగ్గియుఁ ప్రక్కలు నలిసియు డొక్కలు నులిసియు వీఁపులు నగిలియు మూఁపులు నొలిగియు ముక్కులు చదిసియుఁ జెక్కులు చిదిసియు నెతురుల జొత్తిల్లి లత్తుకపుత్త ళులపోలికం బెనంగ నిడుపొడుపునం గూలిన యట్లలతెట్టలు గట్టలుకొన్న నెదురుదొట్టినరుధిరతరంగిణీ తటాకంబుల నోలలుడు భూతభేతాళం బుల నై తాళంబునకు నంతరంరంబు రంజిల్ల సయ్యాదవసింహంబు సింహనాదంబు చేసిన.

మ. హృదిజైతన్యమువోఁ దఁ దెప్పిఱి నిషాదేశుండు సంరబ్ధతం
గదచేతం గొని కామపాలహలసంఘట్టక్ష తాత్మీయసై
న్యదశారద్యనజాతిరోషతఁ బ్రలంబారాతివక్షస్థలం
బదర న్వ్రేయఁగ సీరియుం గదఁ దదీయాంగంబు నొప్పించినన్ 82

క. అయ్యిరువురు గద లదరఁగ
వ్రయ్యం గ్రుయ్యంగ వ్రేయురవమున జలధుల్
వియ్యా లందఁగ మదమున
దయ్యక పోరిరి విశంకటబలోద్భటులై. 82

క. ఆసమయంబునఁ బౌండ్రుఁడు
వ్రేసెన్ గద వ్రేసినట్లు వృష్ణివిభుఁ డిరం
బై సాత్యకియును వానిం
జేసేతన వ్రేసెఁ బిడుగు చిట్లినభంగిన్. 83

క. వేవిసయంతకు నలువురఁ
జావంకంబులును పోలెసైన్యము హాహా

రావములతోఁ జూడఁగ
దీవస వడయంగఁ దూర్పు తెలతెల [1]వాఱెన్. 84

వ. తదనంతరంబ.

సీ. కుంకు[2]ము హత్తించి కొనగోరఁ దీర్చిన
పురుహూతునిల్లాలిబొట్టనంగఁ
జక్రవాకములకుఁ బల్లఁగా మందు ద్రా
గించిన చెందపుగిన్నె యనఁగఁ
బార్వతీపతికిఁ బ్రభాతభూపతి గొన్న
యలరుగెందమ్మి కోహళి యనంగఁ
తొలిదిక్కుతొయ్యలి చెలులపైఁ జల్లంగ
నింద ముంచినపైడిఁకుంద యనఁగ
తే. మేరుధరణీధరంబుతో మేలమాడ
నుదయగిరిరాజు దలయెత్తెనో యనంగఁ
గ్రమముతో నించుకించుక గాన నగుచు
భానుబింబంబు గన్నులపండు వయ్యె. 86

## శ్రీకృష్ణుఁడు ద్వారకానగరమున కేతెంచుట

ఉ. అంత మురాంతకుఁ బదరికాశ్రమవాసులు వీడుకొన్న ని
శ్చింతుఁ డతండు పత్త్రిరథసింహము నెక్కి విమానపంక్తు లం
తంతఁ దొలంగ వచ్చి నగరాంతికసంగరసంభ్రమారవం
బెంతయు దవ్వులం జెవుల నించుక సోఁకిన సంశయించుచున్. 87

తే. హలధరునియార్పు సాత్యకి యార్భటియును
బ్రతిభటనినాదముల దాఁటి పరఁగుటయును
దెలిసి కంసారి సంగరోద్రేకఘూర్ణ
మాననయనుఁడై యిట్లని మదిఁ దలంచు. 88

చ. కటకట పుండ్రనందనుఁడు [3]కన్నులఁ గానక వచ్చి వీటిపై
నిటు విడియంగఁ జాలెనట యింకిట యాదవకోటి కేటికిం

---

1. నేగెన్. 2. మ, 3. కన్నులు

జటులపరాక్రమం బనుచుఁ జయ్యన జేరె మురారి యొత్తె ను
ద్భటకుటిలారిహృత్పుటవిపాటన ధన్యముఁ బాంచజన్యమున్. 89

క. ఆ నినదము విని యాదవ
సేనలు పొంగారె నెదురు సేసలు సల్లెన్
మానవపతితతి వందిజ
వానూనస్తుతులు చెలఁగె నచ్యుతు ప్రోలన్. 90

చ. గరుడుని డిగ్గి పిడ్కొలిపి కంసవిరోధి పురంబులోపలం
దిరపడి దారుకుల లనిచి తే రలవాటుగఁ దేర నెక్కి సం
గరకుతుకంబుతో వెడలి గర్వితులెల్లను దల్లడిల్ల ని
ష్ఠురరపాం: జన్యుఁడగు[2]చున్ నిగుడన్ గని పౌండ్రుఁ డత్తఱిన్. 91

క. శినిమనుమఁడు నిలు నిలు మని
వెనువెంటం దవిలి రాజవే నీవు ననుం
జెనకి యపకారితనమునఁ
జన వచ్చునె యనుడు శౌరి సాత్యకి కనియెన్. 92

మ. రణసంరంభము మాన్ప నేమిటి కనా రానిమ్ము రానిమ్ము నా
రణగర్వంబు మృగేంద్ర సంచరణపర్యంతంబ నీగాలికిం
దృణ మీతం డనుచు న్నిజానుజునిఁ బ్రీతిం దేల్చినం బౌండ్రుఁ డు
ల్బణరోషంబున వాసుదేవునకు నుల్లాసంబుతో నిట్లనున్. 93

ఉ. నీవును వాసుదేవుఁడవు నిక్కము యేనును వాసుదేవుఁడం
బో వినువారి కైన నిది వోలునె యింతటనుండి ధాత్రిలో
గోవులఁ గాచి గాడిదల గొడ్డులఁ బోతులఁ జంపిరేని నే
జీవుల వాసుదేవుఁ డనఁ జెల్లునె లావునఁ బేరుసెల్లునే. 94

క. నాకును గద నీకును గద
నాకును నందకము నీకు నందక మహహా
నాకును జక్రము చక్రము
నీకును విలు నాకు విల్లు నీకుం దగునే. 95

1. జ, 2. డున్ నిగిడెన్.

మ. విను నీవారలఁ బోరిలోఁ గెలిచెదన్ నేఁడెందు [1]వోవచ్చు నీ
కనుమానింపక వాసుదేవుఁ డన నొయ్యారంబునం జెల్ల దె
వ్వనిఁగా జూచితి నన్ను నొక్కగుహలో వర్తింప సింహద్వయం
బునకుం గూడునె యోడునే యొరునికిం బుండ్రక్షమాధీశుఁడున్. 96

ఉ. నావుడు నవ్వు నెమ్మొగమున న్నెగయంగ జనార్దనుండు రా
రా వెడమాట లాడగ దురాగ్రహ చెల్లదు వాసుదేవసం
భావన నీకు నేఁ గలుగఁ బార్థివులెన్నరు గాక [2]యెన్నదున్
లావు గొఱంత గాక నిఖిలక్రియచక్రము నీదుచక్రమున్.

గీ. వెండియును గైదువులు నీకు వేఱ కలుగుఁ
బేరు కలసొమ్ము లగుఁ బోర బెఁడుకంటె
లావు గలవని వింటిమి లజ్జకంద
యొడలఁ గలదేని బలుమాట లుడిగి నడవు. 98

సీ. అనుచు మురాంతకుం డాపౌండ్రు నొకనిశా
తాశుగంబున నేసె నతఁడు బాణ
దశకంబుఁ గంసారిఁ దాఁకించి దారకు
నిరువదనమ్ముల నేసి తురగ
ములమేనఁ బదిశరంబులు గ్రుచ్చి వెండియు
హరిమీఁద డెబ్బది యమ్ము లేయ
[3]మురవైరి మానసంబున నగి వానిద
ర్పము గంద దొడ్డనారసము దొడిగి

తే. జలజనాభుఁడు కోదండచతురుఁ డగుచు
గుఱ్ఱములతోడ సారథిఁ గూలనేసి
వారెనయుఁ జక్రరక్షకద్వయముఁ ద్రుంచి
కల్లు బిల్లలు చేసి వెగ్గలము నవ్వె. 99

---

1. బ్రౌ. 2. యొక్కెడెన్. 3. నగవుతో శౌరిమానసమున వాని దర్పము మెచ్చి దొడ్డనారసము దొడిగి. స్థిరము తోడన సారథిశిరము నఱికి, గుఱ్ఱములు నాలుగమ్ములఁ గూలనేసి.

గీ. తెరపని మానిపిన వాసుదేవుఁ డిలకు
దాఁటి శాతాసి వైచె మాధవునిమీఁదఁ
బదిశరంబులఁ ద్రుంచి గోపాలవిభుఁడు
ముద్దుఁడునుబోలె కన్నులు మూసికొనియె 100

చ. అతఁ డొకశక్తి వైచిన మురాంతకుఁ డంతన రెండు చేసె న
క్షతమదలీల వాఁడు పరిఘంబున వైచినఁ [1]ద్రుంచె బౌండ్రభూ
పతి బహులోహభారదృఢభారదృఢారకతోరచక్ర ము
ద్ధతిఁ గొని సీతలంబె యిది దాకినఁ నోర్వఁగ నంచు నేసినన్. 101

క. గగనమున వచ్చుచక్రముఁ
జిగురాకుం బోలెఁ జక్రి చేఁబట్టి వడిన్
మగుడంగఁ ద్రిప్పి వైచిన
బెగడక మైముఱిసి వాఁడు పెల్లుగ నార్చెన్. 102

క. కడు వెఱఁగంది మురాంతకుఁ
డొడి దప్పినపాముఁవోలె నుండఁగ మఱిఁ దా
నొడిసెల జొన్నల కాచెడి
వడువునఁ బౌండ్రుండు ఱాల వైచెం బెలుచన్. 103

శ్రీకృష్ణుఁడు చక్రమున బౌండ్రునితలఁ దునుముట

మ. అవి నారాయణుఁ డమ్ములం దునిమె నానాస్త్రంబులం గ్రమ్మఱం
గవియంజేసి యొకింత బీరము సెడం గారించి దైతేయచ
క్రవిదారక్రకచ క్రమం బయిన చక్రం బెత్తి తద్దేహముం
బవుల న్వైచినఁ దుంగ ప్రచ్చినగతిం బాసెం బ్రకాశంబుగన్. 104

వ. ఆ సమయంబున. 105

చ. హలధరుఁ డేకలవ్యు హృదయంబు గొనన్ ఘనశక్తి వైచినన్
బలుగద వైచె వాఁడు బలభద్రునివక్ష మతండు రెండు సే
తుల గద పూన్చి వైచె నది తోరపుమంటలు మింటనంటఁ బైఁ
బొలసినఁ దేరు డిగ్గి చెడిపోయె నిషాదుఁడు గాండిశీకుఁడై. 106

1. యున్, వడిసెడిత్రొక్కుల - (కపియుం. గుడిచెడికొన్నల.)

గీ. విఱిఁగి పాఱినఁ బో నీక వెన్నడించు
హలధరునిఁ జూచి వెగడొంది యబ్ధిలోన
నుఱికి దరి చేర రా కైదుయోజనములు
లావుతో నీఁది వాఁడొకదీవి చేరె. 107

వ. ఇట్లు నీలాంబరుం డేకలవ్యపలాయనంబున పరిపూర్ణ మనోరథుండై మరలి యంతకు మున్న సంతసంబున సామంత సహితుండై సభామండపంబునం బేరోలగంబుననున్న నీలవర్ణుం గలసె. సాత్యకియును సకలయదువీరసమేతంబుగా నయ్యెడకు వచ్చి నవ్విధంబున విజయవిభవభాసురుండై వాసుదేవుండు కైలాస యాత్రా ప్రసంగంబుచేసి ఘంటాకర్ణకాలాంతకుల వృత్తాంతంబును గొనియాడి పార్వతీపతి ప్రసన్నుండగుటయు వరలాభంబును సురలు సంయములు హరిహరా భేదభావంబుఁ దెలియుటయు నెఱింగించి యెల్లవారల నిజనివాసంబులకు వీడుకొలిపి యనంతరంబ యంతఃపుర ప్రవేశంబు చేసి సత్యభామారుక్మిణుల సన్నిధిం దన సకల వృత్తాంతంబును జెప్పె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయునితో నట్టి యెడ నొక్క విస్మయంబు వినఁ గల దవధరింపు మని యిట్లనియె. 108

## కృష్ణుడు రుక్మిణీ సత్యభామలతో జూదమాడుట

గీ. చక్రధరుఁ డట్లు రుక్మిణీసత్యభామ
లిరుగెలంకులఁ గొలువ ననేకగణిక
లంత నంత భజింప సత్యాముఖంబు
చూచి నెత్తమాడుద మనుచును గదంగి. 109

క. ఓ తరుణి నేను నెత్తము
నీతో నాడు నెడ రుక్మిణి గనుంగొను, ని
న్నాతి మఱి యాడ నీవుం
జూ లింతియ పంత మడుగుచోఁ దెల్పుటకున్. 110

వ. అనుటయు నద్దేవి యిట్లనియె. 111

ఆ. వాదులానితోడ వాట్లినితోడను
బూతుతోడఁ దిండిపోతుతోడ

నటమటీనితోడ నడియరితోడను
వెలకు నెత్తమాడ వెరవు గాదు. 112

క. జూదరివి సుమా[1]శివి నెఱ
వాదివి [2]తసుకరివి గెలువ వచ్చునటే దా
మోదర నిను మా కనుటయు
నాదెసఁ గనుగొనక పిలువు మనె జాంబవతిన్. 113

వ. అనుటయు సత్యభామ సాసూయంబుగా వాసుదేవున కిట్లనియె. 114

క. కలిగె నొక జాంబవతి వె
న్నెలవడఁ [3]బడె దేల వలపు నీతల వేగెన్
బులియ[4]క వే సవతులు గల
పోలతుఁల కేపాటు వడక పో రా దనియెన్. 115

క. చిత్తం బూరక కలఁచెదు
నెత్తము నాతోడ నాడ నేరుపు గలదే?
పొత్తు గలసి నీవును నీ
తత్తబళలు రందు గెలిచెదం బగువడితోన్. 116

ఉ. ఇంతయు నేల మీద నెదు రెక్కటి[5]లో మునికిం బదారు సె
ల్లింతుఁ [6]గడళ్ళతాఁకున వెలిం బడ సారె గలప్పు దిత్తు గె
ల్పంతన సంగ్రహంబున సహారువు[7]తోఁ గను మాడిపోయినం
బంతముతో [8]దొహారమునఁ బట్టుదుఁ బాసికబొమ్మ గట్టుదున్, 117

చ. తొలితొలి రుక్మిణీ రమణితో నెఱవాదివి నెత్త మాడుమా
గెలిచెదవేని మేలు సరికిం దగ నాదెద నూదు వట్టి నీ
కొలఁది యెఱుంగమే యనుడుఁ గోపము గన్నులఁ గ్రోలి నవ్వి య
చ్చెలువలతోడ శౌరి పొలిచెం జతురంతసమాసనంబునన్. 118

వ. ఇట్లు చతురంతాసనంబున నుండి సకల లోకనాథుండు సత్యభామకు సాక్షి పదం బొసంగి రుక్మిణీసమ్ముఖంబుగా సమాసీనుండయిన న ద్దేవియు. 119

1 నిసి 2 తనకలివి (తనుకరివి) 3 బడనేల 4 కు 5 నొక్కటి 6 దగ
7 లోగము 8. దహారువున (పీ)

సీ. [1]జోగిణి గొనరి [2]బైసుక వెట్టి పలకపై
సారెలు వోయించి సరము చూచి
తనకు లా గయిన నెత్తంబు గైకొని పన్ని
పాసికర్ దాళించి పా టెఱింగి
లోహటంటులు [3]మానిలులిఁ గన్నఁ బడకున్నఁ
బరదాళ మని పోవుఁ బలక లిచ్చి
తప్పార్తుఁ జూ రెండుదాయంబులును గని
వారింపకుము పోటు[వ్రా]లు గలపు
తే. పంత మడిగిన నీవలె భాగ మింతఁ
బోరఁ బెద్దదాయం బాడి పోరు వుచ్చి
వైచునది ధన మునికి పో వచ్చు ననుచుఁ
బేరుకొని పాటుతఱి సరి బేసి యడిగి. 120

క. అత్తీవం [4]చిత్తిగ దుగ
సత్తా దచ్చొక పంచి చౌవం చీరై
దిత్తిగ యిద్దుగ బ్రదలు
చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్. 121

సీ. దుగుణంబు సేసినతోడనే మూఁ డని
వారించి లే దని వలుము సేసి
యూర కెత్తకు దాయ ముగ్గడించినఁ గాని
పట్టి వేయకు మని పటితళించి
వెడలిన సారెలు వెనుకముందఱ చేసి
యెత్తిన సారె పో నీక యార్చి
సమ మాయె రమ్మని సరస [5]వారలఁ బిల్చి
గెలుపు సుమాళంబు గెరలఁ జేయ
తే. బసిడి యారైదు పూజించి పలకమీఁద
బలపమున వ్రాసి వెలివ్రాయిఁ దొలగివైచి
పన్ని పంచి యెక్కటి నాడఁ బంచి వ్రాలుఁ
దప్పు నో పత్రనయమునఁ దాన గెలిచె. 122

1. జేగి. 2. వైసిక. 3. లులితంబువడ. 4. చవుక దుగ. 5. వారికి పిచ్చి.

వ. ఇ త్తెఱంగున న త్తరుణి కరకౌశలంబును దట్టనయుం బుచ్చిపెట్టు వెరవును గెలుపులెక్కయు లోపలం గలంగుటయు మోసపోక పంతం బడిగిన నిమ్మపండు వైచి యుఱికితి నని సరి సరి యన్న జొన్నల కని తాఁకె నన్నఁ గొన్న వారికి నని గెలిచితి నన్నమగనికి మున్నని పుడికిపుచ్చికొన్నట్లు గ త్తరించిన చందంబునఁ బందెంబు పఱచినవిధంబున మ్రొక్కిన దీవించిన విధంబున వెరవున నాడుటయు నాకపటనాటక సూత్రధారుం [1]డంకించుకొని యుల్లసంబున సారెయొడ్డి తొమ్మిది దాయంబుల కిచ్చిన నచ్చెలువ యెక్క పలక తప్పుదాయంబునకు నొక వ్రాయి విడిచెద ననుటయు నద్దేవుండు నాదాయ మీరైదు వెనుక యోటంబు విఱుగు ననుటయు నుదరిపడి యమ్ముదిత సవిలాసంబుగా వైచిన నాశౌరి గోరినదాయంబ పడినం బొంగి వెనుక సరి సరి యని యంతనుండి విన్ననైయాడి యన్నాతి మిగుల నోడియుం దలంకక. 123

సీ. చేయదు దుగుణంబు సెలవు లే కుండిన
నెక్కినపలకఁ బో నిచ్చుఁగాని
పలుకదు రోషించి పదనిపాసికలతో
నవదాయ మైనను నాడుఁ గాని
యుల్లదు గోపించి యొండునెత్తము పన్న
[2]నెచరంబు నేర్పని యెన్నుఁ గాని
నడుఁకదు వంచించి నయ మెక్క డడిగిన
నిలుత మంతట నన్న నిలుచుఁ గాని

తే. పలక దఱుమక [3]బయసుక పల్లటిలక
బోఁటి దూఱక యాతావు పుచ్చు మనక
[4]క్రింద గెలిచినవ్రాలు లెక్కింపు మనక
తప్పు నాడక తొల్లింటిదారి చెడక. 124

క. ఇవ్విధమున రుక్మిణీమదిఁ
బువ్వుం బరిమళముబోలెఁ బొలుపుగ నెత్తం

1. డెక్కించుకొని. 2. నచరంబు—యురయు. 3. బైసిక. 4. యెంతలెక్కింపు మనక వ్రాయెక్క డనక.

ఋవ్వాయి గలిగె శౌరికి
మవ్వము దిగఁ దొరఁగె గెలుపు మట్టం బయ్యెన్. 125

దీ. చాలు నని పొసె రుక్మిణి సత్యభామ
కరము గరమునఁ గీలించి కమలనాభుఁ
డిందు రమ్మనిపిలువ నయ్యింతి నగుచు
నభిముఖంబునఁ బాసిక లందుకొనియె. 126

వ. పందెంబు చెప్ప రుక్మిణిం జాలించి. 127

సీ. ఒకదాయ మాడిన నున్నదాయం బాడు
మనక వాటులు రెండు గొని చెలంగి
కానని మాటఁ దాఁ గడచి పోయినఁ జెప్ప
నెత్తంబు వడ దని నేర్పు దెగడి
యొకదాయమునకును నొంటి దాఁకినఁ బోయి
యింక వై చెద నని యినుమడించి
పోయెడి నని వ్రేయఁ బూచిన వారించి
చూచిపో నిమ్మని సూటి చెఱిచి

తే. సారె మోపును బొరలును సదర నిదర
మెఱిఁగి లాగైనఁగైకొని యించుకంత
పొసంగ కుండిన రుక్మిణి బొంకు బొంక
శౌరిఁ బలుమఱు గెలిచె నా సత్యభామ.

క. నిష్కము మొద లెక్కన్ ద్విచ
తుష్కాష్టక షోడశాదిదుర్వహశులా్క
నిష్కములు వెరుగఁగా శో
చిష్కేశద్యోత మగు హృషీకేశుమదిన్. 129

వ. ఇట్లు విశ్వలోకేశ్వరుండు వినోదించు నవసరంబున. 130

కాశీపతి ద్వారకపైఁ గృత్యను బనుచుట

ఉ. తాపముఁ గోపముం [2]దలము దాఁకిన బొంద్రసహాయుఁడైన కా
శీపతి సైఁప లేక హరుచేఁ బడసెఁ బురిదేహదాహసం

1. బొమ్మని వ్రేటుసూటి. 2. తలఁపు.

దీపనిఁ గృత్య నాఁగ నొకదేవతఁ బావకకుండమధ్యకీ
లాపరిశోభితం గొలువులావులు వేలుపులైన మెచ్చరే. 131

క. మంటల మలఁచినరూపై
మింట నడరి చూపు చూపు మ్రింగెదఁ గడు నాఁ
కొంటిం గలదే యాహుత
యంటయు వాఁ దంటఁ బనచె యాదవపురమున్. 132

గీ. ఒడల నేదిక్కు సూచిన యోజనంబు
మందు చుండఁగఁ దానును మగువ వోలె
ద్వారవతిసేర నబ్బారిఁ దల్ల డిల్లి
పట్టణం బెల్ల నిట్టట్టు పడఁ గలంగె. 133

గీ. సాత్యకియు సీరపాణియు సంభ్రమించి
తమకుఁ జెప్పినవారును దారుఁగూడి
పెద్ద లైనసావాసులఁ బిలిచి పంచి
రంతిపురములో హరి నెత్త మాడునెడకు. 134

వ. వారును దత్కృత్యాదర్శనంబు వెగడందినవారు గావున. 135

క. పెదవులు దడుపుచుఁ బదములు
గుదిగొనఁ దత్తఱపుమాట గుత్తుక దగులన్
ముదుసలితనమున బెదరున
వదలినయంగములు మిగుల వడఁకఁ గడంకన్. 136

క. సకలజగన్నాయక నేఁ
డొకలలన వవుఃకృపీటయోనిజ్వాలా
వికటచ్ఛటచ్ఛటారవ
వికారఘోరముగఁ జేరె నీపురమునకున్. 137

క. ఆఁకొన్న మృత్యువో వెలిఁ
బ్రాఁకిన లయ కాలరుద్ర ఫాలానలమో
యూఁకొనఁ దడ వయ్యెడు నది
సోఁకినచో టెల్లఁ గాలుఁ జొరఁ నిచ్చెదవే. 138

క. నావుడు దుగుణము సూ యిది
తీవంచన[1]యోడెఁ దప్పితే సరి యే యే
మీ వెఱవకు మన[2]రా ప్రజం
బోవుఁ జుమీ పలకప్రాయి పొదపొదఁ దనినన్. 139

వ. వార లన్నారాయణదేవుండు నెత్తంబు తమకంబునం దత్తఱంపు నొడువులఁ గలయందమకు నుత్తరం బిచ్చిన పలుకులం బురుషోత్తముని చిత్తంబు దమమీఁద లే దని విచారించి విన్నపం బవధారు దేవా యనుటయు నయ్యదు కులాంబుధి సుధాకరుండు సకలకళాకుశలుండు గావున నత్తఱి సత్యభామ పాసికలు దాలించి వైచిన. 140

గీ. దాయ మెత్తనో యీసారె దాఁక నీక
కట్టి గెలిచెద నిదె పాసి కల[3]నిదయ్య
ముల బటాబూర మిందేమి ముట్టఁ గలదొ
పొంది వచ్చినప్రాలకుఁ బోవుఁ గాక. 141

క. నావుడు సంతోషించిరి
సావాసులు వీరవచనచతురత సత్యా
దేవియు నెత్తపుమాటలు
గా విని తెలిసికొని మెచ్చెఁ గంసారాతిన్, 142

## శ్రీకృష్ణుఁడు కృత్యపైఁ జక్రముఁ బంపుట

మ. మతి నొక్కింతయు సంచలింపక నిలింపత్రాణపారీణుఁ ద
చ్యుతుఁ డాకృత్య కకృత్యకారిణికి ప్రాప్తిగాఁ బంచె ని
ర్గతబాష్పోదక దానధారరిపురాట్కాసార[4]విస్తారసం
తతపూరస్థిరమానమీనహరణాంతర్నక్రముం జక్రమున్. 143

వ. అదియును శతకోటి శతకోటిసన్నిభంబై చిత్రభాను చిత్రభానుభావంబై సహస్రకిరణసహస్రకిరనిపుణంబై సహస్రారుణమండలమధ్యదేవతా వివిధాయుధ విహరణవిద్యుల్లతికావిలాసంబై జపాషనిక్షిప్తరక్షారక్షణం

1. యొడ్డిత. 2. రోపో. 3. నువచ్చి పట్టెవో భూత మిందేమి పుట్టఁ గలదా. 4. ధీసార.

బై మంటలు మింట నంట వెడలి కడలి వెడలిన బడబానలకీలాకలాపంబు చందంబునఁ గాలకూటవిషవహ్నిజ్వాలామాలికాభీలం బై నీలకంఠనిటలతటనయనశిఖిశిఖాసహాయం బైన తెఱంగున మెఱచి చఱచినం బురంబు సైరనేరక కృత్య కృత్యంబు లేక మరలి పఱవం జొచ్చిన విచ్చలవిడిఁ దనమయం బుగ గగనంబున నిగుడు నచ్చక్రంబుం గనుంగొని. 144

క. సురగరుడయక్షవిద్యా
ధర కిన్నర దివ్యమునులు తద్దర్శనసం
స్మరణ ప్రణామపూజా
పరతంత్రతఁ దెరువు దొలలగి బలసిరి చదలన్. 145

క. పురుహూతముఖ్యదిక్పా
లురును సేవింపంగ సకలలోకేశ్వరుఁ డం
బురుహాసనుఁడు గని నమ
స్కరించి వినుతించె నిజముఁ గై వారముగాన్. 146

సీ. దైతేయమదవతీధమ్మిల్లములతోడ
విరులనెత్తావికి వీడుకోలు
దనుజశుద్ధాంతకాంతాకటాక్షములతోఁ
గలికికాటుకలకుఁ గానివావి
దానవమానినీ స్తనకుంభములతోడఁ
బసుపుఁబయ్యెదలకుఁ బాయు తెరువు
దైత్యావరోధవదయితాధరములతో
సొబగుపీడెములకుఁ జుక్క యెదురు

తే. చేసి సురసుందరీకరోశీరతాల
వృంతచలితాంతకుంతలవిలసదింద్ర
కులవధూటీలలాటికాకుంకుమంబుఁ
బదిలపఱుపఁ జక్రంబ నీథరమ కాదె. 147

వ. అనుచుం జక్రంబు వీడుకొని కడచి పోవుటయు నాసుదర్శనంబు నుద్దేశించి. 148

మ. సతతంబు న్నుతియింతు జంతుమయసంసార క్రియారక్షణా
క్షతశౌర్యక్షపితారిపక్ష మగుటన్ సంగ్రామభీమభ్రమా
గతగేహాంతికదీర్ఘి కాతటలుఠత్కంఠ [1]చ్ఛిదాచ్ఛాదన
క్షతజక్షాళితకేళితామరసరక్షశ్చక్రముం జక్రమున్. 149

క. అనుచు గొనియాడి వనజా
సన్ను( డేగె సుదర్శనంబు సనుచో నెదురం
గని దనుజరాక్షసులు క్రో
ధను లై తన్నిశితధార( దగిలి తునియ(గన్. 150

ఉ. ఆ పమేశ్వరుండు జగదంబికతో( బ్రమథవ్రజంబుతో
గోపతితోడ( జక్రమునకుం జవ మెక్కుడు పోదమంచు( గా
శీపురి నుండ నొల్ల కతిశీఘ్రగతిన్ శతయోజనంబులం
దాపసయోగ్యమై పర(గుతాలవనంబున కే(గె నెమ్మదిన్. 151

క. కాశీపతినగరము పై
నాశాకాశావకాశహాశహాశితహతా
క్రోశజ్జనజాలం బై
కేశవచక్రంబు కృత్యకృత్యం బయ్యెన్. 152

ఉ. ఆపురుషోత్తమాయుధము నంతక ము న్గను(గొన్నభీతి( గా
శీపతి( జేరి యుప్పతిల( జేసిన సిద్ధు(డ వంచు( గౌ(గిటం
జేపదం బట్టి మంబరము( జేసె దిగంబరవేష( గృత్య( ద
త్పాపపరాయణద్వయము( బావకచక్రము నీఱు చేసియున్. 153

చ. తనియక కాల్చె వెండియును దంతితురంగశతాంగసైనికా
వనిసురమండలాధిపతివై శ్యజఘన్యజమండలాను లే
పనకుసుమాంశుక స్తబకబంధవనాచలదుర్గ రౌప్యకాం
చనతృణదారుగేహదృఢసంచయ సూక్ష్మమహాపదార్థముల్. 154

గీ. ఆరు యోజనములలో(తు నందులో స
గంబు నలుసదరము( గాలి కాశి గాసి

1. చ్ఛిదాచ్ఛేదన.

యయ్యె ముప్పదియేండ్లు సిద్ధాలు దింద్రు
చేత నవిముక్త[1]మయి చెల్లెఁ జితి యనంగ. 155

వ. ఇట్లు కాశీపురంబు దరికొలిపి కృత్యాసంహారణంబునం గృతకృత్యుం బై సుదర్శనంబు దామోదరదేవునకుం బొడసూపి సుఖం బుండె దురోదర పరాయణుండైన యన్నారాయణుండు చెలుపు నోటంబును సరిగా నద్దేవీ ద్వయంబుతో వినోదించుచు మఱియు వివిధాంతఃపురవనితావిహారంబులం బ్రొద్దు పుచ్చుచు నుండె నచ్చక్రంబు వెండియు. 156

క. దైతేయ కామినీసం
ఘాతము మగ మొలక లైనకడుపులు డిగ సం
కేతించినట్లు చక్రము
పాతాళంబునకు నరుగుఁ బ్రతిపాణ్మాసిన్. 157

క. నీయెడ నాయెడ నేయెడఁ
బాయఁడు గృష్ణుండు విష్ణుపరిచర్యాసం
ధాయకము చక్ర మాత్మం
జేయుము సత్పూజ లిష్ట సిద్ధికి ననఘా. 158

వ. ఈ చక్ర ప్రభావంబు భావనంబునం దలంచిన యతనికిం గార్య సిద్ధియు శరీరరక్షయుం జేకుఱు నిది నీకుఁ జెప్పితి సావధానుండవై యెప్పుడుం దలంచునది యనుచు నమ్మునీంద్రుండు. 159

ఉ. భాననభానుమండలవిభాసివిభాకరదివ్యభవ్యసం
ధానవిధానదక్షిణసుధాకరుణారసపూరహారిచే
తోనయనా తపోనిధివిధూతతమస్స్ఫురణాంతరంగని
ధ్యానపరాయణా పరమతత్త్వమయ స్తవ వైభవోన్నతా! 160

క. కరణస్వైరవిహార
స్ఫురణావిర్భూతదోషపుంజతమః ప్రా
వరణవిలీనస్వజనో
ద్ధరణసహస్రాంశుతేజ దైవసమాజా! 161

---

1. మహిసుతేజిత యనంగ.

మాలిని —

దురితజననహన్త్యా దూరసంచారమాన్యా
పరిమితగుణధన్యా భక్తిరేఖావదాన్యా
పరమపదగ దివ్యా స్పందితస్వాంతభవ్యా
నిరుపమతనునవ్యా నిందితాక్రాంతభావ్యా! 162

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బైన శ్రీ మహాభారత కథానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచన సోమనాథప్రణీతం బైన యుత్తరహరివంశంబునందు తృతీయాశ్వాసము.

శ్రీరస్తు

# ఉత్తరహరివంశము

## చతుర్థాశ్వాసము

శ్రీహైమవతీకలహా
స్నేహవిరామ ప్రణామసీమంతపద
గ్రాహిసురసింధుకల్లో
లాహితసింధూరలాక్ష హరిహరనాథా. 1

గీ. హంసడిభకులు లోనుగా నఖిలధరణిఁ
బెరుఁగ కంటకకోటిచేఁ బేద లైన
నరపతులకీర్తిపటములు సిరుగకుండ
వెరవుతో నుద్ధరించిన వేల్పు శౌరి. 2

క. నావుడు జనమేజయవిభుఁ
డావైశంపాయనుని మహాదేవు మదిన్
నీవు గొనియాడు పలుకుల
భావము దనివోదు చెవులపండువు లయ్యెన్. 3

క. హంసడిభకు లెవ్వారొకో
కంసారికి వారిఁ జంపఁ గారణ మేమో
సంసారసారవచనరి
రంసామతిఁ దత్కథాంతరము విన వలతున్. 4

క. అనుటయు వైశంపాయన
ముని జనమేజయ నృపాలముఖ్యునితో ని
ట్లనుఁ దత్కథాప్రపంచము
వినిపించెద మొదలుకొని వివేకనిధానా! 5

క. ఎనుఁబది యెనిమిది వేవురు
ధనుజుల కాధ్యుండు వక్రదనుజుఁడు దోడై
చనుదేర హంసడిభకులు
[1]చెనకిన వెసఁ దునిమె శౌరి చెప్పెద నదియున్. 6

సీ. సాల్వదేశంబున జనియించె బ్రహ్మద
త్తాభిధానుండు మూర్ధాభిషిక్తుఁ
డఖిలధర్మవిదిజ్ఞుఁ డాత్మ భార్యాద్వయం
బునకు బిడ్డలు లేమిఁ బొల్లవోయె
సంసార మనుచు నీశాను నారాధించెఁ
బదియేఁడు లొండు సంభ్రమము లేక
పరమేశుఁ డతని సద్భక్తికి మది మెచ్చి
కలలోన నొకనాఁడు గదిసి వరము

తే. వేఁడికొను మన్న నిరువుర వేఁడె సుతుల
శివుఁడు నిచ్చితి ననుచు విచ్చేసెనంత
నతనిదేవు లిద్దరును గర్భాభిరామ
మూర్తులయి రన్నరేంద్రుండు ముద్దుసేయ. 7

ఉ. ఆ సమయంబునందు మహితాత్ముఁడు మిత్రసహుండు నాఁగ ధా
త్రీసురుఁడొక్కరుండు జగతీపతికిన్ సఖుఁడై సుతోదయో
ల్లాసము లేక శ్రీపతిఁ దలంచుచుఁ దప్పక పంచవర్షముల్
చేసిన పూజకున్ హరియుఁ జిత్తములోఁ బొదసూపి విప్రుతోన్. 8

ఉ. మెచ్చితి వేఁడికొ మ్మనుడు మిత్రసహుండు కుమారుఁ గోర నీ
కిచ్చితి నంచు నచ్యుతుఁడు నేఁగె ధరామరుఁ డాత్మకాంతకుం
జెచ్చెరఁ దోఁచు వేవిళులు చెప్పఁగఁ బల్మఱు వచ్చుబోఁటితో
ముచ్చటనూనె నల్ల చనుముక్కులు వెల్వెల బారు చెక్కులున్. 9

క. ఈవిధమున గర్భిణు లగు
మూవురలో రాజసతులు మునుమును సుతులన్

1. తనుఁ జెనకినఁ దునిమె శౌరి తగనది వినుమా.

శైవాత్ముఁ గని రిద్దఱ
నావిప్రవధూటి వైష్ణవాత్మునిఁ గనియెన్. 10

ఆ. హంస డిభకు లనఁగ నన్నయుఁ దమ్ముండు
నధిపనందనులు జనార్దనుండు
విప్రతనయుఁ డిట్లు వీ రొక్కప్రాయంబు
వారు గూడి యాడ వచ్చువారు. 11

ఉ. వేదపురాణశాస్త్రపదవిం దిరుగం బదిలంబు గల్గి ధ
న్వాదిసమస్తశస్త్రవివిధాభ్యసనంబున ధీరులై సదా
సాదినిషాదిరథ్యుచితసత్కళలందు విదగ్ధులై మనో
మోదము సేయువిద్యలకు మువ్వురుజాణ లనంగ నున్నచోన్. 12

హంసడిభకులు శివుఁగూర్చి తపస్సుచేసి వరములు వడయుట

గీ. హంసడిభకులు హిమవన్నగాగ్రమునకుఁ
బార్వతీపతిఁ గోరి తపంబు సేయ
నరిగిరి జనార్దనుండు విద్యావివేక
నిధి మురారి నారాధించె నిజగృహమున. 13

క. వా రిరువురు నై దేఁడులు
నీరును గాలియును ద్రావి నిర్మలతరచే
తోరాజీవభ్రమరము
గౌరీపతిఁ దలఁచి నిష్ఠ గైగొని యుండన్. 14

క. సన్నిధిఁ బన్నగహారుఁడు
పెన్నిధిఁ గని పొంగుచున్న పేదలక్రియ న
య్యన్నాదమ్ములఁ గని మీ
కెన్నఁగ నేవరము లిచ్చ యిచ్చద వానిన్. 15

సీ. అనుడు వా రిరువురు నైకమత్యముతోడ
నమరాసురాది సైన్యాధిపతుల
కోడ కుండంగ మా కొకవర మీశాన
రౌద్ర మహేశ్వర బ్రహ్మశిరము

లనునస్త్రములు నభేద్యకవచములు దివ్య
చాపములును బరశ్వథవిశేష
ములుఁ గయ్యముల కేము పోవుచోఁ గావుగాఁ
బ్రమథద్వయంబు మత్పార్శ్వములను

తే. వచ్చుటయు నీగి రెండవవరము నాఁగ
హరుఁడు వారికి నడిగినయట్ల యిచ్చి
భృంగిరిటిని గుండోదరుఁ బిలిచి వీరి
సమరములఁ గావుఁ డని పంచి చనియె నంత. 16

చ. వరములు గన్న మోదమున వచ్చి కుమారయుగంబు మున్ను మా
తరపితృవందనంబును బదంపడి మిత్రసహాభివాదనా
దరము జనార్దన ప్రణయితాపరిరంభము నాచరించి సం
గరమున తేరు హంసడిభక ప్రతివీరు లనంగఁ బొంగుచున్. 17

క. కవచధనురస్త్రనికరము
నవిరళరుద్రాక్షమాలికాభరణములున్
ధవళవిభూతియు హర హర
శివశివ శబ్దములుఁ[1] గలిగి చెలువయి యున్నన్. 18

క. పొలఁతుల రూపవతులఁ బెం
డిలి చేసిరి దొరలు హంసడిభకుల కమరం
గులపతి జనార్దనునకును
బలియించిరి ముగురు నేకపత్నీవ్రతముల్. 19

వ. ఇట్లు వరప్రసాదసమ్మదభరితహృదయు లై నిజజనకరాజ్య విభవంబు విలసిల్లం జేయుచు వీరాభిమానవిజృంభితు లై యొక్కనాఁడు వినోదార్థం బయ్యిరువురు కుమారులుం గూడుకొని.

## హంసడిభకులు వేఁటకుఁ బోవుట

క. కరితురగరథపదాతులు
పరివేష్టింపంగఁ గొలుచుప్రజ ముందఱ గా

1. ల తోడఁజె.

సరస జనార్దనుఁడుం జన
నరిగిరి వేఁటాడ ధరణి యల్లల నాడన్. 21

క. వెలివాఱును గాలరులును
వలలుఁ దెరలు దీమములును వడిఁ దీరిన కు
క్కలు నారెగోలలును మం
దలక్రోవులు వేఁట కారడంబుఁ బెనుపఁగన్. 22

వ. ఇట్లు వచ్చునెడ ముందట. 23

సీ. ప్రబలదంష్ట్రాగ్రపర్యస్తముస్తాస్తంబ
జంబాలశబలవేశంతపంక్తి
ఘనఘనాఘననీలఘనవన ప్రతిఘాత
ఘనఘర్షణావభగ్న ద్రుమంబు
ఘురఘురారవఘోరఘోణాప్రఘాణవి
ద్రాణచ్ఛదాచ్ఛన్న తాంతలతము
ఖవనఘళాత్కారి ఖరఖురోత్పాతత్రి
హల్యధాత్రీధ్వస్తయవసరాజి

తే. ఖేటఖాటభాషణోద్భటాఖేటచటుల
కుటిలకటుకటాక్షేక్షణక్షోభబధిర
మతిరభసభాసమానయానాభిమాన
రౌమవిక్రియాకులము వరాహకులము. 24

వ. అప్పుడు పందికదుపుల వెనువెంటం దవిలి కొందలింపం జిందఱవందఱగాఁ
జేసి యేసి యట చనఁ జన. 25

గీ. నల్ల[1]సేనపుగుండులు నడచినట్లు
[2]మంపు గొని మే యెఱుంగక మలసి మలసి
[3]నెనరువారికి నుఱుకంగ నెగసి మన్నుఁ
బోతు లెడ చొచ్చె దాఁటెడు పొదలువోలె. 26

---

1. సీసపు. 2. మ్రంపుకొనిమెయ్యే. 8. నెనదువాతికి.

వ. ఇట్లున్ననం గన్ను గానక తిరుగు మన్నుఁబోతుల నున్న యునికిన గన్నంతటం బడ నేసి పోవం బోవ. 27

గీ. నీర ముంచిన సొరకాయ నెగసినట్లు
పేరుకొని వైచు[1]తెల్లంటుచీర వోలె
[2]నుంకుచెండువిధంబున నుత్తరించు
తములపాకు నిక్కెడుక్రియ దాఁటె నిఱ్ఱి. 28

వ. ఇవ్విధంబున నెగసిన యిఱ్ఱి నాలుగు కాళ్లనుం ద్రెవ్వ నొక్కమ్మన నేసి చనునెడ మఱియు నప్పటప్పటికిం జొప్పరులవలన నుప్పతిల్లిన చప్పుళ్ళకుఁ దెప్పరం బైన తుప్పల దూరు దుప్పులును (నిడువేఁటకాళ్లు) (వేటఁకుం) గడంగిన నడికి నడికిడవారికి నెడగాక తొడిగిన యమ్మునసపడి పొరలు పిడుల విడువక చిడిముడిపడు కడఁతులును నీఁటెలకుం బోటబ్బక సూటిమెయి దాఁటియు వేటచే విటతాటంబైన లేటికదుపులును బిఱుంద [3]రొప్పుచోఱిగాఱకుఁగాక వెఱచఱచి పఱచు నెడఁదెఱపి నుఱికిన తొరు ద్రొక్కువం కుక్కలచేఁ బఱిపఱి యైన యఱుములును గొందఱు గొందఱు ముందటం గొందలం బంది యందంద సందడిం గ్రిందు మీఁదుగా వైచినం జిందఱవందఱలుగా ప్రమందిన కుందేళ్ళును నేదెసఁ దొలంగినను నూదిపిఱింది త్రాడై [4]యాదిగొని పాదులవారిచే [5]యాదుల కాదులచే మూదలించిన సీదరంబులతోఁ బాదుకొనిన యేదులును నివ్వలవ్వలనుండి యెడత్రెవ్వకుండఁ ద్రవ్విన యోదంబులంబడి క్రొవ్వఱక మవ్వంబు నివ్వటిల్లం బట్టుపడిన చివ్వంగులునుం గలిగినం గనుంగొనుచు వెండియుఁ [6]గ్రీఁగాలి నోలిం జాలుకొలిపిన కాలువలలకుం జాలువడి లోలోపలం గవళించియు దోడ్తోడ జోడెంపువలలకు లేటివేడెంబు చేసినం గూడఁబడియును మున్ను పన్నినకన్నెవలల సన్నసన్నం బోవక యన్నునం గన్ను దిరిగిపడి సన్న సున్నంబుగాఁ దన్నికొనియును నడ్డగించి నించినయొడ్డువలలకు సడ్డించి వెడ్డునం బడక గడ్డుఱికియు మృగంబు లనేకంబులు వొలియుటయును వేఁట చాలించి హంసడిభకులు నడవులం దిరిగి పరిశ్రాంతులై సేనాసమేతంబుగా మగుడం దలంచి మధ్యాహ్నసమయంబున. 29

1. తెల్లంటి. 2. నుక్కుచెడక వేగంబున నుత్తరించు. 3. చొఱకారకుం గాక. 4. యెయిదికొను. 5. యాదలకాదలచే. 6. క్రిగ్గా.

చ. కనిరి కుమారు లంత శశికాంతశిలాతలశీతలస్థలీ
వనఘనపాదపాదపనివారితవారితరంగరంగన
త్తనపరివర్తనద్విరదదానసమదాళిమాలికా
తనువనజాతనూతన[1]పతాకముఁ బుష్కర మన్ తటాకమున్. 30

క. కని యాపద్మాకరమునఁ
దను పారెడునీరు ద్రావి తమ సేనలుఁ దా
రును విశ్రమించి రాసే
చనకము లగుతరులనీడ సైకతముల పై. 31

వ. అట్టున్నయెడ. 32

క. మాధ్యందినసవనధ్వని
విధ్యుక్తస్వరముతోడ విని వచ్చుటయున్
స్వాధ్యాయపరులు గావున
నధ్యాహారంబు పుట్టె నయ్యిరువురకున్. 33

క. ఊహించి యాశ్రమం బగు
నోహో యిం తొప్పునే సముచ్చారణ మం
చాహంసడిభకు లేసం
దేహము లే కందు సనుమతి సముత్థితులై. 34

ఉ. అచ్చట సేనల న్నిలిపి యాశ్రమవాసులఁ జూచువేడుకన్
వచ్చిరి పాదచారు లయివారు జనార్దనుఁ డేఁగుదేరఁగా
లచ్చి తనూవిలాసమున లావు ధనుశ్శరధారణంబుచే
నచ్చువదంగఁ గాశ్యపమహామునియజ్ఞ సమీపభూమికిన్. 35

క. అరిగి [1]సభాచార్యులకున్
బరిపాటి నమస్కరించి పదపడి వా రా
దరమునఁ జేయుసపర్యలఁ
బరితోషము నొంది కశ్యపప్రభృతులతోన్. 36

---

1. బలాకము (వావిళ్ళ) ; పతాకము (పి) 2. యచటిమునివరులకు.

వ. హంసుం డిట్లనియె. 37

క. మాతండ్రి రాజసూయముఁ
బ్రీతిం జేయఁగఁ దలంచి పిలువం బనిచెన్
భూతలమునఁ గలనృపతి
వ్రాతంబుల మీరు నరుగ వలయు నచటికిన్. 38

మ. క్షితినాతమ్ముఁడు నేను దిగ్విజయముం జేయంగ డాయం గడున్
బ్రతిపీరప్రకరంబు దంబు మెయిఁ గప్పం బొప్పనం బీక యే
కత మాడం గలరే నరేశ్వరశిరోగర్వంబు సర్వంబుఁ బా
పితి మీశానవరప్రసాదమున మాపెం పెల్లెడం జెల్లఁగన్. 39

క. అనుటయు వారందఱు హం
సునితో నిట్లనిరి రాజసూయమునకు మీ
జనకుఁడు దొడఁగిన జాలును
మునుముట్టన వత్తు మిందు మోసము గలదే. 40

మ. అనినం దమ్మునితో జనార్దనునితో హంసుండు సంతోష మొం
ది నిజేచ్ఛం జనుచోటఁ బుష్కరసర స్తీరోత్తరారణ్యపా
వనభూమిం బరమోపదేశమున దుర్వాసోమునీంద్రుండు శి
ష్యనికాయంబుం బ్రబోధవీథిఁ జనఁ జేయన్ సాయమై తోఁచినన్. 41

## హంసడిభకులు దుర్వాసుని నవమానించుట

ఆ. కావిచీర ముసుఁగు కచ్ఛదంబును జూచి
బోడతలయు నిడుదబొట్టుఁ జూచి
గోఁచితోడి వెదురుఁగోలయుఁ జిక్కంబుఁ
గట్టియున్న బుఱ్ఱకాయఁ జూచి. 42

వ. డాయం బోయి హంసడిభకు లతనితో నిట్లనిరి. 43

క. మిడికెదు పెదవులు వ్రేళులు
మడిచెదు కనుదోయి మొగిడి మాయెదురఁ గడున్

వెదపీఁక యొదలు చేసెదు
కడపల జపమునకు నేఁడు గలదో లేదో. 44

వ. అని పలికి యతఁడు పలుక కుండం దమలోన. 45

చ. తిరిసినకూడు దెచ్చి నలుదిక్కుల బోదలు తిండిపెట్టగాఁ
బెరిగినపొట్టతోడ నొక పీఁటపయిం దొరవోతె నెవ్వరిన్.
సరకు గొనందు పట్టుకొని బాఁగల గొన్న బలే యెఱుంగుఁ ద
క్కరి బలుమోపు మోచు నయగారితనం బిరుపుట్టి గట్టినన్. 46

తే. బాంధవులఁ బాసి తమయిల్లుపట్టు విడిచి
తల్లిదండ్రులు వగవఁ గై తవముతోడ
బోడతలలు గాఁ బడసిరి పొదువలెల్ల
వీనిమాటలచేఁ గదా వెఱ్ఱులైరి. 47

చ. ఎఱుఁగరు గాక లోకమున నెవ్వరికైనను మేలు సేయఁగా
నొఱపగునాశ్రమంబున సమున్నత మైన గృహస్థ ధర్మముం
[2]బఱగడ వైచి గోఁచిగొని పాఱెడుపొల్లకు ముక్తిగల్గునే
పఱిగల నేఱినం గొలుచుఁ పాఁతటికిం గలదే తలంపఁగన్.
వ. అని పలుకుచు న య్యిరువురు న మ్మహాముని కిట్లనిరి 49

సీ. [4]అఱుకువయెఱుకతో నాశ్రమం బిది మెచ్చి
[5]తిదిగాక గృహమేధ మేల యొల్ల
వేపదంబునఁ బొందె దింద మూఢుండవ
కాక సంసార సౌఖ్యంబు మాని
కఱపె ది ట్లున్న కొందఱకు నారకపాత
శీలంబుఁ దగునె తాఁ జెడ్డవాఁడు
వెనకయ్యచేతికి వెస లిచ్చె ననుమాట
నిజముగా నిచ్చోట నిన్ను వంప

తే. నొరులు లే రని తలఁతేని నున్నవార
మేము గృహివి గాఁ బంచేయజ్ఞేచ్ఛఁ గలిగి

1. బది 2. పఱకట వైచి. 3. పాఁతఱకుం (పీ) 4. అలకువ 5. తేదిగా·

నాకసుఖ మొందు మిపుడు ప్రాణాన నుండఁ
దలఁచెదేని నావుడు జనార్దనుఁడు గలఁగి. 50

క. భాస్కరనిభుఁ డగుమునికి న
మస్కారము చేసి నృపకుమారులతోఁ దే
జస్కరము లగునె మాన్యా
వస్కంద శ్రుతికఠోరవచనము లనుచున్. 51

క. న్యాయము దప్పకుఁడీ పురు
షాయుషజీవికయు లౌకికాచారము ని
శ్శ్రేయససిద్ధియుఁ జెడు యతి
నాయకదూషణము చేసినన్ మనుజులకున్. 52

శా. నాల్గుం జెల్లెడి బ్రహ్మచారి గృహి వానప్రస్థ యత్యాశ్రమం
బు ల్గైవల్యవివక్షు లంతిమపదంబుం జేరువా రిట్టి వీ
ర ల్గోపించిన నంతకుండుఁ జెడు మీరా యోర్చువా రిమ్మెయిన్
మేల్గీ డాదక వీరి జేరి మనుఁడి మీమీ శుభప్రాప్తికిన్. 53

గీ. చెలిమి మీతోడఁ జేయుట చెట్టతనము
దానఁ గీ డెంతవుట్టినఁ దగిలె నాకు
ననుభవింపక పోవునే యక్కటకట!
వరుగుతో దాఁగరయు నెండవలసినట్లు. 54

చ. గురువులు సెప్పరే చదువుఁ గొంత వివేకము మిమ్ముఁ జేరదే
తెరువునఁ బోక నేఁ డిది మదీయమనోవ్యథఁ జేసె బిమ్మటన్
హరుఁ డుపదేశ మిచ్చినదియంతయుఁ గాల బలంబునన్ మహా
పురుషుం కెగ్గుసేయఁ దలపోయఁగ నాయమె పోయెఁ బాపమై. 55

గీ. పాయఁ దగు మిమ్ముఁ గనుమారిఁ బడఁ బొసంగు
విషము ద్రావుట యోగ్యంబు వెల్లిలోన
మునుఁగు టుచితంబు మీరెల్లఁ గనుఁగొనంగ
నాత్మ విడుచుట చను నాకు ననుచు నడలి. 56

క. అలవడునే రాజులకుం
దులువతనము వినుము యతులతో నతులమతుల్
గలుషించుట చిత్తము నోఁ
బలుకుట బాంధవులఁ దారు బ్రదుకుతలం పే. 57

వ. అనుచుండ నమ్మునీంద్రుండు. 58

క. కరుణయుఁ గోపముఁ గనుఁగవ
[1]నొరయఁగ నొకచంటఁ బాలు నొకచంటను నె
త్తురుఁ గురియుగతి జనార్దను
ధరణీశసుతద్వయంబుఁ దప్పక చూచెన్. 59

గీ. చూచి యిట్లను భూపాలసుతులతోడ
నన్నుఁ గనలించి బ్రదుకఁ గన్నారు లేరు
పొలిసితిరి పొలిసితిరి వే పొందు తొలఁగి
మిమ్ము దరికొనుకోపంబు మ్రింగికొంటి. 60

వ. అది యెట్లనిన. 61

ఆ. చక్రధరుఁడు బారిసమర నున్నాఁడు మి
మ్మింక వేఱె కోప మేల నాకు
తెఱఁగుమాలి తవుడు దిని చచ్చువానికి
విషము వెట్టువాఁడు వెఱ్ఱివాఁడు. 62

క. అనుచుఁ గదలి పో వచ్చిన
ననుమానము మాని హంసుఁ డమ్మునిఁ జేప
ట్టినచంద మేమి చెప్పుదుఁ
బనికిన కాలోరగంబుఁ బట్టుట దోఁచెన్. 63

వ. ఇట్లు పట్టుకొని. 64

శా. తాను న్నిక్కము పెద్దవాఁడు బలె సీతం డిత్తఱి న్నక్కఁ బ
గ్గానం బట్టినయట్లు బిట్టుబిగియంగా నెంతసే పైన ని

1. నొరిచంటం బాలు గురియ నొరిచంటకునె.

చ్చో నుండన్ సమకూడునే మనకు నంచుం జించె నమ్మాని కౌ
పీనంబున్ నృపుఁ డాజనార్దనుఁడు దప్పింపంగఁ గ్రౌర్యంబునన్. 65

ఆ. కలఁగి కన్నవారు కన్నదిక్కునఁ బాఱి
పోయి రెల్లయతులు బోగుమిగులఁ
గినుక యదర సన్నగిల్లినయెలుఁగుతో
నమ్మునీంద్రుఁ డిట్టు లనియె మఱియు. 66

గీ. చేయఁ దగని కీడెల్లఁ జేసితిరి మీరు
చెఱుప నోపుదు శాపంబుచేత మిమ్ము
నయిన యతి నైన నాకేల యాగ్రహంబు
దానవాంతకుఁ డిటమీఁదఁ దాన చెఱుచు. 67

మ. సకలోద్యోగకృతానుబంధుఁడు జరాసంధుండు బంధుండు మీ
కకలంకుం డతఁ డాశ్రమస్థు[1]లను నౌదాసీన్యముం జేయఁ దూ
రకపాయంగలవాఁడు నేఁడు మిము దుర్వ్యాపారులం జూచి కొం
కక మీకింకిరికిం జెలంగినఁ దొలంగం బాఱుఁ దద్ధర్మముల్. 68

క. పో పొమ్మని పలుమాఱుం
గోపమ్మున హంసుఁ బలికి కొనియాడుటయుం
జేపట్టుట మెఱయఁ గృపా
నూపాపాంగుఁడు జనార్దనుని దీవించెన్. 69

క. శ్రీవల్లభుతో సంగతి
గావుత నేఁ డెల్లి నీకుఁ గలుగు సుజనసం
భావితలోకద్వయసుఖ
మీవృత్తాంతంబుఁ జెప్పు మీజనకునకున్. 70

చ. అనునెడఁ గ్రమ్మఱం గినిసి హంసుఁడు నాడిభకుండుఁ దోడి దు
ర్మనుజులఁ గూడి దండముఁ గమండలముం బిదలంబుఁ జిక్క మున్
మునుకొని వెండియున్ యతులముం పగుసొమ్ములు [1]గాల్చి గాల్చి క్రో
వ్వునఁ గఱకుట్టు లయ్యెడఁ జవు ల్గానిపోయిరి వేడ్క నూరికిన్. 71

1. లకు నిర్ణ్షయన్ దైన్యముం 2. గాల్చిక్రొవ్వునన్, గనుకుటు అయ్యెడం జవులుగాఁ గొని.

క. వారివెనుక నంతంతం
జేరి జనార్ధనుఁడు వోయెఁ జెడి రకటకటా !
పీ రనుచు విధివినోదము
వారింపఁగ మనుజకోటి వశమే యనుచున్. 72

వ. ఇట్లు పోయిన యనంతరంబ. 73

శా. దుర్వారోద్గమరోషభాషణము లై ధూర్తప్రలాపంబు లం
తర్విద్యామహిమం గలంప యతు లంతం జేర నేతేర నీ
నిర్వేదం బుడిగింప నచ్యుతుఁడ పో నిర్వాహకుం డంచు నా
దుర్వాసోమునిపుంగవుండు గదలెన్ దుఃఖాకులస్వాంతుఁడై. 74

క. మండఁగ మండగ నార్చిన
ఖండితబిదలములుఁ ద్రుటితకౌపీనములున్
దండముల తుండములును గ
మండలుశకలములుఁ జూచి మఱకువ దోఁపన్. 75

గీ. మురవిరోధిముందట నిట్టమోపు గట్టి
తేరఁ బంచి సహస్రయతిప్రవరులు
తోడ రా[1]నెండ దాఁకిన నీడచోట
నిలిచి నిలిచి యహోరాత్రనిర్గమమున. 76

వ. రేపకడ. 77

గీ. ద్వారకోపశల్యం బటు చేం యొక్క-
కొలన వార్చి దుర్వాసుఁడు గూడ వచ్చి
యతుల ముందట నరుదెంచి యాదవేంద్రుఁ
డాడుచున్న సుధర్మాసభాంతికమున. 78

క. అఱువుడు గావిముసుంగును
విఱిగినదండంబుఁ దునిసి వ్రేలెడు గోచిం
బఱి[2]య లయినకరకమునయి
చుఱచుఱఁ జూఁచెడితెఱగుచూపులతోడన్. 79

1. నేరకంతంత. 2. యలునకమండలమును.

ఉ. వాకిట నిల్చి లోన యదువల్లభుఁ డాడుచునుండె గోళముం
గైకొని సాత్యకిం గదవఁ గాలను గేల నమర్చి చిమ్ముచున్
లోకులునుం గుమారులును లోనుగ నుద్దుల కుద్దులై వినో
దైకపరాయణుండును ననేకవిధంబులఁ జుట్టి యాడగన్. 80

చ. అవసర మైన వచ్చి పణిహారులు దోడ్కొని పోవఁ జొచ్చి యా
దవకులపారిజాతము నుదంచితగోళవినోద మోదితున్
నవవికచారవిందనయనద్యుతిశీతలుఁ గాంచి రాయతి
ప్రవరులు పూర్వజన్మకృతభాగ్యఫలంబునుఁ బోలె నుండగన్. 81

మ. వసుదేవాత్మజుఁడుం గనుంగొనియె దుర్వాసః పరివ్రాడ్విభున్
రసనారూపకలాపశాపవచనప్రారంభసంభావితున్
వ్యసనవ్యాప్తరిరంసహంసశిఖకవ్యాళవ్యధావ్యాకులో
ల్లసనున్ వేషవిశేషరోషనిషయోల్లాసాద్భుతభ్రూకుటిన్. 82

ఉ. అంతకుమున్న యాదవు లపాయభయంబున నాసనాదిపూ
జాంతర మాచరింపు మని యంతట నంతట రా మురారి య
త్యంతవినీతుఁ డై యతికి నయ్యుపచారము లెల్లఁ జేసి వి
శ్రాంతి యొనర్చె నర్హపరిచర్యలఁ దక్కినభిక్షుకోటికిన్. 83

వ. అట్లు సకలయతి ప్రతతికిని యథోచితోపచారంబు లాచరించి వాసుదేవుండు దుర్వాసునితో నిట్లనియె. 84

శా. ఈరూపంబున సంస్కృతిం దొఱఁగి మీ రేచిఁతలం జెంతలం
జేరం గోరక యూర కున్న నిటు విచ్చేయంగఁ జేయం[1]గదుం
బారం బేదిన వంతయుం గలిగెనే బాలార్కబింబంబులో
నారం గూరి నయంధకార మన నాహా సాహసం బెట్టిదో. 85

ఉ. ఆసలఁ ద్రుంపి వెట్టి హృదయం బనుకాఁగున యోగవాసనా
భ్యాసపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి యా
యాసవిహారమత్కుణగణై హికళయ్యకుఁ దజ్జలంబు పైఁ
బోసిన నీశరీర మది పొందియుఁ బొందనియట్ల యూఱడున్. 86

1. గదున్బారంబే నిను వంతయుం గలిగెనే.

చ. మఱకువఁ గత్తరించి మదమానములం [1]జుఱవుచ్చి మెచ్చుఁ జాఁ
గఱగొని క్రోధ కామముల గండడగించి పరోపకారమున్.
జఱఁ బడఁ ద్రోచి వాచవులచట్టలు వాపి తొలంగి చిత్తముం
జఱపడి యున్న నీకు నొక చక్కటి నెక్కటి వేడగల్గెనే. 87

గీ. కలుగుటకు మీరు విచ్చేయు కారణమున
సందియము లేదు మీయట్టి సంయములకు
నేమి కార్యంబు గలిగెనో యెరుఁగ రాదు
తెలుపవే నాకు నిర్మలధీనిధాన. 88

క. అనుటయు భగభగ మండెడు
కనుఁగవతో నొడల నడరుకంపముతో నె
ట్టిన నిట్టూర్పులతో మొగ
మునఁ దనికిన కెంపుతోడ మునిపతి యుండెన్. 89

వ. తదనంతరంబ యంతరంగంబు కొంత సంతరించికొని యతండు నారాయణున
కిట్లనియె. 90

దుర్వాసుఁడు హంసడిభకుల దుర్నయంబు కృష్ణున కెఱిఁగించుట

మ. తగునే యింత మురాంతకా తలఁపవే త్రైలోక్యముం గావ నీ
వు గదా దానవవైరివై పొడమి లావుం జేవయుం జూప రూ
పగుదైవంబు గదాధరుండ వఖిల వ్యాపారపారంగమా
ర్వగ మావృత్త మెరుంగనేర వనఁ జిత్తం బుత్తలం బందదే 91

శా. ఏఁ గాదే నడ[2]తుం జతుర్ముఖునితో నింద్రాదిదిక్పాలకుల్
మూఁగంబాఱి భవత్పదాబ్జములకున్ మ్రొక్కంగ లేకున్నచో
నాఁగ న్వచ్చియు నాఁగఁ జాలని ప్రతీహారు న్విడంబించుచున్
దాఁగం బోయి తలారివానియెదురన్ దాఁగంగ నీ కేటికిన్. 92

ఉ. ప్రాఁతల మేమునీకుఁ బలుబాములఁ బొందకి యున్ననాఁటి[3]నీ
చేఁతలు గంటి [4]మిందఱకుఁ జిత్తముల న్వెలిఁ దోఁచునూఁత[5]లం

1. జుఱవుచ్చి. 2. నం 3. విచ్చేఁతలు 4. మింతటికి 5. లు.

ఘూఁత[1]ల నీవయొండు దలపోఁతలు లేఁతలుమమ్ము నెమ్మెయిన్
లాఁతులఁగా దలంపకు నలంపకు చాల నలంగియుండగన్. 93

వ. అని మఱియును. 94

సీ. ఏ నెఱుంగుదు నిన్ను నేల నాతోడనే
వెదమాయములు బ్రహ్మవేత్త లెఱుఁగు
రూపు రూపులలోనిరూపుఁ దోరపురూపు
చూపనిరూపు నీరూపు సూపి
వేదాంతముల నైన వెదక నందనిరూపు
విజ్ఞానరూప మై వెలయురూపు
తేజ మైశ్వర్యంబుఁ దెలుపఁ జాలెడురూపు
ప్రణవరూపంబు గాఁ బరఁగురూపు

తే. పంచభూతసుధాకరభాస్కరాత్మ
రూప మగురూపు నీరూపు రుచిరరూప
మెఱుఁగుదవె మాకు వ్రేళ్ళతో మొదలు చూచి
చె ట్టెఱుఁగువారి కాకులు నిదుమ నేల. 95

క. మాకుం బుణ్యము చాలమిఁ
గాకేమి జగత్త్రయంబు గావం ద్రోవం
గై కొన్న నీవు సకలవి
వేకివి మాదుఃఖ మెఱుఁగవే మధుమథనా. 96

క. అంభోజనాభ ! నరపతి
డింభులు భువనమున హంసడిభకు లనంగా
జృంభితు లయి యిరుపు రుపా
లంభించిరి కానలోఁ జలంబున మమ్మున్. 97

ఆ. హంసపరమహంసు లగునీయతీంద్రుల
పేరు సైఁప లేక పెచ్చు పెరిగి
డాంసు డాత్మనామహరు లని కానోపుఁ
బట్టి మమ్ముఁ జాల భంగపఱచె. 98

1. ఖ.

క. సరకుగొనరు సురవరులను
గురుశక్తిని భీష్మ బాహ్లికులఁ గైకొన రు
ద్ధరత జరాసంధుని వెర
వరిగా మెచ్చరు మళవరగర్వమునన్. 99

తే. హంసడిభకులనెత నీయతులు నేముఁ
బడినపాటులు వేఱ చెప్పంగ నేల
కమలలోచన ! ముంజేతికంకణమున
కద్ద మేటికి నీసొమ్ము లరయ రాదె. 100

వ. అనుచుం బుండరీకాక్షుముందటం దమతెచ్చినభగ్నవస్తు సముదాయ
భారంబు విచ్చి చూపి యిట్లనిరి. 101

సీ. ఈకమండలుపఙ్క్తి నెటు చూతు నిట్ల త
త్పాపమ స్తంబులు వగుల కున్న
నీదండనివహంబు నెటు చూతు నిట్ల త
ద్దూర్తహ స్తంబులు దునియ కున్న
నీవల్కలవ్రాత మెటు నిట్ల త
త్కపట చర్మంబులు గాల కున్న
నీశిక్యసముదాయ మెటు చూతు నిట్ల త
ద్ద్వేషణాంత్రంబులు ద్రెవ్వ కున్న

తే. నకట మోమోట లేక తా రంత చేసి
బ్రదికి పోయిరె పులి పేదవడినఁ బసుల
[1]వాండ్రె యెక్కుడి రనుకత వచ్చె నాకు
మునులలోపల నాలుక ముల్లు విఱిగె. 102

తే. వలదు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర
జాతు లాత్మకులోచితాచారపథము
నడప నాహంసడిభకు లేనాఁట నేది
నడిపి రది చెల్లుఁ గాక వర్ణముల కెల్ల. 103

1. వాండ్రె వెక్కుడి రను.

క. మా కేది దిక్కుఁ దెరువో
లోకంబులు మూఁడు నింతలో నే మఱునో
నీకడు పట సర్వంబును
జేకొనవే దుష్టశిక్ష చేసి మురారీ ! 104

చ. అనిన యతిం గనుగొని మురాంతకుఁ డిట్లనుఁ దప్పుచేసితిం.
గినియకుమయ్య మిమ్మొకఁడుకీఁడునఁ బెట్టెడువాఁడు లేఁడ యెం
దని పరికింపనైతి విను మాధరణీశకుమారధూర్తులం
దునిమెద నింతలో పగలఁ దూలకుసాత్యకితోడుసంయమీ. 105

క. ఎఱిఁగి యెఱిఁగి నీముందఱ
నఱగొడ్డెము చేసి పోయి [1]రది గైకొన రీ
తెఱఁ గయినహంసడిభకులు
కొఱవిం దల [2]బరికికొన్న కొఱడులు గారే. 106

క. హరుఁడు వర మిచ్చె వాణీ
వరవరుణకుబేరసురవివైవస్వతు లి
త్తురు గాక నీవు గినిసిన
వరములగిరములను బ్రదుకువారే కుమతుల్. 107

క. కలడు జరాసంధుఁడు వా
రలకుం జెలికాడు నిష్ఠురభుజాపరిఘుం
డలఘుబలుఁడు సేనలతోఁ
గలయకమును వారిఁ జంపఁ గల వాఁడఁ జుమీ. 108

చ. ఎదిరిచిన కాలపాకముల నీగతి నీమదిఁ గ్రోధవల్లికం
బ్రదిచినవారు మన్ని శితబాణపరంపర వైవ మిణ్గుఱుల్
విద్రుప గఁదత్ఫలంబులచవిం జరితార్థులుగా శరీరపుం
జిద్రుపలు చేరుఁ దత్సుతులచేతులఁ గాకకులంబువాతులన్. 109

చ. అనిన మునీంద్రుఁడెంతయుఁబ్రియంబున నచ్యుతపుండరీకలో
చన కమలాసనాదిసురసంఘశరణ్యపదాంబుజా జనా

1. రదె కొనరైయా. 2. కఱటికొనినకోర్కులు కావే.

ర్ధన దనుజాంతకా కొలిచెదం బ్రణమిల్లెద సంస్తుతించెదన్
నిను ననిశంబు నన్నుఁ గృపనెక్కొనికావుము దేవనావుడున్. 110

వ. అద్దేవదేవుం డిట్లనియె. 111

క. ఏమే నేమే నొడివిన
నామాటల కెగ్గుగా మనంబున యతిచూ
డామణివి నీవు దలఁపకు
స్వామీ మన్నింప పలయు సైరణతోడన్. 112

క. దానము ధర్మముఁ దత్త్వ
జ్ఞానము సత్యంబు యశము శతమఖపురసో
పానము లయినవి పయిరణ
దానకదా యతుల కది ప్రధానము దలఁపన్. 113

క. అని వేఁడికొని యతీంద్రుల
దనృహమున నారగింప దామోదరుఁ డిం
పునఁ బ్రార్థించిన నేమియు
ననుమానము లేక వారు నౌఁ గా కనినన్. 114

తే. అలవరించి చతుర్విధాహారములను
దుష్టి చేసి దుకూలముల్ ద్రుంచి త్రుంచి
కట్టనిచ్చిన యతులును గమలనాభు
వీడుకొని మున్ను వచ్చినజాడఁ జనిరి. 115

క. విచ్చలవిడి దుర్వాసుం
డచ్చోటన నిల్చె సంతతానందపదం
బిచ్చఁ దలంచుచు నారదు
డచ్చపుఁ జెలికాఁడు గా మురాంతకుఁ డంకన్. 116

వ. హంసడిభకుల వధింపం జింతించుచుండెఁ దదనంతరంబ. 117

ఉ. క్రూరతఁ గ్రొవ్వి హంసడిభకుల్ సభకుం రాజ్యగౌరవో
దారుని బ్రహ్మదత్తుఁ దమతంత్రిఁగనుంగొనిరాజసూయమున్

ధీరతఁ జేయు మియ్యెడను దిగ్విజయం బొనరించి యజ్ఞసం
భారము లెల్లఁ దెత్తుమని బాహుబలంబుఁ జలంబుఁ జెప్పినన్. 118

క. అతఁ డౌఁ గా కనుటయు స
న్నుతమతి యగు నాజనార్దనుండు ధరిత్రీ
పతిసుతులకు నతిహితముగ
జతురతతోఁ బలికె సహజసౌజన్యమునన్. 119

గీ. రాజసూయంబు చేయ నేరాజు దలఁచు
నాతనికి రాజు లరిగాఁపు లయినఁ గాని
నిర్వహింపదు మన మెల్లి నేఁడు సేయు
లావు మెఱయునె ధర యింగలాలపుట్ట. 120

వ. అది యెట్లనిన. 121

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశ్వరులం బరిమార్చి పేర్చి దు
ర్ధరతరసారుఁ డైనజమదగ్ని తనూజుఁడు సంగరంబులో
సరిసరిఁ బోరియుం బిదపఁ జాలక యెవ్వని కోహటించె నా
పరబలభీష్ము భీష్ముఁ బెఱపార్థివు లేమనువారు పోరులన్. 122

మ. కురువీరాగ్రణి బాహ్లికుం దలిగినం గోదండపాండిత్య మె
వ్వరుఁ జూపంగ వలంతు లే పవనజున్ వైరిక్షమాపాలభీ
కరు భీముం గదలించువారుఁ గలరే కంసారితోఁ బోరిలో
సరివాఁడై యని మీకుఁ బెట్టుట జరాసంధుండు సైరించునే. 123

సీ. నరకాసురప్రాణనాళోత్తరణకేళి
[1]రణకేళి వలకేళి రమణఁ జూపెఁ
గంసదానవశిరఃకమల [2]కృత్తన మేలు
తనమేలుచేయి పుద్దలకు నొసఁగెఁ
జాణూరముష్టికక్షతజకీలాలంబు
నాలంబులో నెల్ల నలవు వఱపె
మురహయగ్రీవాంత్రమూలఫేనావళి
నావ[3]లిదలఁగ జీకాకు పఱచె

1. వల కేలివనమున కలవు సూపెఁ 2. కృతతనమగు. 3. లీవలఁగఁ.

తే. వీరరససార [1]కాసారవిహరణంబు
విష్ణునకు నొప్పు నతనితో విగ్రహింప
దొరకొనిన వచ్చు మనకు మద్దులు మునింగి
పాఱ వెంపళ్లు కెంతబంటి యనుట. 124

మ. నిలువం జాలుదురే రణాంగణములో నీలాంబరాడంబరో
జ్జ్వలవేషంబు హలాహలస్థలహలవ్యాపారదోస్సారముం
బ్రళయాంబోధరసోదరారవము నొప్పన్ దర్ప మేర్పాటుగా
బలభద్రుం డతిరౌద్రుఁడై కదిసినం బ్రత్యర్థిభూపాలకుల్. 125

మ. వికలవ్యూహవిధావిహస్తభట మై విధ్వస్తమాతంగ మై
శకలీభూతశతాంగ మై శరఘటాశల్యాయమానాశ్వ మై
సికతాసేతువు నిమ్నగారయముచేఁ జిందైనచందాన సా
త్యకిచేతం బడుశత్రుసంఘము దశాదైన్యంబు సైన్యంబునన్. 126

వ. అదియునుం గాక. 127

ఉ. చేసినవారు మీరు గడుఁ జెట్టతనం బది యోర్వ లేక దు
ర్వాసుఁడు వాసుదేవుఁ గని వైరము తోరము చేసినాఁడు స
న్న్యాసులఁ గూడికొంచుఁ జని యంతకుము న్గడిద్రెవ్వి మీ యెడన్
గాసిలియుండు యాదవని కాయము సైఁపదు రాజసూయమున్. 128

క. మును చేసిన వైరంబును
ముని చేసిన వైరమును మిముం దడవక పో
వునె వైదేశికుఁ డగు వి
ప్రునిచే నివ్వార్ర వింటి భోజనవేళన్. 129

క. ఒప్పగునో తప్పగునో
యిప్పటికిం దోఁచుకార్య మిది నృపతులకుం
జెప్పవలె నాప్తమంత్రులు
చొప్పగునె మనకు రాజసూయము చేయన్. 130

---

1. సాకార.

చ. అనుటయు హంసు డిట్లను జనార్దనుతో మదిజోదు భీష్ము నొం
దనఁ జనిలేదు బాహ్లికుఁడు నాతనికంటెను బంకు వీరు మ
ద్ఘనభుజశక్తికిం దరము గారు దలంపక వచ్చి భీముఁడుం
గనుఁగొన లేఁడు మద్ధనురకాండరవిచ్ఛవిచండకాండముల్. 131

మ. కలు ద్రావం బని పూని యాదవులు ఖడ్గాఖడ్గి [1]వాదింతురే
కలఁగం బాఱుట గాక పంతములకుం గంసారి సైరించినం
గలనం బాణముతోన పట్టువడు నింకన్ సాత్యకిం గీత్యకిన్
బలభద్రున్ గిలభద్రు నా యెదురఁ జెప్పం జొప్ప దప్పం జుమీ. 132

క. మనకు జరాసంధునకును
మనసులు గలసినవి ధర్మమయుఁ డాతం డీ
పని గాదనఁ డింక జనా
ర్దన యాదవనగరమునకుఁ దడయక చనుమీ. 133

హంసడిభకులు జనార్దనుని యాదవనగరమునకుఁ బంచుట

క. చని యా జనార్దనునిచే
ఘన మగులవణంబు మనకుఁ గప్పముడుగు మే
ధనములును సరకు గా విటఁ
జనుదెమ్మను మతని యజ్ఞసమయంబునకున్. 134

క. ఏయుత్తరంబు సెప్పిన
నీయానయ నీకుఁ జెలిమి నీతో మిగులం
జేయుట నొండన నేర న
సూయ తలంపునకు రాదు సూ నినుఁ గనినన్. 135

మ. అనుడు న్వేడుకతోడ వీడుకొని యశ్వారూఢుఁడై యా జనా
ర్దనుఁ డేతేరఁ దదంతరంగము [2]మునీంద్రత్రాణు శ్రీవత్సలాం
ఛను నేఁడెల్లి కనుంగొనం గలిగినం జాలుం గృతార్థుండఁ బొ
మ్మని చింతింపఁగ నాకు నేఁడొదవె నాహా తీర్థమున్ స్వార్థమున్. 136

1. ఁబాదింతురే. 2. విచారంబార.

సీ. యదుకులాంబుధిచంద్రు నానందమునఁ జూచు
రామాదిహితచకోరములలోన
దనుజారిపారిజాతముఁ జేరి పొదిగొన్న
రాజన్యరాజకీరములలోన
వసుదేవసుతసరోవరములో నోలాడు
సనకాదిదివ్యహంసములలోన
గోపాలనవపుష్పగుచ్ఛంబు మూఁగిన
పరిచారికాద్విరేఫములలోనఁ
తే. గలయఁ దొలుబామునోములు గలవుగాన
సెలవు లేక జన్మంబులు చెడియె నాకు
మీఁద జన్మంబు గలుగ నిర్మించె నేని
కమలజునిపేర దాపటికాలిబొమ్మ. 137

సీ. వెలిదమ్ములో లేఁత వెన్నెలో యమృతమో
కన్నులో చిఱునవ్వొ కనికరంబొ
గగనమో చుక్కలో గ్రహరాజ బింబమో
వక్షంబొ మౌక్తికావలియొ మణియొ
తరఁగలో ఫేనమో తరణిమండలమొ హ
స్తములో శంఖంబొ సుదర్శనంబొ
తలిరులో కరికరంబులొ కుంకు[1]ము ప్రభయొ
పదములొ యూరులో పచ్చఁబట్టొ
ఆ. యనుచుఁ గన్నులార నాజగన్నాథునిఁ
గనుగొనంగ నేఁడు గలుగు గాన
తలఁపులోన మున్ను దలఁచినరూపంబు
పట్టువడుట జన్మఫలముగాదె. 138

వ. అని వర్ణించుచుం జని ద్వారకానగరప్రవేశంబుచేసి యదువల్లభునగరివాకిట హయావతరణంబుచేసి తనరాక యెఱింగించి పుచ్చి యద్దేవదేవునియనుమతంబున సభామండపంబునకుం జని జనార్దనుండు. 139

1. మ ప్రభో.

మ. కనియెం గౌస్తుభరత్న భూషణు వలత్కర్పూరహారావళీ
వనితాచాలితతాళవృంతపవనవ్యాధూతచేలాంచలున్
మనుజాధీశకిరీటకోటిపరిషన్మధ్యస్థసింహాసనాం
కునిఁ దేజఃప్రసరప్రభాతతరణిన్ గోపాలచూడామణిన్. 140

సీ. బలభద్రుఁడును దాను భద్రపీఠంబునఁ
గదియ శైనేయుఁ డగ్రమున మెఱయ
దుర్వాసుఁడును నారదుండును రెండు ది
క్కులఁ దన కింపుగా గోష్ఠి సేయ
నుగ్రసేనుఁడు గౌరవోన్నతిఁ దనుఁ జేర
గంధర్వగానంబు గలసి పొలయ
నప్సరోగణనర్తనాడంబరముఁ జూచు
తనచేత నభిమతధనము లదరఁ

తే. దనకునై వందిమాగధ స్తవము నిగుడ
సామవేదులు దనయందు సార మెఱుఁగఁ
దనవలన లోకు లానందధారఁ దేల
లీలఁ బేరోలగం బున్న నీలవర్ణు 141

వ. కని కదియం బోయి తనపేరు చెప్పి నమస్కారంబు చేసి బలదేవునకు నట్ల ప్రణమిల్లి యథోచితస్థానంబునం గూర్చున్న యనంతరంబ మురాంతకుం డతనితో నిట్లనియె. 142

గీ. అనఘ! మీరాజు బ్రహ్మదత్తునకుఁ గుశల
మా నరేంద్రకుమారులు హంసడిభకు
లధికభవ్యులె వరములు హరునిచేతఁ
గొన్న వారట కుశలంబు గొఱఁత గలదె. 143

క. మీజనకుఁడు శుభయుతుఁడే
రాజులు మిము గారవింతురా సుఖకరులే
భూజను లిపు డిచ్చోటఁ బ్ర
యోజనమా నీవు వచ్చునుద్యోగమునన్. 144

1. నవ.

వ. అనుటయు నా జనార్దనుం డిట్లనియె.

క. అందఱకుం కుశలమ, మా
కుం దగుమన్ననల, ప్రజలకుం బరిణామం
బిం దే వచ్చినపని గో
విందయెఱిఁగింప కెఱుఁగవే విశ్వపతీ. 146

క. లోపల వెలుపల వెలుపల
లోపలఁ గా నుండు నఖిలలోకంబులకున్
నీ పరతత్త్వము చిత్రము
రూపము నై నీవు లేనిరూపము గలదే. 147

ఉ. ఉండుట తప్పు వారికడ నుండమి త [1]ప్పిట రాక తప్పు, రా
కుండుట తప్పు, తప్పులకు నొప్పులకున్ గతి నీవ దేవ ! యే
నొండొకరుండనే పలుక కూరక నేరక యుండఁ జేయు నీ
తొండితనంబుచేత నిసితింతలు వాతెడిఁ జిత్త [2]మిప్పుడున్. 148

చ. అనుడు జనార్దనుం డను జనార్దనుతో విను దూతకృత్యముం
బనివడి పూని యేలికల ప్రల్లద మైనను జెప్పఁ జెల్లుఁ ద
ప్పనిపలుకైనఁ బోలు వినఁ బంతము చల్లకు వచ్చి ముంత దాఁ
చినగతి నింత మాటువడఁ జేసినఁ గార్యము గాన వచ్చునే. 149

క. రావలదే పంచినపని
సేవకులకుఁ బాముకాటు సీరఁ దుడిచినం
బోవునె వారే మనిరో
నీ వేలా దాఁచె దేమి నేరమి నీకున్. 150

చ. అనుడు నతండు హంసడిభకానుమతంబున రాజసూయమున్
జనపతి సేయఁ బూని భుజసారమునన్ సడిసన్న రాజులన్
ధనములు చాలఁ దెండని పదంపడి దేవర యున్నచోటికిన్
నను( బని పంపె నిమ్ము యజనంబున మున్నిడి చేయువాఁడుగాన్. 151

---

1. మె.

గీ. అప్పు డాహంసడిభకు లిట్లనిరి మనకు
లవణ మెంతేని నడుగు యాదవులచేత
వేగ రమ్మను శౌరి నియ్యాగమునకు
నావుడుం బని పూనితి దేవదేవ! 152

వ. అనుటయు వాసుదేవుండు రోసంబునకు మూలం బైన హాసంబుచేసి
యిట్లనియె. 153

ఆ. రాజసూయకర్త బ్రహ్మదత్తుం డట్టె!
[1]రభస మెసఁగ హంసడిభకు లట్టె!
చేయఁ బంచువారు చెల్లఁబో లవణంబు
మోచువాఁడ కాక మురవిరోధి. 154

ఉ. అప్పన మెంత గావలె నహంకరణంబు దొలంగి యిచ్చినం
గప్పము పేర నేఁడు నొడికారితనంబున మోస పుచ్చఁగా
నుప్పులు దెత్తురే సమరయోగ్యతలంబున వైరికోటితో
నుప్పనఁబట్టి లాడునెడ నుప్పులు దెత్తురుగాక యాదవుల్. 155

వ. అని పలికి యాదవలోకంబు నాలోకించి. 156

మ కలరా యింతకుమున్ను యాదవులచేఁ గప్పంబు దెప్పింపఁగాఁ
గలరా రాజులు గాజులుం దొడవుఁగా గల్పించిరా కాకులం
గలకంఠంబులఁ జేసెనా కటకటా! గౌరీశ్వరుం డేమిగాఁ
గలవారో యిటమీఁద హంసడిభకుల్ గర్వాంధకారంబునన్. 157

వ. అనుటయు యాదవులు దమలోన. 158

గీ. హంసడిభకులు రాజసూయంబు సేయ
మనము గప్పంబుఁ గొనిపోక మంచిమాట
నేఁడు [2]సారిసత్తెలమొనల్ వాఁడి చేసి
నోరి చొరవ భూతేశుండు వారిఁ జెఱిచె. 159

ఉ. యాదవు లుప్పు మోవఁగ మురారికి సోలలు మోవ కింకఁ బో
రాదు హలాయుధుం గొలువ రమ్మను రైరటుగాని యాగముం

1. రచన—డిచకులట్టి (వీ) 2. సారెసత్తుం.

గాదట చేయ హంసడిభకక్షితిపాలకుమారు లంచు నా
బీదల కేల బోగుబడి పెద్దఱికంబునుఁ బెట్టబీరమున్. 160

తే. అనుచు నొండొరుఁ జెయి వేసి యపహసింప
హరియుఁ గలకల నవ్వి జనార్దనుండు
వినఁగ నిట్లను నొం దేల వీరవరుల
నలుగు మొనఁగాక కప్పంబు లడుగ నగునె. 161

క. అరిఁ గరమున నే దాల్చిన
నరిగరము నాగేంద్రధీరుఁ డయినం జెడఁడే
యరి దిరమై న న్నడుగుట
యరిది రమైకాభిలాష లగున్నృపతులకున్. 162

మ. వెదకం బోయినతీవ కాలఁ దవిలెన్ వేయేల దుర్వాసుచే
మొదటన్ సంచకరంబు హంసడిభకోన్మూలక్రియా కేళికిం
గుదురై యున్నది సాటిగాక యిట మత్కోదండకాండోదర
ప్రదరప్రావరణాంబుద ప్రకటశంపాకంపశాత్కారముల్. 163

వ. వారలతో నిట్లనుము. 164

ఆ. ఈశవరముచేత నెవ్వఁడే నిప్పాట
శూరుఁ డైన దువ్వఁ జూచి నక్క
యొడలు గాల్చికొన్న వడువున మీ రింత
లావుమాట లాడ లజ్జ గాదె. 165

ఆ. హరిగదావిహార మల్లంతఁ దోఁచిన
వరము మిమ్ముఁ గావ వలఁతి యగునె ?
వెఱ్ఱివార ! పిడుగు వ్రేసినఁ దలటొప్పి
యాఁగునే వివేకమైన వలదె. 166

క. అగునో కావో వరములు
డిగ విడువఁగ రాదు హంసడిభకులు నన్నున్
మొగరించిన హరునయినను
జగ మెరుఁగఁగ దోలి తమ్ముఁ జంపెద ననుమీ. 167

క. పరపగు మోహర మేర్పను
నెరవగుచో నెల్లి నేఁడు విడెసెద మధురా
పురమునఁ బ్రయాగమునఁ బు
ష్కరమునఁ దా రేర్చికొన్న కల నగు మాకున్. 168

మ. మొగమోటంబున నీవు వారి యెదుటన్ ముఖ్యంబు యుద్ధంబకా
దెగనాడన్ వెఱలేని సాత్యకి సమిద్ధీరుండు నీతోన యేఁ
గి గుణగ్రాహులు గాని తద్ధరణి భృత్కిటాంతరంగంబులం
బగుల న్వ్రేచుఁ గఠోర వీరవచన ప్రాస ప్రసారోద్ధతిన్. 169

వ. అని పలికి సాత్యకిం గనుంగొని నీవితనితోడ సాల్వనగరంబునకు హయా
రోహణుండ వై సన్నాహంబు మెఱసి యొక్కరుండవ చని మదీయవచనంబు
లన్నియుఁ దద్రాజడింభకుల యెదురఁ బలికి కలనుచెప్పి రమ్మని వీడుకొల్పిన.170

## సాత్యకి సాల్వనగరమునకుఁ బోవుట

ఉ. వేడ్కఁ బ్రణామపూర్వముగ విశ్వజగజ్జనకున్ జనార్దనున్
వీడ్కొని యాజనార్దనుఁడు వేగమ కూడఁగ రా నరాతు లీ
మాడ్కి మహోద్ధతిం జెనయ మా వశమా యన జోడుఁగైదువుం
జూడ్కికిఁ దోఁప శౌరి యనుజుం డరిగెం దురగాధిరూఢుఁడై. 171

సీ. చని సాళ్వపురము చొచ్చి నరేంద్రనందన
మందిరద్వారంబునందు హయము
నవతరించి జనార్దనాంతఃప్రవేశంబు
మున్నుగా వారికిఁ దన్ను శౌరి
పుత్తెంచుటయుఁ జెప్పి పుచ్చె నాతం డట్ల
చేసి యర్ఘ్యాసనాసీనుఁ డైన
విదప రప్పించినఁ బెంపుతో సాత్యకి
యాజనార్దనుఁ డన్నయాసనంబు

తే. నందు గూర్చున్నఁ దప్పక హంసుఁ డతని
యాననంబు విలోకించి యామనోజ్ఞ

భీషణంబగువేషంబు బింబితావ
హిత్థరోషంబుఁ గనుఁగొని యిట్టులనియె. 172

మ. ఇతఁడే సాత్యకి యిమ్మహాభుజుబలం బెల్లప్పుడుం జెప్పఁగా
శ్రుతిపర్వంబగు నేఁడు గంటిమిగదా శూరుండు ధీరుండు సు
వ్రతుఁ డౌదార్యసమన్వితుం డఖిలశాస్త్రజ్ఞుండు శస్త్ర క్రమా
ర్జితసారుం డనుమాటలన్నియుఁ దగుం జిత్తం బుదాత్తంబుగన్. 173

వ. అనుటయు జనార్దనుండు. 174

క. హరిదక్షిణభుజము సమి
ద్ధురంధరుఁడు నయవిహారదోహలి హలికిం
బరమాప్తుఁడు సకలకళా
పరిణతుఁ [1]డీతం డలంతిపని వచ్చునటే 175

వ. అనుటయు హంసుండు సాత్యకితో నిట్లనియె. 176

గీ. కంసవైరికిఁ గుశలమే కామపాలు
నకుఁ బ్రమోదంబె యాదవులకు సుఖంబె
యుగ్రసేనుండు మొదలుగా నున్న సాత్వ
తులకు నెల్లను సేమమే దురితదూర. 177

క. అనవుడు సాత్యకి మోమునఁ
గొనసాగనితెలివి దోఁపఁ గుశలమ నీచె
ప్పినవారి కెల్ల ననుటయు
ననియె జనార్దనునితోడ హంసుఁడు పిదపన్. 178

శా. కంటే శౌరి నతండు నీ పలుకు లాకర్ణించెనే క్రమ్మఱన్
వింటే తద్వచనంబు చెప్పు మనుడు న్విప్రోత్తముం డిట్లనున్
గంటిన్ గంటి దయానిధిన్ గుణనిధిన్ గారుణ్యపాథోనిధిం
గంటి న్నమ్మికఁ దమ్మికంటిఁ గొలువం గంటిం గృతార్థుండనై. 179

1. డతలంకి రాచపని నచ్చునటే.

చ. అవిరళరత్ననూత్నకనకాసనపూర్వమహీధరంబుపై
నవవికచారవిందరుచి నవ్వెడు కన్నులదాయ చుక్కలన్
దివియల మాయఁజేయ నలుదిక్కుల మ్రొక్కుల పేరమోడ్పు యా
దవకరకైరవంబుల కతంబునఁ గంటి మురారి భాస్కరున్. 180

సీ. ఉరము కౌస్తుభరత్న ముదయాద్రితటమునఁ
బొడతెంచు కలువల[1]బోటుబోటు
శిరము కిరీటంబు సురగిరినెత్తాన
రాజిల్లు పగలింటిరాజురాజు
కటిపచ్చఁబట్టు దిగ్దంతి కుంభస్థలిఁ
జూపట్టు రేయెండ జోడుజోడు
చేతిశంఖంబు గర్జితగజేంద్రము కేలఁ
బరఁగు వెన్నెలపూవు బంతిబంతి

తే. యై కొలువులోనఁ దేజోమయంబు సేయ
మౌక్తికవితానమయసభామండపమున
సత్యభామాసఖీకటాక్షముల గములు
చూఱగొనుచున్న దేవకీసుతునిఁగంటి. 181

మ. కని యద్దేవునితోడ వేడబమునం గప్పంబు గార్యంబుగా
ననుఁ బుత్తెంచుటఁ జెప్ప నోడితి జగన్నాథుండు నీ వందు వ
చ్చిన కార్యం బెఱిఁగింపు మన్న పిదపం జెప్పంగ నోరాడె న
వ్వనివా రెవ్వరు లేరు నా పలుకులన్ వాక్రువ్వ నిం కేటికిన్. 182

వ. ఏ పురుషోత్తము నుప్పు గప్పం బడిగిన నప్పు డతం డెప్పుడెప్పు దప్పార్థివడింభద్వయంబుం జూతునో యెచటం దెగం జూతునో యనుచుండి వెండియుం గొండుక నివ్వి యవ్విభుండు నారదుతోడ మాటలాడుచు నా మాటల యెడ ననాదరంబు చేసె నవ్వాసుదేవుండు దుర్వాసుతో వినోదంబుగాఁ గొందఱు యతీశ్వరులకు వాదు చేయించి బ్రహ్మతత్త్వనిర్ణయంబునకు వెఱవక వారిచేత నుత్తరంబు లిప్పించుచు నుండె నట్టియెడ నాతలంపున. 183

1. బోఁటిబోఁటి.

గీ. అకట నేరనివా రైరి హంసడిభకు
లేమిగా నిందుఁ బుత్తెంచి రే నిదేల
వచ్చి పిఱిఁడి నైతి నివ్వాసుదేవుఁ
దేఱి చూడ రా దని చాల దిగుల గుడిచి. 184

క. మానితిఁ బని యామాటలు
మాని తిరుగుఁ డింక బోరు మనమాటలకుం
బూని మరుమాట లాడఁగ
శౌ నేయుఁడు వచ్చెఁ దాన చాలుం బనికిన్. 185

క. అనుటయు హంసుఁడు గమగమ
గనలి మదిం జెరువు విడిచి కాలువఁ బొగడం
జనునే పీనికి నని యి
ట్లను ననుమానింప కా జనార్దనుతోడన్. 186

శా. ఓరీ బ్రాహ్మణధూర్త! నా యెదుర నోహో! సాహసం బెట్టిదో
వైరిం గోరి నుతించుమాట లెటుగా వచ్చెం గృతఘ్నా! యిదిన్
నోరే యెవ్వరి కెవ్వ రయ్యెదరు నిన్నుం బెంచి మన్నించినన్
గారామై యిటు చేసితే తొలఁగు మింకం జాలు నీ కార్యముల్. 187

మ. నిను రప్పింపక మున్న వేగపడి పూనెన్ శార్ఙ్గకౌమోదకీ
వనమాలాంబుజ చక్ర భూమికలు గ్రైవారంబు చేయించె నే
లినవాగారులచేత యాదవుల నోలిం గొల్చి కూర్చుండఁగా
బనిచెం గేశవుఁ డైంద్రజాలికుగతిం బ్రాంతయ్యె నీ కంతటన్. 188

చ. పిఱికివి గాక నీవు నొక పెగ్గడ వే సభ లుండుభంగి ము
న్నెఱుఁగనివాఁడవై బ్రమసి యెవ్వరిముందర నేమిమాటలో
యఱచితి వారి జంకెనల కచ్చటఁ ద్రోపడి వచ్చి తిచ్చటం
[1]గఱవఁగ వచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్. 189

శా. నాకీతమ్ముఁడు ఖడ్గముం గలుగఁగా నాకేశుఁడున్ సాటియే
లోకంబు ల్పదునాలుగున్ గెలుతుఁ గల్లోలానిలాలోలవే

1. గరిమము

లాకూపారము పారముం గదియఁ జేయంజాలినన్ ద్వారకం
గైకొందున్ యదు వృష్ణి భోజ నృపసంఘధ్వంసనాపాది నై. 190

క. మా పట్టణమున నుండక
పో పో నినుఁ జంపరాదు పొత్తునవాఁ డై
భూపాలకుసిరి మ్రింగితి
పాపాత్మా! చుట్టమైతి పగవారలకున్ 191

వ. అని పలికి సాత్యకిం గనుంగొని. 192

గీ. ఓరి యాదవ ! కష్టాత్మ! యొక్కరుండ
విచ్చటికి నీవు వచ్చుట యేమి చంద
మే మనియె నందసుతుఁడు న న్నెఱిఁగి యెఱిఁగి
కప్ప మిప్పుడు నా కీనికారణంబు. 193

వ. అనుటయు సాత్యకి యిట్లనియె- 194

శా. ఆలోకించెదు శార్ఙ్గముక్తపటుబాణౌఘంబుచే నీ మొనల్
నేలం గూలఁ గపాలపాలికలలో నిండారురక్తంబులం
గ్రోలం గేలఁ బిశాచబాలికలు గైకొన్న న్మణిశ్రేణితోఁ
గ్రాలం బట్టిన వెండికోర గతిం గప్పంబు లొప్పంబుగాన్. 195

ఉ. తెచ్చెద రెల్లి నేఁడు మముఁ దెండని పంచిన యుప్పు డాకినుల్
మచ్చటికంబునం జవు లమర్చుటకై డిభకుండు నీవునుం
జొచ్చినచోటు సొచ్చి రణశూరుఁడు శౌరి కరాసిధారచేఁ
బచ్చడి చేయఁగా జమునిబాననముం బురుడించుచోటికిన్. 196

శా. ఆకంసాసురభంజనుం గినియఁ జేయంజాలు నీజిహ్వా హం
సా ! కోయంగలవాఁడ నిత్తు నది హస్తప్రాప్తిగా భూవరా
నీకంబెల్లఁ గనుం గొనంగ నిచటన్ నీ సొమ్ము నీ కిచ్చెదం
గా కే నంతటివాఁడనే తలఁచినం గప్పంబుఁ దెప్పింపగాన్. 197

ఉ. మేద్పడి రాజ్యగర్వమున మీఁదు తలంపుగాక చిచ్చునుం
గాడ్పును గూడినట్టు మురఘస్మరుచేతులశంఖశార్ఙ్గముల్

1. దె, లె, రె.

పిడ్పిడి ప్రోయ డాయఁ బదివేవురుజోదులసింహనాదముల్
దోర్పద వే రసాతలము [1]దూటిన మిన్నుల మీఁదఁబాటినన్. 198

వ. వా రెవ్వరంటేని వినుము. 199

సీ. హలపాణి ప్రథముఁ డాహవశాలి సాత్యకి
నేను రెండవవాఁడ నిట్టివాఁడ
మొగజోదు కృతవర్మ మూఁడవవాఁడు నా
లవవాఁడు నిశరుఁ డుల్లఅపుబిరుదు
కంహ దేనవవాఁడు ఘనవిక్రమాఢ్యుండు
వివిధుఁ డాఱవవాఁడు విజయధనుఁడు
వివిధాస్త్రనిపుణుఁ డేడవవాఁడు ప్రఘనుఁ డ
ష్టముఁడు సారంగుఁ డుత్సాహశీలి

తే. నవముఁడు విదూరదుండు సన్నాహమహితుఁ
డుద్ధవుండు దశముఁ డింక నున్నవారి
నెన్నఁ గొలఁదిగా ది ట్టొట యెఱిఁగి కృష్ణు
వెదకి తి[2]ప్పుడు పులిఁగోల ప్రేసినట్టు. 200

క. హరి తనయు లిరువురును మీ
యిరువురకును ముందుకప్పు మెవ్వని కెవ్వం
డరువఁ గలవాఁడు వెజ్జీ?
సురపతిగలిc బాసి రాజసూయము గలదే. 201

వ. ఇంకం గార్యంబు పరువంబు దప్పె సంగరంబ పరిపక్వం బై నయది. వినుము. 202

క. దురమునకు న్మధురయుఁ బు
ష్కరముఁ బ్రయాగంబుఁ దగిన కలఁకులు మీ కే
[3]దుర వగు నది గాను మనె హరి
యిర వగుగోవర్ధనంబు నేన యొసఁగితిన్. 203

1. దూటియు...బాటియున్. 2. పరున్నపులిఁ. 3. దొర పగు.

వ. అనుటయుం గనుంగవం గినుక నిక్క నక్కుమారయుగళంబు గిటగిటాయమానదంతంబును జటులభ్రుకుటివికటనిటలంబును నిబిడదీర్ఘతరనిశ్వాసంబును నిష్పేషణభీషణకరతలంబును నిర్గళితఘర్మజలకణకలుషితకపోలంబును నగుచు నవుడుగఱచి యిట్లున్నభంగిన పగఱం బరిమార్తు ననుచుండె నప్పుడు హంసుండు సాత్యకితో నిట్లనియె. 204

ఉ. ఓరి దురాత్మ! నీకుఁ దెగ నొల్లక యుండుట నీ పరాక్రమం
బారసి కాదురా వెఱవకాడుము దూతుఁ డవధ్యుఁ డెందు నీ
వీరుల నిన్నుఁ జమ్మెటనె వ్రేయుదు డాయుదుఁ బోర శౌరికిన్
సీరికి బాహుసార మెడసేయుదుఁ జేయుదు రాజసూయమున్. 205

మ. వినురా సాత్యకి! మాట లేమిటికిరా వేదండకోదండకే
తనసంకేతనరేంద్రనూతనబలోదగ్రంబుగా మోహరిం
ప నవశ్యంబును వత్తుఁ బుష్కరసరఃపార్శ్వంబునం దెల్లి గొ
ల్లెన లెత్తింతు విరోధు లంబునిధివెల్లిం [1]డొల్లఁ జల్లింపఁగన్. 206

వ. అనుటయు డిభకుండు. 207

చ. విడు విడుమంచు నా మొనలవీరులు పోరులుగోరుచున్న వా
రెడపడకుండ మి మ్మిచట నెన్నితి [2]కొందఱ సిగ్గు గాదటే
గొరగులు దప్పఁ బట్టినను గోటగ నేనిక [3]తెట్టువెట్టినన్
బడుగులు మీరు చూడ హరిపాపటపై నడిదంబు వెట్టుదున్. 208

వ. అనుటయు సాత్యకి కోపించి. 209

చ. కడఁగితి [4]దౌత్యము న్నెఱపఁ గాన సహింపకపోదుఁగాక నా
కడిదము చేత నుండఁగ మురారి విరోధులఁ బట్టి పూవునుం
[5]దొడిమయుఁ జూపకున్న నది ద్రోహము పందెము వేసి తుండము
ల్దడఁబడకుండ మిమ్ముఁ బెడధారన వ్రేయుదు నేమిచేయుదున్. 210

వ. అనుటయుఁ గోపంబులు రూపంబులు గై కొన్న తెఱంగున నాహంసడిభకులు సాత్యకితో వీ వింక సంగర సన్నాహంబున సకలసైన్యంబుల సమకూర్చుకొని పుష్కరసరోవరంబునకు రమ్ము చావునకుం దప్పితివి పొమ్మనుటయుం గనలి కల

1. పుల్లఁ. 2. దన్నఁగ; నీకును. 3. తట్టు. 4. ధౌర్త్య. 5. దొడమయుఁ.

కలనవ్వికలనికి నడచికదామాటలు సకలలోకైకనాథుండుసమయింపనున్న మిమ్ముం జంపఁదగ దనుటయు వారు మీ యన్నం గయ్యంబునకు దోడ్కొని వచ్చిన నీ పంతం బెఱుంగ నిచ్చుం బొమ్మనుడు నాశైనేయుండు నడిదంబు జళిపించుచు నీయకౌని వెడలి హయారోహణంబు చేసి నిజపురంబునకు రయంబునం జనుదెంచి జనార్దను దర్శించి తనపోయివచ్చిన తెఱం గెఱింగించిన నారాయణుండు మరు నాడు. 211

## కృష్ణుఁడు దండయాత్ర వెడలి పుష్కర సరస్తీరమున విడియుట

మ. కదఁకం బన్నఁగ నానతిచ్చెఁ జతురంగంబుల్ రణక్రీడకు
న్వెడలన్ డిండిమదుందుభు ల్గుభులనన్ వ్రేయించి సైన్యంబుసం
దడిఁ బై పై నడియాలపుంబడగ లెత్తం బంచె నొక్కుమ్మడిం
బడవాళ్ళం బిలిపించి చిత్తమున దర్పం బేర్పడం జేయుచున్. 212

వ, తదనంతరంబ సంరంభ సంభావితసన్నాహులగు సారథులుసారథుల కుతూహలంబునకు యోగ్యంబులగు యుగ్యంబు లమరసమయంబున కమయుందగుకణయ గంపణ ముసల ముద్గరపరిఘపరశ్వధకరవాల భిండివాల ప్రముఖ ప్రహరణంబులు నిండి నొండొండ నడుకొన నిడి సిడింబులు ముడివడ వెడలించి జడనిధిలో నడ యాడుచుండిన యోడలతో పీడుజోడాడు రథంబులును [1]గుథంబులలోఁ బెఱికిన మెఱుఁగుటమ్ముల నిమ్ముల నిడి తెరపుల నొరపుగా నున్న జోదులచేతి టంకారముఖరంబు లగు చాపంబుల రూపంబులం జూపట్టు పసిండకట్ల చుట్టంబులై భుజంబులం బొలుచు కటక కేయూరంబులం గలసి కలసి బలసినప్రభలు ముంచికొని ఖచించిన పలుదొడవులతోడఁ గూడం జూడ నలవడి వికచ వివిధకర్ణికారపరికీర్ణంబు లగు నంగంబులం దెగడు నాగంబులును బేరు వేర భైరవమతంబు భారంగి లంగిణి కలీయ విలాలనంబు మొద లగు ఖలీనంబుల వినీలంబు లయిన ఫేనంబులు దొరుగ నిరుగడం గడలుకొనుకర్ణచామరంబు లినుమడింపఁ గరాళింపక లాఁత చేయక పయివోవక కొక్కరింపక తొడుకక తొట్టింపక చెల్లక నడచి కింకిణీగణ ఝుణ ఝుణ ఝుంకారాలంకార హేషారవకోలాహలంబులు సెలంగ బంగరుపు పల్లనం బులపైఁ బెల్లు ఖచించిన నానావిధ నూత్నరత్నప్రభాపటలంబులతోడం జౌకళింపుచు

1-నగంబుతోఁ జేరిన·

నింద్రాయుధంబులతోడం దోడు చూపుచు గంగాతరంగంబుల తెఱఁగు దాల్చు వారువంబులును విశంకటకంకట వివిధ వర్ణంబు లుదీర్ణంబులుగా వీరరససముచిత సంభాషణంబులు చెలంగఁ గలంగక తొలంగక తెరలక మరలక నడుతు మను పంతంబులు మున్నుగ సేసలుఁ గాసెలుం జిందెలు నందెలుఁ బూఁతలుఁ జేఁతలుం జెలువుగ సురియ ముప్పిడిపిడియమ్ము కఠారమ్ము దరువలి కొంగవా లడిదమ్ము గంగ్రగొడ్డలి కత్తి గొంతంబు సబళం బీటె యినుపకోల సెలకట్టె పట్టెంబుసిరాణంబు చక్రంబు మొదలగు కైదువులు మెఱుంగులు తుఱంగలించిన రవిమండలంబు తెఱంగున వజ్రవైదూర్య మణిమరీచిమధ్యంబునం బొలుచుసింగంబులసంగడివాలగు వీరభటులునుం గలిగి బహువిధచాతుర్యంబులు శౌర్యంబులకుఁ జేవ యొసంగ బిరుదులతోడి యాతపత్రంబులు చిత్రపాత్రంబులుగా నడియాలపుంబడగలు మొగుళ్ళతోడం దడంబడ వెల్లివిరిసిన జలరాశిపోలుపునం దద్బలంబు నడిచె నప్పుడు. 213

సీ. శార్ఙ్గనందకసుదర్శనపాంచజన్య కౌ
మోదకీ కౌస్తుభములు వెలుంగఁ
బీతాంబరము గట్టి పెండెంబు డాకాల
బెట్టి సన్నద్ధుఁడై పేరురమునఁ
బద్మమాలిక గ్రాల బద్ధగోధాంగుళీ
త్రాణుఁడై వందిబృంద స్తవములు
భూసురాశీర్వాదములు మింట నంటంగ
బలభద్ర సాత్యకి ప్రభృతు లెల్లఁ

తే. జేరి నడతేర నరదంబు దారకుండు
గడప యాదవసైన్యసాగరము వొంగఁ
[1]దొలుత నడతెంచు [2]నిండుచందురుఁడు వోలె
రుచిరమూర్తియై నీలవర్ణుండు వెడలె. 214

క. ఈ విధమున సేనలతో
నా విశ్వంభరుఁడు వెడలునప్పుడు దృఢసం

1. గరిమ. 2. నల్లఁజకదుడు; నల్లఁఱందురుఁడు.

రావంబుచేత సకల
స్థావరములుఁ గదలఁ బాంచజన్యం బొత్తెన్. 215

సీ. వడఁకుపన్నగరాజుపడగలమీఁద స
ర్వంసహాకాంత వేరణము సూప
నఖ్యాతలూఁగెడు నుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాట మాడఁ
దెర లెత్తి సప్తసాగరములుఁ బొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప
మొకములచాయ వేఱొకచందముగ నిల్చి
కమలసంభవుఁడు [1]ప్రేంఖణ మొనర్ప
తే. మంగళములోని ప్రేలాలమాడ్కిఁ జుక్క
లిక్కడక్కడ పడ దిక్కు లెనిమిదియును
బగులఁ బాతాళతలము [2]గుబ్బటిలఁ జెలఁగె
శౌరి పూరింప నప్పాంచజన్యరవము. 216

మ. రథవేదండతురంగ సైనికగణారావం బుదాత్తశ్రుతి
వ్యథనస్వానఘణంఘణంఘణఘణధ్వానంబుతో దిగ్వియ
త్పృథివీమండలమెల్ల నిండుటయుఁ దద్దీరధ్వనిం బై కొనెం
బ్రథమారంభవిజృంభమాణహరిశార్ఙ్గజ్యాణ[3]నిక్వాణముల్. 217

వ. ఇట్లు చతురంగసైన్యసమేతంబుగా సవరణతో సన్నాహంబు మెఱసి హృషీకేశుండు పుష్కరసరస్తీరంబున విడిచి తదీయ జలంబుల నుపస్పర్శంబుచేసి మొన లేర్పఱిచి యున్నయవసరంబున. 218

## హంసడిభకులు యుద్ధసన్నద్ధు లయి వచ్చుట

మ. భసితాలిప్తపుత్రిపుండ్రనిటలప్రత్యగ్రరుద్రాక్షదా
మ సముజ్జృంభితవేషు లై వరధనుర్మాహేశ్వరాద్యస్త్రశ
స్త్రసమృద్ధిన్ రథముల్ వెలుంగ మనుభూతద్వంద్వమే తేరరా
జ సహస్రంబులతోడ హంసడిభకుల్ సంగ్రామసన్నద్ధులై. 219

1. పెక్కణ. 2. గుబ్బతులు వోవ. 3. నిర్వాణముల్.

సీ. [1]ఉద్ధతి నిజదశాక్షౌహిణీబలముతోఁ
బడగలు గ్రాలంగ వెడలునప్పు
డవసరం బెఱిఁగి దానవు లనేకసహస్ర
సంఖ్య లేతేర విచక్రుఁ డనఁగ
దైత్యేంద్రుఁ డటమున్న తత్కుమారద్వయ
సఖుఁ డైనవాఁడు వాసవునితోడఁ
బో టొడ్డి గెలిపించెఁ బూర్వగీర్వాణుల
నారాయణునితోడిఁ బోరిపోరి

తే. ద్వారవతియందు నొంచె యాదవులనెల్ల
నట్టి పీగుండు దోడు రా యాతుధాన
ముఖ్యుఁ డగునాహిడింబుండు మొనకు నడిచె
దైత్యులెల్లను జెదర యాదవులు సెలఁగ. 220

వ. ఇవ్విధంబున. 221

క. ఎనుఁబది యెనిమిది [2]లక్షల
దనుజులు రాక్షసులు నడవఁ దమసైన్యంబుల్
మొన లై పదియక్షౌహిణు
లనూనగతి నడవ నడచి రాన్నృపతనయుల్. 222

సీ. కరటిఘటాకోటికటనిర్గళన్మదా
సారంబు దొలుకారుఁ జేరఁ బిలువ
రథనేమిభిన్న పృథివీపరాగంబు
నీహారసమయంబు నేర్పుఁ దెగడ
సుభటభుజోద్భటక్షురికా ప్రభాభంగి
మండువేసవితోడ మాటలాడఁ
దురగఘట్టఖలీనధుతఫేనతారకా
వళి శరత్కాలంబువరుసఁ జూపఁ

తే. బవనచంచలధ్వజపటపల్లవములు
నవవసంతంబుఁ దెలుప సన్నాహతరళ

1 సన్నద్ధ, 2 వేవురు

ఖడ్గలతికలు శిరంపుఁగిడఁక నెఱప
హంసడిభకులసేన యేఁ డనఁగ నడిచె. 223

వ. ఆ సమయంబున. 224

క. బాంధవము చూడక జరా
సంధుఁడు దిగ విడిచె వారి సైరణ చెడి క్రో
ధాంధుఁడు దుర్వాసుం డను
సంధించుం దనకుఁ దగనిశాపం బనుచున్. 225

క. ఇటు నడచి రెండుబలములుఁ
బటుగతిఁ బుష్కరతటాకపార్శ్వంబునఁ జే
రుట పూర్వ [1]జన్మసుకృతము
ఘటియించుట గాక యిట్టికలనుం గలదే. 226

తే. పొసఁగఁ బుండరీకాక్షునిఁ బుష్కరంబుఁ
దలఁచినంతన పాపంబు దొలఁగుఁ జెంత
నుభయమును గూడె నచ్చోట నున్న వారుఁ
జన్నవారును గైవల్యసారధనులు. 227

క. ఆకలన నుభయబలములుఁ
గైకొన కొం దొంటిఁ దాఁకి ఘటితపటహభే
రీకాహళకోలాహల
సాకారస్వైరవిహరణాహంకృతులై. 228

వ. ఇట్లు తలపడి సాయకనికరంబులఁ గరంబుల మునికట్లపట్లకుఁ దునిమిన మునుకొని కరవాలంబులు వదనంబులు గఱచికొని కదనంబునకుం బఱచు వారలనుం గణఁగి గద ప్రేసినం గినిసినట్లు దునిసినచరణంబులతో మరగాళ్ళందిరుగు వెరవరులకై వడిం దిరిగి యడిదంబులం బొడిపొడిగా నడుచునడజోదుభటులును దండతండంబు లగు వేగండంబులు దండెలం దగిలినం గదలనేరని తురంగంబులపై మలంగి దంతంబులకొలందికిం దరుపలి కత్తులం దుత్తుమురుగా మెత్తి విడిపించు రవుతుల దేరులగములనేరువల సారువలుగట్టు వారువంబులపక్కెరల పై నెక్కుడఁ

1. జన్మకృతసం, ఘటనమహిమ గాక యిట్టి.

జూచినం గ్రిక్కిఱియ నాటిననెఱనారసంబులు వెఱికి పిఱుందు ముందఱగా నేసిన విలుకాఱచేతం జీకాకుపడిన రథికులును గడుపులు గాఁడం బొడిచి యెత్తినగదలం గదలం ద్రేవులు చుట్టిపట్టి దిగం బడక వెఱబొమ్మలం గట్టినట్లు వ్రేలియును వ్రేల్మ్రిడి మొలలకతారమ్ములు వెఱికి గదలు తెగ నఱికి దికనుఱికి పగఱం జిఱ్ఱుముఱ్ఱాడు సహజ సాహసులునుం డొంకెనలం బొడిచినఁ [1]గళ్యాలు గడచి తాళులు విఱిచి సంధులు గాఁడి ప్రక్కలు వ్రక్కలు చేసినం జలింపక జంకింపక జంకించి లవుడి నడిచిన బుమిడికంబులతోడన యెమ్ములు నలిగులియైనఁ దలలును సిందెలం బొదివి కట్టి మెట్టికొని నిల్చిన యసిధారులును గసిమసంగినమారి పిసికి పిండలివండు చేసిన చందంబున గొండ లయినకండలలోఁ గలసి పేరినరుధిరంబునఁదిరంబు సవిమెట్టి యిట్టటు గదల నెరక యూరక యున్న గజంబులపై గజిబిజింపక భుజ బలంబు నూపుజోదులును నురవడించిన యరదంబుల కదనొగలు దాఁకి తలలు పగిలి హయంబులు గూలకమున్న లవణి గలిగి లంఘించి కరవాలంబులు విసరిన మ్రొగ్గతిలిన యుగ్యంబులును దలలు దునిసిన సారథులునుం గడిఖండంబు లయిన కోదండంబులునుం గలిగి రథులతోఁ బలుగాడిఁపై జిరాణంబుల బారిసమరి సరిం బడిన యాశ్వికులును బలకలవారిపై బయిలోడక పురికొల్పిన కరిఘటల కడ్డ బు చొచ్చి మచ్చరికంబునంబచ్చడికినఱకినట్లు కొమ్ములుపెఱికియు నెమ్ములు త్రుమ్ములు చేసియు శుండాదండంబులు చిదిమియుం గుంభంబులు నగుల నేసియుం బ్రక్కలు సెక్కలువాపియుం బెక్కువిధంబులం జిక్కువరచు పంతగాఱును మరియును గిరిగొన రాలినమణిభూషణంబులుం జిద్రుపలైన మకుటంబులునుం జిందఱవందఱలైన జోళ్ళు నుం జిక్కువడిన చామరంబులునునొఱగిన పడగలునునొఱగినమస్తకంబులునుం బొర లెడి యట్టలును దెరలెడి తిట్టలును గట్టలుకొన్న కైదువులును బొడి యైనరథాంగం బులును తెలిసిన యంగంబులునుం దెలిసిన మొగంబులునుం గ్రాలం గీలాలజలప్రవా హంబులం దేలియాడు వెలిగొడుగులును బుట్టుల మీఁదం గాలూఁదియున్న బేతాళ బాలికలు పుండరీకంబులమూఁగిన యళికులంబు విడంబింప నిశితభల్లంబులం బెల్లగిల్లి డొల్లిన సమౌక్తిక గజకుంభపాలికలు గరంబులం బూనిన డాకినులు సురనారీవీర

1 గేళాలు గఱచి తాళాలు విఱిచి.

స్వయంవరసమయంబున సకుంకుమాక్షతవ్రాతపాత్రహస్తలై [1]సువ్రతంబు చెప్ప వచ్చిన సతులం దలఁపింపఁ బ్రహారమూర్ఛాపరవశులగు వీరుల బొండుగలు వచ్చి పెఱికి తిగిచినం బ్రేగులు రాకున్న ముక్కులఁ నూఁడిపట్టి వెనుకకు నిక్కి ఱెక్కలు విదుచు కంకగృధ్రంబులచేతం జలిగాలి వొడమినం దెలిసి సచేతనంబు లగుకళే బరంబులునుం గలిగి మఱియు నొండొరుల మెచ్చక నీసున వ్రేసిన యసిధారలు మండ గండు మిగిలి మెదడునం బ్రుంగి మజ్జంబులు దలమునుకలుగ సందడిం దడఁబడ కుండ ముందల పట్లు పట్టికొని పోట్లాడువారును మొనకయిదుపుల పయిఁ రఱియ నుఱికి సరకు సేయక పీఁపునం జెంగలువరేకులు వెడలినట్లు వెడలఁ గెడయువారును వీరు వారనక వీరావేశంబునం జేతుల కసివోవం జెలరేఁగి సింహ నాదంబులు సేయుచు మోఁదువారునుం దిరుగుడు వడక తివియక బీరంబు సెడక బీఱువోక యొడ్డగిల్ల యొదుఁగక వేసఱక విఱుగక విబుధలోకంబునకు వెక్క సంబును వేడుకయునుం గదుర ససమసమరంబు సేయ మధ్యాహ్నసమయంబయ్యె నయ్యవసరంబున. 229

తే. దనుజవైరి విచక్రుతోఁ దలపడుటయు
హలధరుఁడు హంసుఁ దాఁకె సాత్యకి యెదిర్చె
డిభకు మార్కొని రల్లహిడింబు నుగ్ర
సేన వసుదేవ నృపతు లుత్సేక మెసఁగ. 230

మ. మఱియుం దక్కినవారుఁ దక్కిన రిపుల్ మార్కొన్నచో శౌరి ద
గ్గఱి బాణంబులు మూఁగు దెబ్బదులుపై గప్ప న్విచక్రుండు న
త్తఱి నేసెం దెగ నిండ నారసమునన్ దైత్యారి వక్షంబునం
గఱి దోఁపన్ హరియున్ భుగు ల్భుగులుగాఁ గ్రక్కె న్వేసన్ నెత్తురుల్.

క. పదునాలుగుజగములుఁ దన
యుదరంబునఁ దాల్మి విష్ణుఁ [2]డుత్పాదకుఁడై
తుది నుమియునాఁటిచందము
మదిఁ దలఁచె మహేంద్రుఁ డపుడు మాధవుని దెసన్. 232

1. చపుతంబు. 2. దుత్పాతకుఁడై.

చ. హరి నిశితక్షురప్రమున నాతని టెక్కముగూల్చి సారథిం
బొరిగొని మూఁడుతూపుల నపూర్వగతిన్ హరుల న్వధించి భీ
కరతర పాంచజన్యరవగర్వము చూపినఁ దేరు డిగ్గ వాఁ
డరిది గదం గదల్చె దనుజారి కిరీటముఁ దల్లలాటమున్. 233

తే. చేరి యటు వ్రేసి దనుజుండు సింహనాద
చటుల వదనుఁడై దొడ్డపాషాణ మొకటి
శతగుణము ద్రిప్పి శౌరివక్షంబు చూచి
వైచె నది పట్టుకొని వాని వైచె విభుఁడు. 234

క. వాటునన మూర్ఛ వోయెం
బోటరి దైత్యుండు దెలిసి బొమముడి గినుకం
జాటఁ గరఘటితపటుపరి
ఘాటోపము చూపి శౌరి కతఁ డిట్లనియెన్. 235

ఉ. ఈ పరిఘంబు తాఁకునకు నెంతటివాఁడవు నీవు పోరిలోఁ
బ్రాపయి వచ్చి దేవతలపాల మదీయభుజాలంబు నే
మీ పొడగానవే కొఱుక మెత్తనొకో చెడిపోయె దేల నీ
పాపము నాఁటి నీటికద బాహులచేవయు నాఁడిదేకదా. 236

క. అనుచుం బరిఘము వైచిన
దనుజాంతకుఁ డొడిసి పట్టి తన ఘనహేతిం
దునుకలుగ నఱికి నీపొం
గినపుడిసెఁడుఁ బోయె ననుచు గేలి యొనర్చెన్. 237

వ. ఆ దనుజుండు వెండియు. 238

## శ్రీకృష్ణుఁడు డాగ్నేయాస్త్రమున విచక్రుని సంహరించుట

మ. ఘనశాఖం బగువృక్షముం బెఱికి యా కంసారిపై వైచినన్
వనజాక్షుండు గరాసిధార నది ద్రెవ్వన్ వైచి చేపట్టి త
క్కినశస్త్రంబుల నొంచి కొంతపడి నాగ్నేయాస్త్రముం బూన్చి త,
ద్దనుజుం గాల్చి మరల్చె నంతఁ గదిసెం దద్బాణముం దూణమున్. 239

తే. ఉన్నదైతేయు లందఱుఁ గన్నవారు
గన్నదిక్కులఁ బోయి సాగరములోన
నడఁగి రటు నీళ్ళలోని ముళ్ళైరిగాని
నేఁడు దుదిగా ధరిత్రికి నెగయ లేరు. 240

వ. అంత నిక్కడ. 241

చ. హలధరుఁ డేసె హంసుఁ బదియమ్ముల నైదిట నేసె హంసుఁ డా
హలధరు నాతఁ డాశరము లైదిటనైదిట నాఁగి రేఁగి మొ
క్కలమున నారసం బొకటి గాఁడఁగ వానిలలాట మేయుడున్
సొలసి యతండు తేరిపయిఁ జొమ్మలు వోయె నచేతనస్థితిన్. 242

చ. తడవుగ నుండి తేఱి బలితంపుశరం బరిఁబోసి యేసి బె
ట్టడరెడు సింహనాదమున హంసుఁడు గ్రాలఁగ నేఁటుగంటి[1]ను
గ్గడు వగునెత్తుటన్ సుడిసి క్రక్కెడు నెత్తుటఁ గుంకుమచ్ఛవిం
బడిసి హలాయుధుండు కనుపట్టెడు కింక నహంకరించుచున్. 243

ఉ. పూచినకింశుకం బనఁగ బుత్తడి లత్తుకబొమ్మవోలె నా
రాచము లేడువే లొకపరంపరఁగా బరఁగించి పై పయిం
ద్రోచినఁ దేరుఁ గార్ముకముఁ దూణముఁ గేతనమున్ మునింగిదుః,
ఖాచితదేహుఁ డై కడఁగి హంసుఁడు గన్నుల నిప్పు లొల్కఁగన్. 244

తే. ఒక శరంబున బలభద్రు నుచ్చి పోవ
నొకటఁ బడగ ద్రెళ్ళంగ వే ఱొకట సూతు
నాస దిగఁగా రయంబున నేసి యేసె
నొలి నాలుగు గుఱ్ఱాలు నేలఁ గూల. 245

క. ఒదవిన కినుకం గొదగొని
గద గొని హలధరుఁడు రథము కండ్లును నొగలుం
జదిపి పతాకయు సారథి
విదారణము చేసి మిన్ను ప్రీలఁగ నార్చెన్. 246

1. యుం గడువఁగ.

ఉ. అంతటఁ బోక సూతు నద రంటఁగ వ్రేయ రథంబు డిగ్గివాఁ
డంతకదండసన్నిభ గదాతిభయంకరబాహుఁ డై పరి
భ్రాంతి యొనర్చె నిద్దఱు నపారపరాక్రమ కేళిఁ దేలి రం
తంతకు నంతరంగము లహంకరణంబునఁ గొంత వింతగన్. 247

వ. ఇట్లు గదావిహారంబున హంసహలధరులు రుధిరధారాసారంబునం దడిసి వడిసెడక వారింపక యోసరిలక యోలంబు గొనక పాటింపక పొదు కొనక సడలక శంకింపక సందీక సరకుగొనక వెనుక మెట్టక వేగిరపడక చలిచిపోక చాలిపపక చలింపక చాయ దలుగక గదలు సారించియు సైరించియుం జుట్టియుం దట్టియుఁ గదల్చియు నదల్చియుఁ దాఁకించియు జోఁకించియుం బూఁచియుం జూఁచియు మోపియుం బాపియు జడిసియు నొడిసియు నెత్తియు నొత్తియుఁ దాచియుం ద్రోచియు వివిధ విచిత్ర విహారంబులం దిరుగ హలాయుధుండు దక్షిణమండల ప్రచారంబునం బరఁగిన హంసుండు సవ్యభ్రమణంబునం గదిసె నప్పుడయ్యిరువురదట్టనయు ధాకయు లవణియు లావునుం దెగువయుఁ దెలివియు మత్సరంబును మదంబును వెరవును వేగంబును సైరణయు సాహసంబునుం గనుంగొని సురమునిగణంబులు వెక్కసంబున నిత్తెఱంగు సమరం బింతకు మున్నెన్నండునుం గాన మనిరి. తద్గదాధరయుగంబు వృత్రవాసవుల విడంబించె నట్టియెడ హంసుండు వలపలిదెసఁ జుట్టుకొని వచ్చుటయు నాబలభద్రుండు డాపలివంకం దిరిగి కదియుటయుం బిడుగుం బిడు గడిచినచందం బయ్యె నయ్యవసరంబున. 248

క. డిభకుఁడు సాత్యకియుఁ బర
ప్రభావపరిభవవిహారపారీణులు సా
రభుజాబలవిభవులు లో
కభయంకరమూర్తు లగుచుఁ గలనఁ గదిసినన్. 249

సీ. సాత్యకి డిభకుపై సాయకదశకంబు
నిగిడింప నవి మొగమునందుఁ
జనుమొనమీఁద[1] వక్షంబుపై నాఁటిన
నతఁడు సాత్యకి నేసె నయిదువేలు

1. జనుమఱ.

నారసంబుల వాని నడుమున తునుమాడి
  శైనేయుఁ డార్చినఁ జాల నలిగి
విశిఖసప్తక మేసి వెండియు లక్షబా
  ణంబులు వఱపిన నఱకి పైచె

తే. వృష్ణివీరుఁడు డిభకునివిల్లు దునిమె
నర్ధచంద్రబాణంబున నతఁడు వేఱ
వింట నిశితక్షురప్రంబు వెలయఁ దొడిగి
శినివరునినోర నెత్తురుచింద నేసె. 250

క. ఆమని ములు[2]మోదుగుతోఁ
సోమించి మురాంతకానుజుఁడు నెత్తురువ
ఱ్ఱె మఱియు నఱకె డిభకుని
చేముందఱ మెఱయువిల్లు శితభల్లమునన్. 251

చ. డిభకుఁడు వేఱ వింటఁ బ్రకటించిన బాణపరంపరన్ ధరా
విభులు గనుంగొనంగ యదువీరుఁడు గాసిలి వానిచాపమున్
రభస మలర్పఁగాఁ బటుశరంబున ద్రుంచి క్రమంబుతోడఁ ద
త్ప్రభ చెడఁ ద్రుంచెఁ జాపములు పంచశతంబు శతంబు నేకమున్. 252

క. ఎత్తెడు వేగము విండులు
దత్తఱమున విఱుగ నేయుతమకము నైనన్
జిత్తములు గృపాణరణా
యత్తములుగ నిలకు నుఱికి రావీరవరుల్. 253

వ. అట్లు ఖడ్గహస్తులై కదిసినప్పుడు. 254

ఆ. సౌమదత్తి నకుల సౌభద్ర దౌశ్శాస
ని ప్రసిద్ధఖడ్గనిపుణవిద్య
డిభక సాత్యకుల కడిందిశౌర్యము నందుఁ
గానవచ్చె నట్లు గడసి వారు. 255

వ. భ్రాంతంబు [2]విభ్రాంతంబు విద్ధం బావిద్ధంబు విప్లుతంబు విసృతం బాకరంబు వికరంబు భిన్నంబు నిర్మర్యాదం బమానుషంబు సంకుచితంబు

1. మోఁదుగుతోఁ. 2. బుద్భ్రాంతంబు.

వికుచితంబు సవ్యజానువు వామజానువు చిత్రకం బాహితకంబు క్షిప్తంబు గుడుంబింబు లంబనంబు ధృతంబు సవ్యబాహువు వినిర్బాహువు సవ్యేతరంబు వృత్తంబు త్రిబాహువు తుంగబాహువు సవ్యోన్నతంబు దాసి పృష్ఠతః ప్రసారణంబు యోధికంబు పృథితంబు నన ముప్పదిరెండు ప్రచారంబులం బరిభ్రమించి నవసేవకులునుం బోలెఁ జౌరువ వేచికొని ప్రతిగ్రహీతలుం బోలె ధార యేమఱక జూదరులునుంబోలె నండ మఱవక జౌతిషికులుం బోలె ముష్టి వదలక గొండ్లి వరిభవించు నటువులునుం బోలెఁ[1] జాళెలు చూపి [2]యెగ్గు లాడెడువారునుంబోలె నాసపా[3]టున నిక్కి తూర్పెత్తువారునుం బోలె విసరి త్రాసునం దూఁచువారునుం బోలెఁ దట్టిదారకులునుంబోలె నట్టించి పనిఁ దిరుగు వెరవరులునుంబోలె మసలక వడి వసంతమాడెడివారునుం బోలెఁ జిమ్మి శకటవ్యవహారులుంబోలె మెట్టుకొని విరక్తవిటులునుం బోలెఁ జేయీక తనిసిన [4]గవరలునుంబోలె సరకు గొనక నటమటపుఁ గోమటులునుంబోలె లెక్క సేయక పాదరసమర్దకులునుంబోలెఁ జంపం దలంప యదిదంబులు జళిపించిన ఝుణఝుణ ఝుంకారంబులుం దదీయపరస్పరఘర్షణ క్రేంకారంబులుం దమహుం కారంబులును ముప్పిరిగొనం గొప్పరించియుం గొసరియు విచ్చియుం జొచ్చియు నదలించియుం గదలించియుం బోరు నవసరంబున సురవిద్యాధరగంధర్వాదివ్యమునులు దివమ్మున నిలిచి యప్పీరద్వయంబుం గనుంగొని వెక్కసంబున. 256

చ. ఇతని కితండె సాటి యగు నీతని కీతఁడెసాటి వచ్చును
దతిఁ జనువెంట వింట నడిదంబున నింతటివారు లే రుమా
పతికొకరుండు శిష్యుఁ డురుబాహుఁడు ద్రోణున కొక్కరుండు ధీ
రతముఁడు శిష్యుఁ డిట్లిరువురన్ రణధీరతఁ జెప్ప నేఁటికిన్. 257

గీ. అర్జునుండు మురారి సాత్యకియు వీరు
ముగురు జయకాంక్షు లనిమొన మోసపోరు
శక్తిధర చైద్య డిభకులు సములు వీరు
ముగ్గురు మహారథులు శౌర్యమూలధనులు. 258

వ. అనుచుం గొనియాడుచుండి రాసమయంబున. 259

1. జూళ్యాలు. 2. సోగు. 3. టుం దక్కి. 4. తఱువరులునుం.

మ. వసుదేవుం దట యుగ్రసేనుఁ దట నన్వారించు వారంచుఁ గ్రో
ధసముల్లాసముతో హిడింబుఁడు మహాదంష్ట్రోగ్ర సంఛన్న సై
న్యసమూహుం డయి తాఁకె నాన్నృపులు బాహాసారముం జూపినన్
వెస మ్రింగెం గడుపార వీరవరులన్ విస్ఫారజిహ్వోగ్రుఁడై. 260

వ. ఇట్లు ముందటం దలపడిన యదువృష్ణిబలంబులకు భయంకరుఁడై దౌదలు గౌఱుకుచుఁ దల విదుర్చుచు మిడిగుడ్లు ద్రిప్పుచు మీఁదులు చూచుచు బారలు సాఁచుచు బారి సమరుచుం గడు బ్రక్కళించుచుఁ గాలం జరుముచు మేను వెంచుచు మెడ నిక్కించుచు సరదంబుల నరదంబులతో నంటసిల నడుచుచుఁ దురగంబుల దురగంబులతోఁ దుత్తుమురుగా దూఁటుచు దంతావళంబులతోఁ దలలు వగులం దాఁటించుచు వీరుల వీరులతో విటతాటంబుగా విఱుగ వ్రేయుచుం బ్రళయకాల రుద్రుండు ప్రజలపైఁ బరఁగు చందంబునఁ జటులగతిం జాలు మగలఁ జట్టలు వాపి చవిగొను రుధిరపయఃపానంబునను మేదఃఖాదనంబునను మజ్జామజ్జనంబుననుం జేవ మిగిలి చేరినవీరు లాహారంబుగాఁ గుంభకర్ణుండు వానరబలంబుల మ్రింగు భంగి దోఁప యదువృష్ణి సైన్యంబు నిరవశేషంబు చేయుచుం గదిసిన నా వృద్ధనృపతు లిద్దఱు సాహసంబున గంఠీరవంబు తోడం దలపడిన తృగళ్లకై వడి నారాక్షసు తోడం దలపడి. 261

మ. ఖరనారాచపరంపరం బఱపి వీఁకం దాఁకి పాతాళగ
హ్వరముం బోని నిజాస్యముం దెఱచి రక్షోధీశుఁ డన్నింటి ని
ష్ఠురుఁడై మ్రింగి తదీయచాపములు రెండుం బట్టి ఖండించినం
దెరలం బాఱక యున్న వారిఁ గని యాదేవద్విషుం డిట్లనున్. 262

## ఉగ్రసేన వసుదేవులు హిడింబున కోడి పాఱుట

చ. ముదుకల మాంసము న్మెదదు మోదముతోఁ గడుపార మ్రింగ నే
డొదవె మదీయభాగ్యమున నూరక నోరు సొరుండు రండు మీ
రదవదగాక నావుడుఁ దదానన దర్శనము క్షతస్రుతిలై
మదమఱి పాఱి రాన్నృపులు మానిసిదిండికిఁగాక భీతితోన్. 263

వ. అట్టియెడ హలధరుండు.

మ. కని కంసాంతకుతోడ హంసునికి సంగ్రామంబు హత్తించి త
ద్దనుజుం బేర్కొని యిక్కడిక్కడ భవద్దర్పంబు గ్రక్కింతు న
మ్మనుజాధీశులఁ దోల నే ననుచుఁ బల్కొ్మఖున్ భుజస్ఫాలనం
బనిరుద్ధక్రియఁ దెల్పి పీత శతచాపాక్షేపుఁ డై తాఁకినన్. 265

చ. కనుఁగొని వీనిమేనుబలుగండల నాఁకలి పుత్తుఁ గాక నేఁ
డని దనుజాధముండు వికృతాననుఁ డై బలభద్రుఁ దాఁకి నె
ట్టన నెఱలావునం బిడికిటం బొడిచెన్ హలపాణి యొక్కము
ష్టిన తనముష్టిఘాతము హిడింబునకుం జవి చూపి వెండియున్. 266

క. వారింప రానిముదమున
వారిరువురుఁ జటచ్ఛటారవంబులు నెగయం
బోరాడిరి వీరులు చే
యారఁగ బిడిగ్రుద్దులాట నా సమయమునన్. 267

క. పిడికిటఁ బొడిచె హిడింబుఁడు
వడితో హలధరునియురము వానియురంబుం
బిడికిటఁ బొడిచెను రాముఁడు
విడువక యఱచేత నోరు వ్రేసెం బెలుచన్. 268

ఉ. పోటున వ్రేటునం దిరిగి బోరగిలం బడియున్న దానవుం
గాటుకకొండ నెత్తువెలిగౌరు తెఱంగున నెత్తి త్రిప్పి చె
ల్లాటము చూపి వీఁడు [1]మొదలా మనకంచు బలుండు సంగరా
ఘాటము దాఁట వైచిన దిగంబడెఁ గ్రోశయుగంబు చక్కటిన్. 269

క. వికలగతి నున్న రాక్షసు
లొకనొకని మొగంబు గాన కూఁక చని రం
తకు నరుణకిరణుకిరణము
లకుఁ బసుమటికొండపంచలం బడ వలసెన్. 270

సీ. కడపంగ రాకున్న కాలఖడ్గముచేతఁ
బగలింటితల నేలఁ బడినయట్లు

1. ముదలా.

సాయంతనం బనుజాలరి జలధిలోఁ
 బచరింప వల డిగ్గఁ బాఱినట్లు
పౌఢ వైనయాకాశభూరుహంబున సంధ్య
 గోయంగ గొల [1]ద్రెవ్వి కూలినట్లు
చరమదిగ్భృతాళకరమున వరుణుండు
 గడివెట్టఁ బొల పొట్ట నడఁగినట్లు
తే. క్రుంకుగుబ్బలిపాకకి కొప్పరించి
పట్టజాలక వైచిన బ్రద్దపరికిఁ
బాటియగుచు ముగురపొత్తు పళ్ళెరంబు
భానుమండల మంతఁ జూపట్ట దయ్యె. 271

క. ముఱముఱచీకటితో నం
దఱురాజులు సమర ముడిగి తగ నెల్లిటికిం
గొఱ గలకలనగు నడవుఁడు
నెఱవగుగోవర్ధనాద్రి నేలకు ననుచున్ 272

క. రెండుబలంబులవారలు
నొండొరులకుఁ జెప్పు నప్పు డుద్ధతమతులై
రండనఁగ హంసడిభకుల
దం డాగోవర్ధనాద్రితటమున విడిసెన్. 273

మ. హరి యారాత్రి బలంబుఁ బుష్కరతటాకారణ్యమధ్యంబునన్
వెరవారన్ విడియించి తేపకడఁ బృథ్వీనాథు లెల్లం దనున్
గురుసన్నాహబలంబుతోఁ గొలువఁ దద్గోవర్ధనోద్యన్నగాం
తరభూమిన్ యమునాతటంబున సమాధానంబుగాఁ బన్ని నన్. 274

గీ. హంసడిభకుల బల మెల్ల నాయితముగ
మోహరము చేసి నడచిన మొనలు రెండు
దలపడి భయంకరంబుగ దారుణాస్త్ర
శస్త్రపాతంబుచేత నుత్సాహ మెసఁగ. 275

1. నేలగూఁలి.

గీ. చెలఁగుబలములతో నుగ్రసేనుఁ దాఁకి
బాణముల హంసుఁ డిన్నూటపదిట నేసె
డిభకుఁడును వసుదేవు నేడింట నేసె
నిరువురఁ బొదివి యాదవు లేసి రంత. 276

క. అప్పుడు పదిపదియమ్ములఁ
దప్పక యాదవుల బ్రహ్మదత్తకుమారుల్
నొప్పింప రుధిరధారలు
చిప్పిల్లనివారు లేరు సేనలలోనన్. 277

చ. తమబల మింక వీఁగు నని తత్సమయంబునఁ గృష్ణరేవతీ
రమణులు దాఁకి రయ్యిరువురన్ సురసిద్ధమునీంద్రబృందముల్
సమరము జూచి మెచ్చ హరశాసనతత్పరభూతయుగ్మముం
గ్రమమునఁ దోఁచెఁ దోడుపడ రాజకుమారుల రెండుదిక్కులన్. 278

మ. హరితో హంసుఁడు సీరితో డిభకుఁడున్ హంకారహుంకారభీ
కరశంఖధ్వని విక్రమం బమర వీఁకం దాఁకినం బాంచజ
న్యరవాడంబరమున్ సహింప కడరెన్ మాహేశభూతద్వయం
బరవా యించుక లేక హస్తధృతశూలాకారఘోరంబుగన్. 279

గీ. అదరి హరిమేను శూలంబు నడుముటయును
జిఱునగవుతోడ దివిజు లచ్చెరువు నొంద
వారిఁదేరిపై కుఱికి చేయారఁ బట్టి
విసరి యుత్తర[1]దిక్కు నవీచివైచె. 280

కృష్ణుఁడు భూతద్వయమును గైలాసాద్రిపై బడవైచుట

క. వైచిన నిరువురుఁ గైలా
సాచలశిఖరమునఁబడి మహాద్భుతమతు లై
రాచందమెల్ల హంసుఁడు
చూచి హరిం గ్రోధపరవశుం డై పలికెన్. 281

1. దిక్కుకై.

ఉ. విఘ్నము చేసె దేల పృథివీపతిలోకము గప్ప మిచ్చె శ
త్రుఘ్నత రాజసూయమఖదోహలి మాజనకుండు సత్కృపా
నిఘ్నుఁ డొకింత దోడ్పడిన నిన్ను ముదంబునఁ జూచు నీశిరో
దఘ్నము లింకఁ దెమ్ము కరదానముగాఁ గనకంపుఁగాలువల్, 282

ఉ. రాజుల కేను రాజ మఱి రాజశిరోమణి రాజు దేవతా
రాజికి నెల్ల నీవసమె రాసెదు నాసరివాఁడుగా [1]విసీ
తేజము మాలి తంచు నతితీక్ష్ణశరం బరిఁబోసి యేసినన్
భ్రాజిత మయ్యె నవ్వ హరిఫాలమునం దిలకంబు పోలికన్. 283

వ. ఇట్లేటు వడి విచారించి.

మ. ప్రకటస్యందనకేళికిం దగినసారథ్యంబు చేయంగ సా
త్యకిఁ జాలించి తదాత్తచిత్రగతిరథ్యాడంబరం బొప్ప దా
రుకుఁ దేఁగం గడికాఁడిపై హుతవహక్రూరాస్త్రసంధానకా
ర్ముకహస్తుండు మురాంతకుండు పలుకుం గ్రోధాంధుఁడై హంసుతోన్. 285

ఉ. ఏమిర హంస! కంసనరకేంధనబంధురమచ్ఛరానలం
బామిషముం గొనం గలదురా విడిపింపఁగ నిన్ను నేఁడు సం
గ్రామము చేసి నన్నడుగు కప్పము దర్పము నీకు నేల నా
నామునిబాధలం గమరినాఁడవు కాలినత్రాటిచందమై. 286

క. నినుఁ బొరిగొనియెద నిదెపో
జనులు మునులు విని ప్రమోద సంపదఁ దేలన్
మనుజాధమ! యని తొడిగిన
యనలాస్త్రం బేసె నదరు లంటఁగ వాఁడున్. 287

క, వారుణ బాణంబున నది
వారించె మురారి యేసె వాయవ్యాస్త్రం
బారాజకుమారుం డది
బోరన మాహేంద్రబాణమున నడఁగించెన్. 288

1. విసీ.

తే. హరి ప్రయోగించె మాహేశ్వరాస్త్ర మప్పు
డతఁడు రౌద్రాస్త్రమునఁ దోన యడ్డకట్టె
నిట్లు ప్రతిబాణముల హంసుఁ డెచ్చుఁ గుందు
లేక పోరాడె శౌరి కుద్రేక మెసఁగ. 289

మ. సరి గాంధర్వము రాక్షసంబు మఱి పైశాచంబు బ్రాహ్మంబునన్
హరి యేసెన్ వరుస న్మహాస్త్రముల నాహంసుండుఁ గౌబేరమా
సురమున్ యామ్యము వారుణంబు ననఁ దేజోరూపశస్త్రంబుల
న్మరలించె న్మొదలింటి నాల్గిటి రణోన్మాదోద్భటాకారుఁడై. 290

గీ. అచ్యుతుఁడు బ్రహ్మశిర మనునస్త్ర మేయ
హంసుఁ డాయస్త్రమున నది యడఁగఁ జేసె
నచ్చెరువు నొంది మురవైరి యమునలోన
వార్చి వచ్చి మహోగ్రభావంబు దాల్చి. 291

చ. తొడిగిన వైష్ణవాస్త్రమునఁ ద్రుంగితి పొమ్మని హంసు నేసినం
బిడుగులపిండువోలె నతిభీకరతం జనుదేర మాఱుగాఁ
దొడుగుశరంబులే కతఁడుఁ దోరపుబెగ్గల మెత్తి వేయఁగాఁ
గడువడిఁ దేరు డిగ్గి పడెఁ గాళియనాగమహాహ్రదంబునన్. 292

కృష్ణుఁడు హంసుని యమునలో నడగంటఁ ద్రొక్కుట

మ. కడువేగంబున హంసుపై నుఱికి యాకంసారి కాళిందిలో
వడిఁ గాలం దన్నె లోకు లెఱుఁగ న్వాఁడంతలో జచ్చెనో
చెడెనో యెక్కడ వోయెనో యొకఁ డునుం జెప్పంగలేఁ డప్పుడే
పడెఁ బాతాళభుజంగవక్త్రముల నప్పాపాత్ముఁ డండ్రెప్పుడున్. 293

ఉ. ఈ తెఱఁ గాచరించి రథ మెక్కె మురారి ధరాధినాథ ! నీ
తాతపితామహుం డయినధర్మతనూజుఁడు రాజసూయవి
ఖ్యాతి వహించు నయ్యెడల హంసుఁడు ప్రాణముతోడనున్న నే
లా తుద చేరు నధ్వరము లావున వాఁ డొరు నేల కైకొనన్. 294

క. వరములు శరములు హరుచేఁ
దిరముగ హంసుండు వడయుదినమునఁ గాదే

ధర నవతరించె లక్ష్మీ
శ్వరుఁడు జగన్నాథుఁ డపుడు వార్ష్ణేయుండై. 295

వ. ఆద్దేవుండు గలుగుటంజేసి కౌంతేయురాజసూయంబు నిర్వహించె నట్లు యమున మడువునం బడినహంసుఁడు పొడవడంగుట సకలగంధర్వులు హరినామసంకీర్తనంబున గీతంబు లొనర్చిరి తత్సమయంబున. 296

క. హలధరునితోడ డిభకుఁడు
దలపడి పెనఁగునెడ సూర్యతనయాసలిలం
బుల మునిగి హంసు డిలిగెం
దలఁకున ననిపలుకు వినియెఁ దత్రత్యులచేఁ. 297

మ. విని వేగంబునఁ బాఱుతెంచి యమునావేగంబునం బాకశా
సనశస్త్రప్రహతిం బయోధిఁ బడు నాశైలంబుచందంబునన్
మునిఁగెన్ వెంట హలాయుధుండు దఱమన్ మోహాంధకారంబులో
మునిఁగెం దజ్జల మెల్లఁ దల్లడపడ న్మ్రొప్పెట్టు వెట్టెన్ వడిన్. 298

వ. ఇట్లు డిభకుండు యమునాజలంబుల మునింగిన హంసుంగానక యిట్లని విలాపించు 299

సీ. నాయెల్లిసిడన నరలోక మేఽదు
నసులావు వఱితిపాలయ్యె నన్న!
దేవేంద్రునకు నైనఁ దేఱి చూడఁగరాని
గౌరవోన్నతి నీటఁ గలసె నన్న!
పార్వతీపతిచేతఁ బడిసినదివ్యాస్త్ర
భూరిసంపద వెళ్లిఁబోయె నన్న!
వలరాజునకు నైన వర్ణింపఁగాఁ దగు
తనువిలాసం బేఱు గొనియె నన్న!
తే. యన్న! నీయట్టియన్న న న్ననుదినంబు
గారవింపఁగ నుండ నే కరుదుఁ నన్న
నింకఁ జాల నెవ్వగలచే నిచట నిలువ
నాకు నేల నీ[1]తోడిదే లోక మన్న! 300

1 లోకమగుదు నన్న

చ. అనుచు విలాపనాలసత నాయమునానదితీరభూమికిం
జని హరిఁ గాంచి యోరి పురశాసనశిష్యుని హంసుఁ గానవే
యనుటయు వాఁడెపో యమునయందు మునింగె ననంగ వెండియున్
మునుఁగుచుఁ దేలుచున్ డిభకమూఢుఁడు హంసునిఁ గానఁ డెయ్యెడన్. 301

క. వ్రేలెడు వెంట్రుక లిరుగడఁ
దూలఁగఁ దలయూఁచుఁ దొప్పదొప్పన నోరుం
గేల నడిచికొను సెలవుల
లాలలు దొరుఁగంగ నన్నలా! యని యొఱలున్. 302

క. ఱాలం దల యడిచికొనున్
నేలం బడి పొరలు లేచు నెత్తుగు లుమియుం
గేలిఁ బడి రిపులు చూడఁగ
నాలుక వెఱికికొనుఁ జావునకుఁ దన్నికొనున్. 303

వ. ఇట్లు దుర్మరణంబున హంసడిభకులు వాలిసిరి తదనంతరంబ గోవిందుండు గోవర్ధనాచలంబున బలభద్రసాత్యకి ప్రభృతి యాదవలోకంబుతోఁ గొంతవడి వినోదించు నవసరంబున. 304

## యశోదయు నందుఁడును గృష్ణునిఁ జూడవచ్చుట

శా. గోపాలాగ్రణి రేవతీరమణుతో గోవర్ధనాధిత్యకా
వ్యాపారుం డయినాఁ డనంగ విని భావంబేతదాలోకచిం
తాపూర్ణంబుగ నందగోపుఁడు యశోదాదేవియు న్వచ్చి భృ
త్యోపానీతము లై నకానుకలు దా రొప్పించి రేర్పాటుతోన్. 305

క. ఇతరేతరసందర్శన
కృతాభివాదనుల రామకృష్ణులఁ బ్రీతిన్
సతియును బతియుం జూచిరి
సుతులుం బితృభక్తి నెఱయఁ జూచిరి వారిన్. 306

వ. అప్పు డాముదాంతకుండు నందగోపునితో నిట్లనియె. 307

సీ. పసిఁ గేపుఁ బెనుచునే ! పాఁడిమొల్లం బెట్టు
మెకము దాఁటదు గదా ! మేపు గలదె ?
తొరకాలితఱుపుల విడుతురా తొడితొడి ?
జన్నెలఁ దరిపట్టుజూడ గలదె ?
వెలికల్ల వైతురా వేల్పులకుడుపుచోఁ
గదుపులో నే[1]పోతు గడవఁ బాఱు ?
[2]సలగ[3]పన్నులు గొన్ని జట్టిచూపరు గదా
బెదరిన నిలుగూఁతఁ బెట్టఁ గలదె ?

తే. వల్లె వైచువా రెవ్వరు మల్లరాల
లంపు గలతొఱ్ఱులను గూయ లావు గలదె ?
యేర్పుదాఁటులలో దొఱఁ గెఱుఁగ బడునె
[4]పరికరము కోడె లమ్మేడుపాటి గలదె ? 308

వ. అనుటయు నతండు. 309

క. నినుఁ గన్నులార నెప్పుడుఁ
గనుగొనఁగా లేనివగపు గల దొక్కటియున్
వనజోదర ! నీయాదర
మునఁ దక్కినపనుల మాకు మోదము గొఱఁతే. 310

వ. అనుటయు నచ్యుతుండు యశోదం జూచి యిట్లనియె. 311

శా. తల్లీ నిన్నుఁ గనుంగొనం బడయుటన్ ధన్యుండనైతిన్ జగం
బెల్ల న్నిన్ను నుతించి మ్రొక్కిన ధనాధీశోన్నతిన్ నిత్యమై
చెల్లు న్నాకుం బ్రియంబు చేయునదియై చెన్నొందు నావారు ని
న్నుల్లంబారఁ దలంచువారు పరమాయుఃప్రాపితారోగ్యులున్. 312

వ. అనుచు నయ్యిరువురకు యథోచితోపచారంబు లాదరించి నిజనివాసంబులకు పీడ్కొల్పి యనంతరంబ మురాంతకుండు పుష్కరసరోవరంబునకు వచ్చి యందలి మునీంద్రులంగాంచి వారిచేత నర్ఘ్యపాద్యంబులు మొదలగు నుపచారంబులం బరితోషంబు నొందినపిదప వారిట్లనిరి

---

1 తొఱ్ఱు 2 సలిగ, సలిగె, 3 పన్నులఁ 4 పదుదరము

క. ఓహో ! విచక్రుఁ జంపుట
సాహస మొరు లైన వానిఁ జంపం గలరే ?
యాహంసడిభకు లెవ్వరి
చే హతు లయ్యెదరు నీవు చెఱుపక యున్నః. 314

వ. అని కొనియాడి నద్దేవునితో వెండియు. 315

సీ. చక్రంబు మేదినీచక్రంబు నేదేవు
దక్షిణబాహుసౌందర్య మొసఁగు
జలజంబు నొకపాణిజలజంబు నేదేవు
సవ్యభుజంబుతో సరస మాడు
రత్నంబుఁ గామినీరత్నంబు నేదేవు
వక్షస్స్థలంబున వన్నెమిగులు
నోఘంబు దానవారోఘంబు నేదేవు
చరణపల్లవసమాశ్రయము నొందు
తే. భానుమండలమును సుధాభానుమండ
లంబు నేదేవుకనుల లావు వడయు
దేవదేవ నద్దేవునిఁ దెలియువారు
దేవదేవునిరూపంబుఁ దెలియువారు. 316

మ. అని తన్నుం గొనియాడు సంయముల నత్యానందదృష్టిం గనుం
గొని తీపారెడుమాటలం జవులు పెక్కుల్ చూపి వారాదరం
బున వీడ్కొన్న యనంతరంబ మిగులం బొంగారు సైన్యంబుతో
జనియెన్ ద్వారవతీపురంబునకుఁ గంసధ్వంసి నిశ్చింతుఁడై. 317

వ. ఇట్లు విచక్రవిదారణంబుచేసి హంసడిభకవధం బాపాదించి మునియతీంద్ర నివహంబునకు మోదం బొనరించి నిజనగరంబున నీలవర్ణుండు నిత్యోత్సవ పరిపూర్ణుండై యుండె నద్దేవునిగుణంబులు గొనియాడుటకు సహస్రచతురాననులకుం గొలది గాదని వైశంపాయనుండు జనమేజయునితో నింక నేమి వినవలతు వనుటయు. 318

ఉ. సారసనీలతామరస సమ్మదకారణనేత్ర నిర్మలో
ధారవిహారమానసవిధాయితతాపసముఖ్య సంతత

స్ఫారతరార్చనాకరణపాత్ర రమాగిరిజానితంబినీ
చారుమనస్సరోజచరషట్పద రాజమరాళనాయకా. 319

క. చక్రపరశ్వథయుతదో
ర్విక్రమజితదానవేంద్ర వివిధవినోదా
పక్రాంతహృదయభవ్యా!
శక్రప్రముఖామరౌఘసతతనిషేవ్యా! 320

మాలిని—

జలధిగిరినివాసా! చంచదుద్యద్వికాసా!
విలసితదరహాసా! వృత్తసచ్చిద్విలాసా!
ప్రళయబహుళరూపా! పండితాంతఃప్రదీపా!
దళితవిబుధతాపా! దైత్యసంహారికోపా! 321

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బైన శ్రీ మహాభారతకథానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ వాచన సోమనాథ ప్రణీతం బైన యుత్తరహరివంశంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు

# ఉత్తరహరివంశము

## పంచమాశ్వాసము

శ్రీ నిశ్శ్రేయసకాంక్షా
నూనవ్రతభార దక్షిణోదార సప
ర్యానందితచేతో[1]ని
ధ్యానతనుద్యుతినవీన హరిహరనాథా! 1

క. జనమేజయుఁ డిట్లను న
మ్మునితో హరివర్ణనంబు మును పలుమాఱున్
విని తనియదు మది గ్రమ్మఱ
వినఁ గోరెద ననుడు నతఁడు వేడుకతోడన్. 2

వ. మున్ను మురాంతకుండు చేసినలావు లెన్ని యెన్ని. 3

క. ఏణాంకధరుఁడు దోడుగ
బాణుఁడు మొగరింప బాహుపంక్తి [2]శతంబున్.
క్షీణముగ నఱికి వానిం
బ్రాణముతోఁ బట్టివిడిచె బలిమథనుఁ డనిన్. 4

వ. అని మఱియుం గుమారుండు సహాయుం డగుటయుం బరమేశ్వరుండు నిత్య సాన్నిధ్యంబు చేయుటయుం గాత్యాయనిజననీత్వంబు నొందుటయును నతనికి గాణాపత్యంబు గలుగుటయు నెఱింగించి యింతపట్టునుం గలుగునతండు హరిచేత హతుండయ్యె ననుటయు జనమేజయుండు తత్కథాశ్రవణ కుతూహలి యైన నావైశంపాయనుం డిట్లనియె. 5

సీ. బలితనూజుం డైనబాణాసురుఁడు దొల్లి
కార్తికేయుని శూలి గారవించి

---

1. విద్యానంతధ్యానరూప, 2 శతంబ, క్షీణిగతి

ముద్దాడునెడ సూచి మోదంబు ఖేదంబు
బొడమ నెమ్మనములోఁ గొడుకు నిట్టు
పాటింపఁడేఁ దండ్రి పని యేమి కటకటా
నా తండ్రి యుండిన నన్ను నిట్లు
పాటించు నిటమీఁదఁ బరమేశ్వరుఁడు తండ్రి
గాకున్న జన్మంబుకసటు వోదు

తే. [1]తపము మెచ్చు కద్దేవుండు తండ్రి గాఁడు
గాన మెచ్చింతుఁ దపముచేఁ గానకోన
నతనిఁ బంచేంద్రియంబుల కప్పగింతు
మానసంబున [2]కట తెత్తు మదనహరుని. 6

మ. అని బాణాసురుఁ డీసు రోసము మమత్వాహంకృతుల్మానసం
బునకున్ దవ్వులవైచి నిశ్చలగతిన్ ముగ్ధేందుచూడామణిన్
మునిసంఘాతశిరోభినీతచరణాంభోజాతసంభూతనూ
తనరాగద్యుతిభాసురుం బురహరుం దత్త్వస్థితిం జూచుచున్. 7

వ. ఇట్లని స్తుతించుచు. 8

బాణాసురుఁడు శివుని సేవించి వరములఁ బడయుట

ఉ. కొలువఁగ నేర నిన్ను శతకోటివిభాకరతేజు దగ్గఱం
బిలువఁగ నేర నిన్ను మునిబృందవివేకవిమర్శదూరునిన్
విలువఁగ నేర నిన్నుఁ బృథివీవియదంతరభిన్ను నేమిటన్
నిలుపఁ గదయ్య నా హృదయనీరజకర్ణికపై మహేశ్వరా! 9

చ. [3]కలఁగనినారు నిన్ను మదిఁ గౌఁగిటనెత్తుదువారు ముక్తికిం
దొలఁగనివారుగాఁ దెలియుదుం దలపోయుదు లోన నాసలున్
నలఁగవు హృత్పయోజసదనంబునకు న్నినుఁ దెచ్చునంతకున్
మలఁగఁగదే త్రికోణమణిమంటపదీపికపై మహేశ్వరా ? 10

చ ఒరసిరి నిన్నుఁ దర్క నికషోపలధా[4]రల వన్నెఁ గాన రె
త్తరసిరి విశ్వముం గపిల యైనను నీదెస ముల్లు సూపఁగా

1 తగవు, 2 కరఃజేర్తు 3 ఇది కం వీ ప్రతిలో లేదు 4 రులు,

బెరసిరి బ్రహ్మముఖ్యు లగుపెద్దలు [1]బచ్చులువోలె నెల్ల చో
నెరసిరిగాని నిన్నెఱుఁగ నేరరు నావశమే మహేశ్వరా! 11

గీ. అనుచు వినుతించుచున్న బాణాసురునకు
నంత కంతకు సంతోష మావహిల్ల
నంధకారాతి పొడసూపి యతనితోడ
నడుగు మిచ్చెద వర మన్న నతఁడు పొంగి. 12

క. కడువేడ్కతోడ నీకుం
గొడు కయ్యెడునంతకంటెఁ గోర్కియుఁ గలదే
జడుఁ డనక నన్నుఁ గయికొని
గెడగూర్పుము నన్ను గార్తికేయునితోడన్. 13

ఉ. నావుడుఁ జంద్రశేఖరుఁడు నవ్వుచుఁ బార్వతిఁ జూచి వీఁడు నీ
కోవనితా కుమారుఁడు గుహుం డితనిం దనతమ్ముఁ డంచు సం
భావన చేయుఁగాక యొక పట్టణ మిమ్ము విశాఖుఁ గన్న య
ప్పావకుఁ దేలు తద్రుధిరపట్టణపార్శ్వమునం దలోదరీ. 14

చ. పడగయు వాహనంబు నయి బర్హిణవల్లభుఁ డిక్కమారు నే
ర్పడఁ గదియుం కుమారుఁడును బాయనినెచ్చెలియై చరించు నా
వుడు నచలేంద్రకన్య యభవుం గొనియాడె వరంబుచేత న
క్కొడుకుమదాంధుఁడై దివిజకోటికిఁ గీడొనరించె వెండియున్. 15

మ. గెలిచెం బూర్వనరేంద్రులం బఱపె నాగ్నేయావనీనాథులన్
నలఁచెన్ దక్షిణరాజపంక్తిఁ జెఱిచెన్ నైరృత్యరాట్కోటి నా
వలవైచెన్ జరమాధిపాళి నడఁచె న్వాయవ్యభూపాలురన్
దొలఁగం బెట్టె నుదీచ్యపార్థివులఁ దోఁదోలెన్ హరాశులన్. 16

క. గాణాపత్యము వడసెను
బాణుం డిలఁ గార్తికేయపర్వతకన్యా
స్థాణులు పొత్తున మనఁగా
శోణితనగరమున దనుజశోభనకరుఁడై 17

1 పిచ్చులు

వ. ఇట్లు త్రిభువనభవనభారభరణపారీణభుజాస్తంభవిజృంభణంబున సరిలేక కసిమిరి గొనుకరతలంబులతో నొక్కనాఁడు కాలకంధరులం జేరి యద్దేవునకుం బ్రణామం బాచరించి యిట్లనియె.

సీ. ఖురఖలీనాఘాతకోలాహలంబుతో
నేమి నిర్ఘోషంబు నెఱప లేదు
నఖపుంఖరోచులు నారితో సంధించి
కర్ణావతంసంబు గడప లేదు
మణికిరీటకరోటిమంజీరములు రాయ
పీరమధ్యంబులు వ్రేయ లేదు
దంతిదంతావళదంతంబు లొరయ శా
కినుల వాచవులఁ జొక్కింప లేదు

తే. లేదు ప్రతిభటబాహావలేపమహిమ
లేదు సంగ్రామభీమకేళీరవంబు
లేదు విక్రమక్రీడయు లేశమైన
లేదు రాజ్యంబు గలిగియు లేదు ఫలము. 19

శా. దేవా కయ్యముతోడివేడుక మదిం [1]దీండ్రింప మర్త్యుండు నే
త్రోవం జేతులతీఁట వుత్తు నని కోరున్ దానవుం డైన నా
కీవే చేతులు చేసి తీకసిమి రిం కెట్లోర్తు నోర్తున్ రిపు
గ్రీవాఖండనమండనస్ఫురదసిత్రేంకారమున్ గల్గినన్. 20

ఉ. నావుడు దేవదేవుఁడు మనంబున నించుక నవ్వి వానితో
నీవు మయూరకేతనము నేలఁ బడం బొడగన్నయప్పు డా
శీవిష రాజసారభుజ సిద్ధము యుద్ధము కల్మి దాని కేఁ
గావలియున్న చోటన యకారణభంగ మనంగఁ బొంగుచున్. 21

వ. నిజగృహంబునకు వచ్చి 22

ఉ. పండినసంతసంబు ముఖపద్మవికాసవిలాస మొందఁ బా
ఖుండు సభాస్థలంబున మనోరథసిద్ధి యెఱుంగఁ జేయఁ గుం

1 దిట్టాడు

ఖాండుఁడు మంత్రివర్యుఁ దసురాధిపు నత్తఱిఁ జూచి నేఁడు నీ
వొండొకచందమై మిగుల నుబ్బెదు వచ్చినమేలు చెప్పుమా. 23

సీ. సహజవిగ్రహుఁడైన శార్ఙ్గిచే మెఱుఁగెక్కు
చక్రంబు ముద్దగాఁ జఱచి తొక్కొ
పాతాళగత మైనబంధుదానవకోటిఁ
బాటించి తలచూపఁ బంచి తొక్కొ
నీయింటివాకిట నీలలోహితుకంటె
గుహునికంటె[1]ఘనుండు గొలిచెనొక్కొ
మీ తండ్రిచే గుజ్జుమెఱకరి గొన్న భూ
గగనంబు లేలంగఁ గలిగె నొక్కొ

తే. లవణసాగరమధ్యంబు లావుతోడ
నేలునప్పుడు మన కెల్ల నింత బంటి
నన్నెఱుఁగనీక నీకు నేఁ డున్నయునికి
నబ్బె నెబ్బంగి నిబ్బర మయినయబ్బు. 24

వ. అనుటయు నద్దనుజుం డమాత్యున కిట్లనియె. 25

చ. [2]ఇనసమతేజ వింటివె యతీవభుజక్రమవిక్రమక్రియా
ఘను లగుపోటుబంటులకు గాఢతరప్రతిపక్షవక్ష భం
జనహృదయైకరంజనవిశాలమహాహవమూల మైనయ
య్యనిమొనఁ గాక కల్గునె సమంచితకీర్తియు ధైర్యమూర్తియున్. 26

ఉ. లావున వైరిదర్పము వెలార్పక [3]యేఁకరి యున్న చేతులన్
భావభవారిపాదములు పట్టి పరాక్రమకేళిఁ గోరితిన్
[4]దేవునదుండి యన్నమిలిబెక్కెము గూలినయప్డు సంగరం
బేవల నైనఁ గల్గు ననియెన్ హరుఁ డొండొక మోద మేటికిన్. 27

వ. అని మఱియును.

చ. నెయ్యము లేనిసంగతియు నిక్కము లేనివచోవిలాసమున్
వియ్యము లేని వైభవము విందులసందడి లేనిముంగిలిం

1. నుఘనుఁగొలిచితొక్కొ. 2. ఈ పద్యము ప్రాచ్యలిఖితపుస్తకశాలలోని ప్రతిలో మాత్ర మున్నది 3. యాకలిగొన్న. 4. బెక్కెము.

దియ్యము లేనిచాగమును ధీరత లేనియమాత్యకృత్యముం
గయ్యము లేనిశూరతయుఁ గైకొని యూరక మెచ్చ వచ్చునే. 29

క. అని మాటలాడుచుండఁగ
దనుజకులాధీశురాజ్యదర్పము ద్రేఁగై
తునిసినగతి హరు చెప్పిన
పని తప్పక నమలిపడగ బల్లున విఱిగెన్. 30

చ. విఱిగినఁ బొంగె నద్దనుజవీరవరుండు మనంబులోపలన్
వెఱపును ఖేదము న్వెఁఱఁగు విస్మయముం బొడమంగ మంత్రి యి
ట్లెఱిఁగి యెఱిఁగి మాఱిఁ దనయింటికి రమ్మనువాని కమియుం
గఱపిన నొప్పునే విధివికారము దప్పునె యిట్లు ద్రిప్పునే. 31

వ. అనియె నట్టియెడ. 32

శోణితపురమున దుర్నిమిత్తములు పొడసూపుట

క. బాణుఁడు సెలఁగ దనుజ
ప్రాణంబులు దల్లడిల్లఁ బ్రతిభయతర మై
శోణితపురమున నెల్లను
శోణితవర్షంబు గురిసె సురపతి యలరన్. 33

క. మార్జాలంబులు చెలఁగుచు
గర్జించెను గొబల నుండి కంపించె బహు
స్ఫూర్జితనినదముతో ధర
వర్జితపర్వఁ డయి రాహు వడిఁ బట్టె రవిన్. 34

గీ. విడువ కెప్పుడు పెనుగాలి వీవఁ దొడఁగెఁ
దోఁచె దక్షిణదిక్కున ధూమకేతు
వసురకన్యలు పూజింప నరుఁగుతోడ
నున్నతం బైనరచ్చమ్రా నొఱగి కెడసె. 35

గీ. కృత్తికలయందు వక్రించి కీడు [1]సూపె
మంగళుండు దివాకరమండల బు

---

1. సెదర.

వచ్చికొని చుక్కవడె నెల్లవారిఁ గలఁచెఁ
గ్రూరనిర్ఘాతపాతంబు గుండె వగుల. 36

గీ. రచ్చమ్రాఁకుల నెల్లను రక్తధార
లుద్భవించెఁ బ్రభాకరుం డుక్కు మడుపఁ
గడఁగి బాణునిజన్మనక్షత్ర మైన
భరణి వీక్షించె నది దనపక్షమైన. 37

గీ. తెలుపుఁ గెంపును ప్రక్కల వెలయ నలుపు
మెద బెడంగుగఁ గొంతంవుమెఱుఁగువోలె
మూఁడువన్నెలతో నొక మొండె మెగసి
సాంధ్య సమయంబునందు భాస్కరునిఁ గప్పె. 38

వ అయ్యవసరంబునం గుంభాండుం డిట్లని విచారించు. 39

ఆ. వేయుచేతు లిచ్చి వెఱ్ఱిఁ జేసినశూలి
బాణుఁ జెఱుపఁ దలఁచి ఖండనంబు
గలుగఁ జేసె నింక వెలుగు చే న్నేసినఁ
గాచువార లెందుఁ గలరె జగతి. 40

చ. త్రిదశపతిన్ జయించి జగతీతల మంతయు నేలుబాణుఁడే
మదిమది నుండి దానవసమాజము చేటునకై త్రిలోచనుం
గదనము వేఁడె మున్ను బలి గట్టువడెన్ దనకంటెఁ దక్కు వే
యిది విధిపో నిమిత్తములు నేమియు నొప్పవు గీడు దప్పునే. 41

వ. అట్లుంగాక యద్దనుజేంద్రుం బొడగన్న యప్పుడు. 42

చ. హరుఁడు గుమారుకంటెఁ గొనియాడుఁ గుమారుఁడు చాలఁగూర్చునా
హరుఁడుఁ గుమారుఁడున్ రణసహాయులుగా నడతేర వీనిపై
నౌరులు పరాక్రమించుటకు నోపుదురే చెడుకాలమైన నె
వ్వరిదెస నేవికారములు వచ్చునొ యింత విచార మేటికిన్. 43

క. తమ చేసినదుష్కృతములు
తముఁ జెఱుచుం గాక వేఱ తడవం గలదే

తమచేసినసుకృతంబులు
తముఁ గాచును రెండు నేల ద్వవంబునకున్. 44

గీ. అనుచుఁ గుంభాండుఁ డరిగె బాణాసురుండు
దనుజసుందరీసహితుఁడై మనసులూనఁ
గెరలియాడుచు మధుపానకేళిఁ దేలి
యాహవముఁ గోరుచుండె నయ్యవసరమున. 45

## ఇందుధరోపాఖ్యానము

మ. ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీలోద్యానకేళీసరి
న్నికటానేకవిహారదేశములఁ దై తేయేంద్రకన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమానీకంబు పైఁ జల్ల ద
ర్పకబాణంబుల కెల్లనెల్ల యగుసౌభాగ్యంబుతో నాడఁగన్. 46

వ. అట్టియెడ.

సీ. కిసలయంబులతోడఁ గెంగేలు దడఁ బెట్టి
విరులపై నఖకాంతి [1] విజ్జరాల్చి
లేఁదీఁగలకు దనూలీలఁ గానుక యిచ్చి
గుత్తులఁ బాలిండ్లు గొలిచి చూచి
చలిగాలి నిశ్వాససౌరభంబుల నాఁగి
యళిపఙ్క్తిఁ గురులతో నలుక దీర్చి
పుప్పొళ్ళు [2]సెలగందములు వియ్య మందించి
పూఁదేనెఁ జెమటల బుజ్జగించి

తే. తొడలు నసఁటికంబంబులు మెడలుఁ బోఁక
బోదెలు నెలుంగులను బరపుష్టరుతులు
మాటలును గీరభాషలు మక్కళించి
చిగురుఁబోఁడులు వనకేళి చేయఁ జేయ. 48

వ. వారిలో నొక్కర్తు. 49

1. విజ్జు, 2. నొసలిగంబురు.

మ. సహకారాధిపుఁ గౌఁగిలించుకొని వాసంతీలతాకాంత సా
రహరిద్రాక్షసగౌరకేసరములన్ రంజిల్లు మాధ్వీకవా
ర్లహరీస్వేదము చూపఁ బట్టపగ లేలా [1]యింతటన్ సిగ్గులే
దహహా యంచుఁ దొలంగి నవ్వెఁ జెలిమాఱై ముద్దరా లయ్యెడన్. 50

మ. ఒకరామాతిలకంబు రత్నరుచితో నొప్పారు మందారకో
రకముం గర్ణవతంసత న్నిలుపుచున్ రాగాలతాసక్త చూ
చుకచేలాంచలయై మలంగి విడుమంచుఁ గేలు [2]సాఁచెన్ ససా
యక మౌర్వీ న్వైగగొన్న మన్మథుని ప్రత్యాలీఢపాదంబు [3]నాన్. 51

చ. ఒకచపలాక్షి లేఁజిగురుటూయెలఁ గోయిలరాచవారి ని
క్కఁకు నెలయింప వచ్చుకలకంటికటాక్షము [4]తెక్కఁతారు స్రు
క్కఁక పలుమాఱుఁ జూపఁ జెలికత్తెలు [5]ముద్దనబావ పొమ్మనన్
మొకము సగంబు వాంచె మణిముద్రికలం జిఱునవ్వు గప్పుచున్. 52

చ. లలన లతావితానముల లత్తుకరేకులచాయ చల్లుచే
తుల [6]సెలగొమ్మ లందికొనఁ దోరపునవ్వులు పిక్కటిల్ల నె
చ్చెలులు చెలంగి మావిరులు చెందొవలయ్యె ననం దడంబడం
దలిరులు గోయు రాచిలుకధాటులఁ దేఁటులు నాస చేయఁగన్. 53

సీ. సుడిగొన్నచిగురాకు జొంపంబు గెంపారు
తలమీఁద మల్లికాదామ మడఁచి
నిడుదతామరతూఁడు నెట్టెంబు సుట్టి పైఁ
బటికంపుఁగడియంపుభాగ మదిమి
తోన యాత్రేవఁ జెందొవతేకు హత్తించి
మెడచక్కిఁ గస్తూరి [7]మెదిచి పూసి
పాయ గొమ్మల నల్లఁబట్టు దగిల్చి య
క్కొనయాకుపై వెండికోర వెట్టి

తే. ధవళకేతకిధూళిగాత్రమున [8]జెరివి
మోకమామిడి కొకకాంత మ్రొక్కి నిలిచి

1. యింతలో, 2- సారించెసా. 3. లన్; గాన్, 4. తెక్కదారి, 5. ముద్దుల
సాప, 6. సెలగొమ్మ, 7. మేది; 8. జఱచి,

యొదలిలోఁ జక్కఁ_సగము నా కొసఁగు మనుదు
నద్రికన్యక తలవాంచె హరుఁడు నవ్వె. 54

వ. తదనంతరంబ. 55

చ. నడపు తెఱంగు మాటజతనంబు నపాంగవిలాసమున్ మునుం
గిడినబెడంగు ముద్దుమొగ మించుక పంచిన సిగ్గుఁ బార్వతిం
దడఁ బఱుపంగ నొప్పెసఁగె దర్పకవైరికి నాసపాటుగా
నడరుచుఁ జిత్రరేఖ యనునచ్చెర నెచ్చెలు లిచ్చ మెచ్చఁగన్. 56

క. అద్దేవుఁడుం బైపడ
గద్దింపుగ శైలకన్య కనుగీఁటంగా
బెద్దవడి నటించుచు న
మ్మద్దియ చిఱునగవుతోడ మ్రొక్కుచు నిలిచెన్. 57

చ. నిలిచిన చిత్రరేఖఁ గని నీలగళుండు మొగంబు వాంచినం
గలకల నవ్వు నంబిక వికాసముతోఁ జెలికత్తె లింక సి
గ్గులు దగ మానుమంచుఁ బయికొం గెడలింప నపాంగరోచులం
గలఁపె బురారి శైలసుత కన్నులవెన్నెల గాయమించులన్. 58

వ. ఇవ్విధంబున. 59

క. సర్వర్తుక మగువనమున
సర్వజ్ఞుఁడు కేలి సలిపె సలిలక్రీడా
గర్వము మనమునఁ బొడమ న
పూర్వ గతిం దఱిసె నేఱు పొలఁతులఁ దానున్. 60

వ. అప్పుడు. 61

చ. తరుణుల వీరమద్దియల తాఁకునఁ జిందఱవంద తైన క్రొ
న్నురుగులతోడి శైవలము నూలుకొనంగ నితంబపంక్తి పై
బొరలుఁ దరంగరాజి విరిపూవుల నీడిన కుంతలంబులం
బరఁగు పదంబులం దెఱఁగి పైపడ నేర్చు విటాళికైవడిన్. 62

చ. తలిరులఁ జోఁకెనో దొనలఁ దాఁకెనొ తొండపుఁబిండుఁ బ్రాఁకెనో
పులినము లెక్కెనో కనకపుంగలశంబులు ద్రొక్కెనో మెఱుం

గులగమిఁ జిక్కెనో యనఁ దగుం దలఁపంగ దరంగమాలికల్
మెలఁతల యంగసంగతుల మీఁదికి మీఁదికి నాసచేయుచున్. 63

సీ. అరుణారవిందంబు లని ౘ్రమొక్కెనో కాని
చిగురుటాకుల నింత సేర రావు
పులినంబు లని చాల బుజ్జగించెనొ కాని
మరుచక్రముల నింత మరిగిరావు
చక్రవాకము లని సవరించెనో కాని
కరికుంభముల నింత గదియ రావు
గండుమీ లని చాల గారవించెనొ కాని
పూవుఁదూఁపుల నింత వొంది రావు
తే. తరఁగ లాత్మీయధనముల దాయ లయిన
చరణములు నితంబములును జన్నుఁగవలుఁ
గన్నుఁగవలుఁ దోతేర శృంగారజలధి
తరఁగ లింతులు పైకొన్నఁ దలఁకినట్లు. 64

చ. అలఁతితరంగలుం దఱులు నంబురుహంబు మొగంబు షట్పదం
బులు నలకంబులున్ సుడియుఁ బొక్కిలి నెక్కుఁడు వేడ్కసేయఁగా
నెలతుక సంగడిం [1]గమలి నింగిని జుట్టెడు మిన్నునీరిపైఁ
గొలిచి భవాని చేర్చెఁ జనుగుబ్బలజోడుగ జోడుజక్కవల్. 65

చ. కరఁగినపూఁతఁ జేఁ గనకకందుకకాంతి వెలుంగుచన్నులం
[2]బిరిగొను దొడ్డము త్రియపుఁబేరులు వాయఁగ మన్మథాంకముల్
దరుణుల నంబికావిభుఁడు దార్కొనుచోఁ గనుచాటు మాటుగా
దరఁగలు చల్లుశీకరవితానము మానము గావ కుందునే. 66

చ. తరళతరంగమాలికల తాఁకున కొగ్గికొనంగఁ గామినీ
కరములు దాఁకి శీకరనికాయము దత్కుచకుంభరాజిపైఁ
బరఁగినఁ దోఁచె భావభవుఁ బట్టము గట్టునెడం బ్రవాళభా
సురముఖపూర్ణకుంభశుభసూనకనిర్మలమౌక్తికాక్షతల్. 67

---

1. కమలినిం గని చుట్టెడు నీరు మిన్నుపై. 2. బెరిఁగిన.

క. కరసరసిరుహంబున నొక
సరసిరుహం బమర వదనసరసీరుహమున్
బరిమళవశమున మోపుచు
ధరణీధరతనయ దొంతితామరఁ జూపెన్. 68

ఉ. చెందొవరేకు ఫాలమునఁ జేర్చి ప్రఫుల్లపయోరుహంబుచే
నందముగా బిసావళి భుజాంతరముం గదియించి యుత్పలా
మందమరీచిమేచకచమత్కృతిచారుగళోపచారయై
సుందరి యొర్తు వచ్చి హరుచూపులకుం హరుఁ డయ్యె నయ్యెడన్. 69

వ. మఱియును గొందఱు దెఱవలు పలుదెఱంగులం గఱకంఠుకై వడి విడంబించునెడ మృడాని ముఖవికాసంబునకు విలాసం బొసంగ నెసంగిన యాసపాటుచే నాసన్నసమాసీనయై బాణాసురకన్య యగునుషాకాంత యిట్లని వితర్కించు. 70

సీ. సల్లాపనవసుధాసారంబు చెవిఁ గ్రోల్చి
జెలికత్తెఁ బుచ్చి మెచ్చించువారు
నానందమకరంద [1]మందంద పైఁ జిందఁ
గడకంటిచూపులఁ గప్పువారు
ఘర్మాంబుబిందుముక్తా [2]విభూషణము లు
ప్పతిలంగఁ జేసేతఁ బట్టువారు
మఱుపుమున్నీటిలో [3]మానంబు లూటాడ
బిగియారుకౌఁగిట బెరయువారుఁ

తే. బొలయలుకఁ బాసి తెలచినఁ బొందువారుఁ
జతురతరవిహారంబులు సలుపువారుఁ
బ్రథమజన్మంబునం దెంతభాగ్యవతులొ
మగలు మన్నింపఁ బెంపారుమానవతులు. 71

వ. అని విచారించి చెలికత్తెలతోఁ దనతలంపు వెడల నాడుటయును. 72

---

1. మదరి పైఁ జిమ్మంగ. 2. భూషణము లుప్పతిల్లంగఁ జేసేత జల్లువారు. 3. మానసంబులు దేల.

చ. విని చలిగొండచూలు గడు వేడుకచూపుల గారవించి య
ద్దనుజతనూజతో నభిమతం బొడగూడెడు నింత నంతకుం
బని గలదే మనోభవునిపట్టము గట్టికొనంగఁజాలు జా
ణని మగనిం గవుంగిట ననారతముం గొనియాడెదో చెలీ. 73

ఉ. నావుడు నాసరోజముఖి నమ్మికతోడ భవాని కిట్లనున్
దేవి మదీయవాంఛితము తెల్లముగా నొడఁగూడునంటి నా
కావిధ మెన్నఁడబ్బునొ దయామతి నానతి యిమ్మనంగ నా
రాః వలరాచవేగిరము రామకు నంచుఁ జెలంగి నవ్వుచున్. 74

వ. అద్దేవి యిట్లనియె. 75

గీ. "కదగి వైశాఖశుక్లపక్షంబునందు
ద్వాదశి దినాంతవేళ సౌధంబుమీఁద
మదనకేళికి గలలోనఁ గదియు నిన్ను
నెవ్వఁ డాతండ మగఁడు నీ కిందువదన!" 76

క. అన విని మనమునఁ బెనఁగొను
మనోరథము చేరినట్ల మానిని దొలఁగం
జని సంతసిల్లె దేవియుఁ
బినాకియును జెలులు నిష్టభృత్యులుఁ గొలువన్. 77

క. వనకేళిని జలకేళిని
వినోదములఁ దేలి తనిసి వీణావేణు
ధ్వనులును గాయకపాఠక
నినాదములు వినుచుఁ దూర్యనిస్వనములతోన్. 78

వ. పురంబునకు మరల నానతి యిచ్చె ని త్తెఱంగున. 79

క. దివసావసానమున భవ
భవానులుం జెలులుఁ దురగభద్రేభరథా
ది వివిధయానము లమరం
దివిఁ గొందఱు నరుగ నరుగుదెంచిరి పురికిన్. 80

వ. వచ్చిన కతిపయదినాంతరంబున. 81

## ఉషాకన్య స్వప్నముం గని పరితపించుట

శా. ఆ దైతేయతనూజ నింగి వ[1]దునాహర్మ్యంబుపై నొక్కనాఁ
డేచిక్కుం జెలిపిండు మెండుకొనఁగా నేకాంతనిద్రారతిన్
మోదింపం గలలోఁ గుమారుఁ డొక డేఁమో చేసినం దాల్మి పెం
పేదన్ దిగ్గన మేలు కాంచి నయనోదీర్ణాశ్రుసిక్తాస్యయై. 82

క. ఎలుఁ గెత్తి యేడ్చుఁ దనకుం
దొలుసము[2]రత నిక్కమైన [3]దురపిల్లుఁ గటా
కుల మిటు దూషిత మగునె
చెలులు నగం దనగుణంబుచే నని వగుచున్ 83

వ. అట్టియెడం జిత్రరేఖ యనుచెలికత్తె పొడచూపి యుషాకన్యకచేతం దద్భీతి కారణం బెఱింగి యల్లన బుజ్జగించి యక్కాంతతో నిట్లనియె. 84

చ. నలినదళాక్షి నీవు బలినందనుకూఁతుర విట్టి నిన్ను మొ
క్కలమున నొక్కరుండు దనకౌఁగిటఁ జేర్చునె! యిట్లు కన్నునీ
రొలుకఁగ వెక్కివే? వెఱవ [4]కోడక నొంపఁగ వాని కెన్ దలల్
గలవు విచారహీనవయి కంపము నొందకువే తలోదరీ. 85

వ. అట్లు గాక. 86

చ. గెలిచినవాఁడు నేఁడు రణకేళిఁ బురందరుఁ దద్గజేంద్రమున్
వెలిచినవాఁడు దేవతల వెట్టికిఁ బట్టినవాఁడు ధూర్జటిన్
విలిచినవాఁడు భక్తిమయవిత్తమునన్ ధర నేకవీరుఁడై
నిలిచినవాఁడు శౌర్యమున నీజనకుండు భయం బిదేటికిన్. 87

క. ఏయెడ భయమెఱుఁగరు దై
తేయాధిపరక్షితులు సతీ జగతిజనుల్
మీయింట నీకు నవమతి
చేయుదురే యొరులు నిప్పుఁ జెద లంటు నటే. 88

1. దఁగా. 2. రతి. 3. దురపిల్లు. 4. కోటకు నెవ్వగదేల యెవ్విధిం, గలఁవు;....నొంపగ నేరికేన్ తలల్, గలవె.

వ. అనుటయు నయ్యుషాకాంత యిట్లనియె. 89

సీ. మాతండ్రికొలువులో మానినీతిలకంబ
రమ్మను నాపేరు వమ్ము వోయె
నాతోడిసీడలై నను( బిన్న పెద్దగా
సవరించు మీచూపు జాఱువాఱె(
[1]ప్రతిదేవతలు నన్ను బయలు నెత్తినదివ్వె
యఱచేతిమానిక మనుట దప్పె
నల్లపో ల్లెఱు(గని నాకులం బను మంచి
మడు(గుజీరకు( జాల మైల సో(కె

తే. నింక మెచ్చనివారు మోమెత్తి చూడ(
గూడు చవిగా(న( గుడుచుట గూడు నమ్మ
నమ్మ కిటమీ(ద నేను బ్రాణాన( గలిమి
చెలిమి మఱపక తల(పుమీ చిగురు(బోడి. 90

క. అని వెక్కి వెక్కి యేడ్వంగ
వనజానన( జేరి సఖులు వల దుడుగవకా
నిను నెవ్వతె(గా దల(చితి
వనదయునుంబోలె నేల యలమట గుడువన్. 91

ఉ. ఇంతకు మున్న యిచ్చెలువ లెవ్వరు( జూడరు నిన్ను నే(డకా
వింతగ వచ్చితే కతలు వేయును నేటికి నన్యసక్త మై
చింతయు భాషణంబులును చేతలు నీత్రివిధంబు నీడు గా
కింత దలంక నేల కల నెవ్వ(డు డగ్గఱె నేని సెగ్గమే. 92

క. మనమున నొరు( దల(పవు మా
నిని నియతమ బ్రహ్మచారిణివి నీ చరితం
బున( గీడు గలుగ( జేసెదు
కను(గొన నెవ్వరికి వశము కాలము గడవన్.

క. అని చెలులు పలుక నేమియు
నన నేరక యూరకున్న యసురేశ్వరనం

1. ప్రతి దేవతలు; పరిజనంబులు.

దనఁ గనుఁగొని కుంభాండుని
తనూజ యగుచిత్రరేఖ తా ని ట్లనియెన్. 94

చ. ఎఱిఁగితి నీతెఱంగు విను మిందుముఖీ యొకనాఁడు ముగ్ధ లం
దఱమును గూడియాడఁగ సుధాకరశేఖరుకాంత నీమదిన్
నెఱసినకోర్కి దీర్ప నొకనేర్పరి నీ కల వచ్చు నంటకం
దఱి యిదివో దినంబును సుధాభవనంబునుఁ బ్రొద్దుఁ జూడఁగన్. 95

క. మఱచితిగాక లతాంగీ
కఱకంఠునితోడ నాఁడు కాత్యాయని నీ
[1]నెఱ నెఱిఁగి నాఁడు సెప్పిన
తెఱఁ గిది సమకూడె నింక దిగు లేమిటికిన్. 96

వ. అనుటయు నబ్బోటి చిత్తంబున వాటం బయిన పరిభవాభిమానంబు విరిసినఁ గన్నీరు దుడిచికొని కొనలుసాగుకోర్కులు గులుకుతలంపులఁ దమకంపు మొలకలు వొడమం గడమ వడినలజ్జ కడకన్నులం బెరయ నుండెనప్పుడు. 97

మ. పరపయ్యెం బరిభోగవాంఛ దడవం బా లయ్యె నిద్రారతుల్
పొరపయ్యెం బలుదాల్మి వింతవగపుం బ్రోవయ్యె నాలాపముల్
నెరపయ్యె న్మదనాలంబు వరుస న్నీరయ్యె నాలేపముల్
[2]సొరపయ్యె న్దనువల్లి బాణసుతకున్ సోలింతలం దూలుచున్. 98

క. లోఁగిటికి రానిరూపముఁ
గౌఁగిటికిన్ రానిపొందుఁ గారింపంగా
మూఁగినకుసుమశరంబుల
చేఁ గఱకఱఁ గందె నతివచిత్తం బంతన్. 99

వ. ఇట్లు హృదయంబునం గదిరినమదనానంబులచే నుదిలగొని యాసుదతి చిత్రరేఖ కిట్లనియె. 100

చ. ఉడిగి మడింగి మైమఱచి యున్నతఱిం గలలోనఁ జేరె నె
క్కడిమగవాఁడొకో ! యనుచుఁ గందఁగ మేల్కొనుచో నతండ యి

1. నెఱి యె. 2. సొరువయ్యెన్.

ప్పుడు మగఁ డంచుఁ గోరుటకుఁ బొందుగఁ జెప్పితి ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడఁచినచంద మయ్యెఁ గమలానన యీ విరహానలంబునన్. 101

క. నీముడిచినముడి విడువఁగ
నే మెవ్వరు నేర మింక నీసౌభాగ్య
శ్రీమహితునిఁ బతిఁ గూర్పం
గామిని నీకంటెఁ జెలులు గలరే చెప్పుమా. 102

చ. అనుటయుఁ జిత్రరేఖ దనుజాధిపనందనతోడ ని ట్లనున్
నినుఁ గలలోనఁ జైపడిననేర్పరి మ్రుచ్చు నెఱుంగుదేని
య్యనువరిరూపుఁ గైవడియు నన్వయముం జరితంబుఁ జెప్పుమా
విని ప్రియుఁ దార్చెదన్ మనసు వేడుకఁ దీర్చెదఁ గాము నోర్చెదన్. 103

వ. అనుటయు నక్కన్యకారత్నం బి ట్లనియె. 104

క. కలలోనఁ గన్న రూపముఁ
గలలోనన కౌఁగిలింపఁ గంటిఁ బిదప నో
లలనా! నీ పలుకుల నో
లల నాడితిఁ గాని పతిఁ దలంప నెఱుంగన్. 105

క. ఏదంపతులకుఁ బొడమెనొ
యేదేశమునందుఁ గీర్తి కెక్కినవాఁడో
యే దెసవాఁడో యెఱుంగను
మేదిని నిత్తెఱఁగు కూరిమియుఁ గలదె చెలీ! 106

వ. అనుటయుఁ జిత్రరేఖ విచారించి. 107

దీ. [1]ఆలజాలంబు నీరిలో నాడుజాడ
గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ
నిదురలోపలఁ గల దోఁచునీడ[2]విధము
గాన వచ్చునె యప్పుడ కన్నఁ గాక. 108

వ. అనుటయు. 109

1. అఖిలజాలంబు నీరిపై. 2. పిదప.

చ. వెలిచిన కన్నునీరుజడి వెచ్చనిచన్నులమీఁదివేఁడియుం
దొలకరి ఘర్మతోయములతోఁ గలసె న్మెయి గ్రమ్మనుపాటుతో
నెలుఁగున రాలుపా టొదవె నెక్కుడువివర్ణతతోన లోపలం
గలగొనె నారటంపుఁ బులకంబులతోఁ బొదతెంచెఁ గంపమున్. 110

వ ఇవ్విధంబున మవ్వంబు గందినపువ్వునుం బోలె నవ్వనిత నివ్వటిల్లిన యాయల్లకంబు మల్లడిఁ గొలుప నిలుపోప కున్న విన్న నగు నచ్చెలులు మెచ్చ నచ్చిత్రరేఖ చిత్రలేఖననై పుణ్యంబు మెఱయ నిదియ తఱి యని విచారించి యచ్చపునెయ్యంబున నచ్చపలోచన కి ట్లనియె. 111

మ. వనితా యెల్లజగంబులుం బటమునన్ వ్రాయంగ నేర్తున్ సుప
ర్వనరాహిప్రముఖస్వరూపములు చిత్రప్రాప్తిమైఁ జూపెదం
గని నిన్నుం గలలోనఁ బైపడినయాకళ్యాణరత్నాకరున్
మనవాఁ డంచు నెఱింగిపట్టిమది నీ మన్నించినన్ మెచ్చవే. 112

క. ఏడుదినంబులలో నీ
రేడు జగంబులును వ్రాసి యిత్తుఁ బటము నీ
వేడుకకుఁ దగినవానిం
జూడు మతనిఁ దెత్తు నన్నుఁ జూడు లతాంగీ! 113

వ. అని బుజ్జగించి యజ్జోటి నాదంబఱిచి నిజమందిరంబునకుం జనియె ననంతరంబ విరహానలంబు ముప్పిరిగొన్న నప్పువ్వుబోఁడి తనలోన. 114

సీ చెలులు బొమ్మలపెండ్లి చేయుచో లజ్జింతు
మగనికై యే నేల మరులుకొంటిఁ
గలలోన నొకనిఁ జక్కనివానిఁ బొడగని
వెలిఁ జూడ కే నేల వెఱ్ఱినైతిఁ
దగువరుం దని తార తడవి కూర్పకమున్న
బంధుల కే నేల పలుచ నైతి
గతి మాలి బిగియారుకౌఁగిలి లేని యా
బడికూర్మి కే నేల బట్టు వడితిఁ

తే. గదిసి పాసినచవి చూడఁ గలిగెఁ గాని
పాసి కదిసినచవి చూడ బాగు గాదు

తలఁపులకు జక్కి నుండెడితలఁపు లేదు
లజ్జఁ బోఁద్రోవ లజ్జకు లజ్జలేదు. 115

వ. కలఁ గన్న తెఱంగు విచారించి. 116

చ. అకటకటా కటాక్షముల కందియు నందకపోయెఁ గాక వం
చకుఁ డయి వాఁడు నేఁడుదనచక్కఁదనంబు మనంబులోన నిం
కొకపరి చూపెనే నచట నుప్పరవీధి రథంబు దోలుచున్
మకరపతాకుఁ డుగ్రకుసుమ ప్రదరంబులపాలు చేయఁడే. 117

వ. అనుచు నచ్చపలలోచన వెచ్చ నూర్పుటయును. 118

చ. కదలఁ దొలంగెఁ దుమ్మెదలు కట్టెదురం బొడసూపనోడి పు
ప్పొడిఁబొగ లుప్పతిల్లె మొగముం గమలంబును మోచియున్న య
య్యొడ లెటు లోర్చునో చిగురు లోర్వవు కందె నదేల వెన్నెలన్
వడవడ మందమారుతము వామవిలోచన వేఁడియూర్పులన్. 119

వ. మఱియు నమ్మెలంత మేని సంతాపం బంత కంతకు మిగుల నప్పుడు. 120

ఉ. శూలివిలోకనానలము సోఁకు రతీశుఁ డెఱుంగుఁగాన య
బ్బాలమనంబులో విరహపావకదాహము నోర్చె నన్న న
ట్లేలపొసంగు దేహము దహించినయంతటిలో మనోజుఁడై
గాలియ చిక్కెఁ గాన చెడఁగాలఁడు వో యెటువంటిమంటలన్. 121

వ. అత్తఱిం దత్తాపంబు సయిరింపక యత్తలోదరి యుల్లంబు డిల్లంబుగాఁ దొడంగినం గీడ్పడం దలంచి తనలోన. 122

చ. కిసలయపత్త్రికన్ మకరకేతన నూతనవార్తలన్నియుం
బొసఁగ లిఖించి యందుఁ దలపూవులుఁ దమ్మయు నాసచేయు నా
కొసరు తెఱం గెఱింగి కుచకుంభములం బతిఁవాల్చు నన్నుసం
తసమున వ్రాసియిచ్చినఁ గదా చెలికత్తెల కేను మ్రొక్కుదున్. 123

వ. అనుచుఁ బరిభోగవాంఛానిరత యయ్యె నయ్యవసరంబున. 124

క. నీహారముపేర సఖీ
వ్యాహారము విన్న నలుగువారుఁ దనుపుగా

నేహార మఱుతఁ బెట్టిన
నాహారము దొఱఁగుఁ దొఱఁగు నాహారంబున్

వ. ఆ సమయంబునం బతిం దడవం దలంచి వెడవెడ మదనోన్మాదంబు వొడమిన నప్పుడంతుక యిట్లనియె. 126

ఉ. నాదెసఁ గామునమ్ములకు నాఁటుట వైశమ్మ సిగ్గుఁ జిత్తమున్
వాదులు వెట్టుకొన్న [1]యవి వాడిన నెవ్వరి కైన ముందు రా
రో దయితుం గనుంగొన సరోరుహలోచనలార! యింతకున్
జాదులయిల్లు చొచ్చి సెకఁ జల్లెడివెన్నెల వెట్టికొందునే. 127

వ. అనునెడఁ బిరిగొన్నయారటంబు పొరిఁబొరిం గారింపఁ దొడంగిన. 128

తే. ఎసఁగుసంతాపభరమున నిట్టునట్టుఁ
బొరలు శయ్యాతలంబునఁ బువ్వుఁబోఁడి
తివురువిరహాలంబున డివ్వె లెత్తఁ
జిత్తజాతుండు వత్తిఁ దాల్చినవిధమున. 129

వ. తదనంతరంబ యంతరంగంబు సంతాపంబుచేతఁ జేతనారహితం బగుచు వచ్చిన.

ఉ. డెందముమీఁదఁ జెందొవకు డెప్పర మేమియులేదు చన్నులం
జిందదు ఘర్మవారి చెవిఁ జేర్చిన లేఁజిగు రించుకంతయుం
గందదు నాసికాగ్రమునఁ గన్నుల బాష్పము లూర వింక నీ
సుందరిఁ గావనేరఁడు ప్రసూనశరుం డని యార్తమూర్తులై.

వ. చెలికత్తె లున్నంత. 132

శా. ముల్లోకంబుల మూర్తులం బటమునన్ ముద్రించి నేర్పెల్ల రా
జిల్లన్ మెల్లన చిత్రరేఖ చనుదెంచె న్నిండుప్రాణంబు సం
ధిల్లన్ బాణతనూజకుం జెలులకున్ దిక్కెవ్వరున్ లేరు నా
తల్లీ వచ్చితె యంచునెచ్చెలులు మోదం బంద డెందంబునన్. 133

వ. ఇట్లువచ్చి యక్కాంత యంతకు మున్న యంతంత వింతగాసంతరించిన శశికాంత జలశీకరశిశిరతరశయనాంతరంబున నప్పటి కప్పటికి వెలయుపొప్పొడు

1. నని వాడిన నెవ్వరి కీను ?

తిప్పలను గప్పురంపుఁగుప్పలు నుప్పతిల్లిన శీతకరమణిశిలాతలంబుల నెడ నెడ జాలకంబుల జడిగొన్నఁబొదకట్టువెన్నెలచేత నట్టువడి మణికుట్టిమంబులు దుడిచి తుడిచి కడ గానక చిడిముడి పడి యొండొండ బొండుమల్లెలు నిండ నత్తెఱవుల నొఱవుగాఁ బఱవు కొందఱు దెఱవలముద్దరాలితనంబునకు మెఱుం గిడిన తెఱఁగున మెఱయు చతురవనితాకీలితవితతధాతుపటయవనికావితానంబులం గుఱుచ కుఱుచ కురువేరునం బరువంబగుమరువంబునం గసుగందని బిసంబుల నుప్పరిగలో శారికా శుకపికంబులు చడిచప్పుడు దెప్పరమ్ము చేయకుండం జలిచప్పరం బిడి మలయా నిలయంబు మలయు పలుచనితావులకు వలయు చెఱువులు చెరిచి మిర్వులం బొరువున నురివినకుసుమకిసలయకేసరవిసరంబుల నందంద యరవిందకర్ణికాపీఠంబులఁ గందర్పపూజ చేసినం జెలువొందు నిందీవరంబులుఁ జెందొవలుఁ గందువల సంద డించు నిందిందిరంబులకు విందులుగా సమంచితాకుంచితాలకంబు లగునలికంబులు వంచి పంచబాణశరంబు లని ప్రమాణంబు విచారించు విరహపరితాపపరిహరణ నిపుణ పురంధ్రీగణంబులఁ గన్నకన్నచోటఁ జెన్నమరినకన్నియలు విన్ననై యున్నయన్నాతి కన్నీరు దుడిచి తుడిచి పన్నీరునం జేఁ దడిపికొన వలసి రజతవీటి కాపటలంబు వెదలం దిగిచి కులికి కులికి చుట్టం దొలంగ వై చినచిందంబులతోడం బురుడించు చందనలిఖిత చంద్రమండలసమర్చనాసమయసముచిత పరిహారదేవ తాయమానతారకానికరంబుల మఱియుం గదళీదళవీజనంబులఁ గస్తూరికాకర్దమం బులఁ గనకకరండభరిత మకరందంబుల మణికలశపూర్ణమలయజతోయంబుల విన్యస్త వివిధకుసుమస్తబకవిశాలలాంగణంబుల విగతవీణావినోదాది విహార దేశంబుల విచ్ఛిన్న విభ్రమోపహారవిచారపిచ్ఛందకాదిమందిరంబుల మూకీభూత శుకశారికానికాయంబులం గల కన్యాంతఃపురంబు గలయం గనుంగొని. 184

క. ఏ నొకటి చేయఁదలఁచినఁ
దా నొకటి దలంచె విధి లతాతన్వికి నా
పూనినపని తుదిముట్టం
గానిక యూనైతి [1]నైతిఁ గపటంపుఁ జెలిన్. 135

---

1. ఐలముఁ గపటపుఁజెల్మిన్.

వ. అనుచు వచ్చి యచ్చిత్రరేఖ యమ్మచ్చెకంటి పచ్చవిలుతు రచ్చపట్టయిన పాన్పునం పవడించి యున్న నచ్చోటికిం బోయి తప్పక కనుంగొని. 136

ఉ. నవ్వక నవ్వునెమ్మొగము న్నిగుడారెడు వింతకాంతియున్
మవ్వపుఁ గ్రొమ్మెఱుంగులకు మాఱటలైన కటాక్షరోచులుం
జివ్వలు చేసిచేసి యిటు చిక్కనె వెన్నెల వెల్లివేఁడికిం
బువ్వులవాఁడికిం జిగురుబోఁడికి నే మనవచ్చు నీ యెడన్. 137

వ. అని పలుకుచు నప్పొలంతి కలికికన్నులకొలుకులం గీలుకొన్న కజ్జలజల కణంబులు దనపై దుకూలాంచలంబులం మెత్తమెత్తన యొత్తి యత్తరళలోచన కుచంబులపై ముత్తెపుసరంబులు నులి చక్కం ద్రోచి యాచంద్రముఖి యళికదేశంబునం గలయం బడిన యలకంబులు నూఱుకొలిపి తెప్పిఱినచందం బెఱింగి చిత్రపటంబు దెచ్చితి నిదె చూడుమని యిట్లనియె. 138

సీ. సుదతి నీమదిలోనిసౌర దోఁకి మదనుండు
తన కొండుచో టింకఁ దడవుఁ గాక
కాంత నీ పలుకులు గరజాణచిలుకల
వెదకి నాలుకముల్లు విఱుచుఁ గాక
పడఁతి నీమాపు లుప్పనబట్టె లాడించి
చెలులవక్త్రములఁ బూజించుఁ గాక
మెలుఁత నీయడుగులు మెలఁగ నేర్చుట చూచి
యందెలతో మాట లార్చుఁ గాక

గీ. నాకతఁబున వచ్చిననవ్వుఁజాటు
మాటు వడఁ జేసి నీ కూర్మిమగని దెత్తు
నిత్తు నీచిత్రపటమునం దెవ్వఁడైన
మెత్తుగాక నీ చెలికత్తె మేటినేర్పు 139

మ. అనుచుం జిత్రపటంబు దెచ్చి హృదయాహ్లాదంబుగాఁ జూపినం
గని యక్కాంత జగత్త్రయంబు సుమనో గంధర్వయక్షాప్సరో
దనుజాదిత్యుల సిద్ధసాధ్యవసురుద్రవ్రాతముల్ మారుతా
శన సంకీర్ణ రసాతలాశ్రితుల నాశాశూన్యయై దాఁటుచున్. 140

వ. ఇత్తెఱుంగునం ద్రిదివపాతాళంబులయందు మహానుభావులుం గల రని మునుముట్టం దడవి నిజమనోరథసిద్ధి వడయనేరక భూమండలం బవలోకించి భరత ఖండంబున. 141

సీ. పాంచాల పాండ్య బర్బర కిరా తాభీర
కురు విదేహ విదర్భ కుకుర గౌళ
గాంధార మగధ కొంకణ కళింగ పుళింద
సింధు సౌవీరాంధ్ర చేర చోళ
సాముద్ర సాల్వ కోసల కళింగ కుళింగ
వత్ససౌరాష్ట్రాంగ వంగ మత్స్య
సూరసేన సుదేష్ణ సుహ్మ కాశ కరూశ
లాట కర్ణాట మాళవ వరాట

తే. కుంత లావంతి[1] ఘూర్జర కుహ్మక త్రి
గర్త బహుధాన యవన టెంకణ దశార్ణ
పుండ్రబాహ్లిక ద్రవిడ కాంభోజ హూణ
కేకయ వసాతి కాశ్మీర కేరళములు. 142

క. మొద లగుననేకములు జన
పదములు గనుఁగొనెఁ దదీయపతులను మఱియున్
హృదయం బేమూర్తులఁ జే
రద రమణిమనంబులోని రమణుఁడు లేమిన్. 143

క. తదనంతరంబ చూపుల
కాదవె మహారాష్ట్ర పశ్చిమోత్తరభూమిన్
యదుకులనాయకునగరము
సుదతికి నచ్చిత్రరేఖ చూపెడుచోటన్. 144

వ. అందుఁ గొందఱు యాదవులం గడచి చని 145

గీ. కనియె నక్కాంత యంతటఁ గమలనాభు
నీరిఁ బ్రద్యుమ్ను సాత్యకిఁ జేరి వారి

1. కానూపఘూర్జర త్రి.

సరస ననిరుద్ధుఁ జూడ మై జాదుకొన్న
పులకములతోడ జల్లనఁ బొడమెఁ జెమట
గీ. మనసు గ్రుచ్చిలి చొచ్చినమ త్రికాఁడు
వీఁడు గొమ్మని చే సాఁచే వెలఁది యపుడు
కాముఁ డటమీఁద ననిరుద్ధుగాత్రమునకుఁ
జిగురుఁబట్టెంబుఁ జేర్చుట చెప్పినట్లు. 147

వ. ఇట్లు చిత్రలేఖాదర్శితం బయినచిత్రపటంబునం దనమనోరమణుం గనుం గొని యుషారమణి రమణీయం బయినతదాకారంబునం దవిలి తదన్వయ నామ ధేయంబు లెఱింగింపు మనుటయు నచ్చిత్రరేఖ యిట్లనియె. 148

మ. వనితా వాసవవైరిమర్దనుఁ డనన్ వర్ణింప నొప్పున్ జనా
ర్దనుఁ డద్దేవుని మున్ను వింటిమికదా తత్పుత్త్రిఁ బ్రద్యుమ్నుఁ గం
తునికంటెం గొనియాడఁగాఁ బొసఁగు తత్సూనుండు నీకోరువాఁ
డనిరుద్ధుం డిటు చిక్కెనే సమత నీయన్యోన్య యోగ్యాకృతుల్. 149

క. ఇక్కన్యకు మగఁడే యితఁ
డక్కట యీమగని కేటియా లిది యనుచుం
జిక్కొట్టు వలదు చెలులకుఁ
బెక్కేటికి నూరు మెచ్చఁ బెండిలి గలిగెన్. 150

క. వెలవకు కలలోఁ జేసిన
కొలగామికి పగచుచోట గుణరత్నము చే
కుఱె నీకు నలిగి తన్నినఁ
బలుపు పయిం బడినయట్లు పద్మదళాక్షీ. 151

వ. అనుటయు నవ్వనజానన యిట్లనియె. 152

శా. ఈరూపే కలలోపలం గలసె నన్నేరూపునం జేరు నా
కీరూ పింతటిమేటిరూపసికిఁ దా నిల్లాలుగా నోమున
గ్గారా మేలలితాంగికిం గలుగు నింకం జాలు నెవ్వారికిం
జేరన్ రానిమహానిధానమునకుం జేసాచితిం దొయ్యలీ. 153

వ. అట్లుం గాక. 155

ఉ. ముద్దియ ముద్దరా ల్వెనుక ముందట నొండొకకీడు లే దనం
బెద్దలకెల్ల బాట నయి పెట్టినపీఁటన యుండ నైతి నా
బుద్ధులు దప్పె నేమిటికిఁ బోయిననీళ్ళకుఁ గట్ట వెట్ట నీ
యద్దములోనినీడ కెటు లాసపడం బొసఁగుం దలోదరీ 155

ఉ. ధీరుల నింద్రముఖ్యు లగువిక్రతులం గుతి[1]లాలఁ బెట్టు న
వ్వీరుఁడు బాణుఁ డేమిటికి వియ్యపు[2]టిచ్చకుఁ దెచ్చు మర్త్యులన్
దూరపువారిఁ దన్విఁ గన నువ్వులఁ గండ్లను నోరఁబోసికా
న్నారము కాఁ దలంపు లలనా యిలనాడెడు ప్రాణమేటికిన్. 156

గీ. దనుజకులవైరి శౌరి నందనులు నట్ల
రక్కసులు మనవారు వారలకు మనకు
బొసఁగునె నడుమఁ బెట్టినపూరి గాలు
నేల చిత్రరేఖా తుది నింత సఖుగు. 157

వ. అట్లుగాక నామీఁదినెయ్యంబున నీవు విచారించిన తెఱంగు. 158

మ. వనితా నీపతితోడఁ గూడ వలతేన్ వారేల వీరేల నీ
కని నన్నా యనిరుద్ధుఁ డున్నయెడ కెట్లయినన్ వెలాత్రేనిఁ బో
యిన నాతండు కులాభిమానఘనుఁడై యేయూరి కేత్రోవయం
చనుమానించినఁ ద్రోవ నన్ గొఱవిఁ జేయం జూచెదే క్రమ్మఱన్. 159

వ. మఱియు నొక్క తెఱంగు విను మక్కుమారు నిక్కడకుం గొని వచ్చి
తన్నుం గలుపుసామర్థ్యంబు గలదేని. 160

క. కలసెదఁ బతి నతఁ డిచ్చట
మెలఁగుట మాతండ్రి విన్న మే లగునే ప్రే
వులలోన సురియఁ ద్రిప్పిన
కలపనఁ [3]బిండైనఁ జెలిమిక త్తెలు నగరే. 161

ఉ. నావుడుఁ జిత్రరేఖ వదనంబుం బింకము మీఱఁ బల్కు నా
లావున నిప్డు దెత్తు నబలా విభు నింపెసలారఁ గూడి సం

1. లం గలంచు. 2. టంచుకు. 3. బిండైనఁ.

భావన చేయవే చెలులు ప్రాణమునం బరికించునట్లు ర
క్షావిధ మాచరింపు మనసౌధములందు నిగూఢభంగులన్. 162

వ. అనుచుం దద్దనుజేంద్రకన్యకం దనవచనచాతుర్యంబునం గార్యంబునకు నొడంబఱచి చిత్రరేఖ యదువీరనగరంబునకుం బోయిన యనంతరంబ యా బింబాధరపరితాపంబు గొంత డిందుపడిన యనంతరంబు. 163

క. [1]వెల్లి యగునగల త్రొక్కున
నిల్లిగ్గులు గానవచ్చు హృదయములోనన్
మల్లామడి యగుపదండు
మెల్లన కూర్చుండెఁ దాల్మి మినుమిను కనఁగన్. 164

ఆ. అట్లు చిత్రరేఖ యదువీరనగరంబు
చేర నరిగి యకుమారవరునిఁ
బట్టితెచ్చు తెఱఁగు భావించి మాయాబ
లంబు దప్ప నొండులాగు లేమి. 165

వ. చింతించి. 166

చ. ఒకకమలాకరంబునకు నొయ్యనఁ జేరిన నందు నారదుం
డకలుషయోగనిశ్చలత నచ్యుతఁ జిత్తమునం దలంప బా
లిక రచిత ప్రణామముకుళీకృతపాణిపయోరుహాళిమా
లిక కుటిలాలకాలిక వళీభవదాకృతి యయ్యె నయ్యెడన్. 167

వ. ఇట్లు మ్రొక్కుచు వినమ్రవదన యయి యున్న యన్నలినలోచనతో నారదుండు. 168

క. ఓరమణి ! నీవు వచ్చిన
కారణ మెఱిఁగింపు మనుడుఁ గడువేడుక నిం
డారినమదితో నిట్లను
నారమణీతిలక మమ్మహామునితోడన్. 169

మ. బలిదైత్యేంద్రతనూజుఁ డొప్పు జగతిన్ బాణుండు తత్పుత్రియై
కులదీపం బనఁగా నుషారమణి మాకుం బ్రాణమై యుండు నా

1. లొల్లి.

ఁలనారత్నముఁ బార్వతివరవచోలబ్ధాత్మకుండై యొకం
డలయించెం గలలోనమానసగృహైకాకారుఁడై వేడుకన్. 170

క. వాఁ డెవ్వఁడో యెఱుంగదు
పోఁడిమి చెడ లజ్జ గోలుపుచ్చె ననుచుఁ బూఁ
బోఁడి వగచునెడఁ జెప్పిత
వేఁడి[1]కానన్ మగఁడు నీకు వీఁ డని పిదపన్. 171

క. వరునిపొడ [2]పో ల్టెఱుంగక
విరహానలశిఖలచేత వేఁగెడు చెలికి
న్వెరవారఁ జిత్రపటమున
సుర వర పన్నగుల వ్రాసి చూపితి నంతన్. 172

వ. అందులోన 173

క. అనిరుద్ధునిఁ జేపట్టెను
మును గలలోఁ గన్న రూపమునకుం జోడై
యునికిఁ దెలసి యాతనిపయి
మనోజరాగంబు మిగుల మరగించుటయున్. 174

మ. పరితాపంబునఁ బొందు నప్పొలఁతికిం బంతంబు నే నిచ్చితిం
దరుణీ! తెచ్చెద నీమనోరమణుఁ జింతాభార మిం తేల యం
చు రహస్యంబుగ నిక్కుమారవరుఁ గొంచుంబోవ నా త్రోవఁ గా
నరు తక్కెవ్వరు శౌరికిం బిదపఁ గానం జేయుమీ సంయమీ! 175

వ. అత్తెఱం గేల యను తలంపు గలదేని నవధరింపుము. 176

ఉ. బాలుఁ డితండు మార్కొనిన బాణుఁడు గెల్చు మురారియైన నా
భీలభుజుండు దద్దనుజు భీమబలుం బరిమార్చునంతలో
నా లలితాంగినిర్భయవిహారములం జరియించు వాని హృ
ద్బాలముగాక యున్నె మనుజుండుఁ దనూజయుఁ గేలి సల్పఁగన్. 177

వ. కావున నవశ్యంబు యుద్ధంబు సిద్ధంబు. 178

---

1. కౌనిక. 2. మట్టె.

ఉ. నావుడు వామలోచనకు నారదుఁ డిట్లనుఁ గియ్యమన్న సం
భావనగన్న చందమునఁ బాలుదుఁ బయ్యెర దూదినై[1] ప్రమో
దావహ మైనయీపని రయంబునఁ జేసినఁ జాలుఁ దెచ్చెదం
బో వసుదేవసూను ననుబోఁటికిఁ గన్నులపండు వొప్పదే. 179

వ. అనిన విని చిత్రరేఖ వెండియు నొక్క తెఱంగు విన్నవించెద నాకర్ణింపు మని యిట్లనియె. 180

క. తన మనుమనిఁ గొనిపోయిన
మనమునఁ గోపించెనేని మధుసూదనుఁ డే
మని శాప మిచ్చునో నా
కను తలఁకున నీకుఁ జెప్ప కట వో వెఱతుఁ. 181

గీ. కెలనివారికి నెంతటికీడు పుట్టె
నేని తొలఁగించు హరి దనకెగ్గు చేయు
వెడఁగుఁ జెఱుపండె యెదిరికి న్మడఁచువాఁడు
దనకుఁ దగరంబు చఱచు బెంతటిభరంబు. 182

క. మునినాథ ! నీవు మునుము
ట్టనె చెప్పినఁ జాలు మఱి కడంగఁడు నాపై
గినియ విని యతఁడు దర్పిత
దనుజకృతం బని రణంబు దడవుం బిదపన్. 183

వ. అనుటయు నారదుండు గలహసంపాదనవిశారదుండు గావున నమ్ముదితతో నిట్లను నిది నీకుం బని గాదు నాచేసిన సంవిధానంబున నీవు నిశ్చింతంబుగా ననిరుద్ధుం గొనిపొమ్ము. 184

మ. అనినం బొంగి లతాంగి యాదవనగర్యంతఃప్రవేశంబు చే
సి నభోమండలహారిసౌధమయతం జెన్నారు ప్రాద్యుమ్నిహ
ర్మ్యనితాంతాంతికభూమి చేరి కనకప్రాసాదమధ్యంబునం
దనిరుద్ధు న్విభవప్రసిద్ధుఁ గనియెన్ హాలామదాలంకృతున్. 185

---

1 బయ్యెల దూల నై.

సీ. లలితనూతనలతాలంకారముల మెచ్చి
మొగమిచ్చు లేమావిమోక వోలెఁ
బరివారకాపటలంబుతో నవ్వ
దొరకొన్న పిన్నచందురుఁడు వోలెఁ
గమలినీకలికావికాసంబు లెఱిఁగి పై
[1]వ్రాలెడు తేఁటిరాచూలి వోలెఁ
సరళసౌదామినీసల్లాపముల మేను
గరుపాఱుమిండమేఘంబు వోలెఁ
తే నంతకంతకుఁ జిట్టంటు లంటి యంటి
చెలువలకు యౌవనము విందు చేయ నున్న
మానగుణబద్ధు మన్మథమంత్రసిద్ధు
రుచిరరసవిద్ధు నాయనిరుద్ధుఁ జూచి. 186

క. మును విద్యాధరసంతతి
యనఁగా వివిధంబు లగునుపాయంబుల మీ
ఱినతనమయాబలమున
ననిరుద్ధుం బొదివె విస్మయాపాదిని యై. 187

చిత్రరేఖ యుషాంతఃపురంబున కనిరుద్ధుం దెచ్చుట

చ. పొదివిన నభోవిహారమునఁ బువ్వునుఁ బోలె నలంగకుండ న
మ్మదనసమానుఁ బట్టికొని మానవ దానవ దేవకోటికిం
గద లెఱుఁగంగనీక చని కాంచె నుషాసతిఁ జిత్రరేఖ యా
ముదితకు రాకపోక [2]లొకమూఁడుముహూర్తములయ్యె[3]నయ్యెడన్. 188

క. ఇది నీకోరినఫల మని
సుదతికి ననిరుద్ధుఁ జెలువ చూపి యిటు లనున్
మది నొచ్చి నీకుఁ గూరిమి
యదికిన వలరాచచుట్ట మవునో కాఁడో. 189

చ. అనుటయుఁ బూర్ణచంద్రముఖి నాదటఁ జూడఁ జకోరనేత్రకుం
గనుఁగొన నెమ్మనంబు శశికాంతశిలాతలమయ్యె నంతలోఁ

1. జూజాడు, జూటాడుట. 2. యెడ, 3. జూడఁగన్.

దనియకమున్న కన్నుఁగవతామరజోడు తెఱంగుదాల్చె ముం
చినపరితాప మంతయును జీకటితోఁ బురుడించు నత్తఱిన్. 190

గీ. చిత్తమున బాణకన్యక చిత్రరేఖ
చేఁత లన్నియు నత్యంతచిత్ర మనుచు
సంతసమునొంది యనిరుద్ధు నంతిపురము
నందుఁ బెట్టించె నేకాంతమందిరమున. 191

వ. అక్కుమారుండు. 192

క. ఏమగువ పట్టికొనెనో
యేమిటికిం దెచ్చెనో యి క్కడిదెక్కడిపాటో
యేమీ యెఱుఁగఁడు మది మఱి
తామసి యనువిద్య తొలుతఁ దనుఁ బొందుటయున్. 193

వ. ఇట్లు మాయామోహితుం డయిన ప్రద్యుమ్నతనయుండు పాన్పుపైఁ బవ్వ
ళించియున్నతఱి నత్తెఱవ చిత్రరేఖ కిట్లనియె. 194

క. ఇరుసెవి యెఱుఁగక యుండం
దరుణీ సుఖ మనుభవింపఁ దలఁచిన బదివే
వురకన్ను లెదుటఁ బడితిని
సరివా రెల్లిదము చేయ జాణెత నయితిన్ 195

క. జలతైలబిందు వయి నా
మెలఁకువ వెల్లివిరి యైన మేలగునే ని
ర్మల చరితుఁ డయినబాణుం
డలుగఁడె ప్రాణముల కింతయపరాధమునన్. 196

వ. అనినం జిత్రరేఖ యి ట్లనియె. 197

క. ఏ మనఁగ లాఁతివారమె
నీమన సెట్లట్ల కాక నీరజవదనా!
యేమటికిఁ [1]దలఁకె దల్లిం
దామరయును బోలె నుండి తగవు విడుతురే. 198

1. తలఁకె దల్లి, తామర దలఁకె, దల్లియు

వ. అనుచు సఖీజనంబులమనంబులకు రహస్యంబు వెలిపుచ్చం దగమిదోఁపం
బలికి వారిం దమతమవినోదంబుల నెప్పటియట్ల నిలువంబంచిన యనంతరంబ. 199

చ. పడఁతి కుమారచంద్రుకరపల్లవముం దనచన్నుదోయిపై
నిడి పులకించిన్నుఁగవ యించుక మోడ్చి వెండియుం
జిడిముడిపాటుతో నతనిచెక్కులు గ్రుక్కుచుమోవిద్రేఁపలం
బుడుకుచు నుండెఁ దాల్మిగడివోయిననించుక లజ్జలావునన్. 200

వ. ఇట్లున్న యక్కన్నియ కన్నెఱింగి చిత్రరేఖమదుమథను మనుమనిం బోది
విని మాయామోహంబు నెడలించి పరిబోధ పరిచిత్తుం జేసి యుత్తరుణితో రాత్రి
కడచన్నకొలంది చెప్పి ప్రొద్దువోయెం బోయి వచ్చెదనని వీడుకొని వెడలె నా సమ
యంబున. 201

చ. [1]ఒదికిలి పాన్పుపైఁ బతికి నొయ్యన కేలు దలాఁపు చేసి క
ట్టెదురుగఁ గౌగిలించికొని యెత్తుచు నొత్తుచు మోముమోముతో
గదియ నమర్చి పేర్చి పయిఁగా లిడినేరిమి లేనినేర్పులం
బొనలెడియూర్పులం గరువువోసినభంగి లతాంగి యుండ గన్. 202

వ. ప్రద్యుమ్నతనయుండు. 203

క. బిగువుఁజనుంగవతాఁకును
జిగురుంగెమ్మోవి మోవి చేరుటయును సూ
డిగములచేతలగడయును
మగువ కవుంగిట నొకర్తు మరగుటఁ దెలుపన్. 204

వ. కనువిచ్చు నప్పుడు. 205

ఆ. మెఱుఁగుఁదీవవోలె మెలఁతుక కౌఁగిట
మేలుకట్లుక్రింద మేడమీఁద
రత్నదీపమధ్యరాజితం బగుతల్ప
తలమునందుఁ బొందుతన్నుఁ జూచి· 206

---

1. ఒదకిలి.

క. కలగన్న చందమో మది
కలఁగుటయో యైంద్రజాలికవినోదంబో
తెలియఁగ నేర నటంచును
దలఁచును నిజమైన నేన ధన్యుఁడ ననుచున్. 207

క. నాకనకప్రాసాదము
నాకొలువువిలాసినులును నాచుట్టములున్
లేకున్న నేమి కౌఁగిట
నీకామిని యున్నఁ జాలు నెల్లచవులకున్. 208

వ. అనుచు నయ్యనిరుద్ధుండు నిద్దురలేమినక్కామినిపొందు నిక్కంబుగాఁ దెలిసి. 209

సీ. తెమలించి కురులొయ్యఁ దివియ [1]లే కటమున్న
కదిసినకెమ్మోవి గమిచి కమిచి
[2]వెడవెడ సోఁకి పై నడర లే కటమున్న
యలవడ్డకౌఁగిట నదిమి యదిమి
వలు వెడలింపఁ [3]జే వాటు లే కటమున్న
పైకొన్న జఘనంబుఁ బ్రాఁకి ప్రాఁకి
తమకించి కొసరుపంతంబు లే కటమున్న
[4]కదిసినచిత్తంబు గరఁచి కరఁచి

తే. తుది మొదలికంటెఁ దుదికంటె మొదలు చాలఁ
జవులగను లయినరతులకు జనవు లిచ్చి
పూవిలుతుచేతిజంత్రంపుబొమ్మఁ జేసె
మానినీతిలకంబుఁ గుమారవరుఁడు. 210

వ. ఇవ్విధంబున మదనకేళిం దేలి యక్కులపాలికాతిలకంబు చేతం గల లోపలం గన్నది మొదలుగాఁ గౌఁగిటిలోనున్నది తుదిగాఁ దనవృత్తాంతం బంతయు విని యనిరుద్ధుం డుషాసౌభాగ్యానిరుద్ధుం డయి కొన్నిదినంబు లొరులెఱుంగకుండ వర్తించునెడ నొకనాఁడు. 211

---

1. క యటమున్న. 2. వెడ సోఁకినంత మై, 8. బై వాటు, 4. కరఁగిన.

క. ఆవసదశోధనమునకు
సావాసులు వచ్చి కనిరి సౌధముపై సం
భావితుఁ డై దనుజసుతా
సేవితుఁడై యున్న మనుజసింహుఁ గుమారున్. 212

మ. కని యకొక్కమలికిం గుమారునకు సంగం బంగణాయత్తమై
యునికిన్ బాణునితోడఁ జెప్పఁ జని వా రొండేమియున్ శంకలే
క నరుం డొక్కఁడు దేవ! నీ నగరిలోఁ గన్యాజనాంతఃపురం
బున నున్నాఁడు భవత్సుతావిభుత నిప్పొందియ్యకొన్నాఁడవే. 213

ఉ. నావుడు రోషవహ్నివలనం బొగ రేఁగినభంగి మోమునం
గావిరి పర్వ నంగమునఁ గంపము నివ్వటిలంగ బాణుఁ డ
త్యావిలచిత్తుఁడై మనుజుఁ డట్టె మదీయపురంబు చొచ్చె న
చ్చేవయ కాక నానగరు చెర్చె నిసీ మగమాట లేటికిన్. 214

క. [1]ఏ నటె నాకూఁతురి నటె
మానవుఁ డటె నగరు చొచ్చి మాకులమునకున్
హాని యొనరించెఁ గన్నులఁ
గానఁడు దలయెత్త రోఁత గాదే నాకున్. 215

క. మనుజాంగనలం బట్టుట
దనుజులకుం జెల్లుఁగాక దనుజాంగనలన్
మనుజులు పట్టుటకును దొగ
కొనిరే బెండులు మునింగి గుండులు దేలెన్. 216

## అనిరుద్ధుఁ బట్ట బాణుఁడు తనకింకరులఁ బనుచుట

క. అని తనకింకరసైన్యము
ననిరుద్ధునిమీఁదఁ బనిచె నదియు భయోత్పా
దనగతిఁ బట్టుఁడు కట్టుఁడు
తునుముఁ డనునెలుంగు లదరఁ దోతెంచె వడిన్. 217

---

1. ఏ నీ నటె నాకూఁతును.

క. అప్పలుకుల కలకలు మది
నుప్పర మెగయంగ నెసఁగె నుల్లాసము మై
నొప్పారఁగ బరిగోలల
నొప్పించిన భద్రగజము నూల్కొన్నగతిన్. 218

వ అక్కుమారకంఠీరవుండు. 219

క. ఆతరుణి వలదు వల దని
భీతిం దనుఁ బట్ట బట్ట భీకరతరని
ర్ఘాతరవసింహనాదుం
డై తత్స్యందంబు డిగ్గె నవుడు గలఁచుచున్. 220

వ. ఇట్లు డిగ్గి తదంతఃపురద్వారంబున నిలిచి దారుణతరం బగు పరిఘంబు పుచ్చికొని 221

మ. తనఘోరధ్వనికిం గలంగఁబడు తత్సైన్యంబు దైన్యంబునం
దునుకొందం బరిఘంబుపై విసరుచున్ దుర్వారుఁడై పైపయి
న్మనుఁగం బాఱు శరాసిముద్గరగదాముఖ్యాయుధశ్రేణిచేఁ
గినియం జేసిన వేసవిన్ రవి దివిన్ గ్రీడించుచందంబునన్. 222

క. మంది పదాతులఁ గొందఱఁ
జెంపాడిన నున్నవారు చెడి పాఱిరి బా
ణుం దున్నయెడకు నొడళుల
నిండను నెత్తురులు గ్రమ్మ నిట్టూర్పులతోన్. 223

వ. అప్పు డద్దనుజేంద్రుండు. 224

క. వెఱవకుఁడు పాఱకుఁడు చిం
దఱవందర గాకుఁ డేల ధైర్యముఁ దూలన్
మఱచితిరె కులముఁ గీర్తియుఁ
బెఱుకులగతి నింత వలదు బీరము చెడఁగన్. 225

ఉ. పాఱెదు త్రోవ మీకు నలవాటుగఁ జేసినవీరుఁ డెవ్వఁడో
మీఱి యనేకయుద్ధముల మీరు జయించుట లెల్ల నింతతోఁ

దీఱె ననుం గనుంగొనుఁడు ధీరతఁ దోడ్పడ రండు నాకునుం
బాఱుఁడు పాఱుఁ డంచుఁ బరిపంథుల నోర్వుఁడు చాలు మీపనుల్. 226

వ. అని వారి నడకించియు నదలించియుఁ బొదుపు చేసి పోరికిఁ బురికొల్పి మఱియు మహావీరుల బదివేవురుం బదివేవురుగాఁ బలుదెఱంగుల మూఁకలు చేసి ప్రమథగణంబులం గలపి పంచిన. 227

శా. నేలం గొందఱు మింటఁ గొందఱు గజానీకంబుఁ గీలాలము
గ్జాలంబుం బురుడింప సంచితమదోత్సాహంబు దేహంబులం
జాలం గ్రాల నిశాతహేతిలతికాసౌదామనీదామభీ
మాలంకారము బీరముం దెలుప నుద్యద్విక్రమక్రీడతోన్. 228

వ. వచ్చి నిలు నిలు మని యదల్చి తాఁకిన. 229

క. ఒక్కనికిఁ బెక్కు మొనలకు
దక్కక పోరగుట యరిది దానవ బలమై
క్రిక్కిఱిసిన తిమిరమునకు
గ్రుక్కక యాదవకుమారసూర్యుఁడు నిలిచెన్. 230

వ. ఇట్లు నిలిచి తనచేతిపరిఘంబు కంధరంబునం జేర్చి. 231

తే. పరిఘతో మరాదులఁ దన్నుఁ బరులపైవ
వారివారికైదువులన వారి వైచె
మఱియుఁ దనతొంటిపరిఘం బమర్చి చేత
నాసురారాతిసేనపై నడచె నపుడు. 232

వ. ఇట్లు 233

క. ఇరువదినాలుగువేవురు
వరభటులం గింకరుల నవారణఁ బోరం
బరిమార్చి విక్రమక్రమ
ధురంధరుం డయినవిజయదోహలి మఱియున్. 234

క. పలకయుఁ గరవాలముఁ గొని
పొలికలనం గెలనఁ జదలఁ బొదల మెఱుంగుల్

వల నొప్పారఁ బ్రచారం
బులు ముప్పదిరెండు నిండు మొనలకుఁ జూపెన్. 235

వ. ఇట్లు వివిధవిక్రమవిహారంబులకు సారంబు లగుకరవాలధారాప్రహారంబులఁ బరబలంబులం బొరిగడిగి యదుకుమార కుంజరంబు పంజరంబు విడివడినసింగంబు నంగంబులవణి ననుకరించుచుఁ గరటిఘటాఘాటవిఘటనంబున జటులపలాహక పటలవిపాటనంబునఁ దురగపరాపరాఙ్ముఖీకరణ నైపుణంబునం దరశతరంగ పాళీపలాయనప్రతివాదనంబున నిబిడ స్యందనసందోహ విదారణంబున విచిత్ర యానపాత్ర విధ్వంసనంబున సముద్భటభటసముదాయ ఖండనంబునం బటువిటపి వాటిమోటనంబునఁ బ్రచండపవమానప్రతిమానుం డగుటయుఁ దత్సైన్యంబు చాఁపకట్టువడి నందుం గొందఱువిఱిగి పాఱుచో సందడిభ్రమందియు సంగడి వారిం బ్రందియు నెత్తురులు గ్రక్కియు నిగుడ లేక చిక్కియుఁ దాఁకి పడియును దల్లడ పడియును వ్రేళులు గఱచియు వెనుకవారికి వెఱచియుఁ గైదువులువైచియుఁ గ్రంతలు చూచియు బడిపాఁతఱలం ద్రెళ్ళియుం బలుకకు మని గిల్లియు నిండ్లు దూఱియు నెడదవ్వువాఱియుఁ బీనుఁగులలోఁ డాఁగియుఁ బేరుకొన్న రేఁగియుఁ బోరాక మరలియుఁ జోటులేక పొరలియు చొచ్చియు విరథులై కోలుకొనలేక పఱచి రప్పుడు గొందఱు నేలయెడ చాలక నింగికిం దొలంగిన. 236

క. చెడి విఱిగినసైన్యంబుం
బొడగని బాణుండు లోన భుగభుగ నుండెన్
విడువక సమిదాజ్యాహుతు
లడరింపఁగఁ బరఁగు నధ్వరానలము గతిన్. 237

వ. అప్పుడు. 238

శా. కుంభిస్యందనవాజిసైనికపరిక్షోభంబు వారించుచుం
గుంభాండుండు సహస్రవాహయుతముం గోదండముఖ్యాయుధా
రంభోదగ్రము ఖడ్గచర్మవృతమున్ రత్నాఢ్యముం గా ససం
రంభుఁ డై దశనధ్వజోగ్రరథముం బ్రాంతంబునన్ నిల్పినన్. 239

ఉ. దానవనాథుఁ డారథ ముదగ్రత నెక్కి సహస్రబాహులం
బూనిన శస్త్రజాలము నభోజలదంబున కింద్రచాపసం

ధానము చేయ బీరపుటదల్పులతోఁ గవదాంగుళిత్రగో
ధానికరంబుతో శరవితానముతో నెదిరించి నిల్చినన్. 240

క. కనుఁగొని చిఱున వ్వొలయఁగ
ననిరుద్ధుఁడు పూర్ణశశినిభాననుఁ డై మా
ర్కొన నరుణలోచనుం డై
దనుజుఁడు నిలు నిలువు మనుచుఁ దాఁకెం బెలుచన్. 241

వ. అప్పుడు. 242

క. ప్రాణము ఝల్లన నుష క
ల్యాణనిధిం బ్రియునిఁ జూడ నతఁడు గుఱియు నా
బాణకరనికరఖతర
బాణంబులకుం గటాక్షబాణంబులకున్. 243

తే. తండ్రిఁ గనుఁగొన వెఱచి సౌధంబులోన
మఱుఁగుపడు నింతి పతిఁ జూడ మఱియు నెవలుఁ
జిన్నఁ బోయినమోముతోఁ జిత్రరేఖ
తనకు వచ్చినచేటని తల్లడిల్లు. 244

వ. అట్టియెడ బాణాసురుండు. 245

క. దనుజసుతాసురతోత్థిత
మనోజచిహ్నాభిరామమండన మగునా
యనిరుద్ధుమేను గనుఁగొని
తనుత్రరహితంబు సుకరదారుణ మనుచున్. 246

క. అడిదము గొని నాతోఁ దల
పడియెదుసీపడుచుఁ జంప భరమే యని పై
నడరించె వేయిచేతుల
జడిగొనఁ గైదుపులు మఱియు శరనికరములన్. 247

వ. తదవసరంబున. 248

మ. పలకన్ బాణపరంపరల్ జడియుచుం బ్రద్యుమ్నసూనుండు మొ
క్కలుఁ డై యేనుఁగు జంప నాది గొనుసింగంబు న్విడంబించి మం

దల విశ్రాంతి నహర్పతిం జెనయుచున్ డాసెం దదంగంబు న
మ్ముఁలచే రక్తమయంబు చేసి దిశలన్ మూసెన్ సురారాతియున్. 249

క. శరములు దాఁకిన నెత్తురు
దొరిగిన సంగరవిహారదోహలి యై ని
ర్భరరోష మదర బాణుని
యరదమునకుఁ జిత్రగతుల నతఁడు గదసినన్. 250

వ. అక్కుమారసింహంబుమీఁద నసురేశ్వరుండు పరిఘపట్టిసముసలముద్గర
ప్రాసప్రముఖంబు లగు వివిధాయుధంబు లొక్కుమ్మడి నడరించిన నతండు
చలింపక సందీప్తక్రోధుండై. 251

క. గగనమున కెగసి యరదము
నాగ దెగిపడ వేసి ఖడ్గనూతనగతు లొ
ప్పఁగఁ దిరిగి తురగములఁ దన
మగతన మమరంగ యదుకుమారుఁడు వేసెన్. 252

ఉ. వేసిన నింద్రవైరి యదువీరునిపై ముసలాసిముద్గర
ప్రాసగదాది హేతినికరంబు ముసుంగుగ వైచె నప్పు డా
యాసురసైన్య మార్చె నతఁ డంతటఁ బోక విచిత్రఖడ్గవి
న్యాసముతో రథంబు కెలనన్ మెఱుఁగై మెఱిచెం దళుక్కునన్. 253

వ. అట్టియెడ నద్దనుజేంద్రుండు సముద్ధతక్రోధుండై శక్తివైచిన. 254

శా. ఘంటాటంకృతితోఁ గృతాంతలగుడాకారంబుతో దిక్కులన్
మింట న్మంటలు గ్రమ్మ గ్రొమ్మెఱుఁగుతో నెక్కొన్న యాశక్తి పై
కొంట న్మేను మలంచి పట్టికొని కోకొ మ్మంచు వేసెన్ వెసన్
వెంటన్ గీటి ధరిత్రి దూఱ నతఁ డవ్వీరుండు మూర్ఛిల్లఁగన్. 255

తే. అంతలోనన తేఱినయసురనాథుఁ
జూచి కుంభాండుఁ డిట్లను శూరుఁ డయిన
యతనితో నింక నీవు గట్టెదుర నిలిచి
పాడిమై నని చేసిన బ్రదుకు కలదె. 256

క. ఆయుధము దాఁకు టెఱుఁగఁ డు
పాయము బలియించి తింతవడి మరల నితం
డాయతభుజుండు ప్రింగును
మాయాబలమునన కాని మడియఁడు నీచేన్. 257

వ. అనుటయు నతండు రోషదహనదందహ్యమానమానసుండై యొం డుపా
యంబు చేయ నేరక మాయ గైకొనం దలంచి. 258

క. ఉరగము నెర గొను గగడని
వెరవున [1]నరు నణఁతు నని దివికి వెస దాఁటెన్
సరథంబుగ సధ్వజముగ
సరథ్యసాహస్రముగ ససారథికముగన్. 259

వ. ఇవ్విధంబున. 260

క. ధీరుఁడు బాణుఁ డదృశ్యా
కారుం డయిపోయి కలను గయికొని ఖ
స్ఫార ప్రచారపరుఁ డగు
నారాయణపౌత్రు నేసె నాగాస్త్రములన్. 261

వ. అయ్యస్త్రంబులచేత. 262

క. సందానదండశూకా
స్పందితసర్వాంగుఁ డయిన ప్రద్యుమ్నసుతుం
జందనగంధులు చూచిరి
చందనధరణీరుహంబుచందాన ననిన్. 263

వ. ఇట్లు పాములచేతం గట్టువడి నేల కొఱిగిన కుమారుం జేరి యరదంబు మీఁదన
టెక్కెంబుకామపై నొఱగి బాణుండుఁ గుంభాండున కిట్లనియె. 264

క. కులకన్యాదూషకులం
దల గోయక యున్న నేల తగ వగు పీనిం
బొలికలనికి బలి యిమ్మని
పలికినఁ గుంభాండుఁ డసురపతి కిట్లనియెన్. 265

1. నవు దతఁడు గగనవీథికి బాఁటెన్-

ఆ. కలనఁ బడినవారిఁ గయికొని[1]కొనిపోయి
పుండ్ల నోమి మగుడఁ బుచ్చు టొప్పు
బంత మడిగి మగుడ బవర మిచ్చుట యొప్పు
నించునేని దాన యేలు టొప్పు. 266

వ. వినుము చెప్పెద. 267

క భుజగర్వ మడఁగఁ జుట్టిన
భుజగాస్త్రము లిట్టు నట్టుఁ బొరలం బడినన్
గజిబిజిలేదు మొగంబున
మఱ బాపురె పీనిఁ బోల మగలుం గలరే. 268

గీ. వేయిచేతులవాఁడవు వివిధసమర
విజయశాలికి దైతేయవీరవరుఁడ
విట్టి నీతోడఁ బోరాడ నెవ్వఁ డోపు
విక్రమక్రీడ సరిలేని వీఁడ కాక. 269

చ. ఇతనికులంబుఁ బేరు విని యేలఁ దలంచిన నేలు మేలు నీ
కితిలలుఁ దయినబంటు హృదయంబున రోషము పట్టితేని వ
ధ్యతకు విధింప నేల యితఁ డాఁకకుఁ బాత్రము నీవెఱుంగవే
ప్రతినయు నాజ్ఞ యుం దగవుఁ బంతము రాజులు దప్ప రెన్నఁడున్. 270

మ. అనినం బండులు గీటికొంచు హృదయం బల్లాడ బాణాసురుం
డనఘా! నీ పలుకేను దాఁటుదునె వీఁ డన్యాయకార్యంబు చే
సిన సైరింపక యుంటి వంశమునకుం జేటైన యీకొలచే
దునిఁ గన్యాకులటాసమేతముగఁ జేర్తుంగాక కారాస్థితిన్. 271

## బాణాసురుఁ డనిరుద్ధునిఁ జెరసాలం బెట్టించుట

గీ. అనుచుఁ జెఱసాలవారికి నప్పగించి
యాదవకుమారుఁ గూఁతును నసురవిభుఁడు

---

1. పోట్లపుం, డ్లోమి మచుదఁ బుచ్చుటొప్పుఁ బంత, మదుగ మరల బవరనచ్చుట యొప్పుఁగ, గించు.

మనములోపల నెగ్గించి మరలిపోయె
నాత్మమందిరమునకుఁ గుంభాండుఁ గూడి. 272

క. అంత నిట హరినగరిలో
నంతఃపురకాంత లెల్ల ననిరుద్ధుని సౌ
ధాంతరములందుఁ దడవుచుఁ
జింతించుచు నింక నేమి చేయుద మనుచున్.  273

సీ. చెందమ్మివిరులలోఁ జిందుతేనెలు వోలెఁ
గన్నుల బాష్పాంబుకణము లదర
[1]వదరుచీకట్లలో [2]వ్రాలుచుక్కలవోలె
వేణిభరమ్ములో విరులు వ్రేల
దూలుతీఁగెలవెంటఁ దూఁగుతేఁటులు వోలె
నసదునెన్నడుముల నారు లొలయ
[2]రాపుజక్కవలఁ జేరనిచంద్రికలువోలె
జన్నుల ముత్యాలసరులు పెనఁగ
తే. ముద్దుమోము లల్లార్చుచో మూఁపులందు
గర్ణభూషణజాలంబు గళగళింప
మార్చిమార్చి చేతుల వ్రేళ్ళ మడఁచికొనుచు
నింక నెట్లమ్మ యంచు నయ్యింతు లేడ్వ.  274

వ. అందుఁ గొందఱు.  275

సీ. చక్కనివారిలోఁ జక్కనివాఁడు దాఁ
[3]గడుఁ బిన్నగాని వేగంబు పీడు
బంటు నొచ్చిననోరఁ బలుకండు నెఱవాది
సుఖభోగి చుట్టాలసురభి రాచ
బిడ్డయై యుండి గబ్బిదనం బెఱుంగఁడు
గరగరనై యుండుఁ గలయ నేర్చు
నూఁపరలాఁడు గాఁ డుపకారి నవ్వు మే
లము గాని తనవారు లాఁతివా ర

1. వలుదజడచీకట్లలో 2. రేయిజక్కవలఁజేరిన. 3. గడుఁబిన్నకాన వేగంబపీఁడె.

తే. నఁడు గడానిబంగారురత్నంపుబొమ్మ
ముంగిటినిధాన మమ్మలముద్దు దమ్మ
లన్న యీతనిఁ గనదేని కన్నతల్లి
కడుపు మసిగాదె దయ్యమ ! కరుణ లేదె. 276

సీ. అఖిలలోకాధీశుఁ డగుచక్రధరునింట
నొకకీడుమాట నేఁ డొదవె నమ్మ
బాల్యంబునంద శంబరుఁ జంపెఁ బ్రద్యుమ్నుఁ
డతనిలా వెల్లిద మయ్యె నమ్మ
[1]కీడు లే దన దేవకీదేవిబలగ మొ
ప్పినఁ బాలలోఁ బండ్లు విసికి రమ్మ
యదువీరులు ప్రమత్తు లని మున్ను మెచ్చని
చుట్టాలు నగ సేగి చూపె నమ్మ

తే. చెడఁ దలంచిరి గాకేమి సిలుగు చింత
లీని యిప్పటి కౌరు లింత పూని రేని
గడచె నింక మారతీదేవి కడుపుచల్ల
నగుట [2]విధి యిన్ని గలిగించె నక్కటకట. 278

క. మధుమథన క్రోధానల
మధికముగా మండ నూఁదు నవ్వెంగలికిన్
విధి యలుగక [3]మును మృత్యు
క్షుధార్తివివృతాస్యపదవికోఱ యలుగదే. 279

సీ. అనిరుద్ధసింహంబు నంటి చావునకుఁ ద
ప్పిన కరి హరితోడఁ బెనఁగ కున్నె
యదుపుంగవున కింత యపకార మొనరించి
దేవతావిభుఁ డైన దిగులు చొరఁడె

1. గెడలే దనఁగ. 2. విధి గన్నికలు చేసె నక్కటకట. 3. మృత్యువునకు.

మురవైరినీడన మూఁడులోకంబులు
బ్రదుకంగ మన కేల పలవరింప
నద్దేవుమనుమని నద్దిరా యెటు చూతు
ననక [1]కేరడ మెవ్వఁ డలవరించె

తే. వెఱవ కోడక యొకరుండు వ్రేలఁ జూప
నెంతవాఁ డక్కుమారు నోరంత ప్రొద్దు
గలసి పాసి పోఁ జాలనికతన మనకు
నేంతలఁ గాళ్ల నిలువమి నిజము గాక. 280

ఆ. అనుచు నుండలేక యార్తస్వరంబున
నేడ్చి రంతిపురము నింతు లెల్లఁ
బురజనంబులెల్ల గుచరిచినాదమో
యంగనారవంబొ యని తలంప. 281

వ. అట్టియెడ వీరభటులు గడురయంబునం జనుదెంచి యెక్కడెక్కడ యను
వారును నే మేమి యనువారును నెవ్వరెవ్వ రనువారును నిలు నిలు మనువారును
బోకుపో కనువారును నగుచుఁ గళవళించి యక్కామినులచే ననిరుద్ధుం డూరక
యదృశ్యుం డయ్యె నని యెఱింగి విస్మయంబున. 282

గీ. హలధరుండును హరియు సాత్యకియు మఱియుఁ
బేరు గల దొరలందఱు బెరసి సభకు
నరిగిరి పురంబులో వీరు లంతపట్టు
నెఱుఁగ సన్నాహభేరి వ్రేయించి పిదప. 283

క. ఇత్తెఱఁగున సభలోపల
దత్తఱమునఁ గూడఁబడిన దర్పితసామం
తోత్తములలోన విపదుఁడు
మత్తద్విపలీల మనసు మండ నిటు లనున్. 284

చ. ఒకఁ డనిరుద్ధుఁ బాపుటకు నుల్లములో వగ లేదు నాదుసై
నికులఁ దలంప కిందు రజనీసమయంబునఁ జొచ్చి యెవ్వఁడో

1. కోఱడ మె.

మకుటముదన్ని నా శిరము మానికమున్ గొనిపోయె నంచు ని
ష్ప్రకలం బొల్చినట్టు మదిపొక్కెడు నెక్కుడుభంగపాటునన్. 285

క. కన్నుండఁ గంటిపాపం
గొన్నట్లు మొఱంగి బాలుఁ గొనిపోవుటకై
య న్నీచు బంధుయుతముగ
మన్నిగొనక యున్న నేఁటిమాటలు మనకున్. 286

క. నావుడు సాత్యకి యిట్లను
దేవా కుఱఁగటనె వెదకి తెలియగ వచ్చుం
జూవే చోరులఁ జారుల
చే పీటికి దవ్వె వోరు చిక్కుదు రింతన్. 287

ఆ. అనుడు దనుజవైరి యాహుకుఁ బంచిన
నతఁడు చరులఁ బంచె నాక్షణంబ
గజతురంగరథనికాయము లెక్కవే
యగురుదెంచి వార లరసి యరసి. 288

గీ. కలయం దిరిగిరి రైవతకం బనంగ
మఱి లతావేష్ట మన వేణుమంత మనఁగ
ఋక్షవంత మనంగ మహీధరముల
నంతఁ బోక యుద్యానంబులందు జొచ్చి. 289

వ. అరయుచుండి రా సమయంబున సేనాపతి యగున నాదృష్టి వెలువి వెలువి నారాయణున కిట్లనియె. 290

క. ఏ నొకటి విన్నవించెద
దానవకులమథన పెద్దదడవున నుండిఁ
బూని వినిపింపఁ గలపని
యౌనో కాదో విచార మది దెలియఁ దగున్. 291

క. [1]దెస చెడి మైందద్వివిదులు
నసిలోమపులోములును హయగ్రీవుండున్
[2]వసి మాలి సౌంభసాల్వులు
నిసుంభ నరకులును జెడిరి నీ ఖడ్గమునన్. 292

గీ. మఱియుఁ గొందఱు నీచేత మడిసి రందు
మిడి యడఁగఁ జొచ్చి తమసూడు దడవలేరు
పారిజాతంబు దెచ్చుచోఁ బ్రదికి పోయె
నిర్జరాధీశుఁ డొకరుఁడు నిన్నుఁ దాఁకి. 293

శా. నాకుం జూడ మనంబునం గుటిలుఁడై నాకేశుఁ డిట్లాలుఁ దా
నే కొంపోయినవాఁడు వాఁడు దగువాఁడే గౌతమస్త్రీరహ
స్స్వీకారాదులు తచ్చరిత్రములు నాచేఁ గ్రొత్తగా నేల క
ర్ణాకర్ణిక గథలందు మున్ను వినవే నానాప్రకారంబులన్. 294

వ. అనుటయు దనుజవైరి విచారించి నిట్టూర్పు నిగిడించి. 295

క. నాతండ్రీ సురపతిపై
నే తప్పును లేదు మన మనేకవిధములన్
దైతేయవధము చేయుట
యాతని కార్యంబ మనల నతఁడు విడుచునే. 296

వ. అట్లుం గాక. 297

గీ. ఉత్తముండు హితము చేసి యూరకుండు
మధ్యముండు హితము చేసి మాఱు వెదకు
నధముఁ డొరుచేయుహిత మైన నణఁచి పుచ్చు
హితమునకు నెగ్గు చేయువాఁ డెవ్వఁ డగును. 298

క. చేసినమే లెఱుఁగుదు రొరు
గాసింపరు కుచ్చితంపుఁ గఱద లెఱుఁగ ర

1. శస, 2. వసి మాలి.

త్యాసక్త సౌహృదులు [1]స
త్యాసీనులు సురలు వార లపకారకులే. 299

క. ఇప్పుడు నీ పలికిన పలు
కొప్పదు ప్రద్యుమ్నతనయ నొక్కతె వలపుం
ద్రిప్పలఁ బడి కొనిపోయెను
దప్పేం బుంశ్చలికి నేటితగవుం గగవున్. 300

వ. అని చింతించుచున్న మురాంతకునకు నక్రూరుం డిట్లనియె. 301

క. మనపని దనపని దనపని
మనపని గా నడతు మతఁడు మనము నొకఁడు మో
చినమో పిందఱు మోచిన
యనువున నీతోడువడుట యతనికిఁ గీడే. 302

ఉ. ఎట్టికుబుద్ధి యైనఁ దనయిష్టసహాయుని కెగ్గు చేయునే
పట్టెడుచోటు గాల్చుకొను బాలిశుఁడుం గలఁడే సురేశ్వరుం
డట్టె యతండు నిన్ను దనుజాంతకుఁ డంద్రుఁ విరోధమేటికిన్
బుట్టెడు నిద్దఱుం ద్రిదివభూతలరక్షణ మాచరింపఁగన్. 303

క. దేవతలఁ గావ మానుష
భావంబున నవతరించి పని పూనిన యా
దేవాదిదేవుఁడవు నీ
వేవిధమున వారు నీకు నిటు చేయుదురే. 304

వ. అనుటయు నచ్యుతుండు. 305

శా. గంధర్వామరయక్షరాక్షసుల కీ కార్యంబు సిద్ధించునే
[2]బంధక్యాహృతుఁడైనవాఁడు గలఁపం బ్రాద్యుమ్ని దైత్యాధిప
స్కంధావారవిహారిణుల్ గులట లీ చందంబు గావింతు రీ
[3]బంధుభ్రాంతి వెలార్చెన్ మనుమనిం బ్రాగ్వృత్తికిం జేర్చెదన్. 306

1. స, త్యాసికు లగు, 2. బంధవ్యాహృతుఁ, 3. బంధ.

క. అనుటయు నచ్యుతు పదిలపు
మనంబు నిఱికదకు వందిమాగధగణముల్
వినుతించినఁ గై వారము
లనర్గళంబుగఁ జెలంగె నాస్థానములోన్. 307

వ. తదనంతరంబ మున్ను వోయినచారులు, 308

ఆ. కూడి గిరులుఁ దరులుఁ గొల్లంబుఁ బల్లంబు
నరసి మట్టుఁ బుట్ట నడవిఁ దడవి
యోపి తొలలు సెలలు నోలంబుఁ గూలంబుఁ
జూచి క్రంత గ్రుంతఁ జొచ్చి వచ్చి. 309

వ. మధుసూదను సభామందిరద్వారంబున నిలిచి యిట్లనిరి. 310

క. తిరిగితిమి గాలి కైనం
జొరఁ గూడనిచోటు లెల్ల సూర్యమరీచుల్
పరఁగనినెలవుల చూచుట
యరుదె యనిరుద్ధుఁ జూడ నలవడ దయ్యెన్. 311

తే. ఇంక నే దిక్కుఁ దడవుదు మెఱుఁగఁ జెప్పు
మనుచుఁ గన్నీరు దొరుగంగ నవుడు గఱచి
కొనుచు బొమగంటు వెట్టుచుఁ గొంద ఱచట
నొం డుపాయంబు నేరక యున్నయంత. 312

మ. చెలఁగెం దూర్యరవంబు శంఖములు మ్రోసెన్ శౌరిచిత్తంబునం
దళుకొత్తంగఁ బ్రమోద మట్టియెడ నాదైత్యారి యేకార్యమున్
నిలువన్నేరనివాఁడయై మనుమనిం దేఁ బోయెదన్ వార్ధిలో
పల నున్నన్ మును గొంత జూడ యెఱిఁగింపం జాలువాఁ డెవ్వఁడో. 313

వ. అనుచుండె నా సమయంబున. 314

శా. పారావారనగాధి రాజతనయాపాంగేక్షణోదంచిత
శ్రీరాజత్పులకావళీవరతనుప్రీతిప్రకాశాంతరా !
కారుణ్యామృతవర్షిభాషణవిధాకళ్యాణరత్నాకరా !
దూరీభూతతరాంతరాయనివహా దుష్టాత్మశిక్షాపరా ! 315

క. దోషాకర జయభూషా
దూషితనిశ్శేషితారి దురితపరాళీ!
భీషణ ఘోషాఢ్య యశః
పోషణనిత్యాభివృద్ధ పుణ్యసమృద్ధా! 316

మాలిని—

నిగమనివహరంగా! నిత్యమానాంతరంగా!
విగత జననసంగా! వీతభేద ప్రసంగా!
ఖగహిమకరనేత్రా! గౌరనీలాభ్రగాత్రా!
జగదధికృతపాత్రా! సమ్మదోద్యచ్చరిత్రా! 317

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బైన శ్రీ మహాభారతకథానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచన సోమనాథప్రణీతం బైన యుత్తరహరివంశంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు

# ఉత్తరహరివంశము

## షష్ఠాశ్వాసము

శ్రీకలితయోగిహృన్నా
ళీకాంత ర్నిజనివాస లేఖాధిపసం
ధ్యాకాలమూలజపన
స్వాకారోంకారరూప హరిహరనాథా ! 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

చ. తెలతెల వేగునంత నరుదెంచి నభోమణివోలె నారదుం
డలరుమొగంబుతో సభ రయంబునఁ జొచ్చినఁ గంసవైరి య
క్కొలువున మించియు న్మనసు గుందగఁ బీఠము డిగ్గి యమ్మునిం
బలుకుల గోప్రదానమధుపర్కములం బరితృప్తుఁ జేసినన్. 3

చ. అతఁడు సితాంబరావరణ మైలమహామణిపీఠ మెక్కి య
చ్యుతు నిజసింహపీఠగతుఁ జూచి మురాంతక ! యెంత చిన్న వో
యితి మది నెంత వంత గల దీ యదువీరుల నేల చాల ధీ
రతఁ దరలించి చిత్తముల రాఁజెద రన్న మురారి యిట్లనున్. 4

క. మునినాథ చెప్పఁ జిట్టలు
మనయనిరుద్ధుండు నిన్న మగువలు గొలువం
దనయింట రాత్రి నెమ్మది
నునికి గలిగెఁ బిదప నున్న యునికిన యడఁగన్. 5

## నారదుఁడు శ్రీకృష్ణున కనిరుద్ధుని వృత్తాంతము చెప్పుట

ఉ. నావుడు నారదుండు యదునాయకవీరులఁ జూచి యద్భుతా
రావరణంబు చూచితిమి రాత్రి నిజం బనిరుద్ధబాణబా
ణావలిచేత నాదితిసుతాత్మజకై చెలి చిత్రరేఖ సం
భావన నక్కుమారవరుఁ బట్టుట నయ్యుష వాని ముట్టుటన్. 6

క. బలివాసవులును బోలెం
దలపడి రనిరుద్ధబాణదైత్యులు వేచే
తులవాఁడు రెండుచేతుల
చెలువునిచేఁ జిక్కి మాయ చేకొని భీతిన్. 7

చ. తనచతురంగసేనలు శతంబులు వేలును గోట్లునున్ ధరం
బెనఁగొనఁ గూల్చె వీఁడు గడుబెట్టనుచుం బెనుఁబాము కట్టునన్
దనువు మునుంగఁ గట్టె విను దానవసూదన ! యింతభంగ మే
మనుజుఁడు నోర్వఁ డన్నఁ దరమా పరమాత్మజ యాభిలాషికిన్. 8

చ. అని మునిచెప్పిన న్విని మురాంతకు డంతకు భంగి దైత్యుపైఁ
గినిసి ప్రయాణవస్తువులు కింకరకోటికి నప్పగింపఁ బో
యిన నగి నారదుం డసుర యిచ్చటికిం బదునాల్గువేల యో
జనముల నున్న వాఁ డరుగఁ జాలునె మానవలోకయానముల్. 9

క. గరుడనిఁ దలఁపుము పగరం
బొరిగొని కీర్తియును విజయముం గొను మనుడున్
హరి నుబ్బఁ జేసె మునిభూ
సురపుణ్యాహములతోన సుదతుల సేనల్. 10

సీ. తలఁచె నాగాంతకు దానవాంతకుఁ డంత
నతఁడును దోఁచెఁ గెంపారు మేనుఁ
[1]గుంతంబు లన నొప్పుగోళ్ళను భుజములు
రెండురెండులు రెండు రెండ్లు మెఱయ

1, గుంతలంబులు నొప్పుగోళ్ళను,

నన్నివేదంబులు నాఱంగములతోడఁ
జదివి శ్రీవత్సాంకజలజనేత్ర
రుచి మీఱఁగా నూర్ధరోముఁడై సమధిక
కరశాఖుఁడై కెంపు గలుగుపాణి

తే. తలము లమరంగ గొరునిద్దపుఁజెలుంగు
దనర సింహాననుఁ డై తరణికోటి
దీప్తిసుముఖుఁడై యాజానుదీర్ఘ బాహుఁ
డై తరుణసుకుమారుఁ డై హర్ష మెసఁగ. 11

వ. తదనంతరంబ. 12

క. భూతముల కాత్మ యాత్మకు
భూతంబులు దాన యగువిభుం డితఁ డనఁగా
నీతం డష్టవిభూతి
ఖ్యాతి వడసెఁ బ్రీతుఁ డగు ప్రజాపతిచేతన్. 13

గీ. సాధ్యులకు దేవతలకుఁ బ్రజాపతులకు
శాశ్వతుఁ డితం డ యన దివ్యసంయమీంద్ర
సూతమాగధవంధిసంస్తుతులు చెలఁగ
శ్రీవిభుం డాసువర్ణునిఁ జేర వచ్చె. 14

క. దేవుఁడు సాత్యకిఁ గనుఁగొని
నావచ్చినయంతదాఁక నగరమునకు నీ
కావలిసు మ్మని సుతబల
దేవసహాయుఁ డయి వైనతేయుని నెక్కెన్. 15

క. గెలువుము బాణుని వానిఁ
గలవారిని విజయలక్ష్మిఁ గయికొను టరుదే
కలన బదాఱు మొగంబుల
మలయుదు నీ వనుచుఁ జెలఁగె మాగధరవముల్. 16

## గరుడని నెక్కి కృష్ణుండు బలభద్రప్రద్యుమ్నులతో దండయాత్ర వెడలుట

గీ. ఆకసంబున వేంచేయుహరి సిద్ధ
సాధ్యచారణగంధర్వసంయమీంద్ర
వివిధ సంస్తుతుల్ చెవుల పండువులు చేసె
జయజయారావములతోడ సకలదిశల. 17

తోదకవృత్తములు — జయజయ మంగళసంగతరూపా !
జయజయ పావకసంభృతరూపా ?
జయజయ కల్పితసాగరతాపా !
జయజయ ఖండితశంకరచాపా !

జయజయ మస్తకశస్తకలాపా !
జయజయ కౌస్తుభచారుకలాపా !
జయజయ కాళియసారదురూపా !
జయజయ కంసనృశంసహకోపా !

జయజయ ధౌతవిశంకటపాపా !
జయజయ మోహనిశామణిదీపా !
జయజయ పాదలసత్సరిదాపా !
జయజయ విక్రమశానితభూపా ! 18

చ. జయజయ శంకచక్రధర శార్ఙ్గగదాధర శ్రీధరాధరా !
జయజయ భక్తిభావితనిశాచరఖేచరచిత్తగోచరా !
జయజయ కిల్బిషాపనుద శాంతహృదాస్పదచిత్తసమ్మదా !
జయజయ భూతభావన ప్రజాకలితావన లోకపావనా ! 19

మ. జయ నారాయణ పుండరీకనయనా శార్ఙ్గీ జగన్నాయకా !
జయ పీతాంబర భక్తవత్సల విరించస్తోత్రపాత్రక్రియా !
జయ జంభారివిరోధివిక్రమకథాశ్లాఘావిఘాతక్రమా !
జయ గోవింద ముకుంద మందరధరాశౌరీ మురారీ హరీ ! 20

వ. అని యివ్విధంబున దవ్వుదవ్వులనివ్వటిల్లు దివ్యులజయజయాశీర్వచనంబులు దుర్వార సమరగర్వంబు నిర్వహింపం జేయ నజేయవిక్రమధురంధరుం డయిన విశ్వంభరుండు. 21

క. హరితేజము హరికాంతియు
హరివిభవము హరిభయంకరాకృతి హరి వే
గిరము హరివిక్రమంబును
హరి యనుపేరిటికి లక్ష్మి నాపాదింపన్. 22

చ. గరుడనికాంతికిన్ హరి పొగడ్త యొనర్చు నిజప్రభాపరం
పర పరగించురూపము గృపానిధి గైకొని యొప్పె నప్పుడో
నరవరచంద్ర నాఁటి తనంబు మనంబున నాఁటి నేఁటికిన్
బొరిఁ బొరిఁ దృప్తి లేదు ననుఁబోటికి వేఱుతలంపు లేటికిన్. 23

వ. అట్లు దివ్యరూపధరుండై. 24

క. విలు నమ్ము సంకుఁ జక్రముఁ
బలకయుఁ గౌక్షేయకంబుఁ బాశము గదయుం
గల యెనిమిదిచేతుల దాఁ
పల వలపలఁ దాల్చె శౌరి బాణునియనికై. 25

చ. పడగలు వేయి చేసి బలభద్రునికిన్ హరి పాఁపలాగుతో
నొడలును వేయిరూపముల నొప్పఁగ నప్పుడు వైనతేయుపై
విడిసిన వేయిశృంగముల వెండినగంబును నంజనాద్రియుం
దడఁబడఁజేసి రిద్దఱు నుదంచితభానుయుగంబుచాడ్పునన్. 26

శా. ఉద్యద్విక్రమకేళికిం గలన నుద్యోగించువాఁడైన యా
ప్రద్యుమ్నుండు సనత్కుమారతనుఁడై భాసిల్లె నమ్మువ్వురన్
మాద్యల్లీల ధరించి దాఁటెను గరుత్మంతుండు విద్యాధరీ
పద్యావిద్యుదనర్గళానిలదురాపస్వర్గమార్గంబునన్. 27

వ. ఇట్లు పన్నగారి నగారినగరిపొరువుతెరువునం జనునప్పుడు చప్పుడుచేఁ జక్కఁల మొక్కలంబుచే రేకులవీకులచే గగనగంగాభంగంబుల భంగంబులకు

నెలవు లవురవంబుల జవంబుల లవంబులం దెలుప నవ్వినతాతనయుండు తన తమ్ముఁడగుటం దెలుప నిలుపరాక పరాకయిన యనూరుండు రెండురకంబుల నురంబులావునం బగ్గంబు లగ్గలంబులుగాఁ గుదియింప నదియింప కవ్వెరవున సరకుగొనక యణకలు వైచిన పచ్చమావులయొచ్చెమావల సీవలఁ గావలి నడచు మాతరుండు కఠోరవచనంబులాడినఁ బింగళుండంగలార్చిన దండుండు దండించినం జక్కంబడమిఁ దనయెడమిఁ దానడిమిఁ దడిమి నిజంబుగా రవి గారవించి గోచరులగు ఖేచరుల నడిత్రోవం ద్రోవక ననువు చెల్లింపు నిలింపదంపతులనగవులు చలింప నప్పలుఁగుతేనిగఱులనెఱులలో జిక్కిన చుక్కలు లెక్కలు గడవం బొడవుననుండి పడి పొడవడంగి వడివడి జడివడం గడివోయినవీరుల నురలించుసురతరువులశాఖలరేఖ లెఱకలకుం గఱపన (త్రెఱపి)ప్పు దప్పుత్రిపత్రవై చిత్రి చూచి వెఱవున మైమఱపునఁ బఱపనేరక యూరకయున్న యన్నభోగమనుల విమానంబులు చిందఱవందఱ లయి ఘంటలు వెంటలు గొన రాలియుఁ బడగ లెడ గలుగఁ బడలు వడియునుం దల్పంబులు శిల్పంబులం బాసియుం దలుపులు వెలుపలం గెడసియుఁ ఝెంచులయంచులమించులు మంచు లయ్యునం జెదర మఱియుఁ గాకోదరవిదారి యాకసం బెల్ల బెల్లగిల దిశలు దుర్దశంబులుగ నిర్ఝరులు జర్ఝరులుగా మేఘంబులు మోఘంబులుగాఁ గిన్నెరులు గన్నరులుగా భూతంబులు భీతంబులుగా రయంబు గండరువును జయంబు బండరువునునై యరుగునట్టియెడ రేవతీరమణుండు రుక్మిణీరమణునితో నిట్లనియె. 28

సీ. బాలార్కబింబంబు పరఁగించి రేయెండ
మనమీఁదఁ జల్లిన మాయ లేదు
కౌంతంబు మెఱుఁగులు గుప్పించి మెఱుఁగులు
మనమీఁదఁ [1]జిలికిన మహిమ లేదు
హరజటామండలం బసరించి క్రొమ్మించు
మనమీఁదఁ జిమ్మిన మమత లేదు
కమలభవాండంబు గదలించి సలిలంబు
మనమీఁద ముంచిన మహిమ లేదు

1. బొలసిన,

ఆ. పసుపునిగ్గు వోలెఁ బ్రద్యుమ్నునకు నాకు
నీకుఁ జాయ మేన నివ్వటిల్లెఁ
గనకభూధరంబుఁ గదిసినవారమో
కాక వేఱెఱుఁగఁగొ కమలనాభ! 29

చ. అనుఁడు బలంబవైరికి మురాంతకుఁ డిట్లను నిగ్గిరివ్రజం
బనునగరంబు గాచికొని యాహవనీయము మందుముందు న
య్యనలముచాయఁ జూవె మన మందఱము న్వరవర్ణినీఘన
స్తనవరవర్ణినీద్యుతికిఁ దావల మైతిమి ప్రీతి మీఱఁగన్. 30

క. నావుడు నీలాంబరుఁ డ
ద్దేవునితో దీని కెయ్యది యుపాయంబో
నీ వెఱుఁగులేని వేగమ
కావింపుము ప్రతివిధానకరణం బనినన్. 31

మ. వినతానందనుఁ బ్రీతిఁ జూచి పలికె న్విశ్వంభరుం డిప్పు డీ
యనలం బార్పు మనంతర క్రియ నిరాయాసంబునం జేఁత నా
పని యన్నన్ గరుడండు రెండెఱకలన్ భాగీరథీవారిఁ గై
కొని యయ్యాహవనీయ మాఱ గురిసెం గోలాహలోత్పాదియై. 32

క. నరనాథ! యప్పుడు నీలాం
బరుఁడును బీతాంబరుండుఁ బ్రద్యుమ్నుఁడు ము
వ్వురు మూఁడు జగంబులుఁ జా
లరె సాధింప నని నాతలంపునఁ దోఁచెన్. 33

వ. తదనంతరంబ. 34

మ. దహనం బాఱుడుఁ బక్షినాథుఁడు మహోత్సాహోత్థరంహస్తనూ
రుహుఁ డై సాఁగిన నాగిరివ్రజములో రుద్రాజ్ఞఁ దద్రాజధా
ని హితాపాదనులై నయయ్యనుచరాగ్ని శ్రేష్ఠులొం డొండ దు
స్సహరోషావృతచిత్తులై దశదిశాజాజ్వల్యమానాంగులై. 35

వ. తమలోన. 36

ఉ. ఎక్కడివారొకో గరుడుఁ డెక్కుడుగాఁ గలవారు వీరపో
యెక్కుడువారు లోకుల కనేకవిభాకరభీకరాకృతుల్
ముక్కుటమూవు రిక్కడకు బ్రొక్కరులై యరుదెంచి రంచుఁ జే
రుక్కున యాదవత్రయరణోద్భటులై చటులైకవిక్రముల్. 37

వ. పురారియనుచరాగ్నులు పరాక్రమించు సమయంబున. 38

క. దానవుఁ డొకఁడు మనోజవుఁ
డానతి విని బాణుచేత నారణము తెఱం
గేను విన ఎలతుఁ గనుగొను
మా నా కెఱిఁగిం తనుడు సమాలోకించెన్. 39

గీ. మంటజోదుల కలనఁ గల్మాషకుసుమ
దహనతృషితమహాబలతపను లనఁగ
నుద్భటులు స్వధా కారాశ్రయులు మురారి
తోడఁ దలపడి యేగురుఁ దొలఁగి చనిరి. 40

వ. మఱియును.

## కృష్ణుఁడు గిరివ్రజపురరక్షకులగు నగ్నుల గెలుచుట

క. పోరిరి మురారితో రణ
పారంగతు లయి పతంగపటహస్వర్ణాం
గారభ్రాములు స్వాహా
కారాశ్రయు లేవు రనలకాయు లజేయుల్. 42

క. అహతము లయె జ్యోతిష్టో
మహనిర్భాగములు రెండు [1]మంటలు వపుష
స్మహిమ మయి నడవ నడుమను
సహాయుఁ డయి యంగిరుఁ డనుసంయమి నడచెన్. 4?

చ. అదరముపై నుదగ్రుఁ డగునంగిరసుం గని నెమ్మొగంబునన్
దరహసితంబు చెన్నెనఁగ దానవసూదనుఁ డల్ల నిట్లనున్

1. మ టల పురుషుల్

మరలు మునీంద్ర! నీకు వసమా యసమాయుధకేళి గేలికిం
దరమె మదీయసాయకవితానము మానము గోలుపుచ్చదే. 44

మ. అనుడుం గోపము రూపముం బడిసినట్లమ్మౌనిశూలంబు చే
కొని( నారాయణుప్రాణముల్ రణముల్( గోడాడ( జూడన్ జనా
ర్దను( డాశూలము నర్ధచంద్ర విశిఖవ్రాతాహతిం ద్రుంచి య
మ్మునివక్షంబు ముహుర్ముహుః క్షరదసృఙ్ముద్రాతిరౌద్రంబునన్. 45

శా. స్థూణాకల్పనిశాతబాణనిహతిం దూలించి సోలించినం
బ్రాణత్రాణపరాయణుల్ హుతవహుల్ బ్రహ్మాత్మజుల్ నల్వుర
బ్బాణుం దున్నెదకుం గళేబరము( జూపం దెచ్చి రాలోడిత
క్షోణీభాగపరాగధూసరపరిష్కుణాంగ శృంగారమున్. 46

క. [1]అంగిరుడు పెల్లగిల్లిన
సంగరజయ మమర( బాంచజన్యము( బూరిం
చెం గంసవైరి ముందఱ
ప్రింగినశశి నుమియునీలమేఘము పోలెన్. 47

మ భయరసమగ్నులం బ్రథనభగ్నుల దుర్భరదైన్యభుగ్నులన్
నయనవిలగ్నుల న్వివసనాయితనిర్వృతనగ్నులన్ బరా
జయ పరివిగ్నులం బ్రణతిసారవలగ్నుల నగ్నులం బిలే
శయశయనుండు చూచి నడ సాగె గిరివ్రజరాజధానికిన్. 48

మ. బలివిధ్వంసను(డుం బ్రలంబరిపు(డుం బ్రద్యుమ్ను(డున్ శంఖముల్
పెలుచం బట్టిరి పన్నగాంతకగకుత్పేటీస్ఫుటారావముం
గలసెం దచ్చతురర్ణవీరవసపక్షధ్వాన మవ్వేటిలో
పల( గోలాహలదోహలంబయి గతప్రాణుండు బాణుం డనన్. 49

వ. అట్టియెడ మిట్టిపడి గిరివ్రజంబు గజిబిజించిన చందంబున గిరివ్రజంబు గజిబిజి భజించె( దదనంతరంబ దైతేయపతి పదాతివ్రాతం బన్యోన్య సైన్య సన్నాహంబులు దేహంబుల యుల్లాసంబులు రోసంబుల మోసంబుల నోసరింప నిలింపారి పారిషద పరంపరాపరస్పరశంఖనాదంబుల మోదంబులు నలుమ

1. అంగిరసు(డు వెలగిలిన.

డింపఁ జలము డింపక యంపకట్టలు తిట్టలు గొనం బేర్చియు నార్చియు నట్లు పలు గోట్లం గూర్చియు నేర్చియుఁ దరవరుల వెరవరుల కిచ్చియు మెచ్చియుఁ గొంతంబును పంతంబులతోఁ బట్టియుఁ దట్టియు నత్తళంబుల కత్తళంబుల వారిచేఁ బోరించియు సారించియుఁ బరశువులు పరశూరులు కొసంగియు నెసంగియుఁ జక్రంబులు వక్రంబులు వలుకక సవరించియు వివరించియు బల్లెమ్ములు బెల్లెమ్ముల విబువ నమర్చియుఁ జెమర్చియు సెలకట్టియలు సెలికట్టియల నిలిపియుఁ దెలిపియు నడిదంబులు బెడిదంబులుగఁ గదలంచియు ముదలించియు శూలంబుల మేలంబులం జూపియు మోపియు గదలు జోదలు మెచ్చం బాటించియుఁ దాటించియు పలియలు గొనవైచియుఁ ద్రోచియు ముప్పిళ్ళ నప్పిళ్ళ వదలకయుఁ గదలకయుఁ గతారువులు వతారుల కొప్పించియుఁ దప్పించియుఁ బిడియమ్ముల గడియమ్ములం బన్నియు నెన్నియు భేరీభాంకారంబుల దూరంబుల వారించియు వేరించియుఁ జిందంబులందంబులుగా మొరయించియు బెరయించియు గజంబులకు ధ్వజంబు లెత్తించియు జొత్తెంచియు హయంబులకు జయంబు లాశీర్వదించియు మదించియు స్యందనంబులకు వందనంబులు జేసియు డాసియుఁ గాలుబలంబులకు మేలుబలంబు లెక్కించియు నిక్కించియు సవరణల సవరణ లక్షణంబు లక్షంబునం బొడమం గదమ వడని కింకరానీకంబునుం గింకరలోకంబును యక్షరాక్షసదానవగణంబు లై యెయిది గదిసి నడవ నారాయణుం డాఁకె నయ్యవసరంబున. 50

క. ద్విరదంబులు నరదంబులు
హరులు నరులు నిక్కు నుక్కు నలవు న్నెలవుం
బురుడున గరుడున కలుకలు
బెరయ నెరయ శౌరి సీరిఁ బిలుచున్ బెలుచన్.

శా. ధారాస్ఫారకృపాణబాణపటలీధారాహతిం దచ్చతు
ర్ధారీశోణితశోణితద్రవనిపీతప్రీతు లై తన్నుఁ జె
న్నారం బన్నగయక్షరాక్షసు లమర్త్యవ్రాతచేస్స్ఫురత్
స్ఫారస్ఫారవిహారఘోరనటనార్ఘూటస్ఫుటాటోపు లై. 52

క. తమ నలువురరుధిరంబును
సమరంబునఁ గ్రోలు బాణసైనికుల భుజం

గమయక్షరాక్షసులఁ గని
రమారమణుఁ బిలిచి రాముం డనియెన్. 53

క. ఆలంబులోన రక్కస
మేలంబులు గలవె మనల మేనుల రుధిరం
బేలా కోలఁగ నిచ్చెదు
బేలా ! భూతములఁ బఱపు భీతంబులు గాఁగ. 54

వ. అనుటయుఁ బాంచజన్యధరుండుఁ దత్సైన్యంబు దైన్యంబు నొందింపం దలంచి యాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన. 55

మ. అసురారాతిశరాసనారణిజమై యాగ్నేయబాణంబు బా
ణసురారాతిపతాకినీస్ఫురదరణ్యానిం [1]భృతాశాపట
శ్వసనానేకపకర్ణ తాళపవనవ్యాఖ్యాతసంఖ్యంబ యై
భసితాకారత నొందఁ జేసె హలి యుబ్బం బెల్లగిల్లం దిశల్. 56

వ. ఇవ్విధంబున నవ్విధంబునం బిందఱవందఱలై యనీకంబు లనేకంబులు పొదవడంగి నిక్కినభయంబున దక్కిన రయనబునం గలబలంబులు గళవళించి మగిడి నిగిడి నగరంబు చొచ్చిన వెనువెంట నంటం దఱిమి వైనతేయుం దజేయుండయి తోడన చొచ్చె నట్టియెడ. 57

క. నానావిధాయుధంబును
నానావిధసైన్యరవము నానావిధభ
ద్రానేకపఘోటకరథ
సైనికమును నైన ప్రమథసైన్యము దోఁచెన్. 58

చ. పలకలు నొడ్డనంబులును బాసట చేయఁగఁ గత్తిగొంతముల్
బలుసబళంబులు న్వెనుకఁ బన్నిన విండులవారు పైపయిం
దలముగఁ దోఁప వారువపుఁదండము నేనికపిండు దేరుమూఁ
కలుఁ బరిపాటిమై సమరకౌతుకహేతుకమై చెలంగఁగన్. 59

సీ. నిస్సాణముల మ్రోఁత నింగి ముట్టి మురారి
పాంచజన్యముతోడ వాదరింపఁ
గరులతొండములసంగడి నిక్కి తాలాంకు
వలుఁద నాఁగటితోడ వక్కళింపఁ
దురగఖురోద్ధూతధూళి దిక్కులఁ బ్రాఁకి
భుజగారి టెక్కెలఁ బూజ సేయఁ
గరవాలరుచులు భాస్కరకరంబులఁ ద్రోచి
ప్రద్యుమ్నుశరములఁ బంత మడుగఁ

తే. నరదములు గాల్బలంబుల కడ్డ మైనఁ
గ్రింద మీఁదను దెరవులై క్రిక్కిఱియఁగ
దెక్కెములుఁ గొంతములు జల్లెడెలు మలంగఁ
బ్రమథదైతేయసైన్యంబు బయలు మెఱిసె. 60

క. మున్నాకసమున సేనలు
పన్ని హరిశరాగ్ని చేత భస్మిత మగుటం
గన్నారఁ జూచి మఱియును
సన్నాహముతోడ నడిచె సైన్యము ధరణిన్. 61

వ. అట్లున్న సేనలం గనుంగొని నీలాంబరుండు పీతాంబరున కిట్లనియె. 62

ఉ. ఈచతురంగసేనపయి నెక్కుడువేడుక నిక్కె నామదిం
జూచెదవా యొకింతవడి శూరులఁ దేరులతోడి వ్రేసి వే
లాచలవీచు లట్లు కరులన్ హరులన్ గదియించి నుగ్గుగా
వైచెద వైజయంతువిలు వంచెద బాణునిలజ్జ చించెదన్. 63

వ. అనుటయు విశ్వంభరుండు. 64

శా. నా చిత్తంబున నిత్తెఱంగె పొదమెన్ నాగారి మున్నైచనం
బ్రాచీదిఙ్ముఖుఁ డై ననాకుసరసం బ్రద్యుమ్నుఁడు న్నీవు హే
లాచాతుర్యము దాపలన్ వలపలన్ లావై పచారింప థా
త్రీచారంబున మోహరింతము పురారిం జేర లేఁ డిమ్మెయిన్. 65

వ. అనుటయుం బతంగపతి వసుమతికి నవతరించి వసుదేవసుతుని తలంపున కనుగుణంబుగ నడచి కడచి ముంగిలియై జంగిలి వెలుచు గోపాలు పోలికం బ్రతిబింబంబులం గదలించియు నదలించియుఁ గడంగి యీటడంగి తాళఫలంబులు డులుచు పెలుచనం బొదివి పెల్లొదివి హస్తికుల మస్తకంబుల ధర నురలించియుఁ బొరలించియు ముంచి మెయివెంచి మించిన తురగదళంబులం బొలియించియు నరదంబులు చెక్కులు వాయ తెక్కుల విద్రిచియు నద్రిచియుఁ బేరెలమిం దలపడినవీరుల నారెలం జీరి నారులు వోసినట్లు చేసియు మెండుకొనియున్నశుండాలంబుల తొండంబులు వట్టికొని గుండెలు వగులందన్నియుఁ గడిమిఁ గడచన్న పన్నగ యక్షరాక్షసులఁ బెడచేత ద్రేసియు డాసియుఁ బాసియు లాసియు వాసి చెడక కలకలంబులు సేయ పలకలవారి నుంగుటంబుల నింగికిం జిమ్మియు పటపటగా నఖంబుల వ్రచ్చియు విచ్చియు జొచ్చియుఁ బెచ్చు పెరిఁగి వచ్చు బేతాళంబులం బాతాళంబు సొర నడిచియుఁ బిడిచి వైచిన చందంబున మడఁచి త్రోచియు సరసాన బెరసినం గరసాన నొరసిన వెరవు చేసియు గేడించినఁ గూడించి యడంచియుఁ బెల్లగిల్లిన మల్లడి గొలిపియు ననేక ప్రకారంబులం జీకాకు పటిచె నట్టియెడ. 66

శా. ఈషాదండము సీరతుండము ననిన్ హేరాళమై మూఁకలా
ఘోషింపంగ విహంగమాధిపనఖాంకూరంబు ధీరంబుగా
శేషాహిం గొనివచ్చి చొచ్చిరిపులం జెండాట సూచింపఁగా
రోషోద్రేకముఁ జూపుచుండె బలభద్రుం డుల్లసద్రౌద్రుఁడై. 67

ఉ. నాఁగలి సాఁచుచుం దిగుచు నాగరథాశ్వభటావళిం గదన్
జాఁగరగొన్న జక్కులఁ బిశాచిక లాచిఱునుగ్గు [1]లెక్కకై
రేఁగినచోట్లనుం దెలుపు రెండునుమూఁడును నాలుగైదుగాఁ
గొఁగిటఁ గొమ్మలు న్నొగలు గాళులు వ్రేళులఁ బట్టి చూపుచున్. 68

శా. ద్యుమ్నంబు న్నికషంబు వోలెఁ బగలున్ దోఃఖడ్గమున్ రాయఁ బ్రద్యుమ్నుం డాహవకేళి సేయునెడఁ దోడ్తో భూతముల్ ప్రీతితో
నామ్నాయాగత భూతమాంసములు చేయారంగఁ[2] గూర్చున్ వెసన్
నిమ్నోత్తానతలంబు లొక్కమొగిగా నిండా[3]ర బండారముణ్. 69

1. వేఱుచో, 2. మార్చున్, 3. రు—ముల్.

శా. ప్రద్యుమ్న ప్రదరంబు లాబలములం బైపై నివారింపఁగా
విద్యుద్ధామపురస్సరాంబుధర మై విస్ఫారముం బాంచజ
న్యోద్యద్ధ్వానము గర్జితంబులుగ దైత్యుల్ భీతిఁ జక్రాంగచం
చద్యానంబునఁ బెల్లగిల్ల వెలిచెం జక్రాయుధుం డుద్ధతిన్. 70

చ. నలుగురచేత నిత్తెఱఁగున న్నఖిలాంగల సాయకాంబకా
ద్యలఘు మహాయుధ ప్రహత మై దితిజాధిపసేన పాఱినన్
జలజదళాక్షుఁ డొత్తె జలజప్రతిమాన్యము బాహుమధ్యసం
చలదుపగుహనాకలితసాగరకన్యముఁ బాంచజన్యమున్.

శివజ్వరము వచ్చి బలరామునిం దాఁకుట

ఉ. అట్టియెడం గడంగి ప్రమథాధిపుపంపున సీరపాణికిం
గట్టెదు రన్మహాజ్వరము గాళ్లు శిరంబులు మూఁడు మూఁడుగా
ముట్టినతేవ నిక్కముగ మూఁపులు మూఁడయి వచ్చి తాఁకి ము
చ్చుట్టును బాఱి యార్చె నతిశూరతమై భసితాయుధస్థితిన్. 72

చ. తఱిమి సహస్రమేఘములు దాఁకి పరాక్రమకేళి చూపఁ బై
నుఱిమిన భంగినార్చి విను మోరి హలాయుధ! బుద్ధిహీన యిట్లెటేఁగి
యెఱింగి నన్నుఁ గినియించితి ప్రాణముతోడ నింక నె
త్తెఱఁగునఁ బోయె దీమదము ద్రెవ్వఁగఁ జెక్కుదు మేను నొక్కుదున్. 73

క. గదరాజ నేను నీవును
గదరాజవు నిలువు నిలువు కాని మ్మనుచుం
బొదు లైన బాణవృష్టుల
గదుని మనంబునకు వెఱపు గఱపుచు నడచెన్. 74

మ. బలభద్రుండు వేయి మండలము లొప్పం గ్రమ్మఱన్వేగముం
బలముం గాంచి మహాజ్వరం బెదమచే భస్మంబు మంత్రించి పైఁ
జిలికింపంగ నొకింత సోఁకెను రమాశేషంబు బంగారు గు
బ్బలియం దొక్కెడఁ జిందినం దరికొనెన్ భస్మావశేషంబుగాన్. 75

వ. ఇవ్విధంబున నమ్మేరునగరంబున దొక్కమోరు నీ అగుటయుం దద
నంతరంబ. 76

క. బలదేవుమేను సోఁకిన
వెలిమిడిచే వేఁకి సలిచి విటతాటముగా
నిలుగుటతో ములుగుటతో
నలమటతో నావులింత లంతంతకుఁ గాన్ 77

క. జడనుం దాపము నిద్రయు
నిడువెంద్రుకతోడ నెగయు నిట్టూర్పులు సం
దడి గొని వడి గొని మదిలోఁ
జిడిముడి పడి కన్నుఁగవయుఁ జిడిముడి వడఁగాన్. 78

వ. తదవసరంబున గదుండు సగదుండయి గదాధరున కిట్లనియె. 79

క. ఓ కృష్ణ! కృష్ణ! చిక్కితిఁ
జేకొను మభయంబు నాకుఁ జేయుము నాతం
డ్రీ! కాలఁ దొడఁగె నొడ లిదె
లోకాధిప! నీకృపాబ్ధిలో ముంపఁ గదే. 80

క. నావుడుఁ గదురయమున వసు
దేవతనూభవుఁడు రేవతీరమణుని సం
భావనఁ గౌఁగిటఁ జేర్చిన
నావిర్భూతజ్వరాపహరణం బయ్యెన్. 81

వ. ఇవ్విధంబున 82

శా. రాకాచంద్రికఁ దేల్చినట్లు, ఘనసారంబుం బయిం గూర్చిన
ట్లాకాశాపగనీర వ్రాల్చినటు, లాత్మానంద యోగామృతం
బేకాంతస్థితిఁ గ్రోల్చినట్లు హరిచే నింపారు నాలింగన
స్వీకారంబున శీతలాంగధరుఁడై సీరాయుధుం డుండఁగన్. 83

క. ఉభయగద మధ్యమునఁ గై
టభమర్దనుఁ డుండి యచ్చటన్ రణమునకై
యభిముఖునిఁ జేసె నొక్కని
విభు నొక్కనిఁ జేరి వింత వేడుక చూపన్. 84

గీ. బాహు వెత్తి చటిల్లనఁ బరిఢవించి
దేవదేవుఁడు పలుకు నత్తెవులుతేనిఁ
దఱిమి నీ శక్తి యెంత యంతయును నేఁడు
నెఱపుమీ యని గర్వంబు నింగి ముట్ట. 85

క. ఆ మాటలు విని రోగ
గ్రామణి గోపించి కుడికరంబుల రెంటన్
దామోదరు నురముపయిన్
వేమఱు మిడుఁగుఱులతోడి వెలిమిడి చల్లెన్. 86

వ. ఇట్లు చల్లుటయును. 87

ఉ. మంజ్వభిరామజైత్రమగు మాధవు గాత్రము దైన్యపాత్రమై
సంజ్వర మొందఁగన్ ధర వెసం దనచేతులు మూఁడు నెత్తి వ్రే
సెం జ్వరుఁ దంతఁ బోక తులసీవనమాలిక పచ్చగంద మం
టం జ్వలనంబు రాఁబిడికిటం బొడిచెం దదురః కవాటమున్. 88

వ. ఇట్లు వ్రేటునుం బోటునుం జూపి మఱియును. 89

చ. అదరులు వాఱ నూఁదికొని హస్తయుగంబునఁ గంసవైరిఁ గ
ట్టెదురు నురంబు వ్రేసి పెరయాఁగగతిం గఱచె న్మురాంతకుం
డది చిఱునవ్వునం దెగడి యానముం జదియంగ మోఁదినన్
బెదరక వ్రేటుపాటు నెడపెట్టి గదంబు మదంబు చూపఁగన్. 90

శా. దైతేయారి ఘనంబు గర్జిలి భుజాదండాహతిం జూపి య
త్యాతంకం బగురౌద్రతాపమును మూర్ధాధిక్యతన్ ముష్టిని
రాత్ష వ్రాతము వైచినొంచె[1]నిటు ప్రారంభించె ఘోరాభిసం
పాతం బష్టభుజ త్రిబాహుల కపూర్వస్తోత్ర పాత్రంబుగన్. 91

గీ. పురుషసింహంబు లిమ్మెయిఁ బోరి ముష్టి
ఘట్టనంబుల నదలించు దట్టనలకు

1. నటనప్రారంభంఘొ రాభిసం. ప్రాతంబైన భుజత్రిబాహుల.

వెక్కసంబుగ నిర్జరుల్ వెఱచి యింత
వలదు వల దంచు నించుకవడిఁ దలంక. 92

క. సరి సరి ముహూర్త మాత్రం
బరితో హరి పెనఁగి చంప ననువు గని భుజా
పరిఘముల నొక్కెఁ గనకా
భరణంబులతోడ వానిబరులు న్నొగులన్. 93

తే. జ్వరుఁడు మృతుఁ డయ్యె నని భుజావలయమున ని
మీలితాక్షుఁ డై యున్న యమ్మేటిమగని
నెత్తి యల్లంత వైచిన నెగసి వచ్చి
లోకనాథుని హృదయంబులోను చొచ్చె. 94

వ. అట్టియెడ ముకుందుండు. 95

క. గడ గడ వడఁకెడు మేన
న్నిడువెండ్రుక వెట్ట నెదుర చలింపన్
మెడ మడఁచు నావలించుం
దడఁబడుఁ బడఁబోవు నిలుచు ధరఁ గూర్చుండున్. 96

వ. అట్లు గూర్చుండి. 97

కృష్ణుఁడు తన్నుఁ దాఁకిన శివజ్వరముపై విష్ణుజ్వరమును బనుచుట

మ. తనలోఁ జొచ్చిన శాంకరజ్వరముపై దండెత్తఁ గల్పించె న
ద్దనుజారాతి ప్రతిజ్వరంబు నది యాత్మస్వామి డెందంబులోఁ
గని హస్తాంఘ్రి శిరస్త్రయాన్వితుని నాకర్షించి హర్షించెఁ గే
లును మస్తంబులుఁ గాళులుం దనకు నాల్గున్నాల్గు నాల్గుం దగన్. 98

వ. ఇట్లు వైష్ణవజ్వరంబు నిజతేజః ప్రభావంబున శాంకరజ్వరంబుం బుండరీకాక్షు డెందంబున నుండనీక వెలికి వెడలించి. 99

శా. సాహాయ్యం బఖిలాయుధంబులు నిజస్వామి ప్రభావంబునన్
బాహాదండములందుఁ జేయఁ గలిగెన్ బ్రత్యర్థికిన్ భస్మస

న్నాహం బాయుధహీనతం దెలుప విన్నాణంబు గ్రైకోలుగా
నూహింపం గదిసెన్ హరిజ్వరముపై నుగ్రజ్వరం బుద్ధతిన్. 100

గీ. అటు గదిసి మూఁడు చేతుల నడిచి మగుడ
నతఁడు వ్రేసిన వాపోవు నవసరమున
మదనరిపుఁబంటు మందులమారి మఱియు
విష్ణుకింకరు వెజ్జును వీఁపు గఱచె. 101

శా. వ్రేటుంబోటును గాటు నిత్తెఱఁగునన్ వేమారు సైరించి వీ
రాటోపంబున వైష్ణవామయ విభుం డాకోపతాపాధిపుం
ద్రాటం బెబ్బులిఁ గట్టిన ట్లొకట దోర్దండద్వయిం జుట్టి మో
మోటం బించుకలేక తక్కిన భుజాయుగ్మంబునన్ వ్రేయుచున్. 102

క. రాఁ దిగుచు నెగుచు నగుచుం
బోఁ దట్టుం బట్టుఁ దిట్టుఁ బొరిఁ బొరి రోఁదున్
మోఁదు మెడ ద్రొక్కు నెక్కును
మీఁదికి నెగయించు వంచు మెయి సారించున్. 103

గీ. ఎంత చేసిన నంతంత కెక్కుడయిన
బలముఁ జలమును జూప శాంభవరుజావ
రుండు రుక్మిణీవరు జ్వర [1]రోగరాజు
భుజము లుద్ధతిఁ బుతపుతఁ బోవఁ గఱచి. 104

వ. విడిపించుకొని మగుడం దలపడి కేశవరుగ్వల్లభునకు. 105

క. తలఁ దలతోఁ దాఁకించినఁ
దలమీఁదుం గాలు గాలఁ దాఁకించిన మి
క్కిలి కాలు గలుగుఁ జేతులఁ
గులికినఁ దనచేయి మీఁ దగున్ వ్రేటునకున్. 106

ఉ. హత్తినచోట నేదుదలతో[2]నలువాయిఁ బెనంగ వ్రేయుచో
నెత్తినఁ జేతులేదును బయిం మెదగానఁగ వచ్చు మెచ్చుగా

1. రోగరాజ, భుజగభుజములు పురపురఁ బోవఁ గఱచి. 2. ననువాయి.

నుత్తర[1]దోఃకరంబు సరి నొత్తినఁ గాళులు నేడు దోఁచు నే
క్రొత్తరణంబులుం దలఁపఁగూడవు వేఁకులరాచ పోరిలోన్. 107

వ. ఇవ్విధంబునం గ్రొవ్వున నివ్వటిల్ల డిల్లంబులు గాక మల్లయుద్ధంబు సిద్ధంబుగాఁ దొడంగిన గడంగిన మహాజ్వరంబులు జ్వలన జ్వాలాకలాపంబులు రూపంబులు గై కొన్న విన్ననవునఁ గన్నునువు చూప అగ్గింప నెగ్గించియుఁ బోరు నెడ నారాయణజ్వరంబు గరంబు గినిసి కవిసిన పరువంబు గరువంబున నుండ నీక ఖండపరశుజ్వరంబుబట్టి మెట్టుకొని పదంబున మదంబునఁ దాఁచియు ద్రోచియు మడమల వెడమలంచియు నలంచియుఁ బిక్కల మొక్కలంబునఁ జప్పరించియు నుప్పరించియు జానువు నానువున నదిమియుఁ గదిమియుఁ దొడల నొడ లరికట్టియుఁ బుట్టియుఁ జేతుల వాతు లడిచియు విడిచియు మనికట్ల విఱిచియుఁ జఱిచియుఁ గొప్పరంబుల దెప్పరంబుల దెలిపియు సిలిపియు సందుల బొందులఁ గలయ నొత్తియు హత్తియుఁ గారించియు సారించియుఁ దూలించియు సోలించియు లయ్యదుకుంజరుని సన్నిధికిం దెచ్చి పెచ్చు పెరిఁగి మెచ్చింపం దలంచి యిట్లనియె. 108

క. విఱుతునొ మ్రింగుదునో తల
దఱుగుదునో యేను జ్వరుఁడ దాసున్ జ్వరుఁ డా
కఱకంఠు నేయ వి ల్లగు
చెఱకుం జెఱ కైన వంటచెఱకుం జెఱకే. 109

వ. అనుచుఁ గేశవజ్వరంబు సింహనాదంబుఁజేసి విజృంభించిన. 110

మ. పరసేనావనదావపావకుఁడు సంబద్ధాధికక్రోధుఁ డు
త్కరవాతోద్ధురభూషణుండు విలసత్కాలాంతకాకారుఁ డ
య్యురగారాతిపతాకుఁ డుజ్జ్వలజవాత్యుగ్రుండు మాహేశ్వర
జ్వరముం బట్టి వధింపఁ జూడ సుమనస్సంభావనా ప్రాప్తయై. 111

చ. ఒక యశరీరి యిట్లను "మహోదయమూర్తి ! మురారి ! దేవదే
వ ! కుటిల దైత్యదానవ నివారణ కారత ! శాంభవజ్వరం

1. దొక్కరంబు.

బకట వినాశ మందఁ దగునయ్య తగం బ్రతిపాలనంబుచే
వికలముగాకయుండ యదువీరవరాగ్రణి కావునావుడున్. 112

శా. సంతోషించి మురాంతకుండు విడువన్ శంభుజ్వరం బప్పు డా
పంతం బ్రతిగణ్యరూప మగుచుం బాదప్రణామక్రియా
త్యంతం బయినసపర్య శ్రీవిభునిఁగా నాత్మం దలం పొందఁగా
శాంతిం బొంది నుతిప్రకార విలసత్సాంద్రోక్తి సంభావనన్. 113

వ. ఇట్లు స్తుతియించె. 114

శా. "కృష్ణాంగాయ నమో నమో మురభిదే కేశిప్రహర్త్రే నమో
నిష్ణాతాయ నమో నమో బలిజితే[1] నిస్వాపభర్త్రే నమః
కృష్ణేష్టాయ నమో నమో మధుభిదే క్లేశానుశాస్త్రే నమో
ధృష్టోక్తాయ నమో" యనంగ శుభముల్ దీపించు మాకెప్పుడున్. 115

మత్తకోకిల ఈశ్వరాయ మహాత్మనే దనుజేశపంక వివస్వతే
శాశ్వతాయ ధరాధృతేంబుజ చక్ర శార్ఙ్గగదాధరా
యాశ్వమేధఫలైక సంస్తుతి హారివాఙ్మని రక్షిణే
విశ్వరక్షణ హేతవే ప్రభవిష్ణవేఽస్తు నమో యనున్. 116

మ. సురమర్త్యోరగ విష్టపత్రితయ సంక్షోభంబు గావించుచున్
విరసాధిక్య విశేషపోషణమిళద్వీరప్రలాపంబులన్
సరి లే రంచుఁ జెలంగు దైత్యవిభునిన్ స్తంభంబులోఁ బుట్టి శ్రీ
నరసింహాకృతితో వధించిన నిను న్సంభావనన్ మ్రొక్కెదన్. 117

సీ. తాటకాజీవన స్థైర్యంబు శరభాను
సంచయ ప్రభలకుఁ జవులు చూపి
ఖరదూషణానీక వరపత్త్రి నివహంబు
నాళుగ పజ్క్తిఁ జీకాకు పఱచి
రాజత్తరకబంధ రాక్షసు జంఘాల
పత్త్రి సంఘంబుల పాలు చేసి

1. నిష్పావపాత్రే.

పౌలస్త్యవర శిరః పద్మ సందోహంబుఁ
దనశిలీముఖములఁ దవులఁ జేసి

ఆ. రాఘవత్వమందు రణసరోలీలలఁ
గ్రాలు చున్న నిన్నుఁ గన్నులార
జూడఁ గంటి జన్మ సుఖమెల్లఁ బొడగంటి
ముదముతోడఁ జేరి మ్రొక్కఁగంటి. 118

వ. అనుచు బహుప్రకారంబుల వినుతించి సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి శాంకర
జ్వరంబు నారాయణున కిట్లనియె. 119

క. దనుజాధీశ వినాశన
వనజాక్ష భవజ్జ్వరంబు వారించి మహి
న్ననుఁ గరుణతోడఁ జూడుము
వినుతించి నమస్కరింతు వీరవరేణ్యా ! 120

ఆ. అనుఁడు గైటభారి యతితుష్టహృదయుఁడై
యట్ల కాక మజ్జ్వరాధివిభుఁడు
నిదె యడంగు మీర లిద్దఱు లోకంబుఁ
బీడ సేయఁ జంపఁ బెంపు గలిగి. 121

క. నీవు మదీయ జ్వరమును
ద్యావాపృథివీ ప్రసిద్ధతా వైభవనా
నావిధచరిత్రములతో
నీవసుధం బరఁగుఁ దనుదు నెంతయు నెమ్మిన్. 122

వ. శాంకరజ్వరంబు జనార్దనున కిట్లనియె 123

మత్తకోకిల. నేను దైత్యనిషూదనుం డగు నీలకంఠకృతుండనై
యేనయంబును లేక మర్త్యుల యేపు మాపి చరించి దు
ర్మానినై పిదపన్ భవజ్జ్వర రాజనిర్మథనస్ఫుర
త్తానవవ్యథ నొంది కింకరదైన్య మొందితి నావుడున్. 124

క. హరియును ముదమున గిరిశ
జ్వరరచిత మదీయ వినుతి వచన వ్రజమున్
నరుఁడు పఠించినఁ దలఁచిన
జ్వరరహితుం డనుడు జ్వరుఁడు సంతస మొదవన్. 125

వ. నారాయణునకుఁ బునః ప్రణామం బాచరించి సంగరంబు వెడలెఁ దద
నంతరంబ సంరంభవిజృంభితుం డై పీతాంబరుండు నీలాంబర ప్రద్యుమ్ను
లిరుదెసల బలసి నడువ నసురబలంబుఁ గదిసిన. 126

## కృష్ణ ప్రద్యుమ్నబలభద్రులు రాక్షసవీరులతోఁ బోరుట

మ. గరుడస్యందను లైనమూవురకు రక్షఃక్రూరసైన్యంబుతో
సురసంఘావృతజంభశాత్రవసభాశోభాధ్యరంభాంగనా
వరముఖ్యామరభీరుభాసురమనోవైదగ్ధ్యరోధోత్సుకో
ద్ధురతాలాలితయోధవిక్రమమిళద్యుద్ధంబు సిద్ధించినన్. 127

క. కరులును హరులును దేరులు
నరులు దెరలఁ బోర శౌరి నలఁచుం గలఁచుం
గరములు నురములు శిరములు
సరములుగాఁ గ్రుచ్చు మెచ్చు జరగుం బరఁగున్. 128

వ. ఇట్లు బడబానలకీలాకలావసదృశంబు లగుశరంబులం బరబలంబులం
బలుపితత్సైన్యంబు దైన్యంబు నొందించి సింధుకన్యాధవుండు పాంచజన్యం
బొత్తెరోహిణీనందనుండు సనందనుండై శంఖంబు పూరించె నప్పుడు రమా
వల్లభ భల్లప్రహతంబు లై డొల్లుభటులతలలు తాలఫలంబులం బోలం దదు
పరినృత్యమాకంకగృధ్రపర్ణంబులు పర్ణపుటంబుల ననుకరింప మధుమథనప్రదర
దళితంబు లగుమకుటమాణిక్యంబులు మెఱుంగులగములు నిజజయలక్ష్మీ
నీరాజన దీప ప్రభారాజులుగాఁ దదనురూపంబు లయి ధరం దొరుగు సితాత
పత్రంబులు రజతభాజనంబులుగాఁ బీతాంబరాంబక భీతనిశ్వసత్కరికరశీక
రాసారంబు గగనమందాకినీబిందుసందోహంబులం దనకు శిశిరోపచారంబులు
చేసినచందంబుఁ దెగడఁ దదుచితంబు లయి మీఁదికి నెగయుకుంభికుంభ
ముక్తాఫలంబులుసురముక్తాసుమనోవర్ష శోభాకర్షణంబుచేయ నన్యోన్యబాణ ఘట్టనం

నెగసి మింట నంటుమంటలు సురనారీవీరకరగ్రహోమంబు విడంబింప నివ్విధం
బునం బ్రథనకుశలుండై సమంగళుం డైనయనంగజనకుం జూచి మనంబున మెచ్చి
పెచ్చు పెరఁగి బలభద్రుండు రౌద్రాకారుండై సహోదరసహాయుండై లాంగ
లంబున మతంగజంబులం బడఁదిగిచి సూతరథ్య సహితంబుగా రథంబులు
చదిసినఁ గదిసినకడంకతోఁ బ్రథనప్రవీణరథికులు పలుగాఁడి బ్రద్దసందుల దిగ
నుఱికి చింత విడిచి పంతంబులు కలిగివతారి తనంబునం గఠారువు వెఱికికొని
యెదిర్చినం జూచి కసిమసంగి ముసలంబునం గైదువులు విఱుగ
వ్రేసినం దునకలు దమయంగంబులు నాటిన సొలసి తెలిసి విబుధవధూటీకర
గ్రహణనిషేధక్రోధంబున దనకట్టెదుర నిలిచిన సురనగరంబున కరుగంజేసి
తత్పర్యంతయుధ్యమానహయారోహకులు తనపైఁ దఱిమి యుఱిమిన నీసున
వ్రేసి గాసిలం జేసి మొదలం దనచేత దెగినస్యంద నారోహకులకు విందులు
సందడించునట్లుగా మ్రందించి చిందఱవందఱ చేసి సానందుం డయినకందర్పపాలుం
జూచి యతనికి బాసటయై ప్రద్యుమ్నుండు చాపంబు గుదుసుపడం దిగిచి పరివే
షాభిమండలచండఖద్యోతద్యోతమానస ముద్యద్దేహుండై కాలాంతకునకు వింత
యగుపంతంబు గఱపువాఁడునుంబోలెఁ బురదహనంబు నాఁటి రుద్రునకు భద్ర
రౌద్రంబు నేర్పరింప నేర్పుగలిగి కౌశికజాజ్వల్యమానజ్వాలామయూఖరేఖా నర్గళ
ప్రేంఖళనభాసురుం గయి యసురబలంబునకుం జలంబునం బ్రదరంబుల దరం
బులు పుట్టించియుఁ గరంబులు దట్టించియు రూపు మాపియు నేపుఁ జూపియుఁ
గరంబులు ఖండించియు శిరంబులు తుండించియు గజంబులం బఱపియు ధ్వజంబులం
జెఱపియు సంభ్రమంబున విజృంభించునవసరంబున. 129

సీ. యంత్రకుఁ డాడించి యవనిఁ ద్రోచినవ్రాలు
బొమ్మలగతి రథపూగములును
నిర్ఘాతహతిచేత నెఱ దప్పి కూలిన
కుధరాళిచాడ్పునఁ గుంజరములు
సెలయేటిరయమున నిలమీఁదబడ్డ గం
డశిలలభంగి ఘోటవ్రజంబు

[1]ధాతృశిల్పాగారపాతభిన్నాంగు లై
పడియున్న రూపులపగిది భటులు

తే. వికటముగఁ ద్రెళ్ళ నొరగెను విచ్చి పఱచెఁ
దొరిగెఁ బృథ్వీతలంబున దునుక లయ్యెఁ
జండశార్ఙ్గశరాసనశాతవిశిఖ
జాలముల నేయఁ జలమునఁ జక్రధరుఁడు. 130

ఉ. లోఁగక సంగరస్థలములోనఁ బరాక్రమకేళి చూపుచున్
మూఁగినదైత్యదానవుల మొక్కలు ముక్కలుగఁ జక్కు చేసి తా
నీఁగలతిండిగాఁ జదిపె నేపున నచ్యుతపూర్వజుండు పై
నాఁగలిసాఁచి రాఁదిగిచి నాగరథాశ్వపదాతిసంహతిన్. 131

శా. ప్రద్యుమ్నుండు పయోధినిమ్నుఁడు మహారావంబు సంధిల్లగా
నుద్యద్బాణపరంపరానవరతోద్ద్యోతాతివర్షంబుచే
విద్యుత్ప్రత్రపతిమానమూర్తియగుచున్ వీరాద్రులం గప్పఁగా
నుద్యోగింతురు దివ్యకాంతలు వివాహోత్సాహసంభావనన్. 132

శా. కాష్ఠాలిన్ శిఖి ముట్టికొన్నకరణిం గాముండు బాహాస్ఫుర
న్నైష్ఠుర్యాతిశయంబునం బరబలౌన్నత్యం బనిత్యంబుగా
శ్రేష్ఠాస్త్రంబుల నేసి వారల సురస్త్రీరత్న కామ్యోత్సుకా
గోష్ఠీతత్పరతాసమంచితులఁ గాఁ గోపించియేసెన్ వెసన్. 133

వ. మఱియు ననేకసాయకంబులు పరఁగించిన నసురసేన చెనకం జాలక మొనలకుం దలంగియు గలంగియు నరదంబులతో దాఁగియుం దూఁగియు ద్విరదంబులలోఁ జిక్కియుం జొక్కియుఁ దెరువునఁ బోవెఱచియుం బఱచియుం దరువులలోఁ దూఱియు బాఱియుఁ బోటువడి పొరలియుం గెరలియు వాటువడి తెరలియు మరలియు బహుప్రకారంబులం బఱవం దొడంగె నయ్యవసరంబున. 134

మహాస్రగ్ధర. శతసాహస్రాశ్వపంక్తుల్ సమయఁగ దశలక్షల్ భటుల్ ద్రెళ్ళదేరుల్
క్షితిఁ గూలం గోటసంఖ్యల్ గెడయఁ గరివరాశీతిసాహస్రసంఖ్యల్

1. ధాతుశిలాగార.

హతశేషానీక మాజిన్ వ్యథఁ బడముసలాద్యాయుధంబుల్ ధరన్ వై
చి తొలంగం బాఱఁ బోరం జిడిముడి నడుచుం జిక్కుచుం బాఱుచుండన్. 135

వ. బాణుండు వారలతో నిట్లనియె. 136

ఉ. మానితమాన[1] ధైర్యకులమందిరసుందరకీర్తివిస్ఫుర
ద్దానవవంశజాతు[2]లరు దారుణశాతమహాస్త్రసంహతిన్
స్థానముఁ గీర్తియుం గిరిశసంగతియుం బెడఁబాసి పోదురే
మానముకంటెఁ బ్రాణములు మంచివియే తలఁపంగ నక్కటా! 137

సీ. అనిమొనఁ బావకు నైన నాహుతి చేయఁ
దివిరెడుమదిశోనిధీరగుణము
తమలావుకొలఁదులు దా రెఱుంగర యంచు
జను లెల్ల మిముఁ జేయుసంస్తవంబు
మిన్ను పయిఁ బడినను మెలుపుతో నఱచేతు
లొగ్గఁ జాలుటకు నై యోర్పులావు
మానిసిగందంబు మాఱు వల్చె నటంచు
నాజిలో వైరులఁ నడఁచులావు

ఆ. పాఱ విడిచి మీఁకు బాఱంగ నగునయ్యె
వితతశౌర్యులార! వీరులార!
సతతనిశితశస్త్రసందోహధరులార!
దళితవిమతులార! దనుజులార! 138

సీ. వేలుపుజడదారి విం దారగించుచో
నానందబాష్పంబు లడ్డపడును
రక్తనిమ్నగ ననురాగంబు సంధిల్ల
నుబ్బి భూతావళు లోలలాడు
నిర్జరకామినీనిలయాంగణంబులఁ
బచ్చతోరణములు పరఁగుచుండు

1. దైత్య. 2. లయి.

స్యందనకుంజరహయభటవ్రజములు
తునక లైధరమీఁదఁదొరుగుచుండు

ఆ. మొదల మీరు గెల్చుకదనంబులం దెల్ల
నిత్తెఱంగులావు రిత్తవుచ్చి
తిరుగఁ దగునె మీకు ధీరతఁ బెడఁబాసి
వినుతశౌర్యులారా, [1]దనుజులార! 139

సీ. సంగరం బనిన నుత్సవము కేఁగినక్రియ
సొలవక చనియెడిశూరులార!
శంకరుఁ డెప్పుడు సంభావనలుచేయ
నుల్లసిల్లుచు నుండు యోధులార!
గాత్రఖండములు దరిత్రిపైఁ దొరుగంగ
శత్రుల గెలిచెడి జైత్రులార!
[2]సమితిలో సేనానిశౌర్యంబు మెచ్చక
మిన్నక తిరిగెడి మేటులార

ఆ. ప్రకటులార మాన్యబలులార విశ్రుత
విక్రమప్రభావవితతులార!
ప్రమథులార! దైత్యపతులార మీకును!
బాఱు టర్హమయ్యె బవరమందు. 140

వ. అట్లుంగాక. 141

క ఏ నుండఁగ నీలోపల
మానవుల జయించు టెంత మానము మీకున్
మానుఁడు పలాయనక్రియ
దానవవరులార యననఁ దదనీకంబున్. 142

చ. విడువక పాఱి పారిషదవీరులుఁ గొందఱు యాతుధానులుం
దడఁబడుచిత్తముల్ రయము దక్కినబీరము వియ్యమందఁగాఁ

1. వీరులార. 2. శివగణసమితి....మెచ్చకతిరిగెడి.

జిడిముడిపాటుపాదములఁ జెందఁగ మోములదైన్య మొందఁగా,
జెడియును [1]జెడ్క_కయ్యమునఁ జేరఁగఁ జిత్తము నిల్ప రయ్యెడన్. 143

వ. కుంభాండుం డారూఢస్యందనుండై బలంబులతో నిట్లనియె. 144

ఉ. బాణుఁడు వీఁడె మాంత్రయుతబాణుఁడు దానవశూరసైనిక
త్రాణుఁడు శంకరస్తుతిపరాయణుఁ డుజ్జ్వలరోషదీప్తదృ
క్కోణుఁడు సంగరస్ఫురితకోపవరాబ్ధఘటావళీజగ
త్ప్రాణుఁడు యుద్ధవిశ్రుతపరాక్రమరౌద్రరసప్రమాణుఁడున్. 145

క. గిరితనయాధిపషాణ్మా
తురముఖ్యబలంబు లివి యె[2]దుర్కొ_న్నవి కె
తురజోవిసరాంతర్హిత
హరిదశ్వసురాయనంబు లై క్రొవ్వలరన్. 146

వ. మీరింక సాధ్వసగ్రస్తులైన నగునె ధీరమనస్కు లై సమరంబునకు సమరం దనునవసరంబున సర్వజ్ఞుం డఖర్వసమర గర్వపర్వతారోహణ నిర్వక్రపర్వనిర్వాహక నిర్వేదనపారిషదవీరపరివృతుండును నమందానంద కందళితవంధారుబృందారక బృంధసందోహసందీయమానమానసుండును సమరజయజయారావమనోహరుండును రణశ్రమనివారణకారణశ్వేతాతపత్త్రియ మాణశర్వరీనాథశంకాసముత్పాదిజటాజూట తటతటినీ తామరసనురభిసరస వాత్యావిహాయ స్సముత్థిత పరాగవిస్తార ప్రభావిభాసితుండును నందీశసందా వితస్యందన వందనమాలికాసందేహ సర్వతః ప్రసర్యమాణ త్రిశూల విశాల మరీచిద్విగుణితతరణికిరణుండును వితత భుజబలయుత సకల గణభటసముదయవిలసదసిరుచిరరుచివిరాజితమయూర రాజ విచిత్ర గతిచాతురీచతురసమ్మద నేనానీసైన్యసేవ్యమానుండును నై జనార్దనుం ధాఁకి నిలునిలుమని యదల్చి మఱియును. 147

## శివకేశవులయుద్ధము

శా. చతురంభోనిధిమేఖలావలయభూచక్రంబు గంపింపఁగా
శితికంఠుండు విశేషరోషవిలసత్సింహారవోద్యుక్తుఁడై

1. జెడ్డకయ్యమును జేయఁగ. 2. దూరోన్నతకే.

శతనారాచము లేసినన్ హరియుఁ బర్జన్యాస్త్ర మేసె న్వేసన్
శతరూపం బయి తచ్ఛరంబు శివునిన్ సైన్యంబులం గప్పఁగన్. 148

గీ. అట్లు పొదివినఁ గుపితుఁడై యంధకారి
యగ్నిదైవత్యశరమున నసురవైరి
నేసె నేసిన నాయస్త్ర మెల్లకడల
మంట మొత్తంబుతో దివి మాఱు మలసె. 149

శా. ఆయస్త్రం బతిఘోరమై పొదువ దైత్యారాతియున్ రాముఁడున్
మాయావల్లభుఁడుం బత్రివిభుఁడు న్నాకీశభాగమ్యులై
ఛాయాహీనత నొంది రగ్నివిశిఖాజాజ్వల్యమానాంగులై
పోయెం బో యదువంశ మంచుఁ[1] గలఁగన్ భూతావలుల్ భీతితోన్. 150

గీ. అట్లవస్థాంతరప్రాప్తు లైనవారిఁ
జేరి దనుజులు చేసిరి సింహనాద
మగ్ని బాణశిఖావృతుం డైనవానిఁ
బోలిసె నని యెంచి మాధవుఁ బొదివి హరుఁడు. 151

ఉ. అంతట నంబుజోదరుఁడు నబ్ధిపదైవతశస్త్ర మేసినన్
సంతతివారిధారలను జారుతటిల్లతికావితాన మ
త్యంతమహానినాదసతతాద్భుతభీషణగర్జితంబులన్
సంతస మందఁ జేసె సురసంఘములన్ దనుజుల్ చలింపఁగన్. 152

క. ఆశవ్రదహనుఁ డాటిన
నీశానుఁడు రోషవహ్ని నేసెఁ గ్రమమునం
బైశాచము రాక్షసమును
నైశం బాంగిరస మనుమహాస్త్రముల హరిఁ. 153

వ. వాసుదేవుండునుం దదస్త్రనివారణంబు చేయఁ దలంచి. 154

సీ. వాయవ్య సావిత్ర వాసన మోహన
ముఖ్యాస్త్రముల నేసి మురవిరోధి

---

1. జెలఁగెన్ భూతావళుల్ భీతితోన్.

యాత్మాస్త్రు మేసిన నాయస్త్రదీప్తిచే
నసుర ప్రమథ భూతయక్షగణము
బాణునితోఁ గూడఁ బాఱె నల్లడలకు
నంధకారం బయ్యె నఖిలజగతి
విశ్వేశుఁ డప్పుడు వెలుఁగుచు నుండెను
నంది మహాదేవు స్యందనంబుఁ

ఆ. గానఁ దయ్యె శివుఁడు గైశవాస్త్రం బేయ
నాత్మబాణ మగుట నచ్యుతుండుఁ
దూణమందుఁ బెట్టఁ దొడి యేసె రుద్రుండు
పాశుపతము నదియ కేశవుండు. 155

వ. ప్రయోగించిన నయ్యస్త్రంబులు గగనమధ్యభాసురంబులయి చండ మరీచి సంశ్రితంబులై తరణిమండలంబు ననుకరించి చిత్రభానుత్వంబునను శిఖావత్త్వంబు నను హవ్యవాహనసమానం బయి యుగ్రప్రకటిత్వంబునను జ్యోతిర్మయత్వంబు నను గైలాసోపమానం బయి క్రూరసత్త్వ సమగ్రత్వంబునను మహారావత్వంబు నను బారావార ప్రతిమానం బయి సుమనః ప్రియత్వంబునను సూర్యమండలాశ్ర యత్వంబునను సువర్ణ ధరణీధర సంకాశం బయి యివ్విధంబునుం గాక యొక్కొక్క యెడల నెగసి మింట నంటు మంట లంటిన వేఁడిమికి సైరింపం జాలక ప్రభాకరుండు త్వరితంబున రథంబు నడుపు మని జంకించిన శంకించి యనూరుండు రయంబున నుంకించియుం హయంబుల నంకించియుఁ బగ్గంబులు సడల విడిచిన ననుస్యూత లాలాజలంబు లగు వక్త్రగహ్వరంబులు గలుగు హరి దశ్వంబుల జవంబులకు నోర్వక యిక్క డక్కడ వడిన చుక్కలును దిరుగుడు వడిన దివ్య విమానంబుల పయిం బొల్చు పతాకాపట సముదయంబులం జూచి విహాయసకూలంకషాను మానంబునన్ సలిల వినోదాగతసుర ముగ్ధవరవర్ణినీ శరీర విరాజమాన వరవర్ణినీ వైభవంబు ననుకరించుసర్వతః ప్రసరన్మయూఖ శిఖాజాలం బునను సకలమహీధగంబులును సువర్ణాచలంబు లయినం దదీయకనకలతాకుం జంబుల విహరించు సురకామినీ ప్రేమానుభావంబు లగు శయ్యాతలంబులం బరఁగు పుండరీకంబులకు సువర్ణత్వం బాపాదించి జాజ్వల్యమానంబై శైవాస్త్రంబు నిగిడె నట్టియెడ. 156

గీ. తోఁచెఁ నల్లని ధూమకేతు వ్రజంబు
పడె నకాలపుఁబిడుగులు పుడమి మీఁద
మాఁగువారెను మార్తాండ మండలంబుఁ
బరఁగెఁ జుక్కలు దివమున బయలు మెఱసి. 157

క. ప్రమద ముడిగి దిక్కుంభే
రమసంఘము బృంహితములు ప్రకటితములుగాఁ
దమదెసలు విడిచి పాఱెను
దమయంతన దానవారి [1]ధారలు దొరుగన్. 158

క. అవ్విబుధ జగతిలోపలఁ
గ్రొవ్వి దఱిఁగి సురగణంబు క్షోభము నొందెన్
ఇవ్విధమున నుత్పాతము
నివ్వటిలం దొడఁగుటయును నిష్కరుణతతోన్. 159

క. అవియును నొకటొకటికి నె
త్తు వోవక పెనఁగిన గని మధు త్రిపురహరుల్
సవరణతో మగుడంగాఁ
దివిచిరి ఖేచరగణంబు దివిరి నుతింపన్. 160

క. దహనానల విధుమాధవ
మహస్సముద్భవము త్రిపురమథనాస్త్రముఁ గా
మహరుండు ప్రయోగించెను
నహితునిపై సురలు కలఁగ నసురలు చెలఁగన్. 161

శా. ఔన్నత్యస్ఫురదంశుదీప్త మగునాయస్త్రంబు వీక్షింపుచున్
వెన్నుం డాత్మఁ దలంచె నేశరముచే విశ్వేశుఁ డుత్కృష్టుఁడై
తన్నుం జంపఁ దలంచె నంచు మహితౌదార్యం బవార్యంబుగా
నున్నిద్రాబ్జదళాక్షుఁ డుండె సమరోద్యోగానవద్యాకృతిన్. 162

క. అంభోజనాభుఁ డహిత
స్తంభవిరచన ప్రవీణతా వైభవుఁ డై

1. తరువును తిరిగెన్.

జృంభణశర మేసిన సం
రంభ విజృంభణము దక్కి ప్రమథాధిపుఁడున్. 163

క. తడఁబడుచు నొడలు మలుచుచు
వడిఁ దూగుచు నావులింత వచ్చిన సొలయున్
బడివడు గాళులు నిలువక
పడఁ బోవుం బడగకామపైఁ బడి యొఱగున్. 164

వ. అవ్విధంబున.

చ. మనుజవరాగ్రణీ మహిత మార్గణ జృంభణసారభీతుఁడై
ధనదసఖుండు వ్రాలిన నుదారమణిశ్రితవక్షుఁ డుల్లస
ద్వనజదళాక్షుఁ డొత్తె రవధన్యముఁ బౌరసమూహ మాన్యమున్
దనుజచమూమనోరచిత దారుణ దైన్యముఁ బాంచజన్యమున్. 166

శా. ఆయంభోజదళాక్షుఁ డుగ్రతర పంచాస్యారవం బొప్పఁగా
మ్రోయించె న్విశిఖాసనంబు హృదయామోదంబు నిండార ర
క్షోయక్ష ప్రమథేశసైన్యములు సంక్షోభంబు నొందంగఁ బా
ణాయత్త్యుద్భట శక్తి బాణుఁడు గతాహ్లాదంబుతోఁ జాలఁగన్. 167

క. తక్కిన సైన్యము లనిలోఁ
జిక్కి పరాఙ్ముఖతఁ దొలఁగె శివుఁడును భీతిం
బొక్కుచు నలపతమెయి న
ల్దిక్కుఁ దిరిగి నిలిచి యావులించుచు నుండెన్. 168

వ. తదనంతరంబ. 169

మ. నియతామర్షముతోడ బాణసచివానీకంబు నుద్యన్మహా
హయ సంబంధము జైత్రమంత్ర వివిధాయత్తాస్త్ర సంమోద్భవ
స్మయసైన్యావృత మైన స్యందనముఁ గ్రౌంచద్వేషి యెక్కె న్వెసన్
లయకాలాంతకసన్నిభుం డయి రణోన్మాదంబు సంధిల్లఁగన్. 170

కుమారస్వామి కృష్ణ బలభద్ర ప్రద్యుమ్నులతోఁ దలపడుట

ఉ. కయ్యములోని దైత్యులు వికారవపుః ప్రమథ ప్రజంబు లా
యయ్యకు నెక్కు డీతని మహాద్భుత విక్రమమన్నఁ బొంగి తా

నయ్యెడఁ బార్వతీ సుతుఁ డహంకృతితో శతముల్ సహస్రముల్
చయ్యన నేసెఁ బాణములఁ జక్రధరున్ బలభద్రుఁ దత్సుతున్. 171

శా. నిమ్నుం డై శరజుండు సంగరమిళన్నిష్కంపరోషంబుతో
నామ్నాయాత్ముని వేయిబాణములచే హలాప్రియున్ నూఱిటన్
ద్యుమ్నక్ష్మాధరవాసు లచ్చెరువునం దూఁగాడ నిశ్శంకుఁ బ్ర
ద్యుమ్నుం బెక్కు సహస్రబాణములచేఁ దూలించి మించె న్వెసన్. 172

వ. ఆ సమయంబున 173

ఉ. అంచితరక్తదేహులు మహాయుధభీషణు లయ్యెదూద్వహుల్
నొంచిరి వాయువహ్నిఘన నూత్నమహాస్త్రములం బ్రకోపులై
సంచితకోపదారుణవిశంకటబాణకృతారిమారణున్
గ్రౌంచవిదారణుం బ్రమదకారణు నుజ్జ్వలశక్తిధారణున్. 174

క. అనలినాయతనేత్రుఁడు
నానీలాంబరుఁడు మరుడు నధికముదముతో
నానామంత్రసమన్విత
సేనానీశరగణంబు చేసిరి మాయన్. 175

వ. అట్టియెడ. 176

ఉ. దేవగణంబు డెందముల ధీరత దక్కె విమానపంక్తి నా
నావిధపద్యలం దొలఁగె నాకనివాసివనోల్లసన్మహీ
జావళి గూలె విద్రుతము లయ్యె దిశాకరు లుగ్రభంగి నీ
భావభ వారినందనుఁడు బ్రహ్మశిరం బనువస్త్ర మేసినన్. 177

క. ఆదిత్యశతద్యుతి దా
మోదరుఁడు సుదర్శనముఁ బ్రయోగించి తద
స్త్రాద్భుతదీప్తిం జెఱిచెను
గాదంబిని తపను కాంతిఁ గప్పినపగిదిన్. 178

వ. తదనంతరంబ తదస్త్రంబు తిరస్కృతౌఘం బగుటయుం బటు చటుల
భ్రుకుటి కుటిలవిశంకటలలాటతటనికటవికటపటీ యస్వేదోదబిందుసముభివ్యక్తి

కృతరోషావేశుం డై విశాఖుండు సంబద్ధ ఘంటాసమూహ దీర్ఘఘర్ఘర నిర్ఘోషం బును వితతసువర్ణప్రభాశిఖాజాలంబును జయలక్ష్మివినిర్మితనారాయణనీరాజనక్రియ ననుకరించు హేమమయం బగు శక్తిం బ్రయోగించిన. 179

శా. శంకాకీర్ణమనస్కు దానవరిపుల్ చక్రాయుధుం డింతతోఁ
గ్రుంకెంబో యని భీతులయిరి యచటం గ్రోధా ప్రదీప్తిన్ మహా
హుంకారంబున శక్తిఁ గూల్చెవిమతవ్యూహంబు భీతిల్ల నా
తంకంబుం బెడఁబాసి విష్ణుఁడు జగత్ప్రఖ్యాతచారిత్రుఁడై. 180

ఆ. [1]అంతఁ బోక శౌరి యగ్రజుండును దాను
జక్రమును హయంబుఁ జటులగదయు
భుజములందుఁ దాల్పఁ బోరిఁబోరిఁ గదిరెదు
భీతి మానసమునఁ బిచ్చలింప. 181

వ. గుహుండు చేయునది లేక తరుగంబడినఁ బూర్వజయుతుండై (పూర్వ గీర్వాణుం డగు బాణు నజేయు) హృషీకేశుండు సమయింపం దలంచి వెంటందగులు నవసరంబునం గోటవియన నొక్కయుచ్చమల్లి వచ్చి యడ్డపడిన నగ్నికం జూచి నారాయణుండు మాఱు మొగంబు వెట్టికొని యప్పుడు ద్వాదశవర్షంబులు నన్నుం గొలిచిన ఫలంబు ని న్నొకమరి చూఁనం జెడునని శపించె నది మొదలుగా నానగ్నిక దిగంబర యై నవ్విధంబున. 182

మ. జ్వరుఁడున్ శంకరుఁడుం గుమారుఁడు మహా [2]సైన్యంబుసన్నాహసు
స్థిరలీలం డిగఁద్రావి దానవవిభుశ్రేయోవిశేషాదిక
స్ఫురితశ్రీఁ బెడఁబాసి సంతతమహాశూరాగ్రణీసద్యశ
స్సరణుల్ బెండువడం దొలంగిరి మహాసంగ్రామరంగంబునన్. 183

వ. ఇవ్విధంబున సగుహజ్వరుండై ఖండపరశుండు పాఱిన సురపద్యా విరాజమానారరనిర్ఝరిణీ ప్రవాహశంకాసంపాదన నిదానసిరంతరవై జయంతీ

---

1. అంతఁబోవక శౌరియు నగ్రజుండు, చక్రమును శార్ఙ్గము హలంబు చటులగదయు, భుజములందుఁ గాలుప బోరిబోరిఁ దిరిగెదు, భీతిచే మానసంబును పిచ్చలింప.

2. సైన్యౌఘసన్నాహసు.

సంతానంబును ననపద్యవిద్యోతిత వివర్ధితతర తరణికిరణసర్వతో జాజ్వల్యమానా ఖర్వనిర్వక్ర సర్వతః ప్రసర్ప్యమాణ యుద్ధవిలోకనాగతదర్వీకర సార్వభౌమ ఫణామండల మాణిక్యమరీచి విడంబనాపండితతేజః కృపాణ ప్రముఖ శస్త్రాస్త్రం బులం గలుగు స్యందనంబులును బరాభూతభేరీఖాంకారభయానకఘంటాపటల గ్రైవేయకబృంహితారావంబులును నధఃకృత ఘనాఘన కళేబరచ్ఛాయాచ్ఛాదిత దిగంతరాళంబును గరవినిర్గతశీకరాసారకృత దుర్దినంబును నవిరత గళన్మదోదక ధారాపటలచటుల కటంకటీయద్విరేఫరాజావరోధవధూమాధుర్యధుర్యధ్వాన సమా కర్ణనానందంబును సవ్విధంబును గాక నభోవీధియుం బోలె నక్షత్రమాలాలంకృతం బై పారావారంబునుంబోలె మహాసత్త్వసమగ్రం బై త్యాగిగృహాంగణంబునుం బోలె దాన ధారామనోహరం బై ధారాగృహంబునుం బోలెఁ జారుఘటాంకితం బై మలయశైలంబునుంబోలె విషధరప్రకాశంబై త్రిలోచనాస్థానంబునుం బోలె శక్తి ధరాధిష్ఠితంబై చతురాననముఖపంక్తియుం బోలె సామోద్భవ స్థానం బై శరీరం బునం బొల్చు సింధూరంబును ధారాధరమయసాయంతన సంధ్యాసందేహసంపా దన కారణంబగుమతంగజ పంక్తియు నతిత్వరితగమనవేగతిరస్కృత సమీ రణంబులును ఖురదళిత ధరాధూళిపాళీవిరచితాపరసర్వం సహంబులును చరణజనిత పవనంబులును పరనగహ్వర నిష్ఠ్యూత లాలాజంబులును పల్యాణఖచితనూత్నరత్న తేజోవికాసంబులును బాదమధ్య విలీనగగనంబులునై పంచభూతాత్మకత్వంబునను హరినామ ధేయానుగుణగణంబులను శక్రతురగవిలోకన కౌతూహలంబునం బోలె నభంబు నాక్రమించి శ్రుతతదీయజలధిసంభవ పాదంబులం బోలె నర్ధాక్రమణ నివృత్తంబులై ప్రభాకరహయంబు లసహాయంబులై జరగం జాల వని జనంబు లాడు వచనంబులు విని స్వకీయవినయజనిత లజ్జాయుతంబులం బోలె నమితాన నంబులై గమన విస్తారితచామరంబులై పునస్సంజనితపక్షంబులుం బోలె మనో జ్ఞంబులై యివ్విధంబునుంగాక కైలాసనగరంబును బోలె నీశ్వరప్రియంబులయ్యును సువర్ణమంజులంబులై మేరుగిరినితంబునుం బోలె దేవమణి నివాసంబు లయ్యును నసురాధిష్ఠితంబులై సాగరంబునుంబోలెఁ బ్రకటితనిఖిలావర్తంబు లయ్యును జడమయంబులై యక్షిరచయంబునుబోలె దీర్ఘప్లుత ప్రచారంబు లయ్యును హ్రస్వంబు లయి విలసిల్లుఘోటకంబులును నఖిలరత్న ఖచిత మకుటకోటి

ప్రభా ప్రహసిత తరణిమండలంబులును గోపావేశ విశంకట భ్రుకుటిచటుల లలాటదేశంబులుం బరస్పరకృపాణఘట్టన ప్రభావిహాయస్సముత్థితస్ఫులింగ ధూమకేతుసముపలక్షితానిమిత్తంబులును శింజినీటంకారపాదస్థిత బిరుదకటకధ్వానసింహనాద విడంబిత నిస్సాణనిస్వనంబులును మఱియునుం గోదండంబు లుద్దండులై ధరించియుం జరించియు గదలు ప్రౌదలు (!) చెలంగం బట్టియుం దట్టియు శరంబులు గరంబుల నమర్చియుం జెమర్చియు శక్తులు శక్తులకు నిచ్చియుం బుచ్చియుఁ గటారంబులు గుటారంబుల కొసంగియు నెసంగియుఁ బట్టసంబు లట్టహాసంబులతోఁ గదలించియు ముదలించియు బల్లెమ్ములు బల్లెమ్ముల విఱువ నవరించియుఁ జంద్రహాసంబులు మందహాసంబులతో జళిపించియు దళిపించియుఁ దోమరంబులు చామరంబులతోనొగర్చియుం దనర్చియుం బ్రాసంబులు రోసంబులతో సారించియు గారించియు సబళంబులు సుబలంబులుగా నొత్తియు నెత్తియు శల్యంబులు తుల్యంబులుగా ధరించియు భరించియు నారసంబులు సారసంబులతోఁ డిట్టలు గొనం గూర్చియు నేర్చియుఁ బలకలు పులకలు నెగయఁ బాటించియుఁ దాఁటించియుఁ గంకటంబులు సంకటంబులని తమయేలికల నడిగియుం దొడిగియు నలుదెసలం బరఁగుకాలుబలంబులును గూడం జనుదేర విమతపతాకినీ ప్రతిభయమూర్తియగు బాణాసురుండు బాహుసహస్ర ధృత నిఖిలశస్త్రాస్త్రసందోహుం డై నారాయణుం దాఁకె మఱియును 184

శా. ఆరూఢోరగవైరి యైనశతపత్త్రాక్షుం బ్రవీక్షించి దు
ర్వార క్రూరమదాభిమాన విలసద్వైషమ్య సంపాదనో
దారస్ఫార భుజాబలాతిశయితాతారుణ్యభాస్వద్యశ
స్స్ఫారవ్యాప్త చతుఃపయోనిధివృతక్ష్మామండలాభోగుఁ డై. 185

## బాణుడు కృష్ణునితోఁ బ్రతాపోక్తులు పలుకుట

క. బాణుం డిట్లను నిన్నుం
బ్రాణముతో మగుడ నీను పట్టణమునకున్
రేణూకృతతనుఁ జేసి ప్ర
వీణత మైఁ బరగువాఁడ వేయును నేలా. 186

క. తూణోద్ధృతశితవిలస
ద్బాణపరంపరలు వొదువ ధారాస్యూతో
చ్ఛోణితవాహినిఁ దేలుచు
శోణితనగరమున మడియుఁ జొప్పడె నీకున్. 187

క. ద్వారకలోపలఁ జుట్లలు
సూరెల నినుఁ గొలిచినట్లు సుమనోనగరీ
సూరిజనంబులు గొలిచెడి
చారు క్రియ చేయువాఁడ జలజదళాక్షా! 188

ఉ. నీ విపు దష్టబాహుఁడవు నేను గతోరసమస్తశస్త్ర సం 189
భావితదోస్సహస్ర రుచిభాసురదేహుఁడ నాకు సాటి యీ
భూవలయంబునం బొడమఁ బోలదు నీవట నాకు సాటియే
యీవియదున్నతిం బులుఁగు నెక్కిన యంతనె యింత నేమగున్.

వ. అట్లుం గాక. 190

క. నీనిశిత బాణతతికిని
మానసములు దల్ల డిల్ల మగిడి చనంగా
నేను జ్వరుండను హరుఁడను
సేనానిని గాను నన్నుఁ జెనయఁగ వశమే. 191

క. నిన్ను సువర్ణాచలమున
సన్నుత మగువనములోన సరసిజనేత్రల్
మన్నింప నొదవు వేడుక
మన్నిశితశరాగ్నిచేత మరిగింతుఁ జుమీ. 192

క. నావేయికరంబులుఁ గడుఁ
జేవ మిగిలి కోటి సంఖ్యఁ జెన్నెసలారన్
నీ వసమె నన్నుఁ గెలువను
దేవతలకుఁ జూడరాదు తిరమై నన్నున్. 193

---

1. తా నట.

వ. అని యప్పుడు.

క. దనుజుం డాడెడు వచనము
లనేకపకరాగ్రశీకరాకృతిఁ బోలెన్
ఘనవాత తరంగముల జ
లనిధి నడుమునుండు నేఱులంబోలె వెసన్ 195

క. అప్పుడు జగములు గాల్పఁగ
నుప్పొంగుచు నున్న నిర్జరోత్తమ బింబం
బొప్పు వెసఁ దాల్చె దనుజుం
దప్పరుసున నాడుచుండ నతని నయనముల్. 196

వ తదనంతరంబ సరోష సంభ్రమోత్సాహ దీపితుం డై నారాయణుం
డతని కిట్లనియె: 197

ఉ. ఏమిర బాణ! ప్రీడన విహీనభయోద్ధతమానసుండ వై
యే మని పెక్కులాడెద విదేటికి మాటల జేత [2]నివు సం
గ్రామము గెల్వవచ్చునె వికారపుమాట జయంబ[3]యేని నీ
కీమెయి నేల భాషితము లెక్కుడుగాఁ బచరింపు మాజిలోన్. 198

క. ఈ చందమైన విజయమ
నీచే నగుఁ గాక యున్న నిక్కపు జయముం
జూచెద వైనను నోరీ!
నాచే జితుఁ డగుము గెలువు నన్నును నీవున్. 199

## కృష్ణ బాణాసురుల యుద్ధము

క. అనుచు నిశాతాశుగములు
దనుజునిపై నేయ నతఁడు దద్భరములకున్
మనమున విస్మయ మందుచు
ననేక బాణముల నేసె నంభోజాక్షున్. 200

1. తరంగంబుల, నెనయ జలధినడుమ నుండు నేఱులఁ బొలెన్,
2. నీవు సం. 3. యైన నిం, కేమియు నేం.

వ. మఱియు ననేకాయుధంబులం బొదివి యెనిమిది చేతులతో సహస్రబాహువగు తనతో సరిసరిగాఁ బోరినం జూచి విస్మయాకులితచిత్తుండై బాణుండు కోపించి తొల్లి హిరణ్యకశిపుండు బలి కిచ్చిన యాగ్నేయ బాణంబుం బ్రయోగించిన సకలదిశా జాజ్వల్యమానం బయి విజృంభించిన దామోదరుండు. 201

క. పర్జన్యబాణ మేసిన
నూర్జిత వర్షంబుతోడ నున్నతతరధా
రార్ణవము గాఁగ నప్పుడు
నిర్జించెను దనుజశరము నిఖిల విబుధులున్. 202

క. కొనియాడిరి నారాయణు
వినుతించిరి ముదముతోడ వేడ్కలు దొలఁకన్
మనమున నప్పట కప్పటి
కనూనవాక్యములఁ బొగడి రంభోజాక్షున్. 203

వ. తదవసరంబున గరుడమయూరంబులు సమరకాంక్షమానసుంబులతోడం దల పడిన నప్పుడు గరుడండు దక్షిణపక్షంబున వ్రేయం బూనిన సంకుచిత శరీరంబై మయూరంబు సవ్యభాగంబునకు నెగసి ముక్కునం బొడిచి ఱెక్కల నడిచి తదుపరిభాగంబునకు నెగసినం జూచి తానునుం దోడన యెగసి తదీయదేహంబు చరణంబుల నిఱికియు మఱియు గగనంబునకు నుఱికియు దిరుగంబడి నీలకంఠ శిరంబు చంచుపుటంబునం గీలించి తదీయ పక్షంబు గోళ్ళగీఱియు జూళ్ళువాఱియు నయ్యా యోధన శిక్షితుం డగుపతత్త్రిపతితనదక్షిణపక్షంబున నడిచి మహిం బడ విడిచిన నామయూరరా జర్ధపదపాత జనితజ్ఞానుం డై క్రమ్మఱ నెరిగి యురవునం దాఁకియు దుండంబు సారించియుఁ బ్రచండంబుగాఁ గారించియు ఱెక్కల వ్రేయం బూఁచియుఁ బ్రక్కలు డాయునఖంబులఁ జాచిఁయు బహుప్రకారంబుల గారించినం గనుంగొని సుపర్ణుండు విజృంభించిసువర్ణ సంకీర్ణ కిరణ సముదాయ వ్యాప్త నభోమండలుం డై పత్త్రింబులం జిత్రంబులుగా మయూరంబు వ్రేసియు నీసునం బోనీక గాసిచేసియు మఱియుమునుం దనువులేక లేఖలోకంబు వెక్కసం బంద

నక్కాకోదరవిదారి యగువైనతేయుండు తదీయోదరంబు వ్రచ్చి రణభూమికి బలి చేసిన, 204

క. అప్పుడు బర్హిణ మోడిన
నుప్పొంగెను[1]దివ్యవినుతు లుడువీథిన్ దా
నప్పరుసున బాణాసురుఁ
డప్పటి కప్పటికిఁ దలఁకె నధికభయమునన్. 205

ఉ. పుట్టెను దైత్యసేనల నపూర్వతరం బగుశోకభారముం
గట్టిరి దేవసంఘములు కాంచనతోరణపంక్తు లెల్లెడం
బట్టణవీథి నయ్యెడరు బాణుఁడు చూచుచు భీతి నొందఁగా
నట్టియెడన్ గిరీశవచనాజ్ఞను నంది రథంబు దెచ్చినన్. 206

క. ఆయరద మెక్కి బాణుం
డాయుధచయవితతదోస్సహస్రరుచిరుఁ డై
తోయజలోచనుఁ దాఁకెను
నాయతశరవర్ష మొప్ప నతివేగమునన్. 207

శా. జ్వాలాంతం బగుబ్రహ్మశీర్షకమహాస్త్రం బేసినం గేశవుం
డాలోనన్ భ్రుకుటీవిశంకటలలాటాభోగుఁ డై సంచర
ల్లీలాపాటితదైత్యచక్రము లసత్తేజశ్చయావక్రముం
గాలత్రాసవిభాసదైత్యరుష రేఖానక్రముం జక్రమున్. 208

గీ. అటు ప్రయోగించి యాయస్త్ర మంతఁ బెఱిచి
పుష్పకారూఢ హరిహయపూర్వవిబుధ
సంస్తవాధికవర్ధిత సమ్మదుండు
కృష్ణుఁ డట్లను సంగరతృష్ణతోడ. 209

శా. ఓరి దానవధూర్త! నీదువచనోద్యోగంబు లెట్లేఁగెరా
రారా యింకిట నేమి చేసెదవురా క్రౌర్యంబు శౌర్యంబు స
ద్వీరత్వంబును గల్గెనేని దనుజా తెల్లంబుగాఁ జూపుమం
చా రాజీవవిలోచనుండు వచనవ్యాపారపారీణతన్. 210

1. దివ్యగణము లుడుగణవీథిన్, అ-

వ. మఱియును 211

ఉ. తొల్లి సహస్రబాహువు గృతవీర్యతనూభవుండు గ
ర్వోల్లసమానమానసహితోదయమానసుఁ డై దశాస్యహృ
త్పల్లసరోజసోముఁ డయి భూరిమఖప్రథితాభిమానుఁడై
చెల్లియు రేణుకాతనయుచేఁ జెడఁడే మదిలోఁ దలంపవే. 212

ఉ. నిన్నును నత్తెఱంగుననె నేఁడు కరద్వయయుక్తుఁ జేసి ద
ర్పోన్నతి మాన్చి నీదుసుహృద్ధతి గీటడఁగింతుఁ బాఱకి
ట్లున్నగతిం జెలంగుమని యుద్ధవిశారదుఁడై మురారితాఁ
జెన్నొదవన్ సుదర్శనముఁ జేత నమర్చెఁ బ్రయోగకాంక్షతోన్. 213

వ. అట్టియెడ. 214

క. శశిసూర్యశక్రహరపా
శిశమనసద్దీప్తితతి వసించెను జక్రా
కృశమూర్తిలోన నప్పుడు
విశాలలోచనుఁడు సకలవిస్మయకరుఁ డై. 215

క. చక్రము వైవఁగఁ బూన్ప న
వక్రముగాఁ జెలఁగె విబుధవరమునివినుతుల్
వక్రుండు వినుతి జేసెఁ ద్రి
విక్రమునిం ద్రిదివవీథి వివిధక్రియలన్. 216

## చక్రప్రయోగము చేయఁ దివురు కృష్ణుని యెదుట నగ్నిక నిలుచుట

క. అత్తఱిఁ గంతయు నగ్నిక
చిత్తమునం దెలిసి విష్ణుసేవాపర నై
యిత్తఱి బాణాసురునిం
దత్తఱపడ కుండఁ గావఁ దగదే యనుచున్. 217

గీ. దేవదేవ జగన్నాథ దివ్యమూర్తి
కావవే దనుజేశ్వరుఁ గరుణతోడ

ననుచుఁ గోటవి యెదురుగా నరుగుదేర
మోము చూడక కన్నులు మూసికొనుచు. 218

క. దనుజాధీశుని చేతులు
తునుకలు గాఁ గినుకతోడఁ దోయజనయనుం
డనవరతనిశిధారా
జనితవిమతచిత్తభయముఁ జక్రము వైచెన్. 219

వ. ఆ సుదర్శనంబు. 220

క. సమసెను బాణాసురుఁ డని
యమరులు సంతోష మొంద నఖిలోజ్జ్వల మై
యమరారి భుజము లన్నియుఁ
గొమరారఁగ నఱికి నఱికి కుప్పలు వెట్టెన్. 221

శా. మేదోలిప్తశరీర మై ఘనమహోమిశ్రంబు చక్రాయుధం
బాదైత్యాహితుఁ జేర వచ్చి త్రిజగత్యాధారకీర్తి శిర
శ్ఛేదానుజ్ఞకు నానతి మ్మన యదుశ్రేష్ఠుండు రాజన్మనో
మోదంబారఁగ నట్ల చేయఁ దలఁపన్ భూతేశ్వరుం డంతలోన్. 222

శా. వై రూపాక్షి ధరాత్మజాజ్వరగణవ్రాతంబు లంతంతటం
జేరంగాఁ జనుదేరఁ గోటవిపిశాచీ శాకినీనాయకుల్
ప్రారబ్ధస్థితితోఁ జెలంగి చన నత్యాశ్చర్య సంపాది యై
యారాజీవదళాక్షు ముందఱ మనోహారి స్తవం బొప్పఁగా. 223

ఉ. దేవునిచెట్ట వట్టికొని దేవ! యదూద్వహా! సర్వలోక సం
భావితకీర్తిమూర్తియుత భానుసహస్రసమ ప్రకాశ నా
నావిధ విక్రమాధిక వినాయక నాయకపారికాంక్షి సం
సేవిత వైరిరాణ్మథన సిద్ధవినోదన బాణుఁ గావవే. 224

చ. అనుడు మురాంతకుండు ప్రమథాధిప బాణసురారి నీవు గా
చినక్రియ నీనుఁ గాచితిని సిద్ధము నావచనంబు దీని కిం
తనఁ బనిలేరు మీఁదటి ప్రధానపుఁగార్యము దీర్చ నీయను
జ్ఞను విలసిల్లఁ బోయెద విశంకటసత్కరుణారార్ద్రి శంకరా! 225

చ. అనుచుం గృష్ణుఁడు వోయినం బిదప బాణామర్త్యవైరీశను
ద్ధనచక్రాయుధనిష్ఠురక్షతగళ ద్రక్తార్ద్రి సర్వాంగు న
న్ననుభూతా ప్రతిమ ప్రగల్భపరివాదాంతర్హితోద్వేక్రమున్
జనితాస్త్రాధిక వేదనాప్రకటమూర్చాపారవశ్యాత్మునిన్. 226

క. నందీశ్వరుఁ డిట్లను నా
నంద మొదవ నసురనాథునకు సమ్మోహ
స్పందిత మానసునకు దో
స్సందోహవిహీన దేహసరధ్రసునకున్. 227

శా. పోయెన్ విష్ణుఁడు లెమ్ము లెమ్మనుడు నుద్భూతాధిక ప్రజ్ఞుఁడై
యాయుగ్రాక్షపదాబ్జసేవకుఁడు బాణామర్త్య వైరీశ్వరుం
డాయాసాంగుఁడు మాధవాస్త్రవినిఘాతాసక్త సర్వాంగుఁ డై
మాయాత్యక్తమనస్కుఁడై గతరణోన్మాదంబుతో లేచినన్. 228

వ. నందికేశ్వరుండు పురారి ముందట నృత్యంబు చేయ నియోగించిన. 229

క. తాండవము చేసె బాణుఁడు
ఖండసుధాకిరణమకుటకరుణాపరుఁ డై
చండహరిశాస్త్రనివహో
ద్దండక్షతగళిత శోణితము తొడవులుగాన్. 230

క. జనితవరకాంక్ష బాణుం
డు సర్తనము చేయ హృత్పటుతర ప్రియుఁ డై

త్రినయనుఁడు వరము వేఁడుము
దనుజాధిప యనుడు నతఁడు దద్దయు నెమ్మిన్. 231

సీ. అజరుండు నమరుండు నగువర మడుగంగ
హరుఁడును నవ్వర మతని కిచ్చి
క్రమ్మఱ నడుగు వర మ్మన్న నతఁడు నా
దేవరముందటఁ దివిరి నాదు
కరణి నృత్యము చేయఁ గల్గినవారికి
నిమ్ము పుత్త్రుల నన్న నిచ్చె హరుఁడు
సత్యక్షమార్జవాచారు లై వర్ణితా
హారులై మద్భక్తి యతిశయిల్ల

ఆ. నాకు నెదుర నాడునరులు పుత్త్రులఁ గాంతు
రింక నడుగు వరము శంక దక్కి
యనిన విష్ణుచక్రహతిజాతనిష్ఠుర
బాధ మాన వరముఁ బడసె నతఁడు. 232

క. క్రమ్మఱ నడుగుము వర మన
సమ్మదమునఁ బ్రమథనాథసై న్యాధ్యుం డై
నెమ్మి మహాకాళుం డన
సమ్మదుఁ డయి యుండఁ బడసె జగములలోనన్. 233

వ. మఱియును. 234

క. తన యొడలు రెండు చేతుల
మును పొందిన యొప్పుతోడఁ బురడించెడు స
జ్జనసుతశోభను వెలుఁగఁగ
ననూనవర మీశువలన నసురుఁడు పొందెన్ 235

వ. ఇత్తెఱంగున. 236

ఉ. పంచవర ప్రదానమున భరుఁడు బాణకృతప్రమోదుఁడై
సంచితనూత్న పారిషదసౌర సమూహకృత స్తవ క్రియో
దంచిత కీర్తిపూరితదిగంతరుఁ డై నికట ప్రవర్తన
క్రౌంచమహీధ్రవైరి గిరిరాజసుతా భజనాతిమోదుఁ డై. 237

వ. అంతర్ధానంబు చేసె నంతట. 238

## శ్రీకృష్ణుఁ డనిరుద్ధుని విడిపించుకొని పోవుట

చ. గరుడని నెక్కి కేశవుఁడు గ్రక్కున బాణ[1]గృహంబు చేరఁగా
నరిగినఁ బక్షిరాజుఁ గని యచ్యుతపౌత్త్రునిఁ జుట్టికొన్న య
య్యురగము లెల్ల నల్ దెసల నూడనిఁబాడినఁ జూచి సంతత
స్ఫురితసుఖాతికంటకితసుస్థిరమానసుఁడై ప్రియంబునన్. 239

క. అనిరుద్ధు మేను దనచే
తను నిమిరె మురాంతకుండు దర్పవిరాజ
ద్దనుజవినాశనపటుతర
సునిశితచక్రాయు ధాతిశోభితకరుఁ డై. 240

మ. అనిరుద్ధుండుఁ బితామహస్తుతివచోవ్యాపారపారీణుఁ డై
తనుఁ బక్షీంద్రుని నెక్కి మన్న నతఁడున్ దైత్యేంద్రకన్యాసఖుల్
దనతోఁ గూడ సుపర్ణు నెక్కఁ బిదపన్ దామోదరుం డెక్కి నా
యన యేఁగె న్వివిధప్రచారముల నత్యాశ్చర్య యానంబునన్. 241

క. గరుడఁడు నడువఁగ దూరము
జరగి హరియు సలిలపాలుసన్నిధి బాణా
సురగోగణములయునికియు
స్థిరముగ విని యతనిదిక్కు చేరుతలఁపునన్. 242

వ. సుపర్ణున కిట్లనియె. 243

---

1. గృహాంతరంబుకై, యరిగినఁ,

క. దనుజునియావుల వరుణుఁడు
తనదిక్కున నునిచినాఁడు తత్కార్యముకై
మనకుం బోవలె నద్దెస
కనఘా చనఁ దీఱునేని యరుగు మచటికిన్. 244

వ. అనుడు మురాంతకునకు నాగాంతకుం డిట్లనియె. 245

క. నాకును గార్యం బేలా
నీకుం బనిచేయఁ గలుగ నీరజనాభా!
యేకడకు నైన నఁ జనియెదఁ
బ్రాకటవిజయాభిరామ! పాపవిరామా! 246

క. అనుచుం బశ్చిమవేలా
వనమునకుం బక్షివిభుఁడు వరుణునిపురికిం
గొనిపోయె సమ్మదించుచు
వననిధిమధ్యంబు చొచ్చి వనజదళాక్షున్. 247

వ. గోగణంబుఁ జేరఁ జను నవసరంబునన. 248

ఉ. అక్కడ నున్న వారుణభటాళులు ప్రమొక్కలులై రణంబులో
నుక్కున నొండొరుం బిలిచి యుగ్రతరాగ్రహవిగ్రహేచ్ఛనల్
దిక్కులకుం జెలంగు దృఢధీరరవంబులు నింగిముట్టఁగా
నెక్కట యెక్కడంచు విహగేశ్వరవాహనుఁ దాఁకి రయ్యెడన్. 249

క. మదమునఁ దన్నుం జెనయగఁ
బదిలముతోఁ జేరినట్టి ప్రాచేతససై
న్యదృఢభటాలిదవాగ్నులఁ
బ్రదరంబుల జల్లు గురిసి పాఱఁగఁ దోలెన్. 250

వ. తదనంతరంబ. 251

సీ. నిస్సాణరావంబు నింగి ముట్టి భటాళి
శంఖనాదంబుల సవదరింపఁ
గరికరశీకరకణములు విక్రాంత
మకుట ముక్తారుచి మక్క్రశింపఁ
దురగహేషారవోద్ధురత యోధవ్రాత
సింహనాదంబుతోఁ జెలిమిసేయ
శకటనేమివిభిన్న సర్వంసహాధూళి
భటభూషణరజంబు బాదరింప

తే. సకలదిశలును నిండి సైనికులు గొలువఁ
దన్నుఁ గొనియాడ నమరగంధర్వగణము
ప్రకటరుచితోడ ధవళాతపత్ర మొప్ప
వరుణుఁ డరుదెంచె విక్రమోద్ధురత మెఱయ. 252

క. కొడుకులు మనుమలుఁ గొలువఁగ
విడు విడు మని శూరగణము వేగిరపడఁగా
గొడగులు గగనము గప్పఁగ
జడనిధిపతి వచ్చి నిలిచె సమరతలమునన్. 253

వ. ఇట్లు నిలిచి దివ్యనివహజేగీయమానానూనచారిత్రుండై వరుణుండు బహు
శరంబులం బొదవినం గ్రైటభాంతకుండు స్వకీయధనుర్విద్యాకౌశలంబునఁ దదీయ
సాయకంబులు ఖండించి మఱియును వైష్ణవాస్త్రంబు ప్రయోగించినం దదీయాను
స్యూతజలధారాసమూహంబు వైష్ణవాస్త్రంబు నుపశమింప జేసె నట్టియెడ. 254
మహాస్రగ్ధర. జలజాక్షుం డంత రోషజ్వలితహృదయుఁ డై

సంచితౌదార్యతేజో
బలవిస్తారోద్ధతారిప్రకరగజఘటా
ప్రఖ్యజీమూతరాజీ

కలితోద్యత్రోర్యధై ర్యక్షయభయదమహా
కార్యవాతోరుమూర్తిన్
విలసద్దిక్పూర్ణకీర్తిన్ విస్రుమరమహితో
ద్వృత్తివిద్విట్కృతార్తిన్. 255

క. చక్రము వైవఁగఁ బూన్పఁగ
విక్రమకేళికిఁ దొలంగి విస్మయభీతిని
ర్వక్రవ్యాపృతచేతో
పక్రాంతానందుఁ డైనపాశాయుధుఁడున్ 256

ఉ. దేవునిముందట న్నిలిచి దేవ యదూద్వహ నీదు దాసకృ
త్యావహనప్రవీణమతి నక్షయకీర్తిసమృద్ధి నొందితిన్
దేవర యింత చేసిన విధేయులకుం జొరఁ నెద్దిచో టటం
చావరుణుండు వచ్చి వినయంబున మ్రొక్కుచుఁ బల్కె గ్రమ్మఱన్. 257

క. తామస రాజసగుణములు
నీ మనమునఁ బొందఁ దగునె నీ వాద్యుఁ డవున్
మేము వికారగుణంబులు
సేమంబునఁ గన్న మమ్ము శిక్షింపఁ దగున్. 258

క. నీకు వికారము దగునే
మా కెల్లను బుద్ధి చెప్పి మముఁ బ్రోవంగాఁ
జేకొని యున్నాఁడ వనుచు
నాకృష్ణుని నాదిమూల మని జగ మెఱుఁగన్. 259

క. వరుణుఁడు గొనియాడిన విని
సరసిజనేత్రుండు మెచ్చి సమ్మదమునఁ ద
త్కరములు మోడ్చుచు నప్పుడు
సురరిపుగోగణము దెచ్చి చూపు మనవుడున్. 260

క. ఆసాగరవిభుఁ డిట్లను
బాస వలికినాఁడ నేను బాణునితోడన్
నీసురభుల నే నసువులఁ
బాసినపుడు గాని యొరులపాలికిఁ బోవన్. 261

క. ఈనందిఁ గాన నను నను
మానము లేకుండఁ బంపి మఱి గోగణమున్
నీనేర్చునట్లు గాని పొ
మ్మో నలినదళాక్ష త్రిభువనోత్తమమూర్తీ! 262

క. అనుడుం గరుణారసమున
మన మభిషేకంబు చేయఁ బాశధరునికిన్
దనుజునియావుల నిచ్చెను
జనియెఁ బురికి వరుణుఁ డంత సంతస మెసఁగన్. 263

వ. ఇవ్విధంబునం బురంబు చేరం జనునప్పుడు. 264

సీ. గంధర్వజయజయ గాననాదంబులు
శంఖారవంబులు సాము చేయ
ముత్యాలసేసల మొల్లంబుతోఁగూడ
సురపుష్పవృష్టులు సొబగు మీఱ
ద్వారభాసురమణితోరణపంక్తితో
విబుధజూట ప్రభ వియ్య మంద
బర్హిర్ముఖారూఢ భద్రసామజములు
కేలిశైలంబుల గేలి సేయ

ఆ. సురభియుక్తధార సుకుమారమకరంద
సక్తియుక్త చిత్తషట్పదాళి
మధురనినదకలితమాన్యతరూద్యాన
మైనపురము చొచ్చె నచ్యుతుండు. 265

సీ. మానినీ మంజుల మంజీరకర రవ
కేళీసరోహంసకీలితంబు
కామినీకాముకకలహప్రసాదన
పండితశారికాభాసురంబు
సరసకథాలాపసంగీతసాహిత్య
చతురశుకస్తోమసంచితంబు
అంగనాగండూషహాలాలసద్గంధ
వకుళపుష్పావళి ప్రకటితంబు

ఆ. విలసదగరుగంధ విస్ఫుటతరగంధ
మైన వివిధమందిరాంగణంబు
చూచి నెమ్మనమున సుడివడ నానంద
మంత కంత కుబ్బె నచ్యుతుండు. 266

క. ద్వారావతీ పురంబున
శౌరిఁ గొలిచి వచ్చునట్టిసౌరగణము త
త్ప్రేరితసుమనోవర్ష మ
పారముగా మోదంబు జేసి ప్రస్తుతితోడన్. 267

వ. నారాయణునకుం బ్రణామం బాచరించి సమ్మదాక్రాంత మానసు లై తొలంగి చూచుచుండిరి తదనంతరంబ. 268

సీ. గళితమదోదకగండస్థలీసంగి
మధుపఝుం కారాత్తమత్తగజము
హేషారవోద్ధతిపోషితనిస్సాణ
పటహాభేరీధ్వానబహుళహయము
ప్రాకారచితరత్నబహువిధతరధామ
లిప్తసౌధసమూహదీప్తతలము
ఫాలస్థలీకృత ప్రకటితాంజలిపుట
పరిచారికావళీభాసురంబు

ఆ. ద్వారఖచితరత్నతోరణోపాంతావ
లంబిమౌక్తికోపలసిత మైన
నగరి చొచ్చె శౌరి నానావిధానూన
వినుతిలసితహృద్వివేకుఁ డగుచు. 269

ఆ. విష్ణుఁ గొలిచి వచ్చు విబుధగణం బెల్ల
మృగమయూరనిజతురగధవళప
త్త్రినివహదృఢరథంబులు డిగి విష్ణు
వెనుక నగరిలోనఁ జనిరి యంత. 270

క. వసుదేవుని నాహుకునిన్
వెస సాంబుని నుల్ముకునిని విపృధుని శైనే
యు సఖాంక్షకు నందకునిని
నసమానబలాఢ్యు లైన యదువుల కెల్లన్. 271

వ. ఆలింగనముచేసి వారలతోడి నిట్లనిరి యీతం డసాధ్యుం డయిన బాణా
సురునిం గరద్వయసమేతుం గావించి ముహూర్తమాత్రంబున ద్వారకానగరంబు
నకు వచ్చె ననన్యసామాన్యం బైన దైవం బితండ కాఁడే మీభాగ్యంబున నితండు
యదువంశంబునం బుట్టె నవి బహువిధంబులం నారాయణు వినుతించి దేవత
లమరావతి కరిగి రని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పి సకలచరాచర
క్షేమంకర క్రియాలంకరణం బగు నీ హరిస్తోత్రంబు తలంపు మని యతని కీర్త
నంబు వివరించె నని సూతుండు శౌనకాది మహామునీశ్వరులకుం జెప్పిన. 272

ఉ. భావుకకారణా భువనభారకదారణ శస్త్రధారణా
పావనచారణా సుహృద పాయనివారణ సత్కృధారణా!
భావవినోదకా పరమభక్తకమోదక వైరిభేదకా!
సేవకవారిజాసన విశేషకృపాసన దైత్యశాసనా!. 273

క. కల్పాంతమహితవిలస
చ్చిల్పవివాహభరణహరణ చిత్రచరిత్రా!
కల్పితపన్నగతల్పా
కల్పానల్పప్రకాశకమనీయయశా! 274

మాలిని—

చరవిరహితమూర్తీ తారగౌరోరుకీర్తీ!
పరిహృతవిబుధార్తీ భవ్యసంపత్తిపూర్తీ!
యురగశయనభూషా యోగిసంతోషభాషా!
చరణశరణపోషా జంతురక్షాభిలాషా! 275

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బైన శ్రీ మహాభారతకథానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచన సోమనాథప్రణీతం బైన యుత్తరహరివంశంబునందు షష్ఠాశ్వాసము.

ఉత్తరహరివంశము సంపూర్ణము.